విదయుఁ దానుఁ బొర్గూరి కేఁగుచును. రూపించి కడగొట్టుపాపఁ దా రింటి.కాపిడి.... బస. పు. ౩. ४०౭. పం.

కడగొట్టువాఁడు = కడపటివాఁడు. కనిష్ఠ సోదరుఁడు. ఉ. రా. ౭. ౩౨౧.

కడగోరు. వి. ఔ. (కడ + గోరు) కొనగోరు. నఖాగ్రము.

ద్వి. కాటుకకన్నీరు కడగోర దిద్దె. నవ. ౨. ౯౦. పొ. ౧౭ పం.

కడచ(స)ను. అ. క్రి. (కడ + చను) ౧. మరణించు. చచ్చు

సీ. జననాథశల్యుండు సమసె సౌబలుఁడు గీటడఁగె నులూకుండు మడిసె సకల. సంశప్తకులు గడచ నిరి....భార. శల్య. ౧. ౯. భార. శాం. ౨ ४౨౯.

౨. నశించు. పోవు.

ఆ. ....శక్తియెల్లను గడచన్న. నతఁడు నేల వ్రాలె నతిరయమున. భార. అను. ౧. ౯౯.

రగడ. ఎఱుఁగక చేసితి నిపు డపచారము. శరణన్నను గడసనదె విచారము. ఉ. రా. ౩ ౯౨.

౩. కడచు. గతించు.

వ. ....నీవాక్యంబులు నిక్కంబు లగు నైనను గడచిననదానికి శోకం బేల. భా. రా. యు. ౯౭౧.

సీ. సంజప్రొద్దుననుండి సవరేయి కడసన సమ్ముఖంబునఁ గొల్చి సంవసించు. పాండు. ౫. ౨౭౬.

४. ముగియు. సమాప్తమగు.

క. అనఘా యీయజ్ఞము విధి.సనాథబుత్విక్ప్రయోగ సంపూర్ణంబ.య్యును గడచన నేరదు నదు.మన యుడుగును భూసురోత్తమనిమిత్తమునన్. భార. ఆది. ౨. ౨౦౯.

క. కొడుకులనిధనమునకు నా.కడఁగినహయమేధమఖము కడచనమికి నేఁ, గడుదుఃఖితుండనయ్యెదఁ. దనయ.క నీ విపుడు దీనిఁ దలఁగుము కడఁకన్. భార. ఆర. ౩. ౬౭.

౫. కొనసాగు. నెఱవేఱు.

క. పూనిక కడచన విష్ణు.క్కేన ప్రార్థనము సేసి.... విప్ర. ౨. ౧౯.

౬. అపారమగు. అనంతమగు.

సీ. గోత్రాచలము చెత్తుకొని వచ్చి కడచన్నరత్నాకరముఁ గట్టె రాఘవుండు. ప. పం. ౧. ४౨.

ద్వి. మదఁతి యీరంబె యిమ్మనుజేశుచేతఁ, గడచన్న మన్ననఁ బడసినయతఁడు. బస. పు. ౨. ౯౧.పం. (ప్రాఁత ప్రతిపాఠము.)

స. క్రి. దాఁటు. అతిక్రమించు.

క. వననిధి నవనీలం గడ.చనువాని ప్రసాద మొందిసతులు గృహంబుల్, ధనములు నఖిలసుఖంబులు. మన మూరం గాంతు రోలి మర్కటు లెల్లన్. భా. రా. కిష్కిం. ౭౬౬.

సీ. ఏదేవునిజమాయ నెవ్వాఁడుఁ గడసన నేరఁడు తన మేనినీడఁబోలె. పాండు. ౫. ౫౧.

కడచన్న పసిఁడి = ప్రశస్తమైన బంగారము. మేలిమి బంగారము. (ప్రౌ.)

ద్వి. కడచన్న (వన్నె?) పసిఁడియుఁ గన్నెయుఁ దూఁచు, నెడ సువర్ణాంతరం బెఱుఁగరాకున్నె. పండితా. వాద. ౧౯౨ పొ.

కడచు. స. క్రి. (త. కడత్తు.) ౧. (నదీసముద్రాదులను) దాఁటు. తరించు.

గీ. అలసుమంతుని వీడ్కొని యర్కవంశ. ఘనులు గంగాతరంగణిఁ గడచి .... రామా. ౫. ౨౭. భార. ఉద్యో. ४. ౬౫.

౨. ఉల్లంఘించు. జవదాఁటు; దాఁటు. అతిక్రమించు.

ఆ. వేదవిహితవిధుల నాదరించుట యూర్ధ్వ. గతికిఁ దెరువు విధులఁ గడచి యెందు. నాఁగఁట దినవాని లోఁగక చేయుట. యధమగతి

మార్గ మనిరి మునులు. భార. ఆది. ౩. ౨౨౦.

మ. కొడుకుల్ భక్తివిదేయు లౌదురుగదా కోడండ్రు మీవాక్యముల్, గడవం జాలక యుందు రా.... భాగ. ౧. ౨౬౭.

క. వడిగొని కౌరవు లొండొరుఁ, గడపంగ మునుచనిరి.... భార. ఆది. ౬. ౬౭.

పీ. కనకంబు పెనుఁగోట వినువీథిఁ గడపంగ.... హరి. ఉ. ౨ ౧౬౨.

గీ. కమలనాభుండు కక్ష్యాంతరములు గడచి. పారి ౧. ౧౦౫.

౩. తొలఁగించుకొను, తప్పించుకొను.

తరువోజ. ఏనును బ్రజలును నీ ధర్మసతియు, నే యుపాయంబున నిబ్బారిఁ గడవఁ,గా నేర్తు మెయ్యది కర్జంబు.... భార. ఆది. ౬. ౨౪౭.

గీ. ....వారి, వారికర్మఫలంబు లవశ్యభుక్తి, కారణంబులు గా కెందుఁగడవ వశమె. వి. పు. ౧. ౨౧.

వ. ....గండంబులం గడచితిమి.... హర. ౨. ౨౭.

౪. మించు, అతిశయించు.

వ. ....సహదేవుం డాశైనేయు నుద్దేశించి మిమ్మును బాంచాలురం గడచినబంధువులు మాకును మమ్మును మిమ్మును మిగిలినబాంధవు లాపాంచాలురకును వారలకంటె మాకంటె నెక్కుడు సుహృజ్జనులు మీకును లేకునికి దెల్లంబు .... భార. ద్రో. ౫. ౩౭౧.

చ. కొఱవులవేఁడిమిం గడచు ఘోరపుఁబల్కులు కర్ణరంధ్రముల్, చుఱచుఱఁ దాఁకి పాటి మదిఁ జూఁచిన.... భా. రా. యు. ౭౨౩. భార. శాం. ౧. ౮౯.

అ. క్రి. ౧. చచ్చు, మరణించు.

గీ. కడచినప్పుడు క్రిమి లొండెఁ గాక లొండెఁ, గుక్కలొండేనియును భుక్తిఁ గొనెడు దేహ,మొకఁడు ప్రార్థించి యడిగిన నొసఁగవలదె. కాశీ. ౬. ౮౩.

సీ. ధ్రువ వసిష్ఠాపుంధతులఁ దనుచ్ఛాయయుఁ గాననివాఁ డేఁటిలోనఁ గడచు. జై. భా. ౮. ౯౮.

౨. నశించు, పోవు.

సీ. అలివేణివదన చంద్రాతపంబునఁ గాని కడచునే మోహాంధకారభరము. భాను. ౪. ౨౫.

గీ. పోయె నుపదేశకాలంబు పూర్వముననె, కడచె ధైర్యంబు.... శివరా. ౩. ౩.

౩. గతించు, జరిగిపోవు.

ఉ. ....త,ప్మాకరయఁగా బయల్పడనియట్లుగ నుండెడు వత్సరంబునుఁ, జేరువచేయవం గడచె .... భార. విరా. ౩. ౧౦౬.

వ. ....దినంబులు గడచె వారంబు లరిగెఁ బక్షంబులు చనియె మాసంబులు పోయె.... హర ౬. ౧౧.

౪. తొలఁగిపోవు.

గీ. ఇటువలె ననేకగతుల నారటము నొంద, గగనధారతి వానిపైఁ గరుణవొడమి, యడలకు కుమార నీకిటి గడవ నేర,దెట్లనినఁ బూర్వవృత్తాంత మెల్ల వినుము. సారంగ. ౩. ౧౨౨.

౫. మేరమీఱు, మితిమీఱు: మర్యాదనతిక్రమించు.

క. కడు ననురక్తియు నేర్పును,గడఁకయుఁ గలవారి నుఱక కడవఁగ నెగ్గుల్, నొడివెడు వివేకశూన్యుల, కడ నుండెడునంతకంటెఁ గష్టముగలదే. భార. ఆది. ౩. ౧౪౯.

సీ. ఆకాంక్షితస్ఫూర్తి యాచరించుచును శాఖాచంక్రమక్రియఁ గడవఁ జనక. ప్రభా. ౨. ౩.

మ....వైదేహి నేఁ,గడవం దెచ్చితిఁ దప్పు గావుమని లంకారాజ్య మొప్పించి .... ఎ,య్యెడకైనం జనుమా .... భా. రా. యు. ౫౦౧.

౬. కడముట్టు, పారమునొందు.

క. కడవం గఱచినవాఁ డీ,పడు చనుచుం బురుటియిల్లు పడఁతుక వెతలెఁ. మార్క. ౫. ౩౦౪. (కడవం గఱచినవాఁడు = పూర్ణముగా నేర్చినవాఁడు.) విక్ర. ౧. ౨౦.

౩. సుఖముగాఁ గాలము గడపు; మర్యాదతో కాలము గడపు.

క. నీ వేమి కొల యొనర్చితి, వీవగ నది సోఁకు డిగుచు నేఁచఁ దొడంగె, న్వేవేగఁ దత్ప్రతిక్రియ, గావింపక యున్ననెట్లు కడచెద ననినన్. శుక. ౧. ౨౩౫.

క. ఏ నింతనాఁటినుండియు, మానవతులలోన మిగుల మానవతినినై, యీనాఁటికిఁ గడచితి నిఁక, నానోఁచిననోములే మొనర్పం గలవో. శుక. ౧. ౫౦.

౮. మనుగడ సుఖముగా సాగు, జీవనము బాగుగా జరుగు; సుఖముగా జరుగు.

(వ్యవ) వానికి పండ్రెండు రూపాయలతో నెట్లు కడచుచున్నదో తెలియదు.

అక్కడఁ గడవకయే యీయూరు వచ్చినాఁడు. పూఁటకుఁ గడవనివాఁడైనను దుర్వ్యయములు మానుట లేదు.

నేను లేకుండ వానికిఁ గడవదా యేమి?

జీతము స్వల్ప మగుటచే వానికి సంసారము కడచుట లేదు.

౯. ఎక్కువగు, హెచ్చుగు, మీఱు.

(కృత్రిమహంస నెక్కి ఆకాశమునఁ బోవురాచకన్నె యొక్క స్వయంవరమునకు వచ్చిన రాజులవర్ణనము)
క. వడి గగ్గి హంసగతికిం, గడవఁ బఱచువారు.... భోజరా. ౫. ౨౪. (చూ. ౫ ౧౮)

కడచిచను = కడచు.

వ. ....మన్వంతరంబు లాఱును గడచిచనియె. వి. పు. ౪. ౪.

౩. కడతెంచు, కడపిపుచ్చు, కడపు, కడపుఁజేయు, కడవఁబడు, కడవఁబెట్టు.

**కడచుక్క.** వి. (కడ + చుక్క) - కడనక్షత్రము - రేవతి. (శ. ర.)

**కడచెడు.** అ. క్రి. (కడ + చెడు) దిక్కుమాలు, గతిలేకయుండు.

క. విని కినిసి కపిలదేవుఁడు, ఘనహుంకృతి నేపెనంతఁ గినచెడి వారమ్ము నికోపభస్మసాత్కృత, తనువై వడి రచట సగరతనయులు వెలుచన్. జాహ్న వీ. ౨. ౮౨.

**కడచేయు.** స. క్రి. (కడ + చేయు) విడుచు, వదలు.

ద్వి. మ మ్మెల్లఁ దండ్రులమాఱుగా నెన్ని, సమ్మతినలుఁ బ్రాణసఖుఁగా వరించెఁ, గావున నానలఁ గడచేసి మరల, దేవలోకమున కేతెంచితిమి .... ద్వి. నల. ౨. ౬౨౯.

**కడచేరుచు(ర్చు)** స. క్రి. (కడ + చేరుచు) = కడతేర్చు.

(-దరిచేర్చు - కృతార్థునిచేయు)
క. ....కౌరవులకు మేటి వీవ కావున నీ వీ, భారంబు పూని మముఁ గడ, చేరుపఁ దగు నెమ్మెయిం బ్రసిద్ధచరిత్రా. భార. ఉద్యో. ४. ౧౫౫.

**కడజాతి.** వి (కడ + జాతి) చివరకులము, చండాలజాతి.

ఉ. ఈకడజాతివాని కిహిహీ మహిదేవుఁడు చిక్కె.... పాండు. ౩. ౯౫. (చూ. ౩. ౮౮.)

(విశ్వామిత్త్ర వర్ణనము) సీ. కడజాతితోనియోగము నిర్వహించినయఘటనఘటనావిహార హారి. చం. రా. ౨. ౫౬.

**కడతల.** వి. (కడ + తల) చివర ప్రదేశము.

వ. ....కౌరవరాజధాని యైనకరినగరంబుకడతల హలాగ్రంబును జొనిపి యుప్పుటభేదనవిస్తారం బగుగర్వభుజాగర్వదుర్వారుండై పెకలించి .... భాగ. ౧౦. ఉ. ౫౮౮.

**కడతెంచు.** స. క్రి. (కడచు + తెంచు - స్వార్థమున) కడచు, దాఁటు.

ద్వి. అసమాన మైనయయ్యామున మార్గంబు, విడిచినఁ గడతెంచి వేవేగ గొల్ల,విడిపట్టువరు నందువిడిపట్టు సొచ్చి. అ. మ. క. ౨౨ పొ. ౧౩ పం.

**కడతెగు.** అ. క్రి. (కడ+తెగు) ముగియు, సమాప్తమగు.

క. ఉడుమండలంబు దాఁకను, వడి నేఁగితిఁ గోట దాఁట వచ్చునొ యంచుం, గడతెగక యంతకంతకుఁ, బొడవయ్యెను నాకు దాఁటి పోరాదయ్యెన్. మైరా. ౨. ౧౧.

**కడతేర్చు(ఉచు)** స. క్రి. (√కడతేఱు) కడతేఱఁ జేయు.

(చంపు, వధించు)

క. విని గురుతనూభవుఁడు పది, దినములఁ గడితేర్తు నని యె ధీరవిచారా. భార. ఉద్యో. ౪. ౪౧౪. (చూ. ౪. ౪౦౩.)

క. ...దానవు, కపటముకాఁ దెలిసి వానిఁ గడతేర్చుటయున్. జై. భా. ౫. ౧౪౬.

(పోఁగొట్టు)

గీ. వారియగముఖ గడతేర్చి వాంఛితములఁ, గరుణ నొనగూర్చు.... ఉ. రా. ౪. ౨౩.

(కొనసాగించు, నెరవేర్చు; నిర్వర్తించు.)

సీ. తొడఁగినపని చలం బెడపక యతిదుష్కరంబైనఁ గడతేర్చు ప్రభువులార. భార. విరా. ౩. ౨౧.

గీ. జనపని ప్రతిజ్ఞఁ గడతేర్తు నని తలంచి. ఉ. రా. ౩. ౧౧౩.

గీ. ....బంతి, తేర్లదొర వేల్మి నెటిఁ గడతేర్చియున్న. అచ్చ.రా.బాల.౬౩.

(కృతార్థతనొందించు)

(కుంతి కృష్ణునితో నన్నమాటలు) చ. అలఘువిచారనాయలఁత యూర్పుము నన్ గడతేర్చు మెమ్మెయిన్. భార. ఉద్యో. ౩. ౨౦౧.

**డతేఱు.** అ. క్రి. (కడ+తేఱు) ౧. చచ్చు, మరణించు; నశించు.

చ. ...కుంభకర్ణుఁ డా, దిగఁ గలవీరు లెల్లఁ గడతేఱి రనేపలు కూరబూన్య మీ, నగిరము.... భా. రా. యు. ౧౧౨౩.

గీ....వారిదేహంబులు నస్మదాది, దేహములఁ బోలెఁ దుదిఁ గడతేఱు.... కాశీ. ౬. ౭౬.

౨. పోవు, గతించు.

సీ. పరహితంబులు దానపరతలఁ గడతేఱె సతత వ్రతోపవాసములు పొలిసె. హరి. పూ. ౧. ౧౦౦.

ఉ....అట్లకా. దే విరహజ్వరంబు కడతేఱునె యీచలిమందులందు.... భోజరా. ౩. ౨౪౯.

వ.....ఁన్నుంశక్తి కడతేఱె....కాశీ. ౪. ౧౪౨.

౩. నెఱవేఱు, సిద్ధించు.

ఉ. ముందటియట్ల యింకఁ బదుమూఁడుదినంబుల మాత్రకున్ భవ, న్మందిరవాస మియ్యకొనినం గడతేఱు మదీయవాంఛ....భార. విరా. ౩. ౬౨.

క. విను మేను జేయఁబూనిన. పనులం దొకటి గడతేఱఁ బాపాత్ము సుయో, ధనుఁ దొరిగొని తలఁ దన్నుదు. ననురెండవపనియుఁ దీర్ప నరిగెద నెలమిన్. భార. కర్ణ. ౩. ౨౨౫.

౪. బాగుపడు; వర్ధిల్లు; బ్రతుకు.

చ. వలపున స్త్రీలబుద్ధి వినువా రొకరేఁ గడతేఱి నట్టివారలు గలరా....సారంగ. ౩. ౬౬.

చ....ఎవ్వరుం బడనిపాట్లకు లోనయి ప్రత్యయార్థమై, యడరెడుచిచ్చుఁ జొచ్చియతియత్నమునన్ సుఖమింతచెందినం,గడపట జానకీసతికిఁ గాఁపురముం గడతేఱదాయెఁ గా. ఉ. రా. ౬. ౩౨౨.

సీ. అనుపమాకృతిఁ జూచి ఘను డౌ ననిరి గాని కడతేఱఁడని నాఁడె నుడువరైరి....గీ.అంచు రత్నాంగి సుతుఁ జూచి యలమటించు. సారంగ. ౩. ౧౦౨.

ఉ..... చంద్రభాస్కరు లి దేమి యకారణవైర మిట్లు నా,దిక్కునఁ జూపినారు కడతేఱఁగ నిత్తునెయింక వారల, న్మిక్కిలిశక్తి మీఱఁ

దిగ్భ్రమింగెన నంచుఁ బరిప్లవింపఁగఁగా. దశా. ౨. ౩౭౨. అప్ప రా. యు. ౧౧౫.

౫. కృతార్థతనొందు.

వ. ....ఆర్తజనశరణ్యుండ వగుసీనిముత్తంబునఁ గడ తేఱఁగలదాన నగుట నాకలతెఱం గెఱింగించెద దత్తావధానుండవై యవధరింపుము. వీప్ర. ౩. ౧౧.

సీ. ....కడతేఱె ననఁ గృతార్థం బయ్యె ననుట కొప్పు. ఆం. ధా. ౩. ౯౪.

౬. ముగియు. సమాప్తమగు. కడచను.

సీ. ....పూర్ణచంద్రుండు మలినుఁడై కానవచ్చిన నాయువు సంవత్సరంబునఁ గడతేఱు రాజ ముఖ్య. ధార. శాం. ౬. ౧౨౯. (శ. ర. ప్రాంత ప్రతిపాఠములు )

కడనుంచు. స. క్రి. (కడన్ + ఉంచు) పరిత్యజించు, వదలివేయు.

సీ. పంకజాతాసనప్రతిపత్తిఁ గడనుంచి మృగరాజపీఠిపై మేల్ఘటించి. గీ. రాజవేషంబు గాంచుధారణి యటంద్రు, మల్లనంతమహీనాథు. మతినసాథు. కసు. ౧. ౧౩.

ఇట్లే :- కడఁద్రోచు.

గీ. రమణ ద్రష్టృత్వనిర్వికారత్వసాక్షి, తాదివిహ్యోక్త ధర్మజాతమును దొంటి.పగిదిఁ గడఁద్రోచి నీస్వరూపము భజింతు. సీతారా. ౩౩౦. ఉ. హరిశ్ప. ౧. ౬౭.

కడప[1] = గడప. వి. (√కడచు. త. కడప్పు.) ఇంటి గడప, దేహళి.

గీ. కడపమీఁదను మఱి సన్నెకంటిమీఁద, జక్కిమీఁదను గూర్చుండ జాదగాదు. కాశీ. ౨. ౭౫.

కడప[2] = కడిమి. వి. (సం. కదంబః.) కడిమిచెట్టు,

సీ. కడపపూఁదేనియఁ గడుపారఁ గొని ప్రోసి తిరుగుఁదేఁటులతెరలిఁకయును. హరి.పూ. ౯. ౬౮.

గీ. కడిమి కడప యటం చనఁబడుఁ గదంబ. ము.... ఆం. ధా. ౨. ౪౬.

కడపల. వి. బొ. (√కడ) అంతము, చివర.

వ. .... శతసహస్రసంఖ్యలయేండ్లు చరియించియుం గుక్షిలోఁ గడపల గానఁ డయ్యె. హరి. ఉ. ౯. ౯౮.

గీ. ఏది మొద లేది కడపల యేది మధ్య.ము.... భీమ. ౬. ౩౪.

గీ. ఇన్నిచేసినఁ గడపట నింటిలోనఁ, ద్రావుటకు లేదు పాపంబె తగెఁ గాని. వరాహ. ౭. ౭౬.

విశ. చివరది, కడపటిది.

క. కడపటిభూములు నడు మగు,నడుభూములు కడపలగు....హరి. ఉ. ౯. ౪౦.

చ. కడపటినాఁడు....కళా. ౨. ౫౨.

కడపటికొండ = చక్రవాళపర్వతము. వేం. పంచ. ౧. ౭.

కడపలచేరు = అంతమునొందు, పోవు.

సీ. చాటవంబులపిపాసలు కడపలచేరెఁ గాంతారపహ్నుల గర్వ మడఁగె. భాగ. ౧౦. పూ. ౭౫౩.

కడపిపుచ్చు. స. క్రి. (కడపి + పుచ్చు.) ౧. పంపు.

(క) అపాయమునుండి తప్పించి పంపు.

వ. ....నికటప్రదేశంబున నున్న పింగాఖుండు.... తీవ్రమార్గణంబుల నిగిడించి లుంటాకులం దోలి యోట పడకుండ సార్థవాహులం గడపిపుచ్చి. కాశీ. ౪. ౬౪.

(చ) అభీష్టము నెఱవేర్పక పంపు.

గీ. శరణు సొచ్చిన రక్షింపఁ జాలియుండి, కడపి పుచ్చిన మూర్ఖులోకములు దప్పు. ధార. ఉద్యో. ౧. ౧౬౧.

౨. (కాలము) వెళ్లఁబుచ్చు.

ఆ. ఆలతాంగియుఁ దన కప్పటి కొక్కింత, గర్భజనన శంక గల దటంచుఁ, జెప్పి సిద్ధసురుని సిద్ధుని కీర యేఁ, గలయ నవ్వు ననుచుఁ గడపిపుచ్చె. కళా. ౫. ౧౨౧.

౩. కప్పిపుచ్చు, మఱుఁగుపఱచు.

వ. అంత నావాగ్దేవి యావిధంబున నొదవినకళా మర్మ భేదనసామ్రాజ్యసంపదను భవావస్థ మానలాఘవ శంక నప్రకాశంబుగాఁ గడపిపుచ్చుటకు నుపాయం బుఁ జింతించి. కళా. ౫. ౧౭.

కడపు. స. క్రి. (√ కడచు) ౧. చంపు, వధించు; కూల్చు:

శా. తిన్నం డంతట దేవదేవునకు భక్తిం దృప్తిఁ గావింప నా, సన్నుగ్రావమహాటవుల్ దిరిగి దంష్ట్రాటంక కోటీపుట, చ్ఛిన్నక్ష్మాజవరాహము స్గడపి కాల్చెన్. ....కాశ. ౩. ౮౬.

చ. ....ప్రహస్తుఁ డుగ్రుఁడై, కరముసలంబునం గడపె గ్రక్కున వేవురయక్షులన్.... ఉ. రా. ౩. ౩౬.

ద్వి. ముచితరో యాతండు మొగి దోలు దొలిపి, మద్దులఁ గడపినమహితశౌర్యుండు. సిం. భాగ. ౩. ౪౯ పొ.

౨. పోఁగొట్టు; తొలఁగించు.

సీ. ...నానాండజముల ప్రాణములు గడపి. కాశ. ౩. ౪౭.

గీ. భువనసంక్షోభకారి యై పుట్టెనొక్క, శక్తి యిది ల్వాత మది నీవు గడపవలయు. కాశీ. ౨. ౬౯.

గీ. ....నేఁటియాపద గడపవలయు. నా. పంచ. ౧. ౨౨౦.

౩. (పైకి) పోఁజేయు, ఎక్కించు.

చ. ఒడికముతోఁ బ్రయత్నమున నొక్కమహాశిలఁ గొండమీఁదికిన్, గడపఁగ ధార మచ్చటిది గ్రక్కున భూమికి డిగ్గఁ ద్రోవఁగాఁ, గడుసులభంబు....నా. పంచ. ౧. ౧౦౭.

౪. ఉల్లంఘించు, మీఱు.

ద్వి. గాధేయమునిమాట గడపక శబ్ద, వేధిబాణముల నవ్వేదమూయ ఱడఁచి. రం. రా. బాల. ౨౭ పొ. ౨౩. పం.

౫. (త. కడత్తు) ఈసుకపొమ్మను; పొమ్మను.

ఉ. పట్టపురాజ నంచు నొడఁబాటులు దప్పను భూజనంబులన్, గట్టియుఁ గొట్టియున్ బహుముఖం బుం నర్థము గూడఁబెట్ట నే, పట్టున నర్థులం గడప.... భోజరా. ౩. ౧౩౦.

క. అడిగినయప్పుడ చెప్పరఁ, గడపినఁ బోనవ్వయేను గడుదుర్మతినై, పడఁతి నను నిలిపి భిక్షం, బిడక కసు నవజ్ఞఁ జేసి తేల మదమునన్. భార. అర. ౫. ౧౩.

గీ. ....నరవరుండు, వేఁడ మణి యీక కడపుట వెట్టి తనము. వరాహ. ౫. ౧౩. కాశీ. ౭. ౧౩౯.

౬. దాఁటించు, తరింపఁజేయు.

గీ. కలుషఘోరపయోరాశిఁ గడపుతరణి. పారి. ౪. ౪౯.

౭. (గళ్లమొదలగువానిని) దాఁటించు, మీఱఁజేయు. (కపటద్యూతవర్ణనము) సీ. .... ఎక్కుడాయంబుల యెడలు గడపి. దశా. ౫. ౬౪.

౮. నడపు.

క. అమరేంద్రసుతుఁడు తనకుం, గమలాక్షి సుభద్ర రథము గడపఁగ....భార. ఆది. ౮. ౨౦౨.

క. ....మత్స్యగంధి యనఁగా ధర్మార్థంబుగఁ దన తండ్రినియోగంబున నయ్యమున నోడ గడపుచు నుండెన్. భార. ఆది. ౩. ౩౪.

వ. చంద్రసూర్యులం గాలంబు గడప నియోగించి .... భీమ. ౪. ౧౫౧.

౯. జరపు, వెళ్లఁబుచ్చు.

గీ. కడపితే రాత్రి సులభసౌఖ్యంబునా మనం

బు గాఢప్రసన్నమే యంబుజాక్ష. భార. శాం. ౨. ౪.

గీ. దర్పితేల్వలవాతాపిదమన మీయ. పెక్కుకాలాలు గడపినపెద్దలు....వరాహ. ౯. ౧౩౨.

౧౦. విడిచిపెట్టు. వదలు.

సీ. విరుదులసైనను బిటికివాండ్రనుసైనఁ జంపుచోఁ గడఁపడు జముఁడు నేప్పు.లానును మత్త్యనిచావు మాన్పఁగ లేవు రణ మొనర్చినఁగాని రాదె మర ణ.ము....భార. స్త్రీ. ౧. ౨౫.

(పంతికర్ణునితోనన్నమాటలు.) చ....గొంతిహృదయం బున శోకము నివ్వటిల్ల ని.ట్లను నిది దైవసంఘటన మక్కట యెట్లును దప్ప నేర్చునే. యనుపమసత్య విస్ఫురణ నాడినమాట మహాత్ముఁన్న నీ.యనుజుల నల్వురం గడపుమర్జును చేఁతసమ్మతించితే.

భార. ఉద్యో. ౪. ౭౦.

౧౧. పొఱఁప్రోలు. తఱుము.

గీ. అచటివెలయాండ్రు రంభాదు లైన నొరయఁ, గాసె కొంగున వారించి కడపఁ గలరు. మనుచ. ౧. ౫౦.

ద్వి. కనకంపుఁదీఁగెలఁ గడిపుబాహువులు, మృదుపల్ల వంబుల మిగులుహస్తములు. ద్వి. నల. ౧. ౭౩౭. (ఇట ఔపమ్యద్యోతకము)

కడపుఁజేయి. వి. (కడపు + చేయి) చుక్కాను. అరిత్రము.

సీ. వైరిసైన్యాబ్ధిలో వచ్చుగెల్పుననావఁ గడఁజేర్చు ప్రాఁ కుఁడుఁ గడపుఁజేయి. పారి. పీఠి. ౨౪.

కడబంతి. వి. (కడ + బంతి) పంక్తియొక్క చివర.

సా : వడ్డించువాఁడు తనవాఁడైనచో కడబంతిని గూ ర్చుండినను లోపమురాదు.

కడమ. వి. (త.కడై) ౧. కొఱఁత, వెలితి, లోటు.

వి. అన్న కుమార నీ యట్టి సత్పుత్త్రుఁ గన్న గల్గ మా కేమిటఁ గడమ. సెపుమ. భార. ఆర. ౫. ౧౧౫.

చ. .... గుణము వర్ణన లర్థము శబ్ద మొప్పు నేకడ మయు లేదు మత్కృతికి... ఉత్త. ౧. ౨౦.

౨. శేషము. మిగులు.

క. మొదలనె నాకుం గలిగిన,యది శంఖసుదర్శనాంక నాదిపహితమై. పొదలెడిప్రపత్తి యిఁకనడ. పెదఁ గడమయు....పరమ. ౪. ౧౪౦.

(చూ. ౧౩౭. కడమ :- శేషవృత్యముఅనిభావము.)

౩. కడ. అంతము. తుద.

గీ. అనిన సర్వాపరాధి నే నధిపతనయ. నీవు పుణ్యా త్మకుండవు నీకుఁ దప్పు. మోప నే నెంతవాఁడ నా పాపమునకుఁ, గడమ లే దంచుఁ జాఁగిలఁబడియెఁ గుంభి. భోజరా. ౫. ౩౧౮.

విణ. ౧. న్యూనము, తక్కువయైనది, కొఱఁతపడినది.

ద్వి. ఒక్కటి కడమగా నొగి నూఱుమాయ, లక్కడి వారిచే ననువుగా నెఱిఁగి. రం. రా. ఉ. ౫౬. పౌ. ౧. వం.

సీ. రమణీయనూతనరతిరహస్యములకుఁ గామశాస్త్రం బులు గడమ లయ్యె. వి. శృం. ౬. ౨౧౯.

౨. శేషించినది. మిగిలినవి; అన్యము. ఇతరము.

క. కడమకథ నుడువు మనినం, బడఁతికి శుకలోకపట్ట భద్రుఁడు తెలిపెన్. శుక. ౧. ౧౨౯.

వ. ....కుంతియును దానిరెండుభాగంబులు చేసి యం దొక్కభాగంబు భీమునకుం బెట్టి తక్కినభాగంబు కడమకొడుకులుం దానును గుడుచు. భార. ఆది. ౬. ౨౩౮. ఆం. భా. ౩. ౨౪.

జ : కడఁబడు, కడమపడు, కడమపెట్టు.

కడమప(వ)డు = కడఁబడు. అ. క్రి. ౧. కొఱఁతపడు, న్యూనమగు.

వ. ఒక్కొత్రాడు సుట్టిన నది రెండంగుళంబులు కడమ పడియె మఱియు నొక్కబంధనంబు

సంధించి వలగొనిన నంతియ కొఱంత యయ్యె. భాగ. ౧౦. పూ. ౩౮౪.

గీ. కడమవడఁ బల్కెఁ బల్కెఁ లాకస్మికముగ, మగువ మదిరారసోన్మాదమహిమవలన. కవిక. ౪. ౧౬౩

క. ఏ వెంటఁ గడమపఱుపక, దేవా మము సంతరించి లివి నీపాలం,జా వగుట దమకుఁ దగు నటు,గావున క్షమింపు మనరఁగా నేమిటికిఁ. వేం. పంచ. ౧. ౫౭౬.

౨. శేషించు, మిగులు.

గీ. కవిసి రథ్యముల్ వేయింటఁ గడమపడక, యుండఁ జించి.... హరి. ఉ. ౬. ౨౧౮.

గీ. అట్లు జైనుల వధియించి యచటఁ గడమ, పడినపస తులు వడఁద్రోచి .... కేయూర. ౨. ౧౦౫.

౩. అసంపూర్ణమగు, ముగియకుండు.

వ. చెఱువు కడమపడియె ననియుఁ బేదగుడులకుఁ బూజ నడువ దనియు....చెప్పి పంప నారాజీవా సంబు గుప్తాగుప్తప్రకారంబులం బంపుద్రవ్యంబు వెచ్చి....ఆము. ౪. ౫౩.

కడమపెట్టు. స. క్రి. ( √ కడమ.) మిగుల్చు.

గీ. ....అపత్రికాప్రకార మేమియు నీ వింకఁ గడమ పెట్ట,కంతయును నాకు నెఱిఁగింపు .... ప్రభా. ౩. ౧౪౮. ప్రబోధ. ౫. ౪.

కడమింత = కడవమింత. (వా. శ. ర.)

కడముట్టు. అ. క్రి. (కడ + ముట్టు.) సమాప్తమగు, ముగియు; నిశ్శేషమగు, సంపూర్ణమగు.

సీ. తనసేవగాఁ బురందరుఁడు గట్టించు కెంపుల హజారము కడముట్టెనొక్కొ. కళా. ౩. ౧౩౦.

ద్వి. నేఁటితోఁ గడముట్టెనే కౌశికుండు, గాటంబుగా సల్పు కపటనాటకము. ద్వి. హరిశ్చ. ఉ. ౨౪౫౫.

గీ. శత్రువు ఋణంబుఁ జిచ్చు నెచ్చరికతోడఁ, గడమ పెట్టక కడముట్ట నడఁపవలయు. ప్రబోధ. ౫. ౪.

కడముట్టఁబడు = పారంగతుఁడగు, అవ్వలియొడ్డు చేరు.

గీ. సమధికం బైనసంసారజలధియందు, మునుఁగు చును దేలుచును గడముట్టఁబడని జనుల కెల్లను మత్స్యాదసరసిజములు, తెప్ప యై యుద్ధరించు నిం దీవరాక్షి. భీమ. ౫. ౧౩౦.

కడయేనుఁగు. వి. (కడ + ఏనుఁగు.) దిగ్గజము. అచ్చ. రా. బాల. ౩౮.

కడయేలిక. వి. (కడ + ఏలిక.) దిక్పాలుఁడు. అచ్చ రా. ఆర. ౫౮.

ఇట్లే :- కడయొడయుఁడు. అచ్చ. రా. సుం ౧౫౫.

కడయొత్తు. వి. (కడ + ఒత్తు.) గృహవిశేషముయొక్క చుట్టుగోడయందలి కంబములమీఁది దూలము. (శ.ర.)

కడరాలు. వి. (కడ + ఆలు-ఇది 'పేదరాలు' వంటిది.) కడజాతిస్త్రీ, చండాలస్త్రీ.

ద్వి. వెలయంగఁ బెనిమిటివెనుక నిట్లుండ, వలపదా కడరాలివర్తన మొప్పఁ, గడుసాంగ మయ్యె నీగ రితభక్తియును. పండితా. దీక్షా. ౪౨. పొ.

కడతెప్ప. వి. ( కడ + తెప్ప. ) కనుతెప్పయొక్క కొన.

సీ. కడతెప్ప లొరయంగఁ గనుదమ్మి లర మోడ్చి.... ....నైష. ౫. ౯.

కడలి. వి. (కడలు + ఇ = అలలుకలది- క త కడల్.) సముద్రము, మున్నీరు.

గీ. కపటమత్స్యంబవై నీవు కడలిఁజుమ. నైష. ౫. ౧౨౦.

కడలికూఁతురు. వి. (కడలి + కూఁతురు) లక్ష్మి. నిరి. అం. సం. దేవ. ౧౦.

**కడలిరాయఁడు.** వి. (కడలి + రాయఁడు) ౧. సముద్రములలో గొప్పది - క్షీరాబ్ధి, పాలసముద్రము.

సీ. ....కడలిరాయలలోఁతుఁ గన్నుఁగవిప్ప. గీ....మందరంబు. మనుచ. ౫. ౪౭.

౨. సముద్రప్రభువు - నీటితేఁడు, వరుణుఁడు. ఉ. రా. ౧. ౩౧౬.

**కడలివెన్న.** వి. (కడలి + వెన్న) చంద్రుఁడు.

రగడ. కడలివెన్నయు పేఁడిపేలుపు గాడ్పు నగ్గియు నెల్లగాములు....నీవె....అచ్చ. రా. యు. ౬౪. అం. సం. దేవ. ౧౫.

**కడలు.** వి. (బ. కడళ్లు, కడళులు) తరంగము, అల.

సీ. తూటెడుపయ్యెద దుఃఖాంబునిధిలోనఁ గడలచందంబునఁ గడలుకొనఁగ. హరి. పూ. ౯. ౧౪౪.

(రావణుఁడు) క....అమరబలమునకుం గీడ్పడక నిలిచి మెఱసెను బలుకడళ్ల కెదురైన దాటికరటేం దిర మై. నిర్వ. ౬. ౧౩౪.

సీ... జలధులు నలిరేఁగి కడళుల నభ మెక్కఁ గడఁగె ననఁగ. హరి. పూ. ౭. ౧౬౩.

జ: కడలి, కడలికూఁతురు, కడలిరాయఁడు, కడలివెన్న, కడలుకొను, కడలుకొలుపు, కడలెత్తు, కడలొత్తు.

**కడలుకొ(ల్కొ)ను.** అ. క్రి. (కడలు + కొను.)

౧. అతిశయించు.

క. ఉత్తర నలంకరింప ను,దాత్తాభరణాదివస్తుతతి యొసఁగి నరేంద్రోత్తముఁడు నేర్పుగల చెలికత్తియలం బుచ్చెఁ బ్రీతి గడలుకొనంగన్. భార. విరా. ౫. ౩౮౮.

క. అని ప్రియము గడల్కొనఁ బల్కిన ....సారంగ. ౨. ౭౬.

౨. పొంగు, ఉప్పొంగు.

ఆ. ....కథవినంగ నాకుఁ గౌతుకంబు, మనము నిండి గడలుకొనుచున్నది....భార. ఉద్యో. ౩. ౪౧౨.

౩. వ్యాపించు. (ఈయర్థమున 'కడ + లు + కొను'- అనియుఁ జెప్పవచ్చును.)

మ....గద్దెపైం దెదలి పీఁకం గేసరంబుల్ గడల్కొన....పొల్పుంజెందె నంభోజముల్. భార. ఉద్యో. ౨. ౧౧౦.

౪. కలుగు.

గీ. .... నిద్ర రేపు మాపు,మానియుండిన జాడ్యంబు మేనఁ బొడమఁ,గన్నుఁగవయందు నరుణిమ గడలుకొనును. దశా. ౨. ౧౩౮.

**కడలుకొలుపు.** స. క్రి. (√కడలుకొను.) ౧. వ్యాపింపఁజేయు. ఈయర్థమున కడ + లు + కొలుపు - అనియుఁ జెప్పవచ్చును.)

గీ. గఱులు సారించు మీసలు గడలుకొల్పు .... మీనవేషి వెన్నిట నిగమగవేషి యగుచు. భాగ. ౮. ౭౧౯.

౨. కావించు, కలిగించు.

సీ. రతిదేవివెన్వ్రేఁగురారాపుఁజన్నులు గడకన్నులకు నింపు గడలుకొలుప.... గీ. ఉక్కడిఁ దయి యేతెంచె నుక్కు మిగిలి,కలికిగారాబుచెలికాఁడు కలికిమఁడు. నైష. ౭. ౪౧.

సీ నడునెత్తి మట్టిపా లిడి తాలిక లొనర్చి కడలుకొల్పిన గొప్పజడలదింపు. శుక. ౨. ౩౨.

**కడలెత్తు.** అ. క్రి. (కడలు + ఎత్తు) పొంగు, తరంగితమగు.

సీ. పదపల్లవంబునఁ బ్రకటిల్లుచదలేఱు కడలెత్తిధాత్రి వెల్వొడిచి పాఱ. కాశీ. ౫. ౧౧౨.

క. కడలెత్తి మ్రోయ వెలుచును,జలనిధు లినుఁడెండగాయ శంకిలు....ధా. రా. బాల. ౧౨౬.

**కడలొత్తు.** అ. క్రి. (కడలు + ఒత్తు) ౧. తరంగితమగు. పొంగు.

మ. నెలమేఱుల్ గడలొత్తఁ జేయుచును .... కానన మారుతంబు తనకుణ వాంఛానుమూపం

బుగా, వలఘుస్వేదవినోదనం బొసఁగఁగా నాసీనుఁ
డై....హరి. ఉ. ౧. ౫౭.

ఉ. ....లో,నూనినరోషవార్ధి గడలొత్తఁగ ని ట్లనిపల్కె-
భూవరా. భాగ. ౧౦. ఉ. ౩౨౪.

౨. వ్యాపించు. (ఇట-కడ + లు + ఒత్తు. అనియుఁ
జెప్పవచ్చును.)

సీ. కరమూలములఁజిగి గడలొత్తి వల్లఁత్కృచో పాంత
కాంతుల నొత్తరింప. హరి. పూ. ౮. ౧౬౮.

కడవ. వి. (సం. ఘటః. ప్రా. ఘడో) కుండ, కుంభము.

ఆ. తిండిపోత నీకు ఖండనం బేటికిఁ,గడవఁజేరిమనసు
కాంక్ష దీఱ,నోవుకొలఁది మ్రింగి యూరక నీవింటి,
కడవ యుండు మింక నడిచి పడక. భార. ద్రో.
౪. ౨౩౫. (కడవ:-అన్నపుకుండ అనిభావము.)

కడవచెవులపోటరి = కుంభకర్ణుఁడు. అచ్చ. రా. యు.
౨౨౪.

జ: కడముంత, కడవతీటు, కడవముంత, కడవ
బాయి.

కడబఁడు. వి. (క. కణప, కణబ.) మగగుఱ్ఱము.

క. పంచించి ప్రాణవల్లభ, గొంచక తా నుత్తరకు రుకుం
భినిఁ బంచా, రించినగోడిగమై వర్తించువిధము
యోగదృష్టిఁ దెలిసి కడవఁడై.

క....సంజ్ఞా, కంఖాణిం జేర నరిగి కామాతురతకా.
నరాహ. ౫. ౯౫, ౯౬.

కడవఁబడు,కడవఁగఁబడు. అ. క్రి. (√కడచు-
స్వార్థమున 'పడు') - దాఁటిపోవు - ౧. శేషించు,
మిగులు.

క. నడుకట్ట లిసుకతిప్పలు, మడలు దరులు వాఁకలును
గ్రమంబున నొకడుం, గడవఁబడకుండఁ గృష్ణుఁడు,
పడఁతులకును యమున యాటపట్టుగఁ జేసెకా.
హరి. పూ. ౮. ౩౭.

౨. గతించు, కడచు.

క. వెడపనికి నాలిఁ బంపం, గొడుకుఁ బనిచి వ
చ్చినాఁడఁ గ్రూరత్వమునం, గడవంబడునొకొ పని
యని, కడువెసఁ జనుదెంచె నశ్రుకణములు దొరఁ
గకా. భార. శాం. ౫. ౨౮౧.

గీ. అటుల నిజగృహమున కేఁగి యబ్జవదన, పగలు
గడవంగఁబడుటయుఁ బార్థివేంద్రు, కేళిగృహమున
కరుగునవ్వేళ....శుక. ౩. ౩.

కడవఁబెట్టు. స. క్రి. (√కడచు) ౧. తొలఁగించు.

క. ఆపదఁగడవంబెట్టఁగ, నోపి శుభం బైనదాని నొడఁ
గూర్పను మా, కీపుట్టువునకుఁ బాండు, క్ష్మాపా
లుఁడు నిన్నుఁ జూపి చనియె మహాత్మా. భార.
ఉద్యో. ౩. ౯.

౨. (కష్టాదులనుండి) దాఁటించు.

గీ. ....మీదయాసుకృతాదుల, పెంపు మిమ్ముఁ గడవఁ
బెట్టకున్నె. భార. ఉద్యో. ౧. ౧౦౯.

కడవడించు = కళవళించు. అ. క్రి. కలఁతపడు.

ద్వి. ఎడనెడఁ గడవఁలోఁ బడఁగడచుచుఁ, గడవ
డించుచు భుజంగము విజృంభింప. బస. పు. ౯.
౪౩౦ పం.

కడవతీటు. వి. (√కడవ.) తుడుము, వాద్యవిశేషము.
(శ. ర-కడువతీటు అని. చి. ని. బ్రౌ.)

కడవన్నె. వి. (కడ + వన్నె.) ౧. (బంగారముయొ
క్క-) చివరవన్నె, పదియాఱువవన్నె: పదియాఱువవన్నె
బంగారము.

సీ. కడవన్నె తళుకుబంగరుకోట....దశా. ౧. ౨౯౨.

సీ. కడవన్నె గిండ్లొకో గజనిమ్మపండ్లొకో సుదతీ లలామ
వక్షోరుహములు. ఇందు. ౨. ౧౫౮.

కడవన్నెగుబ్బలి = కనకాద్రి, మేరుపర్వతము. ఉ.
రా. ౭. ౧౧౦.

కడవముంత = కడముంత. వి. (కడవ + ముంత) చిన్న
మట్టిపాత్రము. హంస. ౫. ౧౧.

కడవబాయి. వి. (కడవ + బాయి.) కుమ్మరి కడవలు
చేయుట కుపయోగించెడుబాయి. హంస. ౫. ౯.

కడవసము = కడాసము, కళవసము, కళాసము వి. ధార్యచర్మము, ధరించుటకుపయోగించు తోలు.

క. కడవసములుఁ గోలలుఁ గప్పడములు వీరల ధనంబు....భార. ఆది. ౭. ౨౨౫.

చ. జడలను బెంచుచుం గడవసంబులు గట్టుచు.... భూమి జనించినట్టియా, మృడుఁడను గాను.... పార్వ. ౧. ౧౪.

కడవాఁడు. విణ. (కడ + వాఁడు) ౧-సమీపమందుఁడు వాఁడు-సేవకుఁడు,

(నకులుఁడు ధర్మరాజుతో నన్నమాట) క....నాలొంటి విధం, బామనుజేశ్వరుఁడడిగిన, నే మీకడవాఁడనందు ....భార. విరా. ౧. ౯౬.

(౨-క - అర్థమునకుఁగూడ నిది యుదాహరణము.) ౨-చివరవాఁడు-(క) కనిష్ఠుఁడు.

సీ. గారాపు మీతల్లి కడవాఁడఁగాని నేగణుతింపఁగడ వాఁడఁ గాఁజుమయ్య. మనుచ. ౫. ౪.

(ఇటసోదరులలోఁ గని ఁడు అని భావము. ఇది ౩. అర్థమునకుఁగూడ నుదాహరణము)

(చ) అంత్యజుఁడు, చండాలుఁడు.

మ. జడుఁడో బిక్షుఁడొ విప్రుఁడో వృషలుఁడో జ్ఞానాఢ్యుఁడో సిద్ధుఁడో, కడవాఁడో యనుచున్.... మల్లభూ. వైరా. ౯౬.

శ్లో. చండాలః కిమయం....సం. భర్తృ. వైరా. ౯౬.
౩ - దూరపువాఁడు-అన్యుఁడు, పెఱవాఁడు. (చూ. ౨. అర్థము.)

కడవీను. వి. (కడ + వీను) చెవితుద.

మ. పదియార్వన్నె పసిండిపట్ట మవనీ పాలావతంసంబునె, న్నుదుటంగట్టె లతాంగి యోర్తు కడవీనుల్ సోఁక నేర్పొప్పఁగా....నైష. ౬. ౫౩.

కడవెళ్లు. స. క్రి. (కడ + వెళ్లు) దాఁటు, తరించు.

గీ. విరహవారిధి నేఁగడవెళ్ల పెపుడు. ప్రభా. ౩. ౧౨౪.

అ. క్రి. సమాప్తమగు. (శ. ర.)

కడవోవు. అ. క్రి. (కడ + పోవు) ఉడిగిపోవు.

క. ....పాయంటొకనాఁ, డుడివోవుట గలిగిన మదిఁ, గడవోదుగదే మనోజగర్వం బెపుడున్. శివయోగ. ఉ. ౩౩ పొ.

కడవ్రేలు. వి. బొ. (కడ + వ్రేలు) చిటికెన వ్రేలు, కనిష్ఠిక.

(శివుఁడు) చ....శీతవసుధాధర కన్యక ముద్దుఁగేలుదా, మరకడవ్రేలు పట్టుకొని మన్ననఁ దిన్ననికిం బ్రసన్నుఁడై. కాశ. ౩. ౧౨౦.

కడసంజ. వి. (కడ + సంజ.) సాయంసంధ్య, మలుసంజ. కళా. ౮. ౧౦.

కడాని(నీ). వి. ౧. బంగారము, కాంచనము.

ఉ. మేలికడానిడాల్డాయలు మీటెడు జాబిలి బాలమేడలో. నీలా. ౧. ౧.

క. చిత్తజుఁడను దొమ్మరిలాఁ, గెత్తి వదిందూటి చనఁగ నిడినకడానీ, బెత్తపు వలయములో యన, బిత్తరి తాటంకయుగము బెడఁగై తోఁచెన్. చం. రా. ౩. ౭౯.

౨. మేలిమి బంగారము.

చ. మినుకుఁగడానిబంగరువుమేడలసోరణ గండ్లవెంట. .... నీలా. ౧. ౨౯. ఆంధా. ౨. ౨౭౯.

కడారము. సం. విణ (అ. ఆ. అ.) ౧. పింగళ వర్ణము కలది, కపిలవర్ణముకలది. ౨. గర్వించినది. ౩. నిస్సారము. వి. అ. పుం. ౧. పింగళవర్ణము. ౨. రూక్షత్వము. ౩. శూలము. న. జలము.

కడారుఁడు. సం. వి. అ. పుం. భృత్యుఁడు.

కడాసము = కడవసము.

సీ....ధార్యచర్మనామము కడాసము కడవసమన.... ఆం. భా. ౨. ౧౭౭. (ప్రాఁత ప్రతిపాఠము.)

కడి[1]. వి. ౧. కబళము, ముద్ద; (గోమయాది) పిండము.

సీ. కమఠజాండము నొక్కకడి చేసికొని మ్రింగ

నరుదెంచుచున్న కాలాంతకుండో. భా. రా. యు. ౧౪౬౭.

గీ. కదేcడు మెతుకులకై యింతకష్టపడెడు. కుచేల. ౨. ౧౧౨.

క. కది మూడ చేయుభోజన,మిడుదుమ భిక్షాటనం బి దేలా నీకుఁ. ధర్మ. ౩. ౩౯. (కదిమూడచేయు :- మిక్కిలి విలువగల అనిభావము.) శేష. ౧. ౧౦౦.

(వ్యవ) ఆవు రాత్రి నాలుగుపేఁడకళ్లు వేసినది.

౨. ఆహారము, తిండి.

క. తడి గంట నెపుడుఁ దఱుఁగక,కడి దఱుఁగఁగ వడియుఁ దటిఁగి గాసిఁ బడమిఁ,బడినఁ గన రాక మంచపుఁ, దొడుగఱ్రై రట్టె డుబలతో నే మందుఁ. మసుచ. ౩. ౧౩౧.

ఓరెంపుఁగళ్లు = అన్నపిండములు.

ఆ. కలఁక మీఱ మిగులఁ గన్నీరు నించుచుఁ, గొంత దడవు సొగిలి యంత జతన,మొనర నుపులు నీళ్ల నోరెంపుఁగళ్లను, మొదలుగలుగుచెయ్యులదనఁ జేసి. అచ్చ. రా. అయో. ౧౧౨.

జ : కడికంచము, కడిగొను, కడిమెత్తు.

కడి[2]. వి. సువాసన, సుగంధము.

సీ. కబళపరిమళశత్యర్థములయందుఁ గనుపట్టుచుండు ను గడి యనంగ. ఆం. భా. ౩. ౬౧.

౨. దుర్గంధము.

(గజవర్ణనము) సీ. కడి వోవ. సొదఱులు గడిగి నవా శ్వత్థవల్కలరసములు వఱలఁ బూని. కు. సం. ౧. ౯౮.

జ : కడివోవు.

కడి[3]. వి. క్షతి, గాయము. ఆం. భా. ౩. ౬౧.

కడిఁది. విఙ. (క. త. కడిదు) ౧. గొప్పది, అధికము; పెద్దది.

చ. ....ఉన్మదకరినైన నుగ్రమృగనాథునినైనను గిట్టి ముట్టి వెట్టిదముగఁ గాలఁ గేలను గడింది మగంటిమి యుల్లసిల్లఁ బట్టును .... భార. విరా. ౧. ౮౩.

ఉ. ....కడిందిగ గ్రుక్కి....హరి. ఉ. ౨. ౬౭.

సీ. ....కడిఁదిబొమ్మ....రామా. ౬. ౧౧౪.

ద్వి. కడిఁదికొమ్ములపోటు .... రం. రా. సుం. ౨౪౪ పొ. ౧౩ పం.

౨. గంభీరము, లోఁతైనది.

(రాముఁడుసముద్రునితోనన్నమాట) ద్వి. కడగానరాని నీకడిఁది చిత్తంబుఁ, బడయుటకై నేను బడియున్న వాఁడ. రం. రా. యు. ౩౦౭ పొ. ౬ పం.

ద్వి. కడిఁదిచిత్తంబు చెదరంగ . . రం. రా. యు. ౩౦౩ పొ. ౧౬ పం.

౩. కఠినము, తీక్ష్ణము; దారుణము.

ఉ. భావములో నదంభ యగుభక్తికి సంతస మందు దొండె నొం,దే విధియింపుఁ డిప్పుడ కడిందిగ దం డము దప్ప గల్గెనేఁ. నైష. ౪. ౧౧౩.

చ....కడిందివేసవిఁ. ఆము. ౨. ౬౪.

చ....పుష్పాది నీపదాంబుజం, బెటువలెనోర్చెనమ్మ త రుణీ తగునమ్మ కడింది చెయ్యముల్. పసు. ౩. ౧౨౧.

౪. అసాధ్యము, అశక్యము.

సీ....అవిచారముఖ్యంబు గాన లోకంబు మెప్పించుట కడిఁదిగాదె. నిర్వ. ౧౦. ౧౪౨.

ఆ. నవసి పొవసి యనుదినముఁ బరప్రేష్యులై, యునికి దలఁప నర్థమునకచూపె, యట్టిదుఃఖలబ్ధ మైనయ య్యర్థంబు, విడుచు టెవ్విధమునఁ గడిఁదిగాదె. భార. అర. ౬. ౧౧౧.

వి. ౧ కడిమి, శౌర్యము.

సీ....కడిమి యుక్కు కఱకు గట్టి కడిఁది. గీ. నాఁగ శౌర్యాభిధానంబు గాఁగఁ బెంఁగు. ఆం. భా. ౨. ౨౨౧.

౨. ఆపద, ఇక్కట్టు.

క. వడిఁ బోయి మీర లిప్పటి, కడిఁదికి నేమాంస

౨. బియ్యము మున్నగునవి కడిగిననీరు, తండులక్షాళనము, కుడితి.

సీ. తండులక్షాళనోదకము రాజిల్లు కుడితి యనంగను గడుగనంగ. ఆం. భా. ౨. ౨౫౧.

కడిగిపెట్టు = కడిగివేసిన ట్లేమియు లేకుండఁ జేయు.

గీ. తులసిపోఁగులు మొదలుగాఁ గడిగిపెట్టి, చిక్కు బాకీలు పిదప నిశ్శేషపఱిచె. విగం. ౨. ౧౧౬. ('లడ'లకు ప్రాసము.)

(వ్యవ) వానికి ఇల్లంతయుఁ గడిగిపెట్టినాఁడు = ఇంటిలోని యాస్తి యంతయు వానికిచ్చివేసినాఁడు.

జః కడుగుడు.

**కడుగుడు.** వి. (√కడుగు) ౧. కడుగుట ౨. పడఁగట్టుట, శోధనము.

సీ....వడఁగట్టు గాలింపు కడుగు చేయు. గీ. పఱుపఁగ శోధనాభిధ పరఁగుచుండు. ఆం. భా. ౨. ౨౫౨.

**కడుజు** = కణుజు (శ. ర.)

**కడుపు(ప్పు).** వి. (సం. గర్భః. ప్రా. గబ్భో) ౧. ఉదరము, కుక్షి, పొట్ట.

క...ఎచ్చోటఁ గడుపుఁ బ్రోచుకొ యచుమున్. భా. సభా. ౧. ౨౬౮.

క....పానీయంబుల్, గడుపారఁ ద్రావె... వేం. పంచ. ౧. ౩౬౩.

చ....పసుజొప్పెపులు తోఁడుము గాదుకద్దులో, సుయకులు కోఁడుమన్ వదుణుగుండియుఁ దేఁడుచు...కళా. ౫. ౧౨౩.

ఆ...చెడయై, కడుపుకొఱకుఁ బాతకములు చేసి, రౌరవమునఁ గూలు... కేయూర. ౩. ౨౯౩. (కడుపుకొఱకు=ఉదరపోషణార్థము.) హరి. పూ. ౫. ౨౨౧.

౨. గర్భము, చూలు.

ఉ... జారుశశిఁ బొందికటా కడు పేల దెచ్చుకొం, టెగ్గు దలంపఁగా వలదె ... భాగ. ౯. ౩౭౮.

౩. గర్భాశయము.

క...లేడికడుపునఁ బులి పుట్టునె...భార. ఆది. ౬. ౫౮.

(వ్యవ) వాఁడు నన్ను తనకడుపునఁ బుట్టినబిడ్డకంటె ఎక్కువగా చూచుకొనుచున్నాఁడు. (కడుపునఁబుట్టినబిడ్డ=ఔరసుఁడు.)

౪. గర్భస్థపిండము, భ్రూణము.

క. ద్రైతేయకాముని సం, ఘాతము మగ మొలక లైనకడుపులు డిగ సం, కేతించినట్లు చక్రము, పాతాళంబునకు నరుగఁ బ్రతిష్ఠాపించెన్. ఉ. హరి. ౩. ౧౫౭.

చ. కడుపులు దింప...సుక. ౨. ౨౪.

గీ. దేవకీదేవి కడుపులోఁ దేజరిల్లు, దీప్తగర్భంబు మెల్లన తిగిచి యోగ, నిద్ర గోహిణికడుపున నిలిపి చనియెఁ, గడుపు దిగె నంచుఁ బౌరులు గలఁగఁబడఁగ. భాగ. ౧౦. పూ. ౬౨.

౫. సంతతి, సంతానము.

(వ్యవ) నీయమ్మకడుపు చల్లఁగా మంచిమాట చెప్పినావు.

గీ. సిరియును నాఁటియు మొదలైనసుకృతసంగ్రహ, లక్ష్మి గడుపు చల్లఁగా నఖిలకుంచి, నియమమునఁ గొల్తు రెవ్వాని నిత్యకలన, నట్టిశ్రీమేసనినుఁ గొల్తు మహాదహంబు. భీమ. ౪. ౭౨.

కడుపంటు = కడుపు (ఆఁకలిచే వెన్నునకు) అంటుకొనిపోవు.

గీ. పంటవొగ్గళ్లలోఁ గడుపంటి శత్రు, చలనములఁ గ్రుక్కుజీర్ణోటుపుల...ఆము. ౬. ౧౩.

కడుపుఁ గక్కుఱితి (కక్కుర్తి) = ఉదరపోషణాశ.

చ. తపపులఁ బట్టి యేను సతతంబును బోదుము వానివీటికిన్, గడు మఱి చాలమిం గడుపుఁ

గన్కొంటిరిఁ సుర్లోకనాథ... ప్ర. భా. ౧. ౧౧౭.

సీ. కడుపుఁగన్నూర్తికిఁ గావికోకలు కట్టి య
తుల మంచును భిక్ష లడుగువారు. పా. ౧౦. ౧౦౬.

కడుపుచల్లకదలకయుండు=శ్రమపడకుండు.

క. మ్రొక్కెదము సామి నీవయ, నెక్కొనఁగాం
బ్రొద్దు పొడుచు టెఱుఁగక నీవే, వెక్కని
యుండుము దాయలు, గ్రక్కదలక గడుపు
చల్లకదలకయుండక. రామా. ౨. ౬.

కడుపుచేటు:-ప్రసవవేదనపడక తల్లికి కన్నం దులకు ఫలము లేదనిభావము.

గీ. కోరి గంగాజలంబులు గ్రోలఁ జేసి, కలుగ నే
టికిఁ దల్లులకడుపుచేటు. బాహ్లే. ౧. ౭౯.

కడుపుఁజిచ్చు=కడుపుమంట, ఆఁకటిబాధ.

వ....ఏ నశనంబుఁ గానక గానకత్వంబుకొ
న్నియగా....కనికరం బుడిగి కడుపుఁజిచ్చు
నకు ప్రింగంగ దలఁచుకొనియుండి... మను చ.
౫. ౨౭.

కడుపునిండిన బేరము=అక్కఱలేని బేరము, వేడుక బేరము. (వా.)

కడుపుకూడు=ఆఁకటికి నోచినంతమాత్రము తిండి.

ఆ. ఏను గట్టివాఁడనైన నా కెవ్వరు, కడుపుకూ
డు వెట్టి కట్టఁ జీర, యిచ్చి నాకతముచే నేలు
దురట్టివా, రలసఁ బనులు సేసి ... భార.
విరా. ౧. ౨౯౮.

కడుపు(డ్పు)నఁబెట్టు=(శిశువులకు)దగ్గపెట్టు.

సీ. వేఁపాకు గోరంటవిత్తులు నూనె నైచుఁ బోసు
మాన్పుచుఁ గడుపునఁబెట్టు. హంస. ౨.
౧౫.

గీ. మునమునను గడుప్పునఁ బెట్టి మూరిబిడ్డు, మో
మునను మేనఁ జమిరి... హరి. పూ. ౫. ౧౮౭.

(సా) కడుపులోఁజేపెట్టి కలఁచినట్లు.

ద్వి. కడుపులోఁ జేపెట్టి కలఁచినట్లైనఁ, గడుభ
యంబునఁ బొంది కన్నీరు దొరఁగ. ద్వి.
హరిశ్చ. ఉ. ౧౭౨౬.

కడుపుమీఁదఁగొట్టు=వృత్తిచ్ఛేదము చేయు, జీవనాధారముపడఁగొట్టు. (వా.)

కడుపుఁగట్టుకొను=(లోభాదులచే) తిండిమానుకొను. (వా.)

కడుపులోఁబెట్టుకొను=౧. ఆదరించు. ౨. మాఱక యుండు, క్షమించుకొను. ౩. వెల్లడింపకుండు.

కడుపుకంటివిత్తు=కంటికొత్తువల కడుపు పిక్కటి ఫలము, వంశవృద్ధియగు.

క. అడుగఁగ వలసినయది యేమి, యడుగుము వినవను
గ మొదల నాచిలుక యదె, క్కడిది యిటుఁ
దేక యేటికి, విడిచితి నీకడుపుకంటివిత్తుగ
హంసీ. ప్ర. భా. ౪. ౪౧.

చూ: కడుపుబ్బు, కడుపుమంట, కడుపూఁది.

కడుపుబ్బు. వి. (కడుపు+ఉబ్బు.) ౧. కడుపుఉబ్బరించెడి యొకరోగము, ఆనాహము. (ఇందు మలమూత్రబంధము కలుగును.)

సీ. కడుపుబ్బు నాఁగను నడఁచు నానాహాఖ్య. శం.
భా. ౨. ౧౩౭.

౨. ఈర్ష్య.

ఉదా: వాడు నన్నుతిట్టి తనకడుపుబ్బు తీర్చు
కొన్నాఁడు.

కడుపుమంట. వి. (√కడుపు.) ౧. కడుపుబాధ; క్షుద్బాధ.

ఉ. అక్కట వాసుతోఁట యిది దైనఁ బదియ
ఫలంబు లిమ్ము రా, తొక్కనుసాఁకఁ గోరితిఁ
గడున్ దడుకేలను వచ్చి యిచ్చవో, మిక్కు
టపేక నాకడుపుమంటయుఁ బుచ్చికొనంగఁ
బూని యా, చక్కెరవంటిపండ్లు తినసాగి ర
టంచుఁ గృశించు నెంతయుఁగా. శుక. ౩.
౭౭౮.

౨. ఈర్ష్య.

ఉదా: నాకు లాభమువచ్చినదని వానికిఁ గడుపు మంట.

కడుపూఁద. వి. (కడుపు+ఊఁద.) ౧. మలమూత్రములు బంధించి కడుపుబ్బరించెడుపశురోగ విశేషము.

ఆ. నరిడి పుప్పి కప్పనావురు గడుపూఁద, యము రుఁద్రిక్కి యనఁగ నడరి మఱియుఁ, దెవుళు లెన్నియేనిఁ దవిలి యెంతయు మహో, గ్రంబులయ్యెఁ బసుగణంబునందు. హరి.పూ. ౬. ౮౫.

౨. కడుపుబ్బు, ఈర్ష్య. (శ. ర.)

కడుపేడు. వి. (కడున్ + పేడు) మేదరవాఁడు కట్టుకట్టెడుసన్నని వెదురుపేడు. (శ. ర.)

కడువు=కడుగు.

గీ. ఆజ్యతైలాభ్యక్తపాత్రభాండావళులను, నేల్లనీళు లనొండె వేన్నీళ్ల నొండెఁ, గడువ నొంతఁ గోమిననొండెఁ గలుగు శుద్ధి. మార్క. ౩. ౨౫౮.

కడ్డాయము. వి. (క. కడ్డాయ. త. కట్టాయం.) బోము, బలాత్కారము. (శ. ర, బ్రౌ.)

కడ్డి(డీ) వి. (సం. ఘటికా. ప్రా. ఖడిఆ. క. కడ్డి. త. కట్టి) ౧. బలపపుఁగోపు, పలకపుల్ల. (శ. ర.)

౨. పాళము, బంగారుమున్నగువానికడ్డి, శలాక.

గీ. కడ్డి యనఁగ సలాక నాఁగను శలాక, యమరు... ఆం. భా. ౨. ౨౭౫.

కడ్డవత్తి=అగరువత్తి.

క. ధూపంబు కడ్డివత్తులు, దీపంబు నొసంగి... శుక. ౨. ౩౯.

కథాను. వి. శస్త్రచాలనభేదము, కత్తివిసరులలో నొకటి.

వ... కథాను ఘాణు దారు ఝూటు మొదలుపమనాలుగువిసరులు... ప్రబంధ. ౭౦.

కణ. సం. వి. ఆ. స్త్రీ. ౧. ఒకానొక [illegible] మక్షిక. ౨. పిప్పలీ. ౩. జీరకము, తెల్లజీలకఱ్ఱ.

కణఁకు. వి. అగ్ని, నిప్పు.

గీ. సారిది పిహరించుకపు లోకచోటఁ గూడి, కడిఁదిచలిచేత మేనులు గడు వడంక, రాత్రి మేలుఁగాముఖద్యోతరాజిఁ జూచి, కణఁకు గాఁబోలు నని సీఁపు గాఁచుమండ. నా. పంచ. ౧. ౯౯౪.

కణ(డ)ఁజే(ము). వి. (సం. గంజః. క. కణజ) ౧. ధాన్యాదులు దాఁచుకొనుకొట్టు; గాదె; సోణక.

గీ. ... అనిశ్చకాలుఁ, హోరి గోపురమును వంట సాలయుఁ గణఁ, ...౦బుఁ గట్టించుటకు మాస సాయనఁ దలఁచె. పద్మ. ౫. ౭౬.

ద్వి. కణఁజంబు లాదిగాఁ గలుగుసంపదలు, గణుతింపఁ జోద్యంబు గాఁగ ... పవనాథ. ౨. ౧౫౭. సా. ౮. ౩౧.

సీ. అఖిలవస్తువులధాన్యములకణంజలు... హంస. ౨. ౧౩౭.

సీ. కాయధాన్యంబులకణఁజముల్ ఓయ్యంపు గంపెలు దినుసులుగలకొటార్లు. హంస. ౨. ౨౨౬.

సీ. ఈగనే యూఁగినఁ బ్రోగైనపంటను జగము లన్నియుఁ గపఁజాలుగాదె. కవి. ౧. ౧౨౯.

౨. పాఁతఱ

చ. అలనిఖిలధాలయాహినిలయంబుల నెప్పుడుఁ గోడఁబుట్టువుల్, పలకొని యుండఁగాఁ గరి పలన్ గణఁజంబుల నెత్తరామిచే, నిలిచిన కుప్పకావలికి నిల్వదు రప్పరిఁ గొంగుబత్తెపుం, గొలువున కీయకొల్పి హాలికుల్ బికిరంబుషాసంగువేలుపున్. చంద్రా. ౧. ౨౫.

౩. ద్రవద్రవ్యములు పోసికొనుట కుపయోగించెడుపాత్రము, గంగాళము.

సీ. [illegible] యాలకణఁజంబులు వనలక్ష్మిసా

భాగ్యమునకు నెడలు. గీ. ... అనఁగఁ దగిన యలరుగుంపులు ... ఉ. రా. ౬. ౧౧.

**కణగుగ్గులువు.** సం. వి. ఉ. పుం. ఒకవిధమగు గుగ్గిలము, మహిషాక్షము. (మహిసాక్షి.)

**కణజీరకము.** సం. వి. అ. న. క్షుద్రజీరకము, చిన్న జీలకఱ్ఱ.

**కణజీరము.** సం. వి. అ. పుం. తెల్లజీలకఱ్ఱ.

**కణపాయి.** సం. వి. న్. పుం=కణయము.

**కణభక్షుఁడు.** సం. వి. అ. పుం=కణాదుఁడు.

**కణభము.** సం. వి. అ. పుం. కీటభేదము. (ఇది కుట్టినచోటను మంట పుట్టును.)

**కణభుక్కు-(జుఁస్సు).** సం. వి. జ్. పుం=కణాదుఁడు.

**కణము.** సం. వి. అ. పుం. ౧. గింజ. ౨. నూక. ౩. లేశము, సూక్ష్మాంశము. (ఉదా: సికతాకణము, జలకణము.) న. మహిషాక్షము. (మహిసాక్షిగుగ్గిలము.) విణ. అ. పుం. సూక్ష్మమైనది. (అనువము.)

**కణయము.** వి. వాయుస్కంధము, వాయుపథము.

ద్వి. నిలసిల్లఁగా నందు వివిధమేఘములు, గలుగు నా రెండవకణయంబుఁ గడచి... ఆయేనవకణయంబుఁ గడచి. రం. రా. ఉ. ౬౩ పా. ౧౩, ౧౭ పం.

**కణయము.** సం. వి. అ. పుం. ౧. శరభేదము, ఆయుధవిశేషము. (కే. వి.)

వ. కణయకంపనములు మున్నగ... ప్రముఖప్రహరణంబులు. ఉ. హరి. ౪. ౨౧౩.

౨. క్రతుభేదము. (కే. వి.)

**కణలాభము.** సం. వి. అ. పుం. ౧. సుడిగలి. ౨. నీటిసుడి.

**కణసరము.** వి. శ్యేనవిశేషము, ఒకజాతి డేగ.

సీ. కన్నెలేడులమీఁద గాట్పులుబీసంపుఁ గణసరంబులఁ జొన్పి గండడంచి. రసిక. ౧. ౧౧౫. ఆం. భా. ౨. ౯౦. (కడసరము అని చి. ని, శ. ర.)

**కణాటీనము.** సం. వి. అ. పుం. ఖంజనము, కాటుకపిట్ట. (మందపిచ్చుక అనికొందఱు.)

**కణాటీరము.** సం=కణాటీనము.

**కణాదుఁడు.** సం. వి. అ. పుం. వైశేషికసూత్రకర్తయగు నొకఋషి.

**కణి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. వనజీరకము, అడవిజీలకఱ్ఱ. వి. ఇ. పుం. ధ్వని.

**కణిఁతి**=కంతి.

గీ. ... కంతి కణఁతి ... అనంగను బొంగు గ్రంథి. ఆం. భా. ౨. ౭౪.

**కణిక.** వి. (సం. కణికా.) ౧. బలపము. ౨. నిడివియైనముక్క.

ఉదా: అక్షింతలకణిక, సుద్దకణిక.

చెఱకుఁగణిక=చెఱకుముక్క. ద్వి. పరమ. ౧. ౪౪ పా. ౧౬. పం.

**కణిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. అణువు, నలుసు, లేశము, అతిసూక్ష్మాంశము. (జలకణిక, మొ.) ౨. సూచి, సూది. ౩. జీలకఱ్ఱ. ౪. గోదుమరవ. ౫. అగ్నిమంథనము, నెల్లి. ౬. తూలిక. ౭. కూణిక, వీణెబిరడ.

**కణికము.** సం. వి. అ. పుం. ౧. గింజ. ౨. అణువు, నలుసు, ౩. గోదుమరవ. ౪. పటవాసకము, బుక్కా.

**కణితము.** సం. వి. అ. న. ఆర్తస్వరము, కుయ్యి, మొఱ్ఱ.

**కణితి**=కడితి.

ప్రగ్గ. కుండించెఱ మమ్మఁబిల్లఁబడువెంగ ఇసుకలఁ బ్రాఁచెఁ జివ్వంగిమూఁకఱ. యయూ. ౨. ౩౨. చంద్రా. ౨. ౧౪.

**కణిశము.** సం. వి. అ. పుం. న. సస్యమంజరి, ఎన్ను, కంకి.

**కణిష్ఠము.** సం. విణ. (అ.ఆ.అ.) అత్యంతసూక్ష్మమైనది, సూక్ష్మతమము.

**కణీకము.** సం. విణ. (అ.ఆ.అ.) చిన్నది, అల్పము.

**కణీచి.** సం. వి. ఇ. పుం. ౧. నినాదము, ధ్వని. ౨. అళ్వము, గుఱ్ఱము. ఇ, ఈ. స్త్రీ. ౧. పూచినలత. ౨. గురిసెందకీ. ౩. శకటము, బండి. ౪. మనస్సు. ౫. అండుగుఱ్ఱము.

**కణీయము.** సం. విణ. (స. యసీ. స.) సూక్ష్మతరము.

**కణుజు**[1] — అణుజు, అడుజు. వి. శ్యేనభేదము.

గీ. మృగయు లంతటఁ దెచ్చిరి లగుడు గిద్దు, బాతె జలకట్టె కణుజు వేసడము శైరి, కురుజు ... అను పేగకోలము. పి. శకుం. ౧. ౧౧౦.

**కణుజు**[2]. వి. పగడములు తూఁచెడుమానవిశేషము.

గీ. పరఁగును ప్రవాళనామంబు పగడ మనఁగఁ, బపడ మనఁగ సిరాడి నా వాసికెత్తు, కణజనంగను విలసిల్లుఁ బ్రణతశక్త, భూరిదఘంగ శ్రీమాత్ర భూతిశేంగ. ఆం. భా. ౨. ౨౮౮.

**కణుదురు.** వి. వృక్షవిశేషము. హంస. ౪. ౧౧.

**కణేర.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఆఁడేనుఁగు. ౨. వేశ్య.

**కణేరము.** సం. వి. అ. పుం. కర్ణికారము, కొండగోఁగు.

**కణేరువు.** సం. వి. ఉ. పుం—కణేరము. స్త్రీ. ౧. ఆఁడేనుఁగు. ౨. వేశ్య.

**కణ్వము.** సం. వి. అ. న. ౧. పాపము. ౨. భూషణము, అలంకారము.

**కణ్వుఁడు.** సం వి. అ. పుం. ౧. కాణ్వోకముని. (శకుంతలను పెంచినవాఁడు.) విణ. (అ.ఆ.అ.) ౧. బధిరుఁడు, చెవిటి. ౨. మేధావి, బుద్ధిమంతుఁడు.

**కత**=కద[2]. వి. (సం. కథా. ప్రా. కధా. క. కతె. త. కత్తం.) ౧. వృత్తాంతము, సమాచారము, సంగతి.

క. ... కొడుకులకత వినియెద ... భార. ద్రో. ౪. ౨౭౭. రామా. ౯. ౧౯౨.

క. అప్పుడు మనుబోంట్లకతల్, చెప్పఁగ నేమిటికిఁ గాక సిరి వేత్రధరుల్, రొప్పఁగఁ జనియెక్కలువక, యప్పరమేష్ఠియును నచటికతిమూకనుసఙ్. కళా. ౨. ౭౧.

౨. చరిత్రము; కథ; చేష్ట, చర్య.

గీ....అచ్చ తెనుఁగు, బాసచే నిప్పు డేనొనర్పఁగఁ గొడఁగిన, సిల యను పేరఁ దేజాన నిప్పటిల్లు, సింతి పెండిలికత తెలుఁ గెట్టు లనిన. శిలా. ౧. ౨౩.

క. కతలుగ మానసంసార, స్థితు లెల్లను జెప్పె ... సాముచ. ౫. ౧౨౯.

గీ. కడమ పన్నియు నిఁక నేల కతకుఁ గాల్లు, ముంతపఁ జెవులుఁ గల్పింప సుజ్జగములఁ, బమపుఁజవరాంద్రకును దృణప్రాయ మహా. సుద. ౪. ౨౫.

క. కొడుకుపయి సీకుఁ గడుఁ బ్రే, ముడి గావునఁ గతకుఁ గాల్లు ముంతకుఁ జెవులీ, వడిగెడవు రాజసీక, క్రొడియభిమాన మని పలుకఁ గాంతుం డలుకఙ్. సారంగ. ౩. ౧౯.

(నృసింహమూర్తిని చూపి ప్రహ్లాదుఁడు తండ్రితో ననిసమాట.) చ. ... ఇంకనీ, కతలను మాని యిశ్వభు నగణ్యకృపానిధి నాశ్రయింపు... నృసింహ. ౫. ౯౬.

౩. లోకోక్తి, సామెత.

గీ....పులి పేదపడినఁ బసుల, వాండ్రె యొక్కడి రనుకత వచ్చె నాకు. ఉ. హరి. ౪. ౧౦౨.

**కతరాజు**—కథలు చెప్పుటలో నేర్పరి.

క....నీ కిది చెప్పం, గా వలయుబు భయిందు మి

కతుకు=గతుకు¹, గదుకు. స. క్రి. ౧. తిను, భుజించు.

క. కతికిన వతుకు దటంబు, న్మతిమంతులు పలుకు పలుకు మాపోఁటులనుఁ, స్మృతికంటె హెచ్చు...పార్వ. ౫. ౯౭.

౨. కుక్క మొదలగునవి నాలుకతోఁ గొంచెము కొంచెముగా త్రాగు.

చ...ఏఱులు నిండిపాఱఁగం, గతుకఁగఁ జూచుఁ గుక్క తనకట్టిన మీఱుక యొందు భాస్కరా. భా. ౪. ౫.

కతుక్కు=కటుక్కు. వి. కొఱుకుటయందగుధ్వనికి అనుకరణము.

ఆ. ఒక్కచక్క వల గతుక్కునఁ గొఱికి తా, న వలఁ జనఁగ నెంటఁ దవిలె బలము. శుక. ౧. ౧౨౨. (శ. ర.)

కత్తరి. విశే. ౧. నానావర్ణములు గలది, శబలము.

ఉదా: కత్తరియావు, కత్తరియెద్దు. (శ. ర.)

౨. వర్ణసాంకర్యము గలది.

క. ఉత్తమసతి శూద్రులతోఁ, జిత్తజసుఖకేళి వాంఛఁ జేసినఁ బ్రాయ, శ్చిత్తమున శుద్ధిఁబొందును, గత్తరి పురుషునకుఁ బాయు గర్భం బైనన్. విజ్ఞా. ఆచా. ౧౧౨.

చూ: కత్తరించు¹, కత్తరిగలయు, కత్తరిల్లు.

కత్తరించు¹. స. క్రి. (√కత్తరి) చలింపఁజేయు, ఆడించు; తొలఁగించు.

ద్వి. మిన్నక చూచుచు మెడ విప్పుకొనుచుఁ, గన్నులార్చుచుఁ జెవుల్ గత్తరించుచును. పండితా. పర్వ. ౩౭౧. పు.

చ. మఱుకువఁ గత్తరించి మనమానములం జూఱ వుచ్చి మెచ్చుఁ జా, గఱగొని క్రోధకామముల గండడఁగించి... ఉ. హరి. ౪. ౯౭.

కత్తరించు². స. క్రి. (√కత్తెర¹) కత్తిరించు, ఖండించు.

వ. ఇట్లు మనుసూదనుం డేసినబాణకంబులు… చరణంబులు తొలిచియుఁ, జర్మంబు లొలిచియు బాహుదండంబులు గత్తరించియు బయల్కను నొత్తరించియు... ఉ. హరి. ౧. ౧౪౯.

కత్తరిగలయు. అ. క్రి. (√కత్తరి.) మిశ్రమగు, కలసిపోవు; సంకరమగు.

క. ఎఱిఁగింపకున్న నకులు ల, తెలియంగా రాదు నాఁడుఁదేఁగెలు జడలున్, జలరుహములు మొగములు నళి, కులకంబులుఁ జూపుఁజాలుఁ గత్తరిగలయన్. రాజ. చ. ౨. ౧౫౯.

క. పెసఁగుసు నల్లను గలిపిన, కరణిన్ వర్ణాశ్రమములు కత్తరిగలయున్. జై. భా. ౯. ౨౨౩.

కత్తరిల్లు. అ. క్రి. (√కత్తరి.) చలించు.

గీ. కటము లుబ్బంగ మీసాలు గత్తరిల్ల. నైష. ౭. ౪౬.

కత్తలాన=కత్తలాని.

(వర్మితవాజి, కవచము తొడిగినయశ్వము.)

సీ. ... వర్మితవాజి యూఁ గత్తలాని యనంగఁ గత్తలాన యనఁగాను. ఆం. భా. ౨. ౧౯౬.

కత్తలానము=కత్తలాని.

(అశ్వాదివాహనము)

మ. కలుఁగున్నాయుఁ దేజికిన్ భయమున్ మైఁ గా… న్పించు మగిశాయనా, మ్ముఖము పమ్ముకత్తలానము నయంబుల్ మీఱ నావించి యూ, తెలుసం బర్వనఁ బోవువానిఁ గని గౌరికాంత సారెంగిలా, కిల నవ్వు న్మన మొందుపంతము బుద్ధిం గీర్తించి నర్తించెనన్. మనల. ౧. ౭.

కత్తలాని=కత్తలాన, కత్తలానము, కత్తళఁము, కత్తళా. వి. (√కత్తళము. సం. కర్త్రాణః ?) వర్మితాశ్వము, కవచము తొడిగినయశ్వము; అశ్వాదివాహనము.

సీ...వర్మితవాజి యూఁ గత్తలాని యనంగఁ గత్తలాన యనఁగాను...ఆం. భా. ౨. ౧౯౬.

ఉ. అందఱికత్తలానిగమి...అచ్చ. రా. బాల.

౩౭. (ఇట తెల్లఁగొరిజలుఁ దోఁకయు నెంద్రుకలును గలకల్లగుజ్జుము అని శ. ర.)

సీ. తెలఁగంటికల్కి ముద్దియ లూడిగపుఁజెలు ల్కాడిఁదిబొబ్బమెకంబు కత్తళాని. రసిక. ౧. ౨.

**కత్తళఁడు**=కత్తళాని. (చి. ని, శ. ర.)

**కత్తళ(ల)ము.** వి. కవచము.

ఉ. ...హాం,చాలుఁ నెల్లఁ దీవ్రశరజాలములం బొలియించి కాని భూ,పాలక వృచ్ఛఁ గత్తళము...భార. శల్య. ౨. ౩౯.

శ్లో. నాహత్వా సర్వపాంచాలాన్ విమోక్ష్యే కవచం శ్లో. సం. భార. శల్య. ౩౨. ౨౩.

ఆ. కత్తళములు మూపుగములు ... అచ్చ. రా. అర. ౭.

జ: కత్తళాన, కత్తళానము, కత్తళాని, కత్తళఁడు, కత్తళా, కత్తళీఁడు.

**కత్తళా**=కత్తళాని.

(అశ్వాదివాహనము.)

సీ. రమణీయమైనట్టిరాచిల్క కత్తళా పిలపిల్లుడ గరకాశముపడగ. గంగ. ౬.

**కత్తళీఁడు.** విశే. (√కత్తళము) వర్మితుఁడు, కవచముతొడిగినవాఁడు (చి. ని, శ. ర.)

**కత్తి.** వి. (సం. కర్త్రీ. క. త. కత్తి.) ౧. ఆయుధవిశేషము (ఖడ్గము, క్షురిక, మొ.); ఆయుధము.

వ. ...శూలంబుల ఫాలంబులు వ్రీడివియఁగత్తుల నెత్తులు వగిలించియు బల్లెంబుల సెల్లెంబులు నొగిలించియు...విక్ర. ౪. ౯౭.

స్రగ్ధర. ఖడ్గిన్ జెండాడు మ్రాఁకుల్ కవుఁగిటి కోలఁదుల్ కత్తి నొక్కొక్కఘాతన్. మనుచ. ౪. ౭.

గీ. కత్తివాతులతో నూరు గాచి తిరిగి, యాడు మురుపాశముల్ గాంచె నాలువేల, వాని లోనిపిశాచముల్ వచ్చి... టిఁ దునుకలప్రోవు చేసె. ఉ. హరి. ౧. ౧౪౦.

(కత్తివాతులు = మొనకత్తులు, పిచ్చుకత్తులు.)

సీ. ...కైదువ యనఁగను గత్తి యనఁగ, నాయుధ మొప్పు...ఆం. భా. ౨. ౨౧౧.

౨. ముప్పదిరెండువిన్నాణములలో నొకటి.

సీ. కల్లంబు రాటంబు కత్తి కొక్కెస...గీ. అంజ మెడపట్టు నాఁగఁ జెన్నలరుచుండు, ముప్పదియు రెండు విన్నాణములనఁ జెల్లు. ఆం. భా. ౨. ౨౦౯.

౩. ఒకదినములో ఒకఁడు సస్యము కోయుటకు సరిపడు భూమి అని కొందఱు (బ్రౌ.)

౪. నలుపదియుకరములపదునాల్గుకుంటలభూమి. (బ్రౌ.)

కత్తులునూఱు = కలహమునకు కాలుద్రవ్వు.

ఉ. కాయజుఁడా కెపై నలిగి కత్తులునూఱుచునుండు ... కళా. ౭. ౩౯.

జ: కత్తికాను, కత్తిగంటము, కత్తిగొంటు, కత్తిపడిక, కత్తిపీఁట, కత్తిపేరమెకము, కత్తిమందు, కత్తిమీఁదసాము, కత్తివాతికూపు, కత్తులబోను.

**కత్తికాను.** వి. (√కత్తి.) నల్లవానిపనిముట్టు, గీఁతకత్తి.(బ్రౌ, వా.)

**కత్తిగంటము.** వి. (√కత్తి.)ఒకవైపున కత్తిగాను ఒకవైపున గంటముగాను నుపయోగించు వ్రాఁత పనిముట్టు.

గీ. ముదుకతలపాగయును బాహుమూలమందుఁ, గవిలె చర్మపుటొరలోనికత్తిగంట, మలఁతి నిగ్గ్వవిదోవతు లమర గ్రామ,కరణ మేతెంచి రెడ్డివెంగట వసించె. శుక. ౨. ౪౧౬.

**కత్తిగొంటు.** విశే. (√కత్తి.)-కత్తివలె తీక్ష్ణమైనది-క్రూరస్వభావము గలది.

ఆ. కత్తిగొంటువైన యత్తగంతు. కు. సం. ౮. ౧౩౯.

**కత్తిపిడిక.** వి. (√కత్తి.) ఈంద్రవారికత్తుబుట్ట. (శ.ర.)

**కత్తిపీట.** వి. (√కత్తి.) కూరలు మొదలగునవి కోయుటకు కత్తియమర్చినపీట.

**కత్తిపేరిమెకము.** వి. (√కత్తి.) ఖడ్గమృగము. శు. రా. ౭. ౩౯౦.

**కత్తిమందు.** వి. (√కత్తి.) ౧. కత్తియొక్కపూయుపర్ణము. (శ. ర.) ౨. కుబుపులకు పూయుమందు. (శ. ర.) ౩. పిడిలో కత్తి బిగించుట కుపయోగించు కొకానొక జిగురు. (వా)

కత్తిమందుచెట్టు—కత్తిమందు చేయుట కుపయోగించు చెట్టు.

**కత్తిమీఁదిసాము.** వి. (√కత్తి.) మిక్కిలి జాగరూకతతో చేయవలసినపని, అపాయకృత్యము.

క. దొరవచ్చెదనని కోయుము, దరయఁగ జను లెవ్వ రైన నాపెదబెదఁద, ల్వరకింపదు దొరతనపు, న్నగవు ల్మతి కత్తిమీఁదిసాములు సుమ్మీ. కుచేల. ౪. ౮౨.

**కత్తియ(త్తె).** అప. మత్వర్థమునను స్వార్థమునను వచ్చు ఒకానొక స్త్రీప్రత్యయము.

ఉదా: అందకత్తియ(త్తె)=అందముకలది, సుందరి.

ఉదా: చెలికత్తియ(త్తె)=చెలి.

**కత్తియ(త్తె)ము.** వి. ౧. అంకెలయడ్డబంతి. (శ. ర.) ౨. బారు, బంతి, వరుస.

సీ. ... ఘన మైనచెఱకుసింగాణిబద్ధ, వల నైన కొదముతేఁటులకత్తెములనారి ... గంధ. ౬.

**కత్తిరించే=కత్త్రించే.** స. క్రి. (√కత్తెర[1]. క. కత్తరిసు.) కత్తెరతో ఛేదించు; ఛేదించు, ఖండించు.

గీ. కత్తెరలనొడ్డియాణము ల్గత్తిరించి. ప్రబంధ. ౭౬౫.

సీ. నిగిడిపూ తేకుబాగుగఁ గత్తిరించినగడ్డంబు కొనరొమ్ముఁ గమ్మిరింప. హైమ. ౧. ౨౧.

గీ. కత్తిఁ గుత్తుకను బితానఁ గత్తిరించి. చంద్రా. ౨. ౫౫.

**కత్తిరెల్లు(లు).** అ. క్రి. (√కత్తెర[1]) ఛిన్నమగు

గీ. భటుఁ డొకఁడు వింటఁ జూఱుకంటఁ బంది నేయ, మిట్టిపడి మిందు మొఱసినట్లుట్టి తూలి, యది భయపడున్గు రారాని మదర నరని, గండు తొడలును వెసఁ గత్తిరిలఁగఁ జంపె. శుక. ౧. ౧౭౧.

**కత్తివాలితూపు.** వి. (√కత్తి) అర్ధచంద్రబాణము.

క. అంగదుఁ డట్టులు నొవ్వుట, సంగవలుమ సనిలసుతుఁడు రొంపకుయు నై, చెంగత్తివాలితూపున, సింగలములు నెడఁ ద్రిశిరుఁ జెడ నది త్రుంచెన్. భా. రా. యు. ౫౫౮.

ఇట్లే:—కత్తివాలియమ్ము, మొ.

ఆ. వాఁడియైనకత్తివాలియమ్మును గొని, పగతుశిరము చెక్కు లెగయ గొట్టెను. భాస. ఆర. ౬. ౨౪౧.

శ్లో. ఏవముక్త్వా సటా స్తస్య పంచ చక్రే వృకోదరః, అర్ధచంద్రేణ బాణేన ... సం. భార. వన. ౨౭౩. ౧౧.

**కత్తులబోను.** వి. (√కత్తి) కత్తు లమర్చినఒకవిధమైనబోను.

చ. గడలు గుదాళ్లు పగ్గములు కత్తులబోనులు గడ్డపారలున్, వడిఁ గొని మేటికొమ్మలు వచ్చిరి ... చెన్న. ౨. ౨౦౫.

**కత్తువ.** వి. ౧. నీటిలోని మన్ను కెల్లగించెడుగసిక, సేద్యమున కుపయోగించు నొకవిధమైనపనిముట్టు. (శ. ర.) ౨. గనిమ, మడికి చుట్టు నేర్పఱచిన చిన్నకట్ట, సేతువిశేషము. ఆం. భా. ౨. ౯.

**కత్త్రణము.** సం. వి. అ. న. ౧. నిమ్మగడ్డి, కామంచిగడ్డి. ౨. నాఁచు. ౩. కుటి, గడ్డిఋల్లు. (కే. వి.)

**కత్తెర[1].** వి. (సం. కర్తరీ. ప్రా. కత్తరీ. క. త. కత్తరి.) కత్తిరించుట కుపయోగించుసాధనవిశేషము.

పరమ. ర. ౧౫౪. ఆం. భా. ౨. ౭౯౬.

జ: కత్తిరించు². కత్తిరించు, కత్తిరిల్లు, కత్తెరకాండు, కత్తెరకాలు, కత్తెరగడ్డము, కత్తెరచీల, కత్తెరదొంగ, కత్తెరబావిలీ, కత్తెరవాసము, కత్తించు.

**కత్తెర².** వి. (సం. కృత్తికా. ప్రా. కత్తికా.) ౧. కృత్తికానక్షత్రము.

సీ. పూర్వికకోరవిపూంచొదరింటిచందానం గత్తెర యొక్కచోం గదలకుండె. గీ. ... మూంపటిచెలువు దాల్చి, నాత్తె నొక్కడ విశాఖ వింధ్యాద్రియందు. కాశి. ౧. ౧౩౮.

౨. భరణిమూండు నాలుగుపాదములయందును కృత్తికయందును రోహిణి మొదటిపాదమందును సూర్యుం డుండుకాలము. (శ. ర.)

కత్తెరకాపు = మొక్కలు కత్తెరలో కాచుకాపు.

జ: కత్తెరవంగ.

**కత్తెరకాండు.** వి. (కత్తెర¹ + కాండు - క. కత్తరికళ్ల = జేబులుకత్తిరించిదొంగతనముచేయువాండు) కత్తెరదొంగ; మోసగాండు.

సీ. ఎడకానితనములు నడుపుకత్తెరకాండ్ర కిచ్చకంబులు గాంగ మెచ్చు లాసంగి. ప్రబంధ. ౬౭౫.

**కత్తెరకాలు.** వి. ( √కత్తెర¹. ) అండలపుకాళ్లకు అడుగున పోటిగా అమర్చెడు మూప్పకాలు. (శ. ర.)

**కత్తెరగడ్డము.** వి. (కత్తెర¹ + గడ్డము.) కత్తిరించిన గడ్డము, కత్తెర వేసినగడ్డము.

సీ. కత్తెరగడ్డంబు కటుకుజుంజూలుపిసాసములు ... శుక. ౨. ౪౧౨.

**కత్తెరగాయము.** వి. గవాక్షవిశేషము. (శ.ర.)

మ. పురిచుట్టు న్నిశరుండు సాంగుండుమఱి భోజాంధకుల్గాడి క. త్తెరగాయంబుల గండ్లముంగడలసందిం గొమ్మ[illegible] ... మము[illegible] సానసదీన కత్తి... ఉ.హరి. ౨. ౯౮.

**కత్తెరచీల.** వి. ( √కత్తెర¹.) మీటయొక్కయు మనయొక్కయు చీలవదలి రాకుండ దాని చివర గంధ్రమున అడ్డముగా వేసెడుచీల. (శ. ర.)

**కత్తెరదొంగ.** వి. ( √కత్తెర¹.) జేబులు మున్నగునవి కత్తిరించి దొంగతనము చేసెడుచోరుండు.

**కత్తెరబావిలీ.** వి. ( √కత్తెర¹.) స్త్రీకర్ణభూషావిశేషము. (ప్రా.)

**కత్తెరవంగ.** వి. ( √కత్తెర².సం. కర్తారకా.) ఒకవిధమైనవంగ, పుట్టువంగ*.

సీ. ... కత్తెరవంగ యూరంగాంగ గర్తారక దనరుచుండు. ఆం. భా. ౨. ౫౯.

**కత్తెరవాసము.** వి.( √కత్తెర¹.)ఎదురెదురుగా కత్తెరవలె నుంచెడువాసము. (శ. ర.)

**కత్థన.** సం. వి. ఆ. స్త్రీ =కత్థనము.

**కత్థనము.** సం. విశే. (అ. ఆ. అ.) తన్నుందాను పొగడుకొనునది. వి. అ. న. తన్నుందాను పొగడుకొనుట, ఆత్మశ్లాఘనము.

**కత్రి.** వి. జక్కిణి అనునాట్యముయొక్క అంగవిశేషము.

సీ. లాగు మైసిరియుం బల్లటియుం గత్రియు బెళ్కు విలసిల్లుజక్కిణివిధ మొకర్తు. ఉ. రా. ౬. ౧౩౯.

**కత్రించు**=కత్తిరించు ( √కత్తెర¹.)

సీ. రేగాజుపోల్కిం గత్రించుసంచపురేకుబొట్టును నొసలికిం బొందుపఱచి. పార్వ. ౫. ౧౮౮. ౭౦. రా. యు. ౩౫౧. పా. ౧౮౪౦.

**కత్సవరము.** సం. వి. అ. న. స్కంధము, మూంపు.

**కథ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కత; చరితము. ౨. చెప్పుట, కథనము. ౩. ఒకజాతిగద్యగ్రంథము. (కా[illegible]... అఖ్యాయిక.)

శ్లో. కథాయాం సరసం వస్తు గద్యైరేవ వినిర్మితం, క్వచిదత్ర భవేదార్యా క్వచిద్వక్త్రాపవక్త్రకే. ఆదౌ పద్యై ర్నమస్కారః ఖలాదే ర్వృత్తకీర్తనమ్. సా. ద. ౬. ౩౩౩.

**కథంకథికుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.)-ఏమియేమి అనియడుగువాఁడు-ప్రతివిషయమును గుఱించియు ప్రశ్నించుస్వభావముగలవాఁడు; ప్రష్ట, అడుగువాఁడు. (త్రి. ని.)

**కథంభూతము.** సం. విశే. (అ. ఆ. అ.) ఎట్టిది, ఎటువంటిది.

**కథంవిధము.** సం. విశే. (అ. ఆ. అ.) ఎట్టివిధము గలది

**కథకుఁడు.** సం. విశే. (అ. థికా. అ.) ౧. వాచకుఁడు, చెప్పువాఁడు. ౨. కథలు చెప్పువాఁడు.

**కథనము.** సం. వి. అ. న. చెప్పుట.

**కథనీయము.** సం. విశే. (అ. ఆ. అ) చెప్పఁదగినది.

**కథనుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) చెప్పువాఁడు.

**కథయత్.** సం. శత్రు. చెప్పుచున్న.

**కథయమానుఁడు.** సం.విశే. (అ. ఆ. అ.) చెప్పుచున్నవాఁడు.

**కథయిత.** సం. విశే. (ఋ. త్రీ. ఋ.) కథకుఁడు, చెప్పువాఁడు.

**కథయితవ్యము.** సం-కథనీయము.

**కథానకము.** సం. వి. అ. న. పెక్కు-చిన్నకథలు గల గ్రంథము. (బేతాళపంచవింశతి, మొ.)

**కథానాయకుఁడు.** సం. వి. అ. పుం. ఏపురుషుని గుఱించి ముఖ్యముగా కథ చెప్పఁబడునో వాఁడు, కథలో ప్రధానపురుషుఁడు.

**కథాపీఠము.** సం. వి. అ. న. కథా ప్రస్తావసూచకమగు గ్రంథముఖము, పీఠిక, ఉపోద్ఘాతము.

**కథాప్రసంగము.** సం. వి. అ. పుం. ౧. కథాసందర్భము. ౨. కథ చెప్పుట.

**కథాప్రసంగుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. జల్పాకుఁడు, వదరుఁబోతు. ౨. విషవైద్యుఁడు.

**కథాప్రాణుఁడు.** సం.వి.అ.పుం. కథలు చెప్పి జీవనము చేయువాఁడు.

**కథాముఖము.** సం. వి. అ. న. ప్రస్తావన, పీఠిక.

**కథాశేషుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.)-ప్రజలు తన్ను చెప్పుకొనుటమాత్రమే మిగులుగాఁగలవాఁడు, కీర్తిశేషుఁడు-మరణించినవాఁడు. (ఇట్లే-కథావశేషుఁడు.)

**కథించు.** సం. స. క్రి. చెప్పు.

క. అనుటయు వైశంపాయనుఁ, డనఘా యెన్న కథ యడిగితమ్యుతశుభలాభం, ధననామధామమాత్మ్యం, గొనియాడి కథింతు నీదుకోరిక యలరన్. హరి. ఉ. ౫. ౧౦౩.

**కథితపదత.** సం. వి. ఆ. స్త్రీ. (అలం) పునరుక్తి అనెడిదోషము.

**కథితము.** సం. విశే. (అ. ఆ. అ.) చెప్పఁబడినది. వి. అ. న. కథనము, చెప్పుట.

**కథీకృతము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. కథగా చేయఁబడినది. ౨-కథయందుమాత్రమే నిలిచియున్నది-మృతము, చచ్చినది.

**కథేరము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. వంచకము, మోసపుచ్చునది. ౨. కథకము, చెప్పునది. వి. అ. పుం. పక్షి. (కే. ని.)

**కథోద్ఘాతము.** సం. వి. అ. పుం. నాటకమందలి ప్రస్తావనాభేదము. (ఇందు సూత్రధారునివాక్యము విన్నపిదప ప్రథమపాత్రము రంగమునఁ బ్రవేశించును.)

**కథ్యమానము.** సం. విశే. (అ. ఆ. అ) చెప్పఁబడుచున్నది.

**కథ్యము.** సం=కథనీయము.

**కదంబకము.** సం=కదంబము.

**కదంబపుష్పి.** సం. వి. ఈ. స్త్రీ.-కడిమిపూలవంటి పూలుకలది-ముండికావృక్షము, బోడతరముకి.

**కదంబము.** విశే. (సం. కదంబః. క. కదంబ. త. కదంపం.) మిశ్రము.

సీ. పన్నీటితోఁ గదంబము చేసి పూసినమృగనాభిబస రొచనగరు కలుప. ఆము. ౨. ౭౫.

వి. యక్షకర్దమము, కలపము.

సీ. యక్షకర్దమసంజ్ఞ నలరుఁ గదంబమ్ము కలపము నాఁగను...ఆం. భా. ౨. ౧౬౩.

ఉ. కమ్మకదంబ మేల చెలిఁ గౌఁగిటఁ గూర్చుఁ జాలు...రా. వి. ర. ౯౨. ప్రబంధ. ౧౧౯.

(వృత్తియందు వైకల్పికముగా అంత్యవర్ణలోపము.)

కదంబకావులు-మిశ్రమైనకాపిఁగుగలబట్టలు.

వ. అట్టిచందంబునఁ జందనగంధులును జందనకావులును బట్టెడకావులును జెంగావులును గదంబకావులును గరకెంపులును పొత్తంచు లును...హ్హా. ౩. ౨౧౬.

ఈ: కదంబకము, కదంబించు.

**కదంబము.** సం. వి. అ. పుం. ౧ కడిమికి. ౨. తెల్లవకి. (వి. ని.) ౩. ఆవకి. ౪. దేవతాళము, దాపరదంగికి. ౫. సమూహము.

**కదంబి.** సం. వి. ఈ. స్త్రీ. దేవతాళము, దాపరదంగికి.

**కదంబించు.** అ. క్రి. (√కదంబము.) కూడుకొను, కలియు; అంటుకొను.

సీ. కర్పూరశకలసంగతవీటికాచర్వణములఁ జక్కెరపానకములపలన, మిసిమితావులఁ గదంబించుగందంబుల...వి. ప్ర. ౨. ౫౨.

వ....పంకరుహకుముదకువలయకహ్లారషండంబులం దండతండంబు లగుతావులఁ గదంబించు బావులును...పి. శకుం. ౧. ౭౬.

గీ....అప్పసజగంధి, మేనిజవ్వాదిపస గదంబించునొడలు, కడిగికొని వార్చి ప్రవరుఁడు గార్హపత్య, వహ్ని నిట్లని పొగడె ... మనుచ. ౨. ౭౪.

స. క్రి. మిళితముచేయు, కలుపు.

సీ. గంబూర మించఁ గదంబించి కొందఱు కలికికస్తురియలు బాగా లొసంగ. భాను. ౨. ౯౯.

వ....కుంకుమరసంబునఁ గదంబించినపచ్చిపసుపుటలుంగు నమర్చి...ప్రబంధ. ౫౬౯.

**కదకము.** సం. వి. అ. న.-(పైని) మేఘమువలె నుండునది-వితానము, మేలుకట్టు.

**కదధ్వము.** సం. వి. న్. పుం. కాపథము, చెడుత్రోవ.

**కదనము.** సం. వి. అ. న. ౧. వధ, మారణము. ౨. యుద్ధము. ౩. మర్దనము. ౪. విహ్వలత్వము. ౫. పాపము.

**కదన్న**=కద1.

శా. ...మున్నగ్రాటవీభూములం, దన్నం గొల్లగదన్న...భా. రా. యు. ౫౭౪.

**కదన్నము.** సం. వి. అ. న. తినఁగూడనికూడు.

**కదపత్యము.** సం. వి. అ. న. దుస్సంతానము, చెడ్డసంతానము.

**కదభ్యాసము.** సం. వి. అ. పుం. దురభ్యాసము, చెడ్డయలవాటు.

**కదము.** వి. (సం. స్కంధః. ప్రా. కంద. హిం. ఖదమ్) అశ్వగతివిశేషము, ఆస్కందితము.

(వ్యవ) అతఁడు గుఱ్ఱముచే బాగుగా కదము త్రొక్కింపఁగలఁడు.

**కదము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. నీళ్లనిచ్చునది. ౨. సుఖము నిచ్చునది. వి. అ. పుం. మేఘము.

**కదమ్ము**=కద1.

(సంతాపమునకు)

ఉ. అంచెలు గట్టి కాలితోడుసై చననీవుగదమ్మ ప్రోదిరా,యంచలు...మనుచ. ౪. ౬౧.

**కదయ్య(య్యా)**=కద¹.

(ప్రార్థనకు)

క....కారుణ్యము, నాదెస నుంపంగదయ్య నరనాథమణీ. దశా. ౧. ౧౫౮.

**కదరము.** సం. వి. అ. పుం. ౧. అంపము. ౨. ఉల్లోచము, మేల్కట్టు(వై. ని.) ౩. తెల్లచంద్ర, శ్వేతఖదిరము. ౪. పాదమునఁ గలుగుక్షుద్రరోగభేదము. ౫. పాలవిఱుగుడు.

**కదరమ్మ(మ్మా)**=కద¹.

(సంతాపమునకు)

గీ. ...మనలఁ, దలఁచి యమ్మకచెల్ల యవ్వెలఁది యెంత,వంతనడలెనో కదరమ్మ యింతులార. రసిక. ౪. ౪౪.

**కదరయ్య(య్యా)**=కద¹.

(ప్రార్థనమునకు)

గీ...మాపద్మగంధిఁ దోడ్తెచ్చి నన్నుఁ,గూర్పఁ గదరయ్య మిము వేఁడుకొనెదఁ గాక. సారంగ. ౨. ౧౭౦.

**కదరె(రే)**=కద¹.

(సంతాపమునకు)

గీ. ఎంత బడలెనో కదరె యయ్యొమ్మెకాఁడు. రసిక. ౪. ౧౭౭.

శా. ...ఈ,వ్యాజస్వాంతుఁడు రుక్మి యుబ్బుఁ గదరే యత్యంతసంతుష్టుఁడై. రుక్మి. ౨.౭౩.

**కదర్థన.** సం. వి. ఆ. స్త్రీ. ౧. హీనపఱచుట, కీడ్పఱచుట. ౨. పీడించుట.

**కదర్థనము.** సం. వి. అ. న=కదర్థన.

**కదర్థితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. అధఃకరింపఁబడినది, కీడ్పఱుపఁబడినది.

శ్లో. కదర్థితస్యాపి హి ధైర్యవృత్తేర్న శక్యతే ధైర్యగుణః ప్రమార్ష్టుమ్. భర్తృ. నీతి. ౭౭.

౨. బాధింపఁబడినది. ౩. దుష్టము, చెడ్డది. ౪. కొఱమాలినది, నిరర్థకము.

**కదర్థ్యమానుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) ౧. హీనపఱుపఁబడుచున్నవాఁడు, కీడ్పఱుపఁబడుచున్నవాఁడు. ౨. పీడింపఁబడుచున్నవాఁడు.

శ్లో. శస్త్రైరజస్రం కుసుమాయుధస్య,కదర్థ్యమానస్తరుణీ త్వదర్థే. సం. నైష. ౮. ౭౫.

**కదర్యుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) పిసినిగొట్టు, లోభి.

**కదలాడు**=కదలు. (√ కదలు.)

(చలించు.)

చ. ... మద్దికాయలు కడుం గదలాడఁగ ముద్దుగాఱుపొం,దిక జిగిపాలబుగ్గలును... కర్ణి యింపొదవుఁగా సుతుబాల్యము... కవిరా. ౨. ౪౭.

**కదలారతిపళ్లెరము.** వి. (√కదలు.) ఒకవిధమైన ఆరతిపళ్లెము.

వ....హల్లకినీపల్లవాధరామతల్లికలు పూనినజాళువాకదలారతిపళ్లెరంబులసొంపున ...హల్లకస్తోమంబు లుల్లాసంబు పల్లవింపఁజేయ... చంద్రికా. ౪. ౬౮. (వివాహాదిశుభసమయములందు వధూవరాదులు ప్రవేశించునెడ హరిద్రాజలాదులతోఁ గూడిన తట్టలతో నెత్తు నారతికి 'కదలారతి' యని ప్రసిద్ధి-వ్యాఖ్య.)

**కదలించె**=కదలుచె.

గీ. పట్టెఁ గదలించె నసియార్చెఁ బాఁతగర్చె, నెత్తె...తాల్చె నవలీల నిట్లు మందరనగంబు. హర. ౬. ౪౪.

**కదలిక.** వి. (√కదలు) కదలుట.

(చలనము)

గీ. కదలికల జాఱుజిలుఁగుఁబయ్యెదలతోడ. పరమ. ౪. ౧౧౧.

(యాత్ర, ఏఁగుట, చనుట.)
ఆం. భా. ౨. ౨౧౯.
(యత్నము)
క. ఇది వేళ గాదు చొరఁబడి, వెడకఁగ నని
యున్న యతనివెరవు త్రిలోకా,భ్యుదయాం
కురార్పణం బీ,కదలిక యీ దేస్తు నన్నగతి
రవి గ్రుంకెన్. రామా. ౬. ౧౦౬.

**కదలు.** అ. క్రి. (క. కదలు. త. కదల్) ౧. చలించు; అస్థిరమగు.
వ. ఒయ్యనొయ్యనం గదలుతూఁగుటుయ్యాలలం
గన్ను మొగిచియున్న విలాసినీవిలాసులును
...పారి. ౨. ౫౨.
క... కదలనిసిరులం, గేరుచుఁ గుంభకుఁడనియె
డి,పేరిటిగొల్లదొర యొకఁడు పేర్మిఁ జెలం
గున్. నీలా. ౧. ౪౭.
౨. బయలుదేఱు, ప్రయాణమగు.
మ....మాయాబలం,బున నోడింపఁగ నుత్సహిం
చి కదలెన్ భూరిప్రతాపంబునన్. భా. రా.
యు. ౧౨౭౪.
గీ. కాశికాక్షేత్రమున కేఁగఁ గదలిరపుడు, కో
ట్ల్యాలిగుఁగొత్త బృందారకులును మునులు.
కాశీ. ౨. ౩౨.
౩. దండెత్తు.
గీ....మిన్నును నేలయు గ్రక్కతిలఁగ, గాటమై
యెల్లి వానిపైఁ గదలవలయు. రాజ.చ. ౨.
౫౯.
౪. నడచు.
ఆ. కాలఁ జెప్పు లిడక కదలరాదు. వి. పు. ౨.
౨౪౫.
౫. వెళ్లు, పోవు; పాఱిపోవు.
క. కట్టెఁడి యగుమునకు నరుఁ,గ ట్టిడి యొప్పిం
చి యెందుఁ గదలెద వింకన్. సారంగ. ౨.
౯౭.
గీ. పఱచె వెళ్లెను బయనెత్తె జరిగె నుఱికెఁ గదలె.
నరఁ బాఱె ననుమాట గాఁ జెలంగు. ఆం.
భా. ౩. ౮౬.
సీ. వెలవెలఁ బాఱ మోములు లావులు చలింపఁ
గదలె దిక్కులకునై గరుడకులము. దశా. ౨.
౬౦.
౬. పోవు, నశించు.
సీ. పఱమొయిల్గప్పినఁ బాడఱి నునుఁగాంతి గద
లినయమృతాంశుకళ యనంగ. భార. విరా.
౧. ౨౯౪.
౭. యత్నించు.
గీ. నరుఁడు గాండీవమున నొండు నారిఁగూర్చి,
యతివఁ దెగటార్తు ననుచుఁ గట్టలుకతోడఁ,
దీవ్రతరబాణ మొకటి సంధించి యేయఁ,గ
దలఁ గన్గొని పల్కె నాకాశవాణి. జై. భా.
౫. ౧౨౨.
వి. ౧. కదలిక, చలనము.
గీ. పండ్లు వేర్వాసి కదలు చూపకయ మున్న.
కాశీ. ౩. ౮౪.
ఉ....చిత్తరువో కరువో యనంగ గం, డారపు
బొమ్మవోలె నచటం గదలించుక లేక యుం
డఁగన్. ఉ. హరి. ౧. ౬౦.
౨. ప్రయాణము, యాత్ర.
చ. పొదివి నభోవిహారమునఁ బువ్వును బోలె న
లంగకుండ న,మ్మదనసమానుఁ బట్టికొని మాన
వదానవదేవకోటికిం, గద లెఱుఁగంగనీక చ
ని కాంచె నుషాసతిఁ జిత్రరేఖ యా, ముదిత
కు రాకపోక లొకమూఁడుముహూర్తము
లయ్యె నయ్యెడన్. ఉ. హరి. ౫. ౧౦౯.
ఆం. భా. ౨. ౨౧౯.
జ: కదలాడు, కదలారతిపల్లెరము, కదలించు, కదలిక, కదలుచు, కదలుడు, కదలుపరువడి, కదలుమొన.

**కదలుచే(ల్చే)=కదలించే** స. క్రి. (√కదలు) కదలఁజేయు.

(చలింపఁజేయు.)

గీ. కరము లంఘ్రులు నల్లార్చి కదలుపుదురు, రా మకృష్ణులు శైశవరతులఁ దగిలి. భాగ. ౧౦. పూ. ౨౮౯.

ఉ... లేఁత చేతం దనరారువీణియఁ గదల్చుచు నల్లన సారె మీటుచుఁ. జాహ్నవీ. ౪. ౧౭.

**కదలుడు**=కదలిక.

(యాత్ర, ప్రయాణము.)

ఆం. భా. ౨. ౨౮౯.

**కదలుపరువడి.** వి. (√కదలు.) ముప్పదిరెండువి న్నాణములలో నొకటి, మల్లబంధవిశేషము.

వ. ఎడమడుగుపరువడి కుడియడుగుపరువడి కద లుపరువడి ... నృసింహంబును నాది యగు ముప్పదిరెండువిన్నాణంబులనాతెంబు పరీ క్షించి. హంస. ౧. ౨౦౬. ప్రబంధ. ౭౮.

**కదలుమొన.** వి. (√కదలు) మల్లబంధవిశేషము. ప్రబంధ. ౭౮. హంస. ౧. ౨౦౬.

**కదళ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పృశ్ని, కోలపొన్న†. ౨. బూరుగు†. 3. డింబిక, దుండిగము†.

**కదళకము.** సం=కదళము.

**కదళము.** సం. వి. అ. పుం. ౧. అరఁటిచెట్టు. (వై. ని.) ౨. కోలపొన్న†. (మే. ని.)

**కదళి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. అరఁటిచెట్టు. ౨. వైజ యంతి, టెక్కెము. (దీనికిఁ గట్టువస్త్రము అరఁ టియాకువలె నుండును). 3. ఒకజాతిలేడి. వి. న్. పుం. ఒకజాతిలేడి. (క్షీరస్వామి.)

**కదళిక.** సం. వి. ఆ. స్త్రీ=కదళి.

**కదళీదండము.** సం. వి. అ. పుం. అరఁటిబొందె, అరఁటిదూఁట.

**కదవమ్మ(మ్మా)**=కద¹.

(సంతాపమునకు)

గీ. కమ్మవిలుకానితూపులఁ గ్రమ్ముకొఁక, ముమ రంబయ్యెఁ గదవమ్మ ముద్దుగుమ్మ. ఇందు. 3. ౯.

**కదవయ్య(య్యా)**=కద¹.

(ప్రార్థనమునకు)

గీ. కావఁగదవయ్య యర్థార్థికల్పశాఖి. వైష. ౧. ౧౦౭.

మ. అమరుల్విష్ణునిఁ జేరి పంక్తివదనుం డత్రాసి యై గాసిసే,య మరుల్లోకము సంచలించె నిఁక మమ్మాపన్నులం బ్రోవ నా,య మరు ల్విన్నకెదురె జయింపఁగదవయ్యా... ఉ. రా. ౧. ౭౮.

**కదవె(వే)**=కద¹.

(ప్రార్థనమునకు)

సీ. చెన్నారుచిన్నారివన్నెలక్రొన్నెల నగఁ జా లు చిఱునవ్వు నవ్వఁ గదవె. రసిక. ౫. ౧౪౨.

శా. ... తెల్పఁగదవే యేతత్పురావృత్తముఁ. దశా. ౧. ౨౨౭.

**కదించు**=కదియించు. (√కదియు.)

(బంధించు, బిగించు; అతుకు.)

చ. తలుపు గదించి సూత్రములు త్రాసునఁ గూ ర్చుచునున్నవాఁ డిసీ, పలువ మ తెంత నే ర్పరని భర్తకుఁ జూపి దురుక్తు లాడినఁ. హంస. ౨. ౨౧౪.

ఉ....అరర మ్మొగి మూసి గడెఁ గదించి మో, దమ్మున రెట్టఁ బట్టికొని దర్పకకేళికి సంభ్ర మించినఁ. హంస. ౫. ౭౩.

చ. కరఁగను బోఁతఁబోయఁగను గ్రాఁచి కదిం పను గమ్మి దీయఁగా...సారిది విచిత్రచిత్ర ముగ సొమ్ములు సేయ నతండు నేరిచెఁ. హంస. ౨. ౧౮౨.

(కట్టుకొను, ధరించు)

ఉ. దిద్దిన నాభినామము కదించినమేల్మడిచీర చీర్ణమూ, నిద్దపుఁబూఁత పుష్పములు నించి ముడించినకొప్పు ... ఒప్పఁగా, ముద్దియ వ

చ్చి హంసమణిముందర నిల్చె ... హంస. ౨. ౧౯౫.

కదింద్రియము. సం. వి. అ. న. పటుత్వములేని యింద్రియము.

కదియఁబడు=కదియు. అ. క్రి. (√కదియు-స్వార్థమున 'పడు'.)

(కలియఁబడు.)

(మాలి) క. పఱతెంచి కదియఁబడి యే, డ్తెఱ వ్రేసిన మోము దాఁకి తిరిగె గరుడి యుత్తుంగ జక్రంబున హరి వెడ, మతి వైచెను దనుజానను జూమస్తకము తెగన్. నిర్వ. ౩. ౨౯.

ఉ. అత్తఱి మాళవుండు గదియంబడి తోమరచక్రరాజిను, న్మత్తగజేంద్రు నొంచి...పళను. ౧౨. ౬౫.

(కలుగు.)

చ. తపఁబడు మాట గద్దదిక దాఁకొఱను నిల్చిన చోట నిల్వరా, దడుగుఁ బొట్రుపాటు గదియంబడు ...మరు లెత్తినయాఁటదానికిన్. కువల. ౩. ౧౦౦.

కదియించు=కదించు. స. క్రి. (√కదియు) కదియఁజేయు.

౧. ఘటించు, చేర్చు; ఖచించు; లగ్నము చేయు.

వ. అంజలిపుటంబు నిటలంబునం గదియించి. కాశీ. ౫. ౧౧౫.

ఉ. ఎత్తి దృగంకపాళిఁ గదియించి...శుక. ౧. ౧౩౮.

చ. ... తమ్మికెంపులు గదియించినట్టిజిగిపుత్తడి ముక్కలిపెట్టమీఁద...నీలా. ౧. ౬౧.

క. ఆవిభుఁడై నాపాలఁటియు, భావము గదియించె...హరి. ఉ. ౩. ౯.

౨. గ్రహించు, పట్టుకొను.

పీ. కరమునఁ బాలిండ్లు గదియించి కదియించి యధరపల్లవరసం బాని యాని. అని. ౨. ౮౧.

౩. దగ్గఱఁజేర్చు, సమీపింపఁజేయు.

గీ. ఉరగములయొడ్డు వాపి యయ్యుత్పలాక్షి, యూనమున్యులు గదియించి దవనిభుజుల. నైష. ౫. ౩౧.

౪. కట్టు.

చ. ... గాండీవం, బలవడ నెక్కు ద్రోచి బిగియం గదియించి నిషంగయుగ్మమున్. భాగ. ౧౦. ఉ. ౧౨౮౨.

౫. కదించు, కూర్చు.

క. మృదుమధురరచనఁ గావ్యము, గదియించిన యట్ల తత్త్వగాఢార్థము చెప్పుము...వాసిష్ఠ. ౧. ౧౪.

౬. బంధించు, బిగించు.

గీ. తలుపు గదియించి రతికేళి సలుపుమండె. హంస. ౨. ౨౦౬.

కదియు. అ. క్రి. (తె. కది.) ౧. కలియు, కూడు.

(శమీవృక్షవర్ణన.) సీ. కవట లొండొంటితోఁ గదియుచు నెడములు మ్రింగి ప్రబ్బఁగ సాంపు మిగులుదాని. భార. విరా. ౧. ౧౬౨.

౨. సమీపమునకువచ్చు.

మధ్యా. ఎదురను దవ్వులఁ జూచినపాడవు పెల్లఁ బిత్తణము, కదియఁగా నవ్వియొంతయును దవ్వుఁ గనఁబడఁ బిఱుఁద, నిది దినేశ్వరురథమో యనూరుఁడో యిటఁ జంచు నవుడు, హృదయమునను గడువిస్మయం బందె నిష్వాకుకులుఁడు. భాగ. ఆర. ౨. ౧౬౮.

మ. కదిసె న్లగ్న మటంచు మంత్రులు వొరల్... చనుదెంచి. మనుచ. ౫. ౫౮.

౩. తగులు, తాఁకు, అంటు.

క. మొదలిటివ్రాఁతను సోఁకిన, మృదుపకములఁ గడుగ శుద్ధి మీఁదటివ్రాఁతం, గదిసిన నీరను గడిగిన, పిదిలంబుగ శుద్ధి యంద్రు విద్వజ్జనముల్. విజ్ఞా. ఆచా. ౪౩.

సీ. కదియ నాసాశిఖాగ్రమునఁ దర్జని మోపి... నైష. ౫. ౮.

గీ. బాలశైవాలమంజరీ జాలకంబు, లింపుమతి యొత్తు మఱచేతులందుఁ గదియ. నైష. ౨. ౧౪౧. (కదియన్ = దృఢస్పర్శము కునట్లుగా, గట్టిగా.)

౪. కలుగు.

క. యదువంశతిలక వీనికి, నిది జయకాలంబు పెనఁగ నేటికి హరిచే, నొదవు నపజయము వీనికిఁ, గదియు శుభము నీకు నచిరకాలమునందున్. అని. ౩. ౧౧౪.

గీ. లేమ చిహ్నారిలేఁగౌను లేమి పూని, నమఃపత్త్రంబులందు దైన్యంబు గదిసె. వసు. ౨. ౩౦౧.

స. క్రి. ౧. డీకొను, ఎదిరించు.

ఉ. ...నరకాసురుఁ డిట్లనుఁ బాకశాసనుం, డాలములో ననుం గదిసి యంతకపాశము బేరయుక్తుఁడై, తోలుపులంబడెన్. ... ఉ. హరి. ౧. ౬౧.

౨. పొందు, (రతియందు) కూడు.

ద్వి. కామాంధుఁడై తల్లిఁ గదిసినయతఁడు, నుడుగక సురద్రాగుమండెడునతఁడు. ద్వి. హరిశ్చ. ఉ. ౬౭ పం.

౩. చేరు, సమీపించు.

క. కృతనిశ్చయుఁ డగు శేషుని, ధృతనాస్తుం దరెడు ఫణి గదిసి యిట్లను సం, చితవస్తుజాతములలో, వితరణములకు నొసఁగరానిది యు లే దెచటన్. జై. భా. ౭. ౫౧.

సీ. వడిఁ బోవుచోఁ బోఁకయుడి బాఱ నిలక శీఘ్రముగ గవాక్షంబు గదిసె నొకతె. ఇందు. ౬. ౫౯.

జ: కదించు, కదియఁబడు, కదియించు, కదుపు.

**కదుకొను.** అ. క్రి. (కదుకు[1] + కొను? కదుకు + కొను-అని శ. ర.) అతిశయించు.

(సీత) చ. కదుకొని వేఁడిబాష్పములు గ మి వయింబయిఁ బర్వి భీతిమై, నదరుచు... భా. రా. యు. ౨౩౪౬.

**కదుపు.** వి. (√కదియు-సం. కదంబం. త. కదుప్పు)

౧. (సజాతీయపశుపక్ష్యాదుల) సంఘము; గోగణము; పశుసంఘము; సంఘము.

ద్వి. ... మహామృగంబుల ఘనపక్షితతుల, బలువడిఁబుట్టించి పంచిన నవియు నొండొండ గదుపులై యురవడిఁ బఱచి, పండిన చేలెల్ల బయలుగా మేసి. ద్వి. హరిశ్చ. పూ. ౪౯౧ పం.

గీ. ...మంద, కదుపు పదు పనఁ జెలఁగు గోగణము. సాం. ని. తిర్య. ౭౩.

క. కదిసిన బలములు విచ్చినఁ, గదుపులఁ జెదరంగ నీక గాండీవి వెసం, బొదివి యట కడపె నవియును, గొదకొని తమపాలము సొచ్చె గోపాలురతోన్. భార. విరా. ౪. ౨౭౧, ౧. ౨౭౯.

గీ. ... సమజము కదుపు వన నలరు మందు. ఆం. భా. ౨. ౧౦౦.

సీ. గమి పౌఁజు మొత్తము గదుపు... బృందాఖ్య యగు. సాం. ని. మాన. ౩౭.

ఎనుపకదుపు. ఆము. ౪. ౧౨౩.

చిల్కకదుపు. ఉ. రా. ౬. ౨౭.

తుమ్మెదకదుపు. నైష. ౫. ౧౪.

పందికదుపు. ఉ. హరి. ౪. ౨౫.

కదుపుకట్టు = మందగాఁ జేరు, గుంపుకూడు.

గీ. కవిసి యన్యోన్యమైత్రి నక్కడఁ జరించు, పులుపుహానలు జింకపిల్లలు మృగేంద్ర, పోతకంబులు నాలత్రేపులును గదుపు, గట్టికొని కూడియాడ నక్కజముఁ జెందె. పి. శకుం. ౨. ౪౯.

(ఇట్లే-కదుపులుకదుపులుగట్టు.)

క. కదుపులుకదుపులుగట్టుచు, మది లజ్జాపరతఁ జనిరి మాంత్రికులధిపా. నిరం. ౪. ౭౩.

**కదుము.** స. క్రి. (క. కదుబు) ౧. ఆక్రమించు.

చ. వదనము చెంగలింప నిడువాలికకన్నులవాడు
దీటి స్మితమును నుబ్బనుం బెరయ ముత్పు
లకల్ తనువల్లి నిండఁ దగ౯, గదిమినపంచసా
యకవికారము లింపుగ కట్టిపెట్టి యస్మిత
వతిఁ జేరి యానృపకుమారుఁడు కౌఁగిటఁ
జేర్చి యిట్లను౯. వి. పు. ౬. ౯౩.

౨. అదుము, అణఁచు.

సీ. ఒకరాసుతుఁడె చాలు నుద్వేలశక్తి దిక్పా
లురఁ గదిమి కప్పములుగొనఁగ. దశా. ౧. ౭౯.

క. చదిపెం గాలుబలంబులఁ, గదిమె౯ గుఱ్ఱం
పుఁబౌఁజు గగ్గులకాడై, చెదరంగ గంధగజ
ముల, మద మడఁచెం జండవీరమండలిఁ
దాఁకె౯. కాశీ. ౨. ౪౧.

వి. దెబ్బ తగిలినచోట నెత్తురు పేరుకొని వాఁచు
వాఁపు, బొప్పి.

గీ. గాద మనఁగను బొప్పినాఁ గదుము నాఁగఁ,
దగును ఘాతభవగ్రంథి... ఆం. భా. ౨. ౧౩౦.

**కదురు**[1]. అ. క్రి. ౧. కలుగు.

సీ. ఇచ్చట దిక్కు లే రెవ్వరు నా కనుభయమున
మేనఁ గంపంబు పుట్టెఁ, జేయంగ నేమియు
పాయంబు లేమి నాననమున వెల్లఁదనంబు గ
దురె. భార. విరా. ౨. ౩౩.

క. మేలై వచ్చిన మెత్తురు, కాలవశతఁ జేసి కీడు
గదిరిన నతనిం, గేలి యొనర్చుచుఁ జూతురు,
నాలిసతులమాట లంత నమ్మంగలదే. భోజరా.
౪. ౧౪.

౨. అతిశయించు, హెచ్చు.

చ. కినుక మనంబునం గదిరి క్రీడి పితామహు
విల్లు ద్రెళ్లిడిం, దునిమి ... భార. విరా. ౫.
౧౭౬. (చూ. ౧౭౨.)

(అర్జునుఁడు) క.... ధర్మసుతునివిడి, దలకరిగెను
మోము వెల్లఁదనమునఁ గదురె౯. భార. ద్రో.
౨. ౨౩౧.

౩. వ్యాపించు, పర్వు.

క. కెలఁకుల మీఁదను దూరము, పలుమఱుఁ జూ
డంగఁ జనదు పయనంబునఁ గో, డెలకాఁడి
యంత దవ్వేడ, గలుగఁగ ముందఱను దృష్టి
గదురఁగ వలయు౯. వి. పు. ౪. ౨౪౬.

సీ. కనుఁగవ మెఱుఁగులు గదిరినముందఱ పు
ష్పోపహారంబు పోలువు దాల్ప, వేనలికప్పు
పర్వినమీఁదు నీలదుకూలంబు మేల్కట్టు కో
మరు వడయు. భార. విరా. ౧. ౩౦౭.

౪. విజృంభించు.

చ. ప్రిదులని శౌర్యసంపదలఁ బెట్టినదండలు ద్రె
వ్వ శౌ కడుం, గదురుచు హుంకరించుచును...
ఐదుపదిసేయక పోరిరి ... కళా. ౭. ౧౦౦.
(శ. ర. పా.)

జ: కదుకొను, కదురుకొను.

**కదురు**[2]. వి. (క. కదురు. త. కదిర్.) నూలువడి
కెడు సాధనము, తర్కువు, తంత్వాధారసూచిక.

క. వడిదారము చెవులుం ద్రొక్కుడుపలక యుం
దిండు కదురు గుంజలునుం ద్రొ, క్కుడు బొ
మ్మయునుం ద్రిప్పుడు, పుడుకయునుం గలు
గు రాట్నములు గైకొనుచు౯. శుక. ౪.
౪౧౯. ఆం. భా. ౨. ౨౯౪.

**కదురుకొను**=కదురు[1].

(అతిశయించు.)

వ... నిదుర గదియుమిఁ గెంజిగిం గదురుకొనుక
నుతుడలును... చంద్రి. ౪. ౧౦౭.

(కవియు, పైఁబడు.)

సీ. శాకినీభూతపిశాచ బేతాళముల్ కహకహక
హమంచుఁ గదురుకొనిన. దశా. ౪. ౨౧౩.

**కదుష్ణము**. సం. విణ. (అ. ఆ. అ.) కోష్ణము, నులి
వెచ్చనిది, ఇంచుక వేఁడికలది. వి. అ. న. నులి
వెచ్చన, ఇంచుక వేఁడిమి.

**కదె(దే)**=కద[1].

(ప్రసిద్ధికి)

[illegible]ంది కొడుకులఁ, గనియొనుగదా

దేవయాన కణఁ కట్టిదియో. యయా. ౪. ౯౩.

క. లీలమెయిం జాణూరుని, కోలెమ్మిాతండు విటిచి ఘోరధ్వనిజం, ఘాలుండై పంపెఁ గదే, త్రైలోక్యమునకు మనోజ్ఞతరశుభవార్తన్. హరి. ఉ. ౯. ౨౯౨.

(ఆశ్చర్యమునకు)

క. ఇసుమంత గాని లేఁడీ, పసిబాలుఁడు ... బహుభక్ష్యరాసులు, మెసఁగెడి విసువఁడు ప్రతుష్టిమేకొనఁడు గదే. పాండు. ౯. ౧౬౦.

**కద్ది.** వి. (క. కద్దు=కోరిక.) అనురాగము? సంగతి?

ఉ. అద్దముఁ జూచి బిట్టులుకు నానతిఁ జేసిన సంచలించు న,మ్ముద్దియ విశ్వనాథుపయి ముచ్చటచేసిన యంతనుండి యి, క్కద్ది నెఱింగి చందురుని గానఁగనీరు పికంబు గూయ న, న్నిద్దపుమ్రోత మాన్పుదురు నెచ్చెలు లిచ్చ యెఱింగి నిచ్చలున్. కావ్యా. ౧. ౬౮. (ప్రయోగాంతరము లేదు.)

**కద్దుము.** విణ. దట్టము. (శ. ర.)

క. ఎద్దులు మఱుఁగులుగాఁ జని, కద్దుములై చేరు పెన్నెకంబుల నాలో, నుద్దవిడి నొంచి గలవు న, నద్దిర యని యయ్యయాతి యబ్బురపడఁగన్. యయా. ౨. ౧౯. (శ. ర. పా. "గద్దములై" ముద్రి.)

**కద్రథము.** సం. వి. అ. పుం. చెడ్డరథము.

**కద్రుణము.** సం. విణ. (అ. ఆ. అ.) పింగళవర్ణము కలది.

**కద్రువ.** సం. వి. ఊ. స్త్రీ. కశ్యపునిభార్య, నాగమాత.

**కద్రువు.** సం. విణ. (ఉ.) పింగళవర్ణము కలది. వి. ఉ. పుం. పింగళవర్ణము.

**కద్వదుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) దుర్భాషలాడువాఁడు.

**కద్వరము.** సం. వి. అ. న. దధిస్నేహము. (త్రి. ని- మెఱుఁగుమిాఁదిమిాఁగడ ? "మజ్జిగ తేట" అని విశ్వము.)

**కనఁబడు**=కానఁబడు. అ. క్రి. (కనన్+పడు) అగపడు, కనుపట్టు; గోచరించు.

మధ్యా... అవ్వి యెంతయును దవ్వయి కనఁబడఁ బిఱుఁద.... భాగ. ఆర. ౨. ౧౬౯.

చ.... మేలు కనంబడ వెచ్చ నూర్చ న,మ్మనవతి నాదరించి వసుమంతుఁడు దా నలనాఁటి వేడుకన్. శుక. ౧. ౯౯. (మేలుకనంబడన్=వలపుగోచరించునట్లు.)

**కనకక్షారము.** సం. వి. అ. పుం. వెలిగారము.

**కనకతప్పెట.** మి. వి. పటహము. (శ. ర.)

**కనకదండము.** సం. వి. అ. న. ౧. బంగారుదండము కలరాజచ్ఛత్రము. ౨. బంగారుదండము.

**కనకన**=గనగన. వి. మండుట ప్రకాశించుట రాలుట మున్నగువానియందగు అనుకరణము.

వ. మండువేసవిం గనకన మండునగ్నిముఖంబు నడుమన నిలిచి... హర. ౯. ౧౯.

క. కనకన వెలుఁగుమ నిదిగోఁ, గననయ్యెం గనకతగిణి గరుడధ్వజుమున్. దశా. ౧. ౧౬౨.

క.... కనకనఁ, గనుఁగొనలన్ నిప్పు లురులఁగా ... శుక. ౨. ౨౪౨.

కనకనలాడు=కనకనమను. (వా.)

జః కనకనమను.

**కనకనమను.** అ. క్రి. (కనకన+అను) ౧. మిక్కిలి మండు.

క. నినుఁ జూడఁ గలిగినప్పటి, యను మోహం బింతలోనె యధికవ్యథయై, కనకనమనఁ జొచ్చెఁ గదే, మనమున సీతాశిరోగ్రమాణిక్యం బా. రామా. ౭. ౧౯. (మిక్కిలి బాధించు అనిభావము.)

౨. మిక్కిలి ప్రకాశించు.

క. కనుఁగొనఁ దివురు నభీష్టము, కనుఁగొనలం

దివురులొత్తఁగా నెక్కి రాగిల్, గనకనగోపమితము లై, కనకనమనుసౌధవీథికలకుల్ గడఁకన్. లక్ష్మి. 3. ౬౫.

**కనకనికషము.** సం. వి. అ. పుం. ఒరగంటిమీఁద గీఁచినబంగారుగీటు. మేఘ. ౧. ౩౬.

**కనకపత్త్రము.** సం. వి. అ. న. చెవికిఁ బెట్టుకొనెడి ఒకవిధ మైనబంగారునగ.

**కనకపలము.** సం. వి. అ. పుం-బంగారువన్నెగల మాంసముగలది-మత్స్యభేదము. (వాచ.) స. నాలుగుకర్షములయెత్తుబంగారు.

**కనకప్రభ.** సం. వి. ఆ. స్త్రీ. ౧-బంగారుపంటి కాంతిగలది-మహాజ్యోతిష్మతి, పెద్దమానేరుతీఁగ. ౨. బంగారముయొక్క కాంతి.

**కనకప్రసవ.** సం. వి. ఆ. స్త్రీ. స్వర్ణకేతకి, పచ్చమొగలిచెట్టు.

**కనకమయము.** విశ.(అ. ఈ.అ.) బంగారుది, సువర్ణవికార మైనది.

**కనకము.** సం. వి. అ. న.బంగారు. పుం.౧. సంపెఁగచెట్టు. ౨. ఉమ్మెత్త. 3. కాంచనాలము. ౪. కృష్ణాగురువు, నల్లఅగలు. ౫. నాగకేసరము. ౬. మోదుగు. ౭. కాసమర్దము, కసింద. ౮. కడిమి. ౯. కణగుగ్గులువు, మహిషాక్షము.

**కనకరంభ.** సం. వి. ఆ. స్త్రీ. స్వర్ణకదళి, పచ్చఅరఁటి.

**కనకాక్షి.** సం.వి.ఈ. స్త్రీ.అఁడుగుడ్లగూబ. (వై.ని. పైఁడికంటి అని శ. ర.)

**కనకాచలము.** సం. వి. అ. పుం. బంగారుకొండ, మేరువు. (ఇట్లే: కనకాద్రి, కనకగిరి, కనకశైలము, మొ.)

**కనకారము.** సం. వి. అ. పుం. కోవిదారము.

**కనకాలుక.** సం. వి. ఆ. స్త్రీ. భృంగారము, బంగారుగిండి.

**కనకాహ్వము.** సం. వి. అ. పుం. ౧. ఉమ్మెత్త. ౨. నాగకేసరము.

**కనకాహ్వయము.** సం=కనకాహ్వము.

**కనఖలము.** సం. వి. అ. న. గంగాతీరమున హరిద్వారసమీపముననున్న తీర్థవిశేషము; ఆతీర్థము దగ్గఱనున్న ఒకానొకపర్వతము.

**కననము.** సం. విశ. (అ. ఆ. అ.) కాణము, ఒంటికన్నుగలది.

**కనరు.** అ. క్రి. కోపపడు.

వ...పొరలుచుం దెరలుచు వనరుచుం గనరుచు నొగులుచుం బొగులుచుఁ గసరుచుం గొసరుచు...వి. శకుం. 3. ౧౯౧.

వి. ౧. కోపము.

సీ. కొల్వు గాచినవానిఁ గూర్మి చూపినవాని సుతునిగా హితునిగాఁ జూడవలయు. గీ. ఇట్టివారలపైఁ బ్రేమ పెట్టుకొనక,కనరు పెట్టినమను జుఁడు గనఁడు కీర్తి. వేణు. ౭౯.

గీ. కనరసంగను గసరనఁ దనరుఁ గోపము... ఆం. భా. ౧. ౧౩౫.

౨. (క. కనరు.) వెగటు.

శా. తారుణ్యాతిగచూతనూత్నఫలయుక్తైలాభిఘారస్వన, ద్ధారాధూపితశుష్యదంబుహృతమాత్స్యచ్ఛేదపాకోద్గతో,ద్గారంపుంగన రార్చు భోగులవు సంధ్యావేళలం గేళికాం, తారాభ్యంతరవాలుకాస్థితహిమాంతర్నారికేళాంబువుల్. ఆము. ౨. ౬౯.

3. (కందగడ్డలోనగువానియందలి) నస, దురద. (శ. ర.)

విశ. వెగ టైనది.

(వ్యవ) కూర కనరుగా నున్నది.

కనరెక్కు=వెగ టైనదగు.

  

(వ్యవ) వంకాయకూర కనరెక్కినది.

కనరువోవు=కాటువోవు, వెగటగు.

సీ. కనరువోకుండఁ గాఁచినయానవాలతోఁ గడి సేయవచ్చుమీఁగడలతోడ. పి. శకుం. ౧. ౧౩౫.

**కనలించు.** స. క్రి. (√కనలు.) కనలఁజేయు. (కోపింపఁజేయు.)

గీ. చూచి యిట్లను భూపాలసుతులతోడ, నన్నుఁ గనలించి బ్రదుకఁగన్వారు లేరు. ఉ. హరి. ౪. ౬౦.

ఆ. మనసు రాదు నాకు మానినీమణులార ... పొందు, కాకయున్న నన్నుఁ గనలింప కూరక, యుండుఁడు...చంద్రా. ౨. ౧౪౮.

**కనలు.** వి. (క. కనలు.) కోపము.

చ....కన్నులం, గనలునఁ గెంపు పెం పడరఁగా నసురాధముఁ డాక్షణంబునన్. హరి. ఉ. ౮. ౫౨.

చ. చిలుపనికమ్మఁదేనియలు చిప్పిలి హస్తములస్తకంబునన్, నిలువక జీరువాఱునెడ నీ యతిసాంద్రపరాగముల్గదా, యలరులవింటి జోదునకు నప్పటి కప్పటికప్పళించుకోఁ, గలిగెడునంచు వే కనలు గైకొని మూఱె విభుండు కేతకిన్. నైష. ౧. ౯౨.

శ్లో. ధనుర్మధుస్విన్నకరోఽపి భీమజా, పరం పరాగైస్తవ ధూళిహస్తయన్, ప్రసూనధన్వా శరసాత్కరోతి మా, మితి క్రుధాఽకృశ్యత తేన కేతకమ్. సం. నైష. ౧.౭౧. ఆం. భా. ౧. ౧౩౫.

విణ. మండునది. ('వి. మంట' అని శ. ర.)

సీ. అలుఁగులఁ బొడిపించి యహికోటిఁ గఱపించి కరులచేఁ ద్రొక్కించి కనలుటగ్గిఁ, ద్రోయించి...నృసిం. ౪. ౧౭౭.

అ. క్రి. ౧. మండు, జ్వలించు.

సీ. అనలకణంబులు గనగనఁ గనలంగ దారుణంబైనయాకారవంబు. మార్క. ౨. ౪౯.

మ. ...అయ్యుత్సుము తీక్షణచ్ఛటల నగ్నిజ్వాలలొక్కమ్మడిం, గనలం గన్గొని వానిపైఁ గవిసెఁ దీక్ష్ణప్రాగ్రశృంగంబులై. హరి. పూ. ౬. ౧౪౭.

౨. తపించు.

క. అని మది విరహానలమునఁ, గనలుచు దైన్యమునఁ బల్కు కామాక్షు నమ్మునిముచ్చు నాదరింపక, కనుఁగవ నదలించి పలికెఁ గామిని పెలుచన్. సురా. ౭౭.

సీ. కట్టెండ తాఁకునఁ గనలి యంగము చెడి కందినను సిచాయ గలుగు మేను. సురా. ౫౭.

౩. కోపించు.

గీ. ధర్మనందనుపలుకులు దనకుహృదయతాప మొనరింప మోమున దైన్య మొంద, నున్న పాంచాలి యిట్లని యొయ్యఁ బలికెఁ, గనలి శౌరితో గద్గదకంఠి యగుచు. భార. ఉద్యో. ౩. ౧౦౦.

గీ. కంటికొనఁ గెంపు గదురంగఁ గనలి చూచి, పదము దిగి పడ శపియించె బాలు నతని. కాశీ. ౮. ౨౬౬.

జ: కనలించు.

**కనాతిగోడ.** వి. (హిం. కనాత్.) వసననిర్మితకుడ్యము, బట్టతో నేర్పఱచినగోడ.

గీ. రంజిలుఁ గనాతిగోడ సరాతి యనఁగ, వసననిర్మితకుడ్యభావంబు గాను. ఆం. భా. ౨. ౧౫౯. (ప్రాఁత ప్రతిపాఠము.)

**కనారిలు.** అ. క్రి. (త. కనఱల్.) ౧. కోపగించు, క్రోధయుక్తమగు.

చ. యమునకుఁ దానె పెద్దయముఁడై భయ మొంద రావణుండు సం, యమునికిఁ బోయె నింక నెటులైనను మంచిది మర్త్యకోటిబన్నము గడతేఱె నింతటఁ గనారిలి వేల్పులమీఁదఁ జూపు విక్రమము... ఉ. రా. ౩. ౩౧౪.

౨. తపించు.

ఉ. ఇందునిభాస్యఁ గాంచి విను మింతి శతక్ర తుఁ డిచ్చ నిక్ శతా,నందము లొంది పొంద జననం బితఁ డొందుట నేఁ డిఁకక్ శతా, నందుఁ డనం దనచ్చు నిజనందను లందఱు న న్యజాతు ల,న్నం దలవంపులై మది గనారిలెఁ గాన నొకండు పల్కెడక్. సమీర. ౧. ౨౨౦.

కని. (సం. వి. ఈ. స్త్రీ. కన్య. కావ్యాద. ౩. ౧౧౧.

కనికరము. వి. (త. కణికరం.) ౧. కరుణ, దయ.

క. దైవికమున నొక నేరమి,గావించిన నిట్లు వి. డువఁగాఁ దగ వౌనే,సేవకుని నన్ను మును లా,రా వలదా యింత కనికరంబైన మదిక్. వరాహ. ౧౦. ౪౩. నీలా. ౧. ౪౩. ఆం. భా. ౧. ౧౩౧.

౨. కరుణము, శోకము.

క. తనకుం దనయులు లేమికిఁ,గనికర మందుచును...భల్లా. ౩. ఆ. (శ. ర.)

సీ.వలరాచరాచవాఁ డలికాక్షుకను వెచ్చఁ గరఁగినయలకనికరపుఁజోటు. మనుచ. ౨. ౯.

జ: కనికరించు.

కనికరించు. స. క్రి. అ. క్రి.(√కనికరము) కరుణించు. (చూ. కరుణించు.)

(వ్యవ) వానిని కనికరింపరాదు.కనికరించి నావిన్నప మాలింపుము.

కనిపట్టు. స. క్రి. (కని+పట్టు-త. కండుపిడి.) వెదకిపట్టు;(క్రొత్తగా) కనుఁగొను, తెలిసికొను.

చ. పరిమెయిఁ బాటి వానిఁ గనిపట్టి వడిం బెడకేలు గట్టి తె,చ్చిరి...భార. శాం. ౩. ౫౦౫.

ఉదా: కొలంబస్సు అమెరికాను కనిపట్టెను. పాశ్చాత్యులు మొన్న మొన్న నే విమానములను కనిపట్టినారు. ('కనిపెట్టు' వా.)

కనిపి(న్పి)ంచు.=కానిపించు. స. క్రి. (√ కను) కనఁజేయు.

(ప్రసవింపఁజేయు.)

(అప్సరోవర్ణనము.) సీ. పలుకువాల్గనుల యాఁకలి దీర్చుచలుప యేమగువలఁ గనిపించుమంత్రసాని. చంద్రా. ౩. ౧౦౧.

(పొందఁజేయు, ఘటిల్లఁజేయు.)

మ.తనకర్మంబె శుభాశుభస్థితులు తత్తద్వేళలక్ బ్రాణికిక్, గనిపింపం బరు లెవ్వ రింపులకనంగా లేక మిథ్యా విమో,హనిరూఢాత్మకులై హితాహితమనీషాయత్త భేదప్రక,ల్పనలం జిక్కుదు రల్పులు...సమీర. ౧. ౨౨౪.

(చూపు)

చ.కనుఁగవఁ గట్టినట్టిపడుకం దలఁగించి మృగాళి నెల్లఁ గ్ర,న్ననఁ గనిపించి పో విడిచిన స్వైర వొప్పఁగఁ బాటి మూఁగిమూఁ,గి నిగిడి లాఁచి పట్టికొనెఁ గీడ్పడఁగాఁ బెనులేటి గుంపులక్, వినుతపరాక్రమంబు లగు వేఁట సివంగులు రాజు మెచ్చఁగక్. చిత్రభా. ౩. ౧౫౧.

మ. వినిపించెక్ హరి పాంచజన్యరవ ముద్వేల ప్రభాచక్రముక్, గనిపించెక్ సురదానవావళికి రక్షస్స్వామిమాయాళి లే,దనిపించెక్ క్షణమాత్రలో సమదదేవారాతిరింఛోళి చేఁ, దనిపించెక్ దృణరాజి రాజితభుజాతేజంబు శోభిల్లఁగక్. దశా. ౨. ౪౦౦.

అ. క్రి. కనఁబడు, అగపడు.

సీ. వినుఁగెంపుఁబతకంబు గనిపింప సుకదీర్ఘి కాచేలయై మించె గగనలక్ష్మి. ఉ. రా.౧.౧౩౬.

మ. కలలో దేవర చెప్పె రేయి యెదుటం గన్పించి నెయ్యంబు వా,టిల ... శుక. ౨. ౪౧౫.

కనియు. అ. క్రి. కమియు, పరిపక్వమగు.

చ....ఎట్టి డెప్పుడుం,గనియఁగఁ బండి యుండు...భార. ఆర. ౭. ౪౪౫.

క. మును లెతెంచిరి చిత్తము, లనురాగరసాబ్ధి

నోలలాడఁగఁ దపముల్,గనియంగఁ బంటేఁ దమ కని, యనుపమభద్రు బలభద్రునను జూనిఁ జూడన్. హరి. ఉ. ౩. ౧౬౧.

**కనిష్ఠ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. చిటికెనవ్రేలు. ౨. ఒకానొకనాయిక. ౩. తమ్మునిభార్య. ౪. చెల్లెలు.

**కనిష్ఠకము.** సం. విశే. (అ. ష్ఠి కా. అ.) మిక్కిలియల్పమైనది, కడుఁజిన్నది. వి. అ. న. కూకతృణము,గింజలమీఁదముండ్లుగలధాన్యపుమొక్క.

**కనిష్ఠము.** సం. వి. అ. న. కూప్యమను భూలవణము. (శే. ని.)

**కనిష్ఠిక.** సం. వి. ఆ. స్త్రీ. చిటికెనవ్రేలు.

**కనిష్ఠుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. అతిహీనుఁడు, మిక్కిలి యల్పుఁడు. ౨. అతితరుణుఁడు, యవిష్ఠుఁడు. వి. అ. పుం. తమ్ముఁడు.

**కనీని.** సం. వి. ఈ. స్త్రీ.=కనీనిక.

**కనీనిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. చిటికెనవ్రేలు. ౨. కంటినల్లగ్రుడ్డు.

**కనీయసము.** సం. వి. అ. న. రాగి.

**కనీయుఁడు.** సం. విశే. (స్. యసీ. స్.) ౧. మిక్కిలి యల్పుఁడు. ౨. అతితరుణుఁడు, యవీయుఁడు. వి. స్. పుం. తమ్ముఁడు.

**కనీసము.** విశే. (సం. కనీయస్.) అధమము. (శ. ర.)

**కను.** (దీనికి 'కానన్, కానక, కానమి, కానని, కానఁడు' మున్నగువిశేషరూపములుకూడ సిద్ధించును.) స. క్రి. ౧. చూచు.

క. మున్నెన్నఁడు నివ్విధ మేఁ,గన్నది గాదు... భార. ద్రో. ౩. ౧౯౭.

సీ. కానరే కానలలోన లోకోత్తరు నని మ్రాని మ్రానికి నరిగియరిగి. భార. అర. ౨. ౯౪.

౨. ప్రసవించు, (బిడ్డను) కాంచు.

చ. ... ననుం గని కుంతి యొంతయుం,జెడ నది వైచిపోయె...భార. ఉద్యో. ౪. ౩౩.

ఉ. కానక కన్నకూఁతు...దశకు. ౫. ౬౭.

౩. ఎఱుఁగు, తెలియు.

గీ. శారదాదేవివరమున సకలలోక,వర్తనంబులు కానంగ వచ్చుమాకు,భానుమతిమచ్చఁగన్నట్టు భావవీథి. విక్ర. ౩. ౧౨౫.

క. ...అప్పలుకునం,గనియెను దనపలుకు దప్పుగా నతఁడు మదిన్. భార. సౌ. ౨. ౭౪.

వ. క్రమంబునఁ దనచిత్తంబు నలకూబరచింతాయత్తం బగుచుండం దత్సమీపగమనంబున కుపాయంబు గానక బహుకాలంబు గడపి... కళా. ౨. ౪౭.

క. భిన్నాసురాస్త్రములచవిఁ, గన్నమురాహితశిలీముఖము లపు డనిలో, మున్నెఱుఁగనిసురవీరుల,క్రొన్నెత్తురుచవియు నెఱిఁగి క్రోలఁ దొడంగెన్. పారి. ౫. ౬.

ఉ....ఓ,కన్నియ నీయెడం గలుగుగౌరవ మే యెడఁ జూచి కాన...పారి. ౧. ౬౫. (చూచికానను=చూచియెఱుఁగను, చూడలేదు.)

౪. పొందు, పడయు; (భాగ్యమును)పొందు.

గీ. తల్లి నీకులగోత్రసౌందర్యములకుఁ,దగినపతిఁ గంటి నానికిఁ దగఁగ గర్భ,మయ్యె నీదుగర్భమునవాఁ డఖిలభువన,వహనమహనీయుఁ డగుచక్రవర్తి సుమ్ము. భార. ఆది. ౪. ౬౧.

ఆ. ఎక్కలమునఁ బుట్టెరేని బహుసుతుండు నతికృపాన్వితుఁడు వేయునెలలపై,బ్రదికినతఁడుఁ గండ్రు త్రిదశపదము. భార. అను. ౨. ౬౪.

ఆ. రాఘవత్వమందు రణసరోలీలలఁ,గ్రాలుచున్న నిన్నుఁ గన్నులారఁ,జూడఁ గంటి జన్మసుఖమెల్లఁ బొడగంటి, ముదముతోడఁ జేరి మ్రొక్కఁగంటి. ఉ. హరి. ౬. ౧౧౫.

౫. ఆశ్రయించు, శరణుచొచ్చు.

శా. ...జనకకన్యన్ వేగ యొప్పించి లో,కై

త్రాణుని రామునిం గనుము...భా. రా.సుం. ౮౮౭.

ఉ. ఎట్టు ఘటిల్లు సంధి గడు నెగ్గొనరించిననన్ను సేల చే,పట్టు నతండు నావలదు ప్రాంజలియై తనుఁ గన్నమీఁద ని,ట్టట్టనువాఁడు గాఁడు శరణాగతవత్సలుఁడు ... భా. రా. యు. ౨౨౭.

విక్కకన్ను. చూ.

(నేత్రము.)

క. మఱి యైదు వేలయేఁడులు, తెఱచినకను మూయ కినుని దెస చూచుచు...ఉ.రా.౨.౧౬౮.

ఉ. వచ్చి లతాగృహంబుతలవాకిలి బోటులు చెప్పి చూపఁ గ,న్విచ్చి ... అచ్చపలాక్షి చూచె లలితాననచంద్రుని మానవేంద్రునిన్. పి. శకుం. ౩. ౨౧౨. భారత. ద్రో. ౫. ౧౬.

(చెఱకు లోనగువానిగనుపు,పర్వము. 'పర్వము క్రిందిగుంట' అని శ. ర.)

సీ. కను గలవింటఁ జొక్కపుఁజవుల్ వుట్టించి... వసు. ౩. ౫౩.

విశే. అల్పము. (చూ. కనుచీకటి, మొ.)

కంటవత్తిడుకొను=ఏమఱకుండు, జాగరూకతతోనుండు.

గీ. వట్టికూడును వేన్నీళ్లు పెట్టి యొజ్జ,గలుగువిద్యంబు లిప్పించి వలఁతియైన,వెజ్జు నెచరించి యరయించె విప్రసుతుని,గంటవత్తిడుకొని సైరికప్రభుండు. పాండు. ౩. ౫౬.

కంటికి ఱెప్పలీల:-మిక్కిలి జాగ్రత్తతో అని భావము.

ఉ....జో,కొట్టిరి జోల వాడి రెడఁ గూర్కినఁ గంటికి ఱెప్పలీల న,ట్టిట్టెడ గాక కాచిరి మహీవరమందిరమందగామినుల్. రామా. ౩. ౧౩౨.

కంటినొప్పి=పీడ.

(నక్కపులితో నన్నమాట.) గీ. ఎలుఁగులకు వేపిత్తుదుప్పులకు గండ, మేదులకు మిత్తి లేళ్లకు నెదురుమక్క, కాసరంబులపాలిటికంటినొప్పి, యసదు గాదుగదా భవదన్వయంబు. శుక. ౨. ౨౭౩.

కంటిలోని నెరసు:-మిక్కిలి బాధించుటకు దెలుపునపు డుపమానముగా నుపయుక్తము.

గీ. నీవు నాదాయతోఁ గూడి నీచబుద్ధి, బుద్ధి సెప్పెదు నాకుఁ దమ్ముఁడవె నీవు,కడఁగి నీమంత్రులును నీవుఁ గంటిలోని, నెరసునరవిగనున్నారు నిశ్చయముగ. మొ. రా. యు. ౧. ౨౦.

కంటివింటివజీరు=ఇక్షుధన్వుఁడు, మన్మథుఁడు.

గీ. కంటివింటివజీర ముక్కంటివింటి, వంటిసిరులగు నీమచ్చెకంటిసిరులు, దంటకుచశైలములు నటువంటి వగుట, నంటరాకుము నీజన్మ మాఱ మార. ముకుంద. ౩. ౬౭.

కనిపెంచువయసు=సంతానము కనుటకుఁ దగిన వయస్సు.

క. కని పెంచువయసు గాదే,తన తేటికి లేక పోవుఁ దనయుం డిఁక నీ,కునునీజననికియుత్తమ, తనయులు గల్గుటకుఁ జరువు దగఁ గావింతున్. దశా. ౬. ౮౫.

కనుఁగొ(గ్గొ)లికి=కంటికొలికి.

మ. తొలియుక్కల్ పరికింపఁ గన్గొలుకులందున్ నీరు నించున్...ఉ. రా. ౮. ౧౫౭.

కనుఁగో(గ్గో)న=కంటికొన.

మ. ...ఉ,గ్గడు వై కోప్కులు మూఁగె వస్తువులపైఁ గన్గోనలం దంద్ర యె,క్కుడు నోఁచెం గమనీయసౌహృదపరిక్షోభంబునన్ బొల్తికిన్. హరి. ఉ. ౩. ౧౭౦.

కనుఁగ్రేవ=నేత్రాంతము, క్రేఁగన్ను.

మ....రోషమువసంగీ ధూత చేతస్కుఁడై, కనుఁగ్రేవన్ మిసుఁగుర్లు సాలఁ బొడమంగా... భాగ. ౩. ౬౬౨.

కనుఁజాటు=రహస్యము.

ద్వి. ఘనతపోమహిమచేఁ గన్నయాత్మజుని, క నుఁజాటుగా నుండఁగను జాటువెట్టి. రం. రా. ఉ. ౯౨. పా. ౧౪ పం.

క. కనుఁజాటునుండి నడిపెన, పనులం గండలును బెరిఁగి...శుక. ౨. ౨౦౭.

కనుగట్టు=కన్నుమూయు; మూయుచేయు.

సీ. కనుగట్టి గాంగేయగర్భు డాఁగురుమూఁత లాడించె వస్త్రాపహరణవేళ. పాండు. 3. ౧౭౮.

కనుచూపుమేర=చూపు అయినంతదూరము.

క. కనుచూపుమేర దానిం, గనుఁగొని యమ్మగువ యగునొ కాదో యనుచుం, జనుదెంచి ... శుక. ౨. ౫౬౬.

కనుచూఱయొసఁగు=కనుచూఱగా ఇచ్చు, యథేచ్ఛముగా చూడ వీలగునట్లు చేయు.

గీ. చూపఱుల కెల్లఁ దనుఁ గనుచూఱ యొసఁగి, వేగ పఱతెంచి చూచె భూవిభు నొకర్తు. కవిక. 3. ౧౪౧.

కనుదాఁపురము=కనుఁజాటు, కనుమఱుఁగు.

గీ. అయినయీఱల్లు నాడికో ల్లయినవమ్మ, కాఁగలట్టిది యే మైనఁగాని కలదు, ఇంక నీకనుదాఁపురం బేల పొమ్ము, అంబుజాతాక్షి పక్వబింబాధరోష్ఠి. గంధ. ౬౭.

జ: కంటి[1], కనఁబడు, కనిపట్టు, కనిపించు, కనుఁగడ, కనుఁగాపు, కనుఁగొను, కనుఁద్రాము, కన్నది, కన్నయ్య, కన్నవిటి, కన్నాఁగు, కన్నాకు, కన్ను, మొ.

కనుఁగ(గ్గ)డ. వి. (కను+కడ.) కంటికొన, కడకన్ను.

ఉ. ఆనతమౌళియై యటులు ప్రార్థనసేయుముసీంద్రు శాంబరీ, మానుషవేషధారి దయమానమనస్థితి బిగ్గనవ్వుచున్, పీనులఁ దాఁకుకనడల వేమఱుఁ జూచుచుఁ బల్కుఁ జిల్కుఁపూఁ, దేనియసోనవెల్లువలఁ దెప్పలఁ దేలెడు మేలి పల్కులన్. పాండు. ౪. ౧౧౨.

కనుఁగాపు. వి. (కను+కాపు.) కనుసంజ్ఞకై కాచుకొనియుండు సేవకుఁడు.

ఉ. ఇట్టివిధంబునన్ విబుసు లెవ్వడును న్గనుఁగాపులట్లు ముక్కవ్వెట్టియుఁ జేసి చేసియును వేసరి...హర. 3. ౧౧.

కనుఁగొ(గ్గొ)ను. స. క్రి. (కను+కొను.) ౧. చూచు; పరీక్షించు.

మ.... పౌత్రుని భూరిశ్రవసుం గనుంగొనుము నిందుం గ్రేణిసేయంగ నే, చిన పెంపొప్పఁ గ బాహ్లీసుం దరిగె నిశ్చింతంబునన్ బోరికిన్. భార. భీష్మ. ౧. ౯౪.

ఉ. ఎందును నిట్టిరూపు నను లెవ్వరుఁ గాంచిరె నాక కాదు సం, క్రందనసూతికిం దగిలి కన్గొనఁజాలదె.... భార. విరా. ౨. ౨౬.

వ. ఇట్లిరువురుం బ్రవర్తించిననర్తవంబులు కనుంగొని విక్రమార్కుం డిట్లనియె. విక్ర. ౨. ౯౨.

౨. తెలిసికొను, ఎఱుఁగు.

సీ. జనునవిశ్వాసంబు కనుఁగొని మెలఁగుట విశ్వసనీయుని వేశ్యఱుచుట. గీ...వలదు పతికి. ఆము. ౪. ౨౪౨.

గీ. తెల్లవాఱుట గన్గొని యెల్లవారు. సీలా. 3. ౪౬.

3. పొందు, పడయు.

చ.... దీనిఁ దాల్చి యిప్పడఁతులలోఁ గనుంగొను మపారమహామహిమానుభావమున్. పారి. ౧. ౬౧.

కనుఁబాటు. వి. (కను+పాటు.) ౧. దృష్టి, చూపు.

గీ. శివుని కనుఁబాటు దాఁకని చిత్తభవుఁడో. విక్ర. ౮. ౪౨.

౨. దృష్టిదోషము.

సీ. నుదతి నీమొ వక్కఁ జూచుట కోడెనఁ గనుఁ

పాటు వోరయునో యని తలంచి. భార. విరా. ౨. ౪౮.

**కనుఁబె(న్బె)ంటి.** వి. (√కను.) కాఁగలప్రయోజనమును సూచించు నొకానొకపక్షి, జీలుగుపిట్ట.

వ...గబ్బలుఁగు గాలి కనుంబెంటి పైఁడికంటి లోనగుతిర్యక్కులు భావిప్రయోజనసూచకంబు లై యున్నయవి. ఆను. ౬. ౬౬.

సీ. గోంగడి కక్కెర గొక్కెర గోరువంక పూరేడు కనుఁబెంటి నీరుకాకి. హంస. ౩. ౧౨.

సీ. వంగపండును గోరువంక కప్పెట సొట్టిపిట్ట పావురము కన్బెంటి మూఁగ, మొదలుగాఁ గల్గుపులుఁగులు....సుద. ౩. ౧౯౪.

**కనుఁబ్రాము, కన్నుఁబ్రాము, కన్ప్రాబము.** స. క్రి.(కను+ప్రాము.) కనుపులుము, మోసపుచ్చు.

క. అనుజన్మవధూగమనం, బొనరించినద్రోహి వగుట నోర్వక నిన్నుఁ, గనుఁబ్రామి సంహరించిన,ననుఁ జెందునె దుష్కృతంబు నగచర తిలకా. రామా. ౫. ౩౧౬.

ఉ. ఆవసుదేవుఁ డెంతయు రయంబున నర్భకు నెత్తుకొంచుఁ దాఁ, గావలియున్నకంసునధికారుల నందఱఁ గన్నుఁబ్రామి దుస్థావృతగేహముఁ వెడలి....పద్మ. ౯. ౯౩.

శా. శ్రీరత్నాకరకన్యకారమణుఁ డారీతిఁ జగన్మోహనా, కారోదార వధూవిలాసముల రక్షశ్శ్రేణిఁ గన్బ్రామి...దశా. ౫. ౩.

**కనుక(న్క).** అవ్య. ద్రు. ౧. కావున, కాఁబట్టి.

గీ. తొలుత మాటలుపడి పుల్లసిలినవాఁడు, గనుకఁ గొంకుచు...విప్ర. ౪. ౭౭.

౨.వాక్యాలంకారముగఁ బ్రయోగింపఁబడును.

ఉ. భూసుతకోస మేఁ గనుక బొంకితి నేనియుఁ బెద్దకాలముం, జేసినతాపసంబు రహిఁ జెందక నిష్ఫల మా...ఉ. రా. ౭. ౭౬.

౩. "చుమీ" అనునర్థ మిచ్చును.

సీ. తడికాళ్లతోఁ ద్రొక్కుదవుచుమీ యదె కుశాస్తరణ మాత్మధ్యానసమయ మయ్యె, సెడ లేదు వేష్టువ లిట రమ్ము ముట్టెదు గనుకఁ బ్రాతస్స్నానమునను వలయు. విప్ర. ౩. ౭౭.

౪. అవధారణార్థకము.

సీ. బింబోష్ఠి నేఁ గన్కఁ బీతాంబరమ సైన మెఱసియుండుదుఁగదా మేనినిండ. భాగ. ౧౦. ఉ. ౨౧౨.

**కనుకట్టు.** వి. (√కను.) ౧. కన్నులకుఁ గట్టెడు కట్టు, గంత.

వ....పద నగ్గలించి కూయుచుఁ గడుపు నకనకంబడఁ గనుకట్టుతోడ మోములు మలంచుచు...మనుచ. ౪. ౨౭.

౨. ఇంద్రజాలవిద్యావిశేషము.

సీ. మేఁత లొసంగినఁ బూఁతలు పూసినఁ గనుకట్లొనర్చిన గాత లిడిన, మందులు పెట్టిన...మంత్రతంత్రములఁ బన్నిన...ప్రబంధ. ౭౩౭.

**కనుక(న్క)ని.** వి. ౧. సంభ్రమము; వెఱపు, భయము.

చ. ఘనుఁడు వృకోదరుండు దనుఁ గట్టలుకం దలపడ్డకోటికా, స్యునితురగంబులం దునిమి సూతునికంఠముఁ ద్రుంచి వైచి తీవ్రనిశితమైనప్రాసమున వానియురంబుఁ బగిల్చి చంపినం, గనుకనిఁ బాఱె భీతి యెసఁగంగఁ దదీయచమూసమూహముల్. భార. ఆర. ౬. ౨౩౧, అశ్వ. ౪. ౧౨౩.

క. దినదినమున కతివమదిఁ, ఘనగరిమఁ మగుఁడు దఱుమఁగా రతులతఁటిఁ, దినదినమునకుఁ గృశించెను, గనుకనియును ద్రపయు నిరవకాశతఁ బొరెఁ. కళా. ౭. ౧౫౭. (చూ. ౧౫౫.)

వ. తత్పరిజనంబు లందఱు నశనిపాతంబున బెదరి

చెదరినట్లు గనుకనిం బఱచి రయ్యేకస్తంభ హర్మ్యంబును దక్షుకువిషాగ్ని దగ్ధం బయ్యె ...భార.ఆది. ౨. ౨౦౦.

శ్లో. భయాత్పరిత్యజ్య దిశః ప్రపేదిరే. సం. భార. ఆది. ౪౪. ౪.

ఉ. సిగ్గునసుం బికాపికలు...శంకలకుఁ గన్కని ... అగ్గజయానకుం బలికి నయ్యె యభీష్ట రహఃప్రసంగముల్. కవిక. 3. ౨౨౯. (కన్కని:-భయహేతువు.)

౨. తీవ్రత; అభినివేశము, పట్టుదల.

క. తనకోడుపుఁ జెక్కు రథికులు, గనుకని నొప్పింప...చిత్రభా. ౭. ౯౮.

చ. కనుకనిఁ దెల్లవాఱుదనుకన్ రతిగోరెడు పల్లవాళి మేల్గనుఁగొని...కువల. ౨. ౧౧౨.

ద్వి. ...మాప్రాణంబులైన, విడుతుముగాక మామడికూటివృత్తి,విడుతుమే యిది యేటివిపరీతవృత్తి, యనుచు బోయలు లేచి కనుకనిఁ బలుక. బస. పు. ౭. ౫౭౦పం. భా. రా. బాల. ౫౬౮.

3. జాగరూకత.

చ....ఆత్మపత్నులకుఁ గోర్కి గ నావరపాయసాన్నముం, గనుకని రెండుభాగములుగా నొనరించి తగంగ నందులోన్. భా. రా. బాల.౧౪౪.(కనుకని:-సరిగాఅనిభావము.)

చ. వనములఁ గొండలన్ గుహల వాఁగుల బావులఁ బల్వలంబులన్, ఘనతృణసీమలన్... పురంబులం,గనుకనిఁ జూచుచున్ వెదకి కానక చెచ్చెర వచ్చి...భా.రా.బాల.౬౨౩.

**కనుకను(కన్గను.)** వి. ఔ. (కను+కను) ప్రతినేత్రము.

ద్వి. అనుచుండ వాయువు లందంద విసరెఁ,గనుకను వెంధూళి గప్పె...రం. రా.బాల. ౭౭ పా. ౨౨ పం. (కనుకను=కంటిని కంటిని=అందఱకన్నులను.)

కనుగ(న్గ)ంటన్=కన్నార, ప్రత్యక్షముగా.

మ.... అంభోజగర్భాదులున్, దముఁ గావన్ హర రెమ్మ రెమ్మనిరివో తాఁ జూచి కన్గంట న,య్యమ ప్రాణేశ్వరు నెట్లు మ్రింగుమనె నయ్యుగ్రానలజ్వాలలన్. భాగ. ౮. ౨౩౯.

చ....ఈ,శ్వరుఁ గనుగంటఁ జూచిరఁట వారమృతాత్ములు గావు డొప్పదే. కు. సం. ౭. ౮౯౪.

ద్వి. కఱకంఠుమూర్తిఁ గన్గంట వీక్షించి. బస. పు. ౪. ౪౦౭పం.

**కనుకలి.** వి. (కను+కలి). చూపు, దృష్టి.

చ. వినుకలిచేతనే విరహవేదన నామది నింత వర్ధిలెన్, గనుకలి నట్లు చిత్రఫలకంబునఁ గాంచినయింతి నెమ్మనం,బునఁ గడు నింతకెంత పరిపూర్తి వహించునో...ప్రభా. 3. ౨౫.

క. అనుమాన మేల నిజ మీ,ననఁబోఁడియె రుక్మబాహునందన యలనా,వినుకలియును గనుకలియును, మనమునఁ దలపోయ నైకమత్యముఁ గాంచెన్. చంద్ర. 3. ౧౪౫.

**కనుకుట్టు.** విణ. (√కను)-నేత్రబాధకుఁడు-బాధకుఁడు.

(చంద్రోదయవర్ణనము.)చ....విరాలికల్కి ప్రో, గులకనుకుట్టు...రా. వి. 3. ౮.

**కనుకుట్టుఁదనము.** వి. (√కనుకుట్టు.) ఈర్ష్య.

వ...అవ్వదినెలు దమమఱఁది ప్రియవాదితనంబు చూచి కనుకుట్టుఁదనంబున నతనిధర్మంబునకు విఘ్నంబు గావింపం దలంచి...భోజరా. ౬. ౧౨౫.

**కనుకూ(గూ)ర్కు-(రుకు).** అ. క్రి. (√కను.) కనుమూసి నిద్రించు.

చ. జరఠ యొకర్తు కుంజగృహచంద్రశిలం గను
మూర్ఛచుండ...రామా. ౨. ౯౭.

క. చని తత్కాళీగేహం,బున నొకమగనాలికూ
టమునకై కనుగూర్కని యొక్కజారులో
నిం,పునఁ బొదలుచు నుత్తరంపుమూల రమిం
చెన్. శుక. ౩. ౬౧౨. చంద్రా. ౩. ౪౯.

**కనుకూలి.** వి. ధాన్యరూపమైనకూలి. (శ. ర.)

**కనుగ(గ్గ)లుగు(ల్గు).** అ. క్రి. (కను+కలుగు.) జాగరూకుఁడగు, అప్రమత్తుఁడగు.

ఉ. ఏమఱి రక్షసాలనిమ్మ గేంద్రుని నక్కయుఁ
గోలుపుచ్చు సం,గ్రామములోనఁ గన్గలిగి
కానక తక్కిన నాశిఖండిచే,నీమనుజేంద్రుఁ
గోల్పడమె...భార. భీష్మ. ౧. ౭౦.

గీ. వింత పుట్టినఁ గనుగల్గి చింతసేయ,కుంట ...
వలదు పతికి. ఆము. ౪. ౨౫౨.

**కనుగి(గ్గి)లుపు=కనుగొలుపు.**

స. క్రి. (కనుసైగచేయు.)

సీ. అని పల్కి క్రమ్మఱఁ జనఁజూచుచో దీని
కేఁడు జోదులఁ గన్గిలిపి యదల్చి,టయు
...అచ్చ.రా. యు. ౧౨౫.

**కనుగి(న్గి)లుపు=కనుగొలుపు.**

అ. క్రి. (కనుసైగచేయు.)

వ...కన్నియ మొఱంగి యచ్చెలులు విభునకుం
గనుగిలిపి యొండొరు లొక్కొక నెపంబున
నొయ్యనొయ్యం జనిరి. రామా. ౪. ౧౫౬.

వి. కంటిని ఒకవిధముగాఁద్రిప్పుట.

సీ. కన్గిలు పనఁగను గన్గీటు విలసిల్లు...ఆం. భా.
౩. ౨౯.

**కనుగీ(న్గీ)టు=కనుగొలుపు.**

స. క్రి. (కనుగొలుపు, కనుసైగచేయు.)

సీ. అతఁడు మాండవ్యమహామునిప్రవరుని గను
గీటె నీ వెఱుంగవె యటంచు. హరిశ్చ. ౧.
౧౩౧. విప్ర. ౪. ౭౫.

వి. కనుగిలుపు. ఆం. భా. ౩. ౨౯.

**కనుగుఁజేఁప.** వి. మత్స్యవిశేషము. (శ. ర.)

**కనుగొ(న్గొ)లుపు(ల్పు)=కనుగిలుపు,కనుగిలుపు, కనుగీటు.** అ. క్రి. స. క్రి. (కను+కొలుపు). కనుసైగచేయు.

వ. నీమది నెఱుంగుదురు గాదె యనునెడ నీవన
మాలిక కనుగొలిపి యొగఁగొలిపినఁ గలవాణి
మఱియు నిట్లనియె. మృ. వి. ౨. ౧౯.

క...తనమ్రోలం,గనుపట్టుననుంగుఁబట్టిఁ గనుగొ
ల్పుటయున్....నీలా. ౧. ౭౪.

**కనుగ్రుడ్డు.** వి. (కను+గ్రుడ్డు.) నేత్రగోళకము.

క. ...మాయగోవు పడుచుం,గనుగ్రుడ్లం దిరుగ
వేసి కాలముచేసెన్...వరాహ. ౧౦. ౪౦.

క. అనినన్ విని తనయిరువది,కనుగ్రుడ్లన్ నిప్పు
లురలఁగాఁ ద్రిప్పుచు న,జ్జనకన్యపాలాత్మ
జపై,ననిమిషరిపుఁ డపుడ చంప సలిగియు
నచటన్. రామా. ౬. ౧౬౭.

**కనుచీకటి=కనుమబ్బు.** వి. (√కను.) సంధ్యా
కాలమందలి లేఁజీకటి. (శ. ర, వా.)

**కను(న్ను)నీరు,కన్నీరు.** వి. (√కను). అశ్రువు.

సీ. కనునీళ్లు పులిమికొంచును బానశాలలో మం
చు గట్టించునమర్త్యకులము. కువల. ౩. ౨౦.

శా. తోరం బౌకనునీరు చన్నుఁగవయందున్
జాఱి జాల్వాఱఁ గ,న్యారత్నంబు ప్రసూ
నతల్పమునఁ దాపార్తిన్ నెసం దూలెడిన్.
ఇందు. ౨. ౧౭౭.

చ...కన్నునీరు గొ,బ్బున వెడలంగ...భోజరా.
౪. ౧౬౭.

వ....అలుక కన్గొనలకెలంకులం దొలంకఁ గన్నీ
రు మున్నీరై ప్రవహింప...రామా.౫.౧౯౩.

క. కన్నీరొలుకఁగ వగచిన,నన్నరపతు లెల్ల
వేడ్కరి...భార. ద్రో. ౧. ౨౯.

**కనుప(న్ప)ట్టు.** అ. క్రి. (√కను.) చూపట్టు, కనఁబడు; గోచరమగు.

ఉ. భానుఁడు పశ్చిమాద్రిఁ గనుపట్టెఁ దలిర్చిన మావిమో కనన్. భార. విరా. ౩. ౧౯౨.

మ. ఉడుమార్గం బఖిలంబు నున్న నయి శాణోత్తేజనం బొంది పు,ల్కాడుగం బడ్డనిశాతఖడ్గము క్రియం గన్పట్టె నప్పట్టునన్. హర. ౨. ౨౪.

చ. ...పా, యనియనుశక్తి నీయెడన యగ్గలమై కనుపట్టు...పారి. ౧. ౧౧౭.

**కనుప(న్ప)డు.** అ. క్రి. (కను+పడు.) చూపట్టు, కనఁబడు.

క. అని సిద్ధురాలు సెప్పినఁ, బొనపొనగా భ్రమలు చెందఁ బులకలు వొడమెన్, మనసిజశిఖి యొనసినచోఁ, గనుపడు ధూమాంకురములగతి నృపుమేనన్. హంస. ౧. ౬౪.

సీ. పాంకంబుగా నూనె పంకించి సవరంబు కుప్పె గన్పడ గొప్పకొప్పు వెట్టు. శుక. ౩. ౩౪౮.

**కనుపా(న్పా)ప, కంటిపాప.** వి. (కను+పాప.) నేత్రావయవవిశేషము. (కంటిలోని ప్రతిమ-శ.ర.)

మ. కనుపాపల్ పయి కెప్పలన్ గదియ...మనుచ. ౪. ౭౮.

ఆ. స్థూలము కను గ్రుడ్డు సూక్ష్మంబు కన్పాప, కంటిపాప నుండుఁ గారణంబు, కారణమున బ్రహ్మకళ వెలుంగఁగవలె, విశ్వ...వేమన. ౧. ౯౮.

**కనుపాలవిత్తులు.** వి. బ. కులుత్థాంజనము. (శ.ర.)

**కనుపు(న్పు)**=గనుపు. వి. వెదురు చెఱకు లోనగు వానియందు వెడవెడ నేర్పడియుండు గ్రంథి, పర్వము.

సీ...కన్ను కనుపు గంటు గను పంచసఁగఁ బర్వ, మమరు...ఆం. భా. ౨. ౭౮.

గీ. జగతి ధర్మార్థకామమోక్షంబు లసఁగ, వఱలు నాలుగు కనుపుల చెఱకు...

రసంబు మధ్వద్వయంబు, సార మంత్ర కుయుక్తి దుర్జనులు గలిగి. దశా. ౧౦. ౯౯.

(అంజలవుపర్ణనము.) సీ. శిరసెత్తు ముని వ్రేలిపరువ కన్పులు గల్గుబలుకొమ్ము మగరాలపనుల పైఁడి, సింహలలాటంబు...దశా. ౭. ౧. ౨౯.

కనుపులవిలుకాఁడు = చెఱకువిల్తుఁడు, మన్మథుఁడు.

క. కను మూసినఁ గను విచ్చినఁ, గనుపులవిలుకాని త్రాయఁ గణఁగిన నేవే, ల్పును దలఁచిన రాపట్టియు, కనుపట్టెడు నెట్టు లోర్వఁగలఁ గలకంఠీ. ఏ. పి. ౮. ౨౨.

జ: కనుపుకొట్టు, కనుపులగుండ్లు.

**కనుపుకొ(గొ)ట్టు.** స. క్రి. (కనుపు+కొట్టు.) ఖండించు; సంహరించు.

వ. ఇవ్విధంబునఁ గురుసేనం గనుపుకొట్టి నవ్వుచున్న కన్నడిం గనుంగొని. భార. ద్రో. ౩. ౧౪౯.

వ. కాలుబలంబులం గనుపుగొట్టినం గాలు చెయి తల డొక్కయని యేరుపాటు లేక వండం డఱిగినయట్లున్న యెడలును... భార. భీష్మ. ౩. ౨౮౭.

వ...అప్పుడమి తేనినుండట నిలిచి పని యేమి వనుపు మనిన నతండు ప్రీతుండై కళ్యపాదులం గనుపుగొట్టు మని పనిచిన నది వార లున్నెడ కేసి పోయె...భార. ఆను. ౩. ౨౨౦.

**కనుపులగుండ్లు.** వి. బ. (కనుపులు+గుండ్లు) మణిమయమైనహస్తభూషావిశేషము. (శ. ర.)

**కనుపె(న్పె)ట్టు.** స. క్రి. (కను+పెట్టు). ౧. ఆలోచించు, పరిశీలించు.

గీ. పరుఁడ నగు నాకు నక్షరపురుషునకును, భేదమేమియు లేదు కన్పెట్టి చూడఁ, గలదె వేఱెంచుకయిన లోకమున ముఖ్యా, బింబమునకును దత్ప్రతిబింబమునకు. సీతారా. ౨.

౨. కాచు, రక్షించు.

క. అట్టికతి విభుఁడు మాతో,నిట్టటు సేయుమ నకున్కి నీసొమ్ములు గ,న్పెట్టుకొనియున్న వారము,పట్ట వెఱచి యింక మీకు భారంబని నః. పరమ. 3. ౫3.

అ. క్రి. ఎదురుచూచు, ప్రతీక్షించు.

ఉ....బెట్టు కూ,పెట్టుచు నిట్లు పోరఁ గనుపెట్టుక యొక్కరుఁ డుండి....ఆము.౬. ౮౦. కళా. ౫. ౧౯౭.

**కనుపొట్టలు.** వి. బ. (√కను). కంటి ఱెప్పలు. (వ్యవ) వానికనుపొట్టలుబ్బినవి.

**కనుబడి.** వి. (√కను). ౧. రాబడి.

సీ. ఒకచాయఁ గరణకుల్ సకలదేశంబుల కనుబడికవిలెలు వినికిసేయ. భోజసుతా.౧.౧౦౪.

౨. ఉత్పత్తి. (శ. ర.)

**కనుబేటము.** వి.(కను+బేటము-క.కణ్ణు=కన్ను, బేటము=వలపు, మోహము.) చక్షుఃప్రీతి,చూచుటవలనఁగలుగు అనురాగము.

మ. కనుబేటంబున గాట మైనహృదయగ్లానింబ యోజాస్య యి,ట్లునికి న్నెచ్చెలు లిచ్చ నొర్చి తమలో నూహించి శీతక్రియల్, పానరింపఁ సమకట్టి... దళవ. 3. ౧౨3.

క. ...ప్రియసఖుఁడు దన్నుఁ గొల్వఁగఁ బురికా,చట నరుగుదెంచి యొకచెం,గట నుండెఁ దెలియరాని కనుబేటమునః. ద్వా. ౧౨. 3౦. ప. సం. ౧౦. 3౯౮.

**కనుమ.** వి. (క.కణమె.) ౧. రెండుకొండలనడిమి సందుత్రోవ; కాంతారము.

ఆ.వలస బెదర నృపతి కలఁగక ప్రజవగ,లార్పఁ బనిచి కనుమలందు నిలువ,వేఱు వేఱ యేర్చి విలుమందిఁ బనిచి...ఆము. 3. ౨౭.

వ. భల్లుకంబులయాక్రోశంబులం బెదరి గుములు పాసి యుఱుకటంపుఁగనుమ తెరువులం బఱచుతతి బలుపలుఁగుకాక్రక్కటంబులం గిటలు వగిలి... చాఁపకట్టుగాఁ బడుసారంగంబులకు నిర వైనపట్లును...చంద్రా. ౨. ౮౪.

సీ. ... కనుమ యనినఁగాంతారమగు ... ఆం. భా. ౨. ౯.

౨. సందు; బిలము, కన్నము.

వ. ప్రవాహంబు నిజప్రవహణగుణంబు విడువక ప్రవహణద్వారంబు వెదకుచుం జిరకాలంబు నిలిచియేనియుం గనుమ గలిగినఁ బ్రవహించుచుండంబున....కవిక. ౪. ౧౨౦.

సీ. కన్న మనంగను గనుమ యనంగను గ్రంత యనందగు...ఆం. భా. ౧. ౧౪౫.

చ. అని నియమించి దానిశిర మంజక యొక్క కరండనిగ్రహం, బనువుగఁజేసి యాఖునకు మప్పుడ పోయె ననంతరంబు లో,చనములు విచ్చి చూచి మది సంతసముః వగపుం దలిర్ప నా,కనుమన తాను నేఁగి భుజగం బొకబొక్క వసించి యాత్మలోః. కేయూర. ౪. ౧౧౦.

**కనుమబ్బు**=కనుచీకటి. (కను+మబ్బు.)

ఉ. ...పల్లవా,లింగనకాంక్షఁ దన్మహిళ లేఁగనుమబ్బునఁ దక్కుఁ బెట్టి తు,చ్ఛాంగనరథ్య నేఁగె నెదురై పతి కన్నులు గోరగింపఁ గః. వేం. పంచ. ౧. ౨౪౬.

**కనుమ(న్మ)రి**=కమ్మరి, కరుమలి. వి.ఇనుపపనివాఁడు, అయస్కారుఁడు.

సీ. కమ్మరి కనుమరి కరుమలి యనఁగాను మీఱుచుండును నయస్కారసంజ్ఞ. ఆం. భా. ౨. ౨౮౪.

ద్వి. మును జీవ మనులోహమునకు జ్ఞానాగ్ని, నొనరఁగఁ బద నిచ్చుకనుమరి యతఁడు. బస.పు. ౪. ౬౬ పం.

వ. కన్మరి...దా. శా. ౪. ౧3౮౪.

**కనుమఱుఁగు(వు).** వి. (√కను.) ౧. ఆటంకము.

ద్వి. నన్నుఁ గాంచఁ గోరునీనవ్యదృష్టికిని, గను

లోడ్డి వ్రాసి యీలాతపుఁగోల సవ్యహస్తం
బునఁ బట్టి మట్టించిన నన్నియు నీవు దలం
చినప్రాణులై నిల్చి నీవు చెప్పినపని చేయు
...ద్వా. ౭. ౧౧౩. ఆము. ౨. ౫౪.

౩. తంబుర వీణె మున్నగుతంత్రీవాద్యములు వాయించుటకు వ్రేలికిఁ దగుల్చుకొనులోహపు గోరు. (శ. ర, బ్రౌ.)

౪. జంతికలు చేయుగొట్టము (బ్రౌ.)

౫. అప్పడాలు మున్నగునవి ఒత్తుగుండ్రనికఱ్ఱ. (బ్రౌ )

ప్రత్తికోడుపు=ప్రత్తికాయలోనిజడ, విడి.

సీ. శయనించె నొకచోట శ్రవణనక్షత్రంబు
గుంటిమీఁదటి ప్రత్తికోడుపువోలె. కాశీ. ౧. ౧౩౭.

జమ్ముకోడుపు=జమ్ముకండె, జమ్ముకంకి, జమ్ముచెన్ను. (బ్రౌ.)

**కోడుము.** వి. తీర్థపుబిందె.

క. కోడు మెత్తుకొఱకు గుడికిన్, నడుచున్ వెలపడుచు నాభినామునుం గ్రొమ్ముడిసౌరున్నడి చేరు, న్నడి జాఱుంబైఁట వింతవగఁ గనిపింపన్. శుక. ౩. ౧౭. ('కోడుమెత్తుకొఱకున్=తిరుమజ్జనపుసేవయందు తీర్థపుబిందె నెత్తునప్పుడు కావించుయుత్సవమునకు' అని కథాసందర్భమును బట్టి తోఁచుచున్నది.)

**కోణజేము**=కోణజో. (బ్రౌ.)

**కోణజో.** వి. వాకిటికావలియిల్లు, ద్వారమును మాత్రము సంరక్షణముచేయుపంచ. (బ్రౌ, శ. ర. "కొంజా" అనివాడుక.)

**కోణతము**[1]=కోడతము.

సీ. విరుదు గల్గినయింటఁ బెరిఁగినం గోణతంబు
విప్పినంతనె కుక్క పెదకుఁ జెప్పు. వేమ. ౩౬.

**కోణతము**[2], **కోణత.** వి. మల్లసాధనవిశేషము.

మ. అమరం గ్రొవ్విరితేనెజాలుకోణతా లందంద
లాగించి షాం,కముగం బుష్పాడిమట్టిలోఁ
బొరలి పేఁకన్ బోఁకపూమొఁగ్గగో,తములం
ద్రొబ్బి సమీరమల్లుఁ డసవొందన్ మావి
పూలోడిఁ ద్రి,ప్పమెయిన్ గోకిలబాలుఁ
డెంచికొను సొంపుల్ గుల్కువాదంబులన్.
శృం. ౨. ౧౧౭.

సీ. మనును జెట్టి యనంగ మల్లాభిధానంబు...త
త్సాధనంబులై తగుఁ గంబము కోణత...ఆం.
భా. ౨. ౨౦౭. ప్రబంధ. ౭౨.

కోణిఁగె. వి. దిబ్బ, కుప్ప.

వ...మగరాలగోడలనీడలం దుఱంగలించుక్రీడా
పులినంపుఁగోణిఁగెలఁ దెలంగురంగుల మె
లంగుచెలుంగులు...కృష్ణ. ౧. ౨౦.

కోణిగ(గె)=కోడిగ. వి. ముంజూరు, చూరుముందటిభాగము.

సీ. పగడాలకోణిగలనిగనిగల్వజ్రంపుజగతిశ్రే
వల నెఱజాజా నింప. వసు. ౨. ౨౩.

సీ. నెలవులై చెలువారునిలువుల పిలసిల్లి కోణిగఁ
బారావతకులము పదర. మనుచ. ౬. ౩.

ద్వి. గోమేదకంబులకోణిగలుఁబవిరి,గా మల్చి పై
వజ్రగార యొసంగి. రం. రా. బాల. ౭౩౫.
౭ పం.

చ. చెదరి కపోతముల్ గోణిగ చేరక తారకవీ
థిఁ బాఱఁగా...వసు. ౪. ౬౩.

కోణిగచూరు=కోణిగ.

సీ. దోఁపుచూరనఁగను దోఁచు నంతర్ఛది కో
ణిగచూరనఁగ నగు వ్యలీక,ము...ఆం. భా.
౨. ౨౧.

**కోణిగె.** వి. నమస్కారము.

రగడ. గోవర్ధనమునఁ గొలుపై గన్పడు, గోపవే
షునకుఁ గొణిగె లొనవ్చుచు ... హంస. ౪.
౨౧౩.

వ...తులసీవనమునవలిగ బాధమునమః గొణిగె...
ప్రబంధ. ౮౮౦.

క్రొంణిద[1]=కొడిద. (బ్రౌ)

క్రొంణిద[2]. వి. మనుష్యజాతివిశేషము. (శ. ర, బ్రౌ.)

క్రొంణిదిలి=కొడిదిలి.

ద్వి. ఎవతు నిద్ధర నెల్ల నేలినవృపులు, గొనిపో
యిరే నేలఁ గొణిదిడం బైన. ద్వి.హరిశ్చ.
పూ. ౧౪౨౭ పం. భా. శ. ర.

క్రొంణుఁగురు=కొడుఁగురు. వి. ౧. దీపముయొక్క
చిట్టెము. (శ. ర.) ౨. (శైత్యాదులచే శరీరము
నకుఁ గలుగు) వంకర. (చూ. కొడుఁగురుపో
వు.)

క్రొంణుజో=కొనుజో. వి. పిడుఁజా, పశువులదేహమం
దు చేరి రక్తము పీల్చెడిజంతువిశేషము. (శ. ర,
బ్రౌ.)

క్రొంతి(త్తి)మిరి. వి. (సం. కుస్తుంబరి. ప్రా. కొతుం
బరి. త. కొత్తమల్లి. క. కొత్తుంబరి.) దనియపు
మొక్క, ధాన్యాకము.

సీ...కుస్తుంబరి దనర్చుఁ గొతిమిరి యన. ఆం.
భా. ౨. ౨౪౯. అ. మ. శ. ౫. ౨౪౫ పా.
౧౬ పం.

జః కొతిమిరిపురుగు.

క్రొంతిమిరిపురుగు. వి. (√ కొతిమిరి) దీపములో
పడి చచ్చునొకవిధ మైనపురుగు. (ఇది దీపము
లోఁ బడికాలునప్పుడు కొత్తిమిరివాసన కొట్టు
ను గనుక ఇట్టిపేరు వచ్చినది. బ్రౌ.)

క్రొంతుకు=కొదుకు. అ. క్రి. ౧. జంకు, వెనుదీయు.

ఆ. తల్లి పాలుపైచి తరల నన్నులపంత, బతికి
కూఁతపట్టి కొతుక కీవు, కన్ను లెత్తిచేసి య
న్నులఁ గని కాలు,కూఁత లుఱచె దేమి కొ
కిలంబ. రసిక. ౪. ౧౭౦.

చ. అతితరమారఘోరవిశిఖాగ్నిశిఖాపరితాపభీ
తి న,య్యాతివలమిన్న నిన్నిచటికంపెడిచో
మతి యేమి పల్కె నీ,మతిఁ గొతుకంగ నే
ల చెపుమా...శుకమా రయంబునన్. రసిక.
౫. ౪౬.

౨. వర్ణలోపము గా మాటాడు, మాటలునమలు.
(శ. ర.)

వి. సంకోచము, జంకు. (శ. ర.)

విణ. వర్ణలోపము గాని పదలోపము గాని కల
ది, గ్రస్తము. (౧. పదము. ౨. వాక్యము.)

సీ. గచ్చు కొతుకు నాఁగ గ్రస్తాఖ్య విలసిల్లు.
...అం. భా. ౧. ౧౧౫.

జః కొతుకుపడు.

క్రొంతుకుపడు. అ. క్రి. (కొతుకు+పడు) ౧. (మా
ట) లుప్తవర్ణము గాని లుప్తపదము గాని అగు.
(శ. ర.)

౨. తగ్గు, తక్కువ యగు.

క. అతనికి మంజుల యనఁ గా, సతి యొక్క తె గ
లదు దానిసరి యెన్నుటకుం, గొతుకుపడు రతి
కిఁ జతురత, యితరల నిఁక నెన్న నేల యిం
దునిభాస్యా. హంస. ౨. ౮౦.

క్రొంత్త డ(శ)ము=క్రొత్తడము. వి. (త. కొత్తళమ్.
క. కొత్తళ.) కోటబురుజు.

ద్వి. తఱు చైనయట్టికొత్తడములతోడ, నిర వైన
ముందఱియిట్టికకోట,పడమటివాకి లేర్పడఁ
గాచి యుండు, రెడపక రాక్షసు లెనుబదికో
ట్లు. రం. రా. యు. ౩౦౩ పా. ౧౫ పం.

చ. తలఁకుసఁ గోటనల్గడలఁ దల్పులు వేల్పులు మూ
సి డాసి కొ,త్తళములపై నలంగములఁ దా
ర్కొని మార్కొని...ఉ. రా. ౪. ౨౭౨.

సీ...సాలావయవాఖ్య కొత్త,శ మ్మన...ఆం.భా
౨. ౧౨.

**కొత్తెము.** వి. తాటిపండునందు విత్తు లేనికండ. (శ. ర.)

**కొత్తెమ్మ(మ).** వి. యోగిని, యోగాభ్యాసము చేయుదానిని. (బ్రౌ.)

కొత్తెమసాని=యోగిని యగుస్త్రీ.

వ... ప్రత్యక్షీకృతమోక్షలక్ష్మీవిశేషంబులం బోని యనశనవ్రతపుష్కి భూతంబు లగు మేనులుం గలకొత్తెమసానులును ... విప్ర. ౨. ౧౮.

**కొత్వాలు.** వి. (హిం. కొత్వాల్) పోలీసుఅధికారి. (శ. ర.)

గీ. ఎఱుక గలవారితరబడి నేగునపుడు, కరముల సిఖాలుచేసి ముష్కరతురుష్క, లవలఁ బొమ్మని కొత్వాలు కప్పురింపు, రచ్చటికిఁ జేరఁ బదులకు నలవి కామి. కృష్ణ. ౨. ౧౨౩.

**కొద**=కొదవ. వి. (√కొదవ) ౧. కొఱంత, లోపము, న్యూనత.

సీ. కూడుసీరకు నింటఁ గొద లేక యుండునే ... హర. ౨. ౫౧.

క. చదలేటినీటఁ దడుపక, కొద లేటికిఁ దీఱు సగరుకొమరుల కని ప్రేమ దిగంతచరుఁడు గరుడుఁడు, మది వంత యడంప నంశుమంతుం డంతన్. చం. రా. ౩. ౧౬.

౨. అక్కఱ, గమి, ఆశ.

క. ఇది గాంధర్వవివాహము, సుదతీ మన కిపుడు సాక్షి సూర్యుఁడె యగు నో, ముదుకఁడ నీకొద తీఁతిన, వద లెద వే నొల్ల ననుఁ బ్రవాళాధరయున్. భోజరా. ౭. ౧౧౫.

వ... జాతినపమ్యోదలు దాఠిన పేరెదలు కొలఁది గడచినసద్దులు కొద దీఱనిసుద్దులు గలిగి యమ్యోడ ... సమీర. ౩. ౧౭౮.

౩. సంకోచము, జంకు.

చ. ఎదఁ గొద లేక మ్రుచ్చు లని యెట్లు వచించితి వల్లభర్మసం, పదలకు మూల మైనహరిభక్తుల్ కొక్కడ కాదు వారికిం, దుద ... ... లదు దొంగతనం బని యేను బాస చేసెద ... పరమ. ౩. ౭౧.

౪. శేషము, మిగులు.

గీ. అరిన లాఁతుగఁ గోల్పోక నతఁడు రాజా, రడ్డిఁ గను వని కొదయుఁ దీర్పంగ మగిడి, యంతఁ బరియును సైప్రజ కలిసి పాటి, పోవ వాఁడును వెడపోట్లు పొడిచి చనియె. ఆము. ౬. ౭౩. (శ. ర. పా.)

**కొదమ.** వి. తిర్యగర్భకము, పశుపక్ష్యాదులపిల్ల; శిశువు.

గీ. నిసు వనంగను బిల్ల నా నిసుఁ గనంగఁ, గూన యనఁ గందు నాఁగను గొదమ యనఁగఁ, దిర్యగర్భకములు గాను దెలియ వలయు, నాపచారిక మన్యాఖ్య లౌట శర్వ. ఆం. భా. ౨. ౯౯.

సీ. త్రాళ్లఁ బట్టింపంగఁ దతి నైనకొదమల సంచు లెత్తింగి శిక్షించు నేర్పు. భార. విరా. ౧. ౯౫.

పులికొదమ. భార. ద్రో. ౨. ౭౯.

అంచకొదమ. నైష. ౬. ౨౨.

తేఁటికొదమ. పారి. ౨. ౬౩.

లేడికొదమ. హర. ౫. ౫౫.

వేఁడివేలుపుఁగొదమ = సూర్యశిశువు.

చ ... వేఁడివేలుపుం, గొదమలు దావపావకునికుఱలు ... వానరవీరులు ... రామా. ౭. ౧౭౦.

విశ. ౧. తరుణము, పసుమని. (పసుపక్ష్యాదికము)

సీ. గోడిగజాతిలోఁ గొదమపెంటుల నేర్చి మావుల వాత్రించుమార్దవంబు. భార. విరా. ౧. ౯౫.

కొదమతుమ్మెద. నైష. ౭. ౫.

కొదమపులి. కళా. ౧. ౧౨౭.

కొదమ... ... ఘటికా. ౨. ౨౬.

౨. బలిష్ఠము, దృఢము.

సీ. కొదమగుబ్బలదానిఁ గ్రొమ్మించుఁ గ్రమ్మించు నెమ్మేనినిగనిగన్నిగలదాని. దశా. ౨. ౧౦.

౩. లేఁత; పిన్న, చిన్న.

సీ. సౌరభోల్లాసముల్ జాతి గ్రుంగఁగఁ జేరె నలరారుకొదమక్రొవ్వులను నెలను. ఆము. ౫. ౧౩౯.

సీ. ధుంఢివిఘ్నేశునిష్ఠురకంఠవేదిపైఁ గొదమచుక్కలరాజుఁ గుస్తరించు. భీమ. ౨. ౪౮.

ఉ. సోరణగండ్లఁ రాఁ గొదమచుక్కలు పట్టసతు ల్కవాటముల్, చేరుప ... ఆము. ౨. ౧౩.

కొదమతనము = చిన్నతనము, లేఁబ్రాయము.

గీ. కొదమతనమున నొప్పారి పిదప గండు, మెఱసి పొదలెడుమృగనాథు లెఱుఁగు దోఁప. హరి. పూ. ౬. ౧౭౫.

కొదమయెండ = ఈరెండ, లేఁతయెండ.

గీ. కొమరుఁబ్రాయంపునూనూఁగుఁగొదమయెండ, ప్రాచి కభినవమాణిక్యపదక మయ్యె. కాశీ. ౧. ౧౨౩.

కొదమపిడుగు = తీక్ష్ణమైనపిడుగు. (బ్రౌ.)

పిడుగుఁగొదమ = కొదమపిడుగు.

ఆ. కొడుకుపాటుఁ జూచి కోపించి కాళింగ, పతి రయమునఁ దేరు పఱపి భీముఁ, బొదివి పిడుగుఁగొదమవోనినారసము బి,ట్టేసె నది యతండు వేసెఁ దునియ. భార.భీష్మ.౨.౬౫.

జ: కొదమరి.

**కొదమరి.** విశే. (కొదమ + అరి) పిల్లలు గలది.

ద్వి. మద మతి ధృతి మాలి మదగజేంద్రంబు,కొదమరిపంది చన్గుడుచునే దేవ. పండితా. మహిమ.౨౬౦ పా.

**కొదరు.** అ. క్రి. ౧. అతిశయించు.

(ఉపాకవ్యవర్ణనము) సీ. కోర్కులతమకంబు కొదరియుఁ దాలిమిపొందున నందంద క్రిందువడఁగ. హరి. ఉ. ౭. ౧౭౩.

౨. చెదరు. (శ.ర.) ౩. రేఁగు (శ.ర.) ౪. ప్రాఁడికలమునుండి సిరావలె చిందు. (బ్రౌ.)

**కొదలించు.** స. క్రి. (√కొదలు) కుదించు, తగ్గించు, సంకుచితముచేయు.

సీ. నెడతొక్కుఁబలుకుల వినిపించుఁ గొదలించుఁ గలయ వల్లభుపల్కు పలుకుపొంత. కు.సం.౯. ౩౪౬.

**కొదలు.** విశే. ( క. కొడలు. ) ౧. మాఁదము, అలసము.

గీ...సారెఁ జెల్లుబ్బయువజనశ్రమజలాబ్ధి,నిను డుకొన దక్షిణము వాసి యేఁగుదెంచెఁ, గొదలునడతోడఁ బవమానకుంభజుండు. చంద్ర. ౩. ౧౦౭.

౨. అవ్యక్తము, అస్ఫుటము.

సీ. కొదలుమాటలు తేనె గులుకుచుఁ బలుకువో మోహనం బగువింత ముద్దుఁజెలువు. కళా. ౬. ౧౯౬.

గీ. సుకవిసంస్తుత్యు శంభుదాసుని నుతింప, నేర్తునే దైన నేను వర్ణింతు నతని, చిన్నిమనుమఁడఁ గావునఁ జిఱుతవాండ్ర, కొదలుపలుకులు ముద్దునేయుఁదురు గాదె. విప్ర. ౧. ౧౨.

జ: కొదలించు, కొదలుపడు.

**కొదలువ(ల్ప)డు.** అ. క్రి. (కొదలు + పడు) = కొదపడు.

(న్యూనత నొందు, కొఱఁతపడు)

ఉ. ఇమ్ములఁ దోడ నాడుచెలు లేమను చుండు దురోకొ యిప్డు నా, తమ్ముని ముద్దుమాటలు గొదల్పడఁ బల్కెడుచిల్కబోద ని,త్యమ్మును బొత్తునం గుడుచునన్తరిలి చేడ్పడు ... నిర్వ. ౫. ౧౦౫.

**కొదవ=కొద.** వి. ౧. కొఱఁత, లోపము.

గీ. నేను మీదాన నగుట మీగానకథలు, వడివ

నవ్వేళఁ గొదవలు దడవ లేము. కళా. ౨. ౪౩.

గీ. ఇది యెఱుంగక యున్న నా లేమి కొదవ, నీకుఁ దెలియక యుండుట నీతిగాదు. శుక. ౩. ౨౭౩.

౨. లేమి, దారిద్ర్యము.

సీ. ఉదరపోషణమున కుర్వీశులను వేఁడి కొదవచేఁ గుందుచుఁ గొన్నినాళ్లు. వేణు. ౩౩.

౩. తక్కువపాటు, న్యూనత, అవమానము.

ద్వి. ఇది నాదుముఖభంగ మీక్షింపు నాదు, కొదవ నీకొదవగాఁ గోర్కి భావింపు. రం. రా. అర. ౧౬౯ పా. ౪ పం.

గీ... ఆర్తశరణ్య నీప్రాపు గలిగి, యుండఁగా నిట్టి కొవ మా కొదవ లేల. రామా. ౩. ౬౫.

౪. సంశయము, సందేహము.

గీ... అతని, తీర్థయాత్రయుఁ దపమును దేటపఱుప, నొదవినపుడు గదా మదికొదవ దీఱు. కళా. ౨. ౧౫౭. (చూ. ౧౫౬)

౫. అపరాధము, నేరము, తప్పు.

గీ. బుజముపై నొక్కరోఁకలి పూని పట్టి, వదరుకొనుచును గసరుచుఁ బెదవు లదరఁ, గొదవ లెన్నుచుఁ దాఁ గన్నకూఁతు రున్న, తావునకు వచ్చె నలదేవదేవితల్లి. విప్ర. ౪. ౧౯.

చ. అన విని యంత యేమిటికి నానతి యిచ్చెద రిన్నినాళ్లుఁ దద్దనుజాని నొంచి మీపద ముదారముదాకృతి నొందఁజేయకుం, డినయది నాకు నేర మవునే కద యీకొదవల్ సహించిన, న్ననుపుఁడు వానిఁ బట్టి నుఱుమాడెద నొద్దికఁ జెల్లఁజేసెదన్. కువల. ౨. ౫౧.

౬. న్యూనము.

గీ. తక్కువ కొఱంత పొచ్చెము తగ్గకుందు, కొదవ లొచ్చు కొదుక యనఁ బొదలు న్యూనము... ఆం. భా. ౩. ౨౪.

ఊ: కొద, కొదవచేయు, కొదవవడు, కొదవపడు.

కొదవచేయు. స. క్రి. (కొదవ + చేయు) చిన్నఁబుచ్చు, అవమానించు.

క. గుతిచేసి గిన్నెఁ బంపిన, తరువాతను మల్లి పంపఁదగ దంపినచో, మతి నిన్నుఁ గొదవచేసిన, తెఱఁగగుఁ గెలవులును మీమదిం గడు నెడయుల్. విప్ర. ౪. ౭౩.

కొదవ(వ)డు. అ. క్రి. (కొద + వడు) ౧. న్యూనత నొందు, కొఱఁతపడు.

క. యాగము కొదవడకుండఁగ, సాగింపుఁడు యుష్మదీయసవనానలకుం, డాగతవిసీలఘూమస, మాగమమున దనుజమశకమండలి మ్రగ్గున్. హ. శకుం. ౩. ౧౦౬.

౨. తగ్గు, క్షీణించు; ఎత్తువడు.

సీ. ముదిమిచే లా వెల్లఁ గొదవడ్డ ఖరుని ద్రుంపుటయు నీళ్లకు వడ్డుపోయుటయును. అచ్చ. రా. యు. ౨౫౫.

క. కదలు రదనములు పదములు, గుదివడు జవసత్త్వ మింకఁ గొదవడుఁ జూపుల్, వదనంబు స్రుక్కుఁ జిక్కున్, ముదిమి సుమీ రోఁత ... సుద. ౨. ౧౩౬.

సీ... కొదవడ్డయేనుఁగుఁ గొదమపో లె. దశకు. ౩. ౪.

౩. విచ్ఛిన్న మగు, ఎడ తెగు.

సీ. కొదవడ్డ కౌరవక్షోణిపాలవతంసవంశంబు నిలిచె నెవ్వానివలన. వరాహ. ౧. ౯.

౪. మిగులు, శేషించు.

క. కలయం ద్రిమ్మరి మేదినిఁ, గలవీరుల నోర్చి జయముఁ గైకొంటి మను, ష్యులు నీ కెదురే యింకం, గలదే కొదవడ్డచో టఖండితశౌర్యా. నిర్వ. ౫. ౩౯.

కొదవపడు=కొదపడు. అ. క్రి. (√కొదవ) (కొఱఁతపడు, తక్కువపడు)

సీ... తత్త్రపతిమ యంతయును మన కబ్బినఁ బను లన్నియుఁ గొదవపడక సాగు. పరమ. ౫. ౧౪.

క. రంగద్వేలాసకుబ్జా,లింగనలోపిత మదీయాలీ
లాసేవా, సాంగత్యవచనరచనల,భంగుల నే
మైనఁ గొదవపడెనో యుపేంద్రా. విప్ర. ౪. ౩౮.

(భంగమగు, చెడు.)

క. కొదవపడియెఁ బని యనుచు, న్మది జాలిం దూలి వర్ధమానుఁడు దానిన్, వదినుండి మనుచు నందుల,కు దయాపరతంత్రుఁ డగుచుఁ గొండఱ నిలిపెన్. వేం. పంచ. ౧. ౯౬.

**కొదుక.** విణ. న్యూనము, తక్కువ.

గీ. తక్కువ కొఱంత పొచ్చెము తగ్గు కుందు, కొదవ లొచ్చు కొదుక యనఁ బొదలు న్యూన, ము...అం. భా. ౩. ౨౪.

**కొదుకు=కొఱుకు.** అ. క్రి. ౧. జంకు, భయపడు; వెనుదీయు.

క. అలంకి యాడుకైవడిఁ, గోలాటం బేయువాడ్కిఁ గొదుకక కవలై, యాలమునఁ జెడుగుడాడెడు,పోలిక నిరువాఁగు జగడమునఁ గలఁబడియెన్. చంద్రా. ౬. ౭౪.

క. తనకు ననిష్టం బగునో, యని కొదుకుట శంక ...నరస. ౩. ౫౮.

సీ. అడిగినఁ గొదుకక పుడమివేల్పులకు నిచ్చులుఁ బాఁడిమొదవులఁ జాల నొసఁగు. నీలా. ౧. ౪౯.

ద్వి. ఇది యడుగఁగ వచ్చునివి రాదటంచుఁ, గొదుకక వర మేఁజికొను మిత్తు ననిన. ద్వి. పరమ. ౨. ౧౦౦ పా. ౨౦ పం.

౨. వర్ణలోపముగా మాటాడు, మాటనములు.

క. బ్రదికినబలిదైత్యేంద్రుం,డెదఁ దనయపజయముఁ దలఁచి యెంతయు వెతచే, గొదుకుచు నిట్లని పలికెన్, త్రిదశాహితగురుని న్యాయనిష్ఠురఫణితిన్. దశా. ౫. ౫.

జః కొదుకుకొను.

**కొదుకుకొను.** అ. క్రి. (కొదుకు+కొను- స్వార్థమున.)

(జంకు, భయపడు.)

గీ. అల్లనల్లన హరి హరి హరి యటంచు, గోఁడుఁ బోలె నొదుఁగుచుఁ గొదుకుకొనుచు, భక్తి... పదభక్తి మూర్తిభవించె ననఁగఁ, జకితహ ... దాక్షిదాసరిపాని యయ్యె. విప్ర. ౩. ౩.

**కొదుపు.** స. క్రి. (త. కుదప్పు) ఏదేని నోట వేసికొని మ్రింగకుండ ఊరక నములు. (శ. ర-ఊరిచు.బ్రౌ.)

**కొద్ది=కొలఁది.**

వి. (పరిమితి, పరిమాణము.)

ద్వి. ఇలువేల్పులకుఁ బూజ లిచ్చెడువారు, కఁ కొద్ది దానముల్ గావించువారు. రం. రా. అయో. ౮౮ పా. ౧౯ పం.

ఉ. ముద్దియమోహ మెంతటిదొ మోహనరూపవిలాస వింటె యే,నుద్దుల నొల్ల దెవ్వరినిఁ జూడఁగ నొల్లదు సొమ్ము లొల్ల దే,ప్రొద్దు విడెంబు చల్వలును భోజన మొల్లదు నిద్ర యొల్ల దీ, కొద్దికిఁ బచ్చవిల్తునిలకోరుల నేమగుచున్నదో కదా. శకాం. ౪. ౧౦౬.

సీ. తమికొద్ది నధరబింబము గంటివడనీక మొనపంటి నొక్కింత మోపు మనుచు. అని. ౩. ౧౬. జాహ్నవీ. ౩. ౯౬. దశా. ౫. ౨౭.

(శక్తి)

గీ. చైచి సరగునఁ గ్రమ్మఱ వచ్చి తలుపు, మూసి గడె పెట్టి యిఁక మునిముచ్చుకాన, యిటు మొగం బైన నాకొద్ది యెఱిఁగె దనుచు,నింటికిని వచ్చె నవ్విటకంటకియును.విప్ర.౪.౩౧.

వ... రాళ్ల నొడిసెలలఁ బెట్టి చేకొద్దిఁ ద్రిప్పి తివ్వటివ్వన ఉవ్వుచు...సానంకో. ౨. ౨౪ పా.

సీ. మొలవంకికొద్ది బెబ్బులిని గెల్చినవాఁడు గరిగ నీముంజేతిగవ్వదండ. చంప్రా. ౨. ౫౭.

విణ. (అల్పము, కొంచెము.)

ద్వి. కొద్దిగా ముత్తెంపుగొనబువజ్రాల, మద్దికాయ

లడాలుమలయఁ జిక్కెళ్లు. రం. రా. బాల. ౨౦ పా. ౩౦ షం.

(పాటిది, ప్రమాణము కలది.)

సీ. తాళములంతలై తగ నిమ్మకండులకొద్దులై బొం గరాలుద్ది గాంచి. ప్రబంధ. ౭౧౦.

(వ్యవ) కొద్దివారు గొప్పవారు. కొద్దిమంది.

జ: కొద్దికాఁడు.

**కొద్దికాఁడు.** విణ. (కొద్ది+కాఁడు.) క్షుద్రుఁడు, అల్పుఁడు.

సీ. కొద్దికాఁడనఁగను క్షుద్రుండు తగు ... ఆం. భా. ౩. ౧౩.

**కొన.** వి. (క. కొనె. త. కొనై.) ౧. చివర, కొస.

ఆ. వెలరువాలుదీవియల నల్లనల్లార్చు, స్వర్ణగండ్ల యందుఁ జొచ్చి సుడిసి, తిరిగి వేగుఁబోక తెమ్మెర లలవేఁగ, కొనలవంక లొత్తు ననలఁ బ్రోచు. భార. ఉద్యో. ౨. ౧౧౨.

ద్వి. కని బొద్దుఁ డంత నుత్కటకోపవహ్ని, కొనలను దనుదాన గొని కాలుచుండ. పండితా. వాద. ౧౭౬ పా. (వహ్నికొన=అగ్నిశిఖ.)

క. కొనఁ గననిపాపకర్ముఁడు, తను నాహారాదివిధులఁ దనుపఁడు మేయన్, జననీఁడు కాలు గట్టున్, మనుటయుఁ జచ్చుటయుఁ గాదు మద్విధమనఘా. వేం. పంచ. ర. ౫౬౫.

౨. వృక్షాదులచివరకొమ్మ, అగ్రశాఖ.

చ. భయ మనుతొల్లికన్ విమలభావవసుంధరఁ బెల్లగించి భక్తి యనెడువిత్తుఁ బెట్టి ప్రతధీనదిసమ్మదవారిఁ జల్లఁగా, నయమున నంకురించుచు ననల్ గొనలై యెలమిం జెలంగి తన్మయముగఁ బ్రాఁకె సంచనఁగ నారులమైపులకంబు లేర్పడెన్. కాశి. ర. ౧౨౨.

చ. ... ఉగ్రత మహాబలురాకకు నోర్వఁ జాలక్కాతని నొకభంగి గెల్తు నని తాఁ దలపోసి హ ...ంచె వాతులుం, గొనలు...

దకొమ్మలు రేయగుడున్ రయంబునన్. భార. శాం. ౩. ౩౯౮.

౩. గుబ్బురుజాలు, కేసరము.

సీ. తేజినా నున్నతవాజియై విలసిల్లు... గీ. కొన యనఁగఁ గేసరం బొప్పు... ఆం. భా. ౨. ౧౯౭.

కొనచీకటి=వేకువ నుండులేఁజీకటి.

గీ. అంతఁ దొలుకోడి గూయ నయ్యాత్మపాదుఁ, డాత్మశిష్యులఁ దెలుపుచు నరిగె నదికి, నింద్రుఁడును గొనచీకటి నింతియిల్లు, సొచ్చి నెమ్మెను బుణుకంగ సుందరయును. జాహ్నవీ. ర. ౭౬.

నడుకొన=నడిమిప్రదేశము.

క. అనుచు నొడఁబాటు లేకున్నను నయ్యర్తురుని నొగలనడుకొన నిడి తా, నను రథ మెక్కి రథికుఁడయి, చనియె నరుఁడు జమ్మి సేరసమ్మదలీలన్. భార. విరా. ర. ౭౪.

వ. ...సకలచతురంగంబులం బూఁచున ట్లొనర్చి యొక్క మోహరంబుగా నమర్చి యం దగ్రభాగంబునం దాను నిలిచి యిరుగెలంకుల నశ్వత్థామసౌబలుల నునిచి నడుకొన శల్యు నిలిపి యన్నరేంద్రుండు వెన్నుదన్ని నిల్చునట్లు సేసె ... భార. ద్రో. ౫. ౧౮౨.

సీ. కుతలంబునడుకొనఁ గొలకొండగా నిల్పి శరనిధి గ్రొచ్చిరి సగరసుతులు. కు. సం. ౧. ౫౨.

కొనరిక్క = రేవతీనక్షత్రము.

క. కొనరిక్క పేరిపాలఁతుక, పెనిమిటివై నాఁగలి యును బెనుఁదాటిసెడం, బును బూని తవిలి కాంద్రన్, దునిమి పుడమిపడఁతి వ్రేఁగుద్రోయుదువు గదా. అచ్చ. రా. బాల. ౧౫౮.

కొనగోరు = గోటికొన, నఖాగ్రము. భీమ. ౧. ౧౧౦. రాజ. చ. ౨. ౧౦౭.

కొనముక్కు = నాసికాగ్రము. వైజ. ర. ౬౭.

కొనరెట్ట = హస్తాగ్రము. రం. రా. అయో. ౯౯ ...ం.

కొనబావిలీ = చెవికొనయందు ధరించెడి భూషావిశేషము. (వా)

జః కొట్టకొన, కొనలిడు, కొనలునిగుడు, కొనలువాఱు, కొనలుసాగు, కొనలొత్తు, కొనసాగించు, కొనసాగు.

**కొనటి, కొనటివాఁడు.** విశే. కురూపి.

గీ... రూపవిహీనులు దారు రూపు, గలిగి తొలుమేనఁ గొనటులఁ బలికినారు. భార. అను. ౫. ౯౩.

గీ. ...కన్యఁ, గులజ నైనను రోగిణిఁ గొనటిఁ జెనఁటిఁ, బరిణయంబగు టొప్పదు...మార్క. ౩. ౨౩౯.

గీ. బుద్ధిమంతునివలన దుర్బుద్ధు లధికువలన హీనులు రూపసివలనఁ గొనటి, వా రసూయలు సేయుదు రీరసమున... భార. శాం. ౩. ౭౦.

**కొనకొనఁగోడి.** వి. బొల్లికోడి, జలకుక్కుటము.

గీ. కొనకొనంగోడి యెట్రింత కొంకనక్క, నమిలి యీ నాలుగిటిదర్శనంబు లెస్స. క్రీడా. ౫౨.

సీ. చక్రస్తనప్రకాశమునకు ఫేనంపుఁగొం గిడి కొనకొనఁగోళ్ల గొణఁగి. ఆము. ౪. ౧౫౩. సుద. ౩. ౧౯౪.

**కొనలిడు.** అ. క్రి. (కొనలు + ఇడు) వర్ధిల్లు, అతిశయించు.

క. ... క్రియ్య దొకయించు కైనక, డయ్యెదు కొనలిడియెఁ దృష్ణ... భాగ. ౯. ౫౭౭.

**కొనలునిగుడు.** అ. క్రి. (కొనలు + నిగుడు.) కొనలొత్తు, వర్ధిల్లు, అతిశయించు.

ఆ. వాఁడు నతనిరాక పోఁడిగ నిజబుద్ధి, నెఱిఁగి యతనియున్న యెడకు వచ్చి, పరమభక్తి మ్రొక్కి ధరణీసురేశ్వరుఁ, గుశల మడిగి ప్రియము గొనలునిగుడ. భార. ఆర. ౫. ౭౮.

క. అర్థులకు మ్రొక్కి తక్కటి, క్రొత్తడులందఱకుఁ బ్రియము గొనలునిగుడఁగా, నతతిఁ బిలికించె వరవ, నూత్నమరైయి సత్యభామ యుజ్జ్వలగరిమన్. హరి. ఉ. ౪. ౨౨౧.

**కొనలువాఱు.** అ. క్రి. (కొనలు + పాఱు) వ్యాపించు, ప్రసరించు.

వ. ...నిజగరుత్కనక రేఖామయూఖంబు లాఖండలారిదిక్కనకనక్కజంపు పెలమిఁ గొనలువాఱి యుద్దీపించు ప్రద్యుమ్నప్రతాపవైభవంబునుంబోలెఁ జాల నాలోకనీయంబు లగుచుండ. ప్రభా. ౨. ౧౦౫.

**కొనలుసాగు.** అ. క్రి. (కొనలు + సాఁగు?) ౧. కొనసాగు, వర్ధిల్లు.

గీ. గోపకాంతలయాసలు కొనలుసాగు, చందమునఁ గోర్కె లెంతయు సందడించెఁ, గడుపులోపల సర్వలోకములు నిడిన, బాలకునితల్లి యైన యప్పద్మముఖికి. వి. పు. ౭. ౪౭.

గీ. ఇవ్విధంబున బ్రాహ్మణుం డేతెఁగియొతెఁగి, తిరుగుచుండఁగఁ బెక్కువత్సరము లరుగఁ, గలుగుదురు పుత్రు లిద్ద ఱక్కాలమునకుఁ, గుండగోళకవంశంబు కొనలుసాగ. కాశీ. ౭. ౨౩౪.

౨. వ్యాపించు, ప్రసరించు.

వ. ... అనవుడుఁ గనుంగొనలఁ గొనలుసాగుకనలున కనుకూలం బైనహృదయంబు సదయంబుగా నొనరించి... కాశీ. ౧. ౫౭.

**కొనలొత్తు.** అ. క్రి. (కొనలు + ఒత్తు) వర్ధిల్లు.

ద్వి. కొనిపోయె వేడ్కలు కొనలొత్త నపుడు, విను తార్క్ష్యపాద్యాదివిధులఁ బూజించి. రం. రా. బాల. ౨౫ పా. ౨౦ పం.

**కొనసాగించు.** స. క్రి. (√కొనసాగు) కొనసాగఁ జేయు.

(వృద్ధిచేయు, పెంచు.)

మ. ధన మార్జింపుము నార్జితం బయినతద్ద్రవ్యంబు తేరంబుచేఁ, గొనసాగింపుము వర్ధివాసివలనన్ గూరుక్ మతిం గొంత... ప్రబోధ. ౪. ౩౩.

**కొనసాగు.** అ. క్రి. (కొన + సాఁగు?) ౧. ప్రసరించు, వ్యాపించు; ప్రవహించు.

గీ. కాల మనుకువిందుఁడు చంద్రికాపటంబు, చేయఁ బన్ని సమగ్రమె కో యనంగ, నవమయూఖాళి గొనసాగి మిపుల నొప్పె, విధుఁ డమరవానిగృహాభిత్తి వివర మనఁగ. కళా. ౮. ౧౪.

చ. నొసలను ముంగురుల్ చెదర నూల్కొని ముక్కరడాలు మోవిపై, వెసఁ గొనసాగ ... జాహ్నవీ. ౧. ౧౮౬.

సీ. ముజ్జగమ్ముఁ బవిత్రముగఁ జేయుతీర్థమ్ముఁ గొనసాగఁ జేసినయనఘమూర్తి. విజ. వి. ౧.౧౨౭.

౨. వర్ధిల్లు, పెరుఁగు, అతిశయించు.

ఆ. కొడుకుఁ గన్నవేడ్క గొనసాగ రోహిణిఁ, జీరఁ బంచి చిత్రచేలములను, మండనముల నిచ్చి మన్నించె నందుండు. భాగ. ౧౦ పూ. ౧౯౭.

వ. నాబంధువర్గంబు బంధువర్గపుఁ డీఁగయుంబోలెఁ గొనసాగి బ్రదుకుం గాక యని యాశీర్వదించి ... కాశీ. ౪. ౧౬౯.

సీ. మత్పాదభక్తి యాత్మకు జనించినమాత్రఁ గొనసాగి జ్ఞానంబు గుదురుపడును. దశా. ౧.౨౨౨

౩. పూర్తియగు; నెఱవేఱు, సఫలమగు.

గీ. అమ్మహాపూజ గొనసాగినట్టు లైన, సంగరంబున గెల్చె శత్రు లైన, విఘ్న మొందిన నోడు నవ్విధము మత్తు, చిత్తుఁ దాట గణింపక చేయఁ దొడఁగె. ఉ. రా. ౩. ౨౦౪.

గీ. ...అశక్తు లైన, వారిచేఁతలు కొనసాగి వచ్చు నెట్లు. వరాహ. ౧౧. ౨౮.

గీ. వేలుపులవేల్పు మామొఱ యాలకించి, కనికరపుఁ జూడ్కిఁ గనుఁగొని గాట మగుచు, నెదలఁ బొదలెడునలు కల్లఁ ద్రిదిలపఱిచి, సాఁకవే కోర్కు లీఁకఁ గొనసాగఁ జేసి. అచ్చ. రా. బాల. ౭౯.

**కొని—కొన్ని.**

క. మనుజపతి యివ్విధంబునఁ, దన చెలియింటికిని మ్రుచ్చుఁ దప్పన నొప్పిం, చినయట్టుల మదిని సరకు, గొనక మఱచి యున్న యెడను గొనిదిన ములకున్. నిర్వ. ౭.౬౩.

(హల్లు పర మగుచో 'ఇ'కారము లోపించుటయుఁ గలదు)

ఉ. కొన్ని గొణంగి కొన్ని నిసి కొన్ని తుటారము లాడి...పాండు. ౪. ౧౮౭.

**కొనితెచ్చు.** స. క్రి. (కొని + తెచ్చు) తీసికొనివచ్చు.

వ. భగీరథుం డను రాజన్యుండు కపిలముని ప్రదీప్తకోపానలదగ్ధు లగు సాగరుల నిరయంబువలన నుద్ధరించుటకై తపోవిశేషంబున మందాకినిం గొనితేర...కాశీ. ౪. ౨౮.

క. తోరపులత్తుకచాయల, వారువములు గట్టి మహిషవరకేతువు నెల్వార సమకట్టి తేరా, సారథి గొనితేర నెక్కె సంరంభమునన్. ఉ. రా. ౩. ౩౮౩.

చ. ఇతరులు రాకమున్న యది యెక్కడఁ బెట్టిన దానవో సుకీ, భ్రమతఁ గొనితెమ్ము తల్లిఖతుఁ గన్నులఁ జూచినదాఁక నామనం, బతిముదితంబు గాదు... ప్రభా. ౧. ౧౩౬.

**కొనిపించు.** స. క్రి. (√ కొను) కొనఁ జేయు.

(విలువకు పుచ్చుకొనఁజేయు.)

ఉదా: మగనిచే ఆమె జరీచీర కొనిపించినది.

**కొనిపెట్టు.** స. క్రి. (కొని + పెట్టు) కొనియిచ్చు, విలిచియిచ్చు.

సీ. మురువుతో నా మేలిముసుఁగు దీసినవేళఁ గొనిపెట్టు మందునో కుప్పసంబు. గంధ. ౧౩౧.

**కొనిపోవు, కొంపోవు.** స. క్రి. (కొని + పోవు) అపహరించు; తీసికొనిపోవు.

క. నాచిన్ని ముద్దుఁగూఁతురు, నాచక్కనితల్లి వీథి నడయాడఁగ నన్నీచు కొనిపోయె పాళ్యము, రాచిలుకం గొంచుఁ బోవు క్రమమునఁ దంత్రీ. రాజ. చ. ౨. ౩౧.

క. చంపినఁ జంపుము నన్నటు, గొంపోకుండినను జాలు గొసర గదయుకేన్, జంపిన నన్నొకటిన మత్రి, కొంపోయిన నెంద చెట్లగుదుకో యెఱుఁగన్. ప్రభా. ౩. ౧౪౩.

ఇల్లే: కొనిచను, కొంచుఁజను, కొంచేఁగు, కొంచుఁబోవు.

క. శౌరి యిచ్చె పారిజాతము, గోరికఁ గొనిచనుచు మనలఁ గొనిపోఁడని లోఁ, గూరిన నెవ్వగఁ దక్కిన, భూరుహములు మధురసాస్రుపూరము నించెన్. పారి. ౪. ౫౨.

చ. భామినితోడ నిట్లనియెఁ బద్మదళాక్షునిఁ గానఁ బోయెదన్, గోమలి బల్దరిద్రులము కొంచుఁ జనన్ మన కద్ది వస్తు వా, స్వామికి నిష్టమైన యది సంగతియే చన రిక్తచేతులన్, భూమిపు లార్దకున్ సతులపొందులకున్ గురు లున్నచోటికిన్. కుచేల. ౧. ౧౦౩.

శా. ... వా,కుం గాంతాజనులం దగంగఁ బురికిం గొంచేఁగు టర్హం బగున్. భార. శల్య. ౨. ౨౧.

క...రాచిలుకం గొంచుఁబోవు...రాజ.చ.౨.౩౧.

**కొనియాట.** వి. (√కొనియాడు) కొనియాడుట.

(శ్లాఘనము)

ఉ. ... అ,త్యాదరవృత్తి మీరు విజయాశ ననుం గొనియాటఁ జేసి యాఁ, గాదన కియ్యకొంటి ...భార. ద్రో. ౧. ౭౩.

క. నకు సహదేవనయశా, స్త్రకళావేదిత్వమునకు జను లనురాగా, ధికులై మిమ్ముం గొనియా,టకు నాతఁడు మనసు గిప్పుడం జింతిల్లున్. భార. శాం. ౧. ౧౭.

(ఆచరించుట)

సీ. తలఁపంగ నాద్యమై తనయుధర్మమ యొప్పుఁ గొనియాట నాస్తికగోష్ఠిఁ జనమి... గీ...ఇన్నియును శిష్టచరితంబు లిద్ధచరిత. భార. అర. ౫. ౪౪.

(కొలుచుట)

క. కడుఁ గ్రొత్తలు నీ విటు నను, బడుగుం జాటించి మిన్ను ప్రాఁకించెను నీ, యనుగులఁ గొనియాటకుఁ బను,పడినారము నీకు మమ్ముఁ జాడి యె పొగడన్. హరి. ఉ. ౮. ౫౨.

**కొనియాడు=కొండాడు.** స. క్రి. (కొని+ఆడు.)

౧. మెచ్చు, పొగడు, స్తుతించు.

క. తనపలుకు లోక మెల్లను, గొనియాడఁగఁ దగిన లోకగురుఁడు...భార. ఆది. ౭. ౨౪౬.

చ. హరుఁ జెడనాడి వీరిఁ గొనియాడెదు పెద్దయు నీవు...కు. సం. ౨. ౧౬౬.

౨. గౌరవించు, ఆదరించు; పాటించు, లక్ష్యపెట్టు.

చ. ... నీగురువుఁ బొల్తి తగం గొనియాడు మెట్లు నా,ప్పె నటుల భక్తిమై నడవు... భార. విరా. ౧. ౨౫౨.

సీ. కుంతీమహాదేవికోడండ్రలోపల నగ్గలంబుగఁ గొనియాడఁ బరఁగి. భార. విరా. ౨. ౨౧౬.

క. అనినఁ బితృదేవతలు మా,కును నీకును నరకగతి యగుం జుమ్మీ నీ, మనమున మావచనంబులు, కొనియాడక విడిచితేని కులజలధిశశీ. మార్క. ౭. ౧౯.

౩. భజించు, సేవించు, కొలుచు.

క. ... నీవు నివ్విధములజనములం, గొనియాడుము వారలు శో,భనము లొసంగుదు రఘుంబుఁ బాపుదురు కృపన్. భార. ఆను. ౨. ౧౩౬.

సీ. స్వర్గకాములు పితృవర్గంబుఁ గొనియాడి యిహలోకసుఖలీల లెల్లఁ గాంచి. హరి. పూ. ౨. ౧౩౦.

౪. కాపాడు, రక్షించు, పోషించు.

గీ. ...అతనిపుత్త్రకులు దాని, నెంగిసులు పెట్టి కొనియాడ నెలమిఁ బెరిఁగి. భార. కర్ణ. ౨. ౫౪.

క. విను మద్గోవిందుఁడు సఖుఁ,డును బంధుఁడుఁ గార్యకర్తయుఁడునై నిన్నుం, గొనియాడుమంద దురితం, బను పేరును గలదె నీకు ననఘచరిత్రా. భార. శాం. ౩. ౪౮.

క. విను భక్తియు వెఱపుఁ గలిగి, యనుజన్ములు నె

ద్దవాని నారాధింపఁగ, జనవర యతండు తమ్ములఁ,గొనియాడఁగ సిరికిఁ బట్టగుదు రుజ్జ్వలులై. భార. అను. ౪. ౧౩౨.

మూ: సహ్యేషాం వృత్తిదాతా స్యాత్సచైతాన్ ప్రతిపాలయేత్, కనిష్ఠాస్తం నమస్యేరన్ సర్వే ఛందానువర్తినః. సం. భార. అను. ౧౬౨. ౧. రం.రా. కిష్కి. ౧. ౨౧౬ పా. ౨౩ పం.

౫. అవలంబించు; ఆచరించు.

చ. ఇది శతవృద్ధ మాజనని యిప్పుడు మృత్యువుఁ బొందె నిట్లు నే,యదుకుల ప్రయుక్తమగుచున్న సనాతనధర్మ మిత్తెఱంగ దహనకర్మ మెల్ల మది గానిదిగా మును నిశ్చయించి మా, మొదలిటివా రొనర్చువిధముం గొనియాడితి మేము నియ్యెడన్. భార. విరా. ౧. ౧౨౯.

క. విను రాజు లెట్టిధర్మము, గొనియాడుదు రట్ల నడచు గుఱుకొని ధాత్రీ, జనము ... హరి.పూ. ౨. ౮౭.

క. అనిన నతఁ డిట్టిధర్మము, కొనియాడక వ్రతము లొండు గోరి నడపఁ గాఁ,బని యేమి... భార. శాం. ౬. ౫౦౪.

౬. తలపోయు.

క.విధివశమునవచ్చినకీ,శుభములు గొనియాడి వ్రేఁగులై విపులభవాం, బుధి మునుఁగుదురు ... భార. అను. ౧. ౯.

శ్లో. కోహ్యాత్మానం గురుం కుర్యాత్ ప్రాప్తవ్యే సతి చింతయన్, ప్లవంతే ధర్మలఘవో లోకేంభసి యథా ప్లవాః, మజ్జంతి పాపగురవః శస్త్రం స్కన్నమివోదకే. సం. భార. అను. ౧. ౨౨, ౨౩.

**కొనివచ్చు.** స. క్రి. (కొని + వచ్చు) తెచ్చు. (తీసికొనివచ్చు)

గీ.... సాహిణి యొకండు, కర్తయెదుటికిఁ గొనివచ్చె గంధవాహ, బాంధవం బగుకొకమహాసైంధవంబు. మను చ. ౪. ౭౭.

(పైఁడిచేఁప) సీ. తనసంతతికి మేఁతఁ గొనివచ్చు రీతి దిక్కరికరీరంబులగరుల వాను. దశా. ౧. ౨౯౯.

**కొను.** స. క్రి. (త. కొళ్.) ౧. గ్రహించు.

(క) పట్టుకొను.

తరళము... ఏను తీర్థము లీసము ద్రతటంబునన... వీని నెన్నఁడు నాడనో,డుదురు నస్త్రను లిందుఁ గోల్తానదుల్ గొనన్ వడిఁ జొచ్చుదున్.భార. ఆది. ౮. ౧౪౮.

సీ. గంధర్వకామినీకాముకవ్రాతంబు లాతాలఁ గొని మోఁది లజ్జఁ గొందు. హర. ౫. ౧౦.

ఉ. ముందల వట్టినట్లు తనముఖ్యతరాస్త్రము గొన్న దేవకీ,నందనుఁ జూచి... పారి. ౫. ౩౮.

(చ) తీసికొను; తీసికొనిపోవు.

ఆ. ... అతివపెండుఁ, గరులఁ దురగములను నరదంబులను గొని, యరుగుఁ జెంచె ... భార. మా. ౧౧౫.

క. చని సంప్రార్థించి యతనిఁ,గొని రుద్రునిఁ గాంచి నీసఖుం డీతఁడు వచ్చినకార్యము కృపతోడను,విను మని దండంబు తెఱఁగు వినిపించెఁ దగన్. భార. శాం. ౩. ౧౧౭.

(ట)-ధనాదులు- ప్రతిగ్రహించు; పరిగ్రహించు, స్వీకరించు.

గీ. కపిల యిచ్చినవానిన కాదు నిజము, కొన్నవానిని బ్రహ్మాత్మకుఁడుగఁ జేయు. భార. అను. ౩. ౧౦౩.

క. విను మిచ్చెద నని యీమియుఁ, గొనియెద నని పలికి పిదపఁ గొనకునికియు నత్యానృతంబులు సత్యవ్రత,మునకుం దొలఁగంగ మనకు భూవర తగునే. భార. శాం. ౪.౧౫౦.

క. కాకేమి తన్నుఁ దిట్టెనె, కోకిల తన కేమి ధనము కో కొమ్మనెనే,లోకము పగ యగుఁ బరుసని, వాకునఁ జుట్టమగు మధురవాక్యములఁ కళా. ౨. ౮.

క. శ్రీకందమూలఫలములు, కోకొం డని యొసఁగ నందికొని నమలి కపుల్.. భా. రా. కిష్కిం. ౬౫౫.

(త) లోఁగొను, ఇముడ్చుకొను.

గీ....సముద్రంబులోన బుట్టి, నైవఁ గొన్నంత గొనఁ గాక...భార. భీష్మ. ౨. ౨౭౨.

౨. అపహరించు; హరించు.

క. ఆమిష మని దానిం గొనఁ,గా మది సమకట్టి యొక్క ఖగ మాఖగముల్, వ్యోమమునఁ దాఁక...భార. ఆది. ౩. ౨౯.

గీ. ... బ్రాహ్మణధనంబు గొనుట ధర్మంబు గాదు, మనుజపతులకుఁ దగియెడిమానికంబు, గాన విడుచుట నీతిమార్గంబు గాదు. వరాహ. ౫. ౫.

క. ఉన్నఁ గని యప్పుడఁతి యో, యన్న విడువు భుజగనాథు ననవుడు నతఁడీ, పిన్నాతని ప్రాణంబులు, గొన్నది యిది దీనియనుఱుఁ గొని యెద ననియెన్. భార. అను. ౧. ౭.

౩. ఆధారముగాఁ జేసికొను; అనుసరించు.

గీ. ... ఎవ్వరిఁ గొని యతండు, కౌరవులమీఁద నెత్తిరాఁ గలుగువాఁడు. భార. ఉద్యో. ౨ ౧౬౯.

క. తమతమదేశంబులకై, మిముఁ గొని పాండవుల గెలుచు మెయికోలున భూ,రమణులు గొందఱు వచ్చిరి...భార. భీష్మ. ౧. ౩౧.

గీ. పురము వెడలి గోమతి యను పుణ్యతటిని, నడుమ కొని చని యారాజనందనుండు, దీనియావల దసనాశో ద్విజకుమార, వరులయూరని యడుగంగ వారు సేరి. మార్క. ౩. ౬౬.

౪. కావించు, చేయు.

క. వడి దోవఁ దిగుచుట దొడుగుట, వెడలం దెగ గొనుట శరము విడుచుట గానం,బడక విలు గుదుసువడుటయు, నడుగక రక్కసులు పడుటయును గానఁబడున్. భా. రా. అర. ౧. ౨౭౪. (తెగగొను=జ్యాకృష్టి చేయు.)

చ. ధనువుల విల్లు బాణములు దారుణలీల నమర్చి బద్దిగల్, గొని నిగిడించు...భా. రా. అర. ౨ ౨౭౪.

౫. పొందు, ప్రాపించు. (ఇది పెక్కుపట్ల విశేష్యముల కనుప్రయుక్తమై ఈయర్థముతో శబ్దపల్లక్రియగా ఏర్పడుచున్నది. ఉదా: తెవులుగొను, భయముగొను, మఱలుకొను.)

గీ. కుసుమధనువున నెవ్వండు గొను విజయము. భాగ. ౧౦ ఉ. ౧౦.

ఉ. ... సురేశ్వరాదులం, బన్నములాడి నీమగని పక్షము పల్కెదు గాక చేల నీ, కొన్నమఱుల్ జగజ్జనులు గొందురె వ్రాత్యులఁ బూజ్య లందురే. కు. సం. ౨. ౧౬౯.

క....ఈతటినిం, గనుఁగొను పుణ్యుఁడు మిక్కిలి, కను గొను నెన్నదుట నెన్నఁగాఁదర మగునే. దశా. ౧. ౧౨౩. పాండు. ౧. ౭౧.

౬. లక్ష్యముగాఁ జేయు, గుఱిగాఁ జేయు.

ద్వి. ... ఇంద్రజిత్తు, పసిఁడిపింజల నొప్పుబాణము ల్డొడిగి, గోముఖుం డనువానిఁ గొని కాఁడనేసె. రం. రా. ఉ. ౭౫ పా. ౧౭ పం.

౭. లక్ష్యపెట్టు, సరకుసేయు.

క. కొనరు బుసులమాట నాస్తికులు వివయనిధీ. భార. శాం. ౬. ౨౨౫.

చ. ... భుజశక్తి నెవ్వరిం,గొనక కరంగి రజ్జవలుకుల్ గడుఁ జెక్కులు వల్కు దప్ప నీ,వు ... భార. మహా. ౪౪. భార. ద్రో. ౫.౩౭. నృసిం. ౪. ౨౧.

౮. వశపఱచుకొను, ఆక్రమించు, స్వాధీనపఱచుకొను.

సీ. అభయంబు వేఁడిన నందఱఁ గృపఁ గాచి యోధియీపెన్నెలయెల్లఁ దాన, కొని యధ్వరములు పెక్కొనరించి ... భార. శాం. ౧. ౨౩౭.

చ. బలిమిఁ దదీయు లప్పుడు సభాముఖ్యుల రట్టఁ బట్టి యా, తలఁ బడవై చుచుం దమకుఁ దా

మె యవారణఁ దత్తదాసనం,బులు గొని కూరు చుండిరి ... ప్రభా. ౧. ౮౨.

గీ. ఇందుర మ్మన్న చోట ని ల్లెల్లఁ గొనుట. కువల. ౨. ౨౩.

౯. తాల్చు, ధరించు.

క. నలువదితొమ్మిది రూపం,బులు గొనియుం బుష్ప గంధములు మోవఁగ లే, కలసియుఁ దమ్మెర లానుం,బలుముఖు యువజనము మేనిపలుచనిచె మటల్. పాండు. ౧. ౧౮౪.

సీ. కొమ్ముకత్తుల మెఱుంగుల నెల్ల పావడల్ గొనునది మస్తేనుఁగులచయంబు. కువల. ౨. ౧౨౭.

౧౦. పూను.

క. విను మప్పులుకులు పాటిగఁ,గొని దుర్యోధనుని తోడఁ గొంటిని బగ... భార. కర్ణ. ౩. ౬౦.

ఆ. హితజనంబు లెదుర నీతని కెడ రైనఁ, బ్రాణ మిత్తు ననుచుఁ బ్రతినఁ గొంటి. జై. భా. ౮. ౯౦.

౧౧. కలియు, కూడు, చేరు.

సీ. కమలకాననమధ్యకలహంసవిభుభాతిఁ గూర్మి నెచ్చెలిపిండు గొని చెలఁగుచు. పాండు. ౨. ౩౧. కేయూర. ౪. ౧౬౪.

౧౨. తలఁచు, ఎంచు.

క. అది రవి గ్రుంకుటగాఁ గొని,మద మెసకంబెసఁగ నార్చి మనసైన్యంబుల్, వొదలె... భార. ద్రో. ౪. ౩౧౬.

ఆ. దనుజుఁ డునుము మనుట తప్పగాఁ గొనకుమీ. రుక్మా. ౪. ౧౬.

క. కటకట మనవారిది దుర్ఘటముగఁ గొని యెంతె చింతఁ గావించెద రిప్పటి కింక నేము మేమెం,తటిపగయును దీర్ప లేమె తమయాజ్ఞవ సక్. ప్రభా. ౨. ౪౪.

౧౩. నెఱవేర్చు, సాధించు.

క. రాణింపఁ బల్కి తనవుని, జూతై కొను ... ఆము. ౪. ౨౬౯.

ద్వి. పెనుపొందఁగా సామభేదదానములఁ,గొన రా నికార్యంబు గొనకొని చేసి,మఱిగదా దండం బు. రం. రా. యు. అగ్నాపా. ౧ పం.

౧౪. తెచ్చుకొను, తెచ్చిపెట్టుకొను.

చ. కిలకిల నవ్వు మోవిపలుగెంటుల దీటుఁ గుచంబు లొరగా, పెలువడఁ బైటవేయు నెఱవింతగఁ గేరు మరుల్కొనంగ జెర్కులు గొనఁ జూచు లేనివగలుం గొని మాటికిఁ గుల్కు... హంస. ౧. ౨౧౭.

౧౫. చేరనిచ్చు.

వ. ... క్రేపులం గొననియావులం దొలఁగం గట్టి పిల్లల పెట్టియు మందులు నల్లియుం జాల దుఃఖపడిచి చే పెత్తెంగించువారును. హరి. పూ. ౫. ౧౪౨.

౧౬. (నృత్తాదులను) ప్రయోగించు.

క. మద్దెలసద్దున నీతని, నిద్దురమ ల్లెల్లఁ బోవ నేర్పు మెఱయ నే,నిద్దముగ దేశిఁ గొనియెద,నొద్దిక గా నుండుఁ డనుచు నొనరిచి సఖులక్. వాల్మీకి. ౩. ౧౨౨.

౧౭. భుజించు, తిను.

క. విను మధురాహారంబులు, గొనుటయుఁ బెక్కుఁడు నిద్ర గూరినయెడ మేల్కొని యునికియుఁ గార్యాలోచనముఁ దెరువు నడచుట యును జన దొక్కనికిక్. భార. ఉద్యో. ౨. ౩౮.

క. తనుయాత్రకుఁ గా నశనము, గొనుఁ బూర్ణము గాఁ గొనండు... భార. శాం. ౫. ౩౨౧.

౧౮. త్రాగు.

క. శ్రీపాదంబులు గడిగెను, శ్రీపాదోదకము గొనియె...హర. ౨. ౧౨౪.

క. ఎనుబదియేఁడులవార్ధక,మునఁ బ్రాప్తశక్తి యుడిగిపోదాతనికిక్, దినిరెండిది పెద్దమాంసము, గొనియొడియది కల్ల మనసు క్రొవ్వట్టుడుగుక్. శివరా. ౪. ౧౫.

చ... అన్న మేమియుం, గుడువదు నీరముం గొ
నదు...భాగ. ౧౦ పూ. ౧౭౨౯.

౧౯. నెలకుఁదీసికొను, నిలుచు.

క. ఏ మస్త్రైద మనినఁ బృథివి,యోమనుజాధీశ కొ
నుట యొప్పెడు తెరు వెం,దేమియును నెగ్గు లే
దీ, భూమిసురులకోర్కి దీర్చిపుచ్చుము ప్రీ
తిన్. భార. అశ్వ. ౪. ౧౯౫.

సీ...అమ్మైద నూఱుగోవుల కివ్వరేఁ గొనుఁడు...
హరి. పూ. ౨. ౮౦.

౨౦. ఖండించు, నఱకు.

చ... ఎక్కుడు నెన రాహుమస్తకముఁ గొన్న సు
దర్శన దేవుఁ గొల్చెదన్. ఆము. ౧. ౯.

౨౧. కొట్టు, వ్రేయు.

సీ. కొనె మూరెఁ జదిపె నాఁగను గొట్టె నని తోఁ
చు...అం. భా. ౩. ౧౩౨.

మ ...భీమపార్థులును గోకొమ్మంచు నొక్కుమ్మ
డిన్, గవియన్ ... భార. భీష్మ. ౩. ౩౧౯.
మార్క. ౧. ౧౩౫.

౨౨. నాటు, కాఁడు.

చ. ఒకబలుకూపురంబు గొని యుచ్చిచసం గర
మర్గి యేయుడున్. భార. ద్రో. ౫. ౧౭౩.

చ. హలధరుఁ డేకలవ్యహృదయంబు గొనన్ ఘు
నళక్తి వైచినన్. ఉ. హరి. ౩. ౧౦౬.

ద్వి. పరతేర నొకకొయ్య యరకాలు గొన్నఁ, జార
చుర నరములు నుక్కఁ దివుచుడు. పండితా.
పురా. ౧౩౨. పా.

అ. క్రి. ౧. నెలకొను, ఉండు.

చ. మనమునఁ గొన్న నెవ్వగలు మాన్పి ఘటింతురు
కావ్యసమ్మదం, బనఘకథాముఖంబున హితా
హితబోధ మొనర్తు రింపుగాఁ, గనుఁగొనుకం
టె నద్భుతముగా నెఱిఁగింతు రతీంద్రియా
ర్థముల్, ఘనమతు లెల్లవారికి నకారణమిత్రు
లు గారె సత్కవుల్. కవిక. పీఠి. ౮.

౨. పనికివచ్చు, చెల్లు, సాగు.

ఆ. కుటిలబుద్ధు లిచటఁ గొనవు వెట్టిన ఘన, దో
ర్బలంబు మెఱసి తొడర వలయు, సతఁడు గాఁ
డివమున నడ్డపాళీలు వైవఁ, డుఱుల నంపవా
న గురియుఁ గాని. భార. విరా. ౪. ౧౯౭.

మ. అనినం గ్రోధకషాయితాక్షుఁడయి మిథ్యాజ
ల్ప నీవాఁడుముల్, గొన విచ్చో నని మండలీ
కృతరణత్కోదండనిర్ముక్తశ,స్త్రనికాయంబుల
నేసలన్ గడపి... జై. భా. ౫. ౧౦.

౩. అతిశయించు, విజృంభించు; వ్యాపించు.

సీ. పరితాపశిఖిశిఖ ల్దరికొని వనములోఁ గార్చి
చ్చువలె కొని కాలుచుండు. కు.సం. ౫. ౬౫౧.

చ. గనగన నెల్ల ప్రొద్దుఁ గొని క్రాలెడువేఁడిమిఁ
బేర్చుభర్తమే, నెనయను దగ్గఱన్ సయిఁప
కెంతయు భీతి నొదుంగుమన్ ... హరి. పూ.
౧. ౯౬౭.

౪. అగు, ఏర్పడు.

ద్వి. గుంపులుగుంపులుగొని తన్ను దూఱి,సాంపేది
రామునిసుద్ది చెప్పుచును. రం. రా. అయో.
౧౨౧పా. ౨౯పం. (గుంపులుగుంపులుగొను=
గుంపులుగుంపులుగా ఏర్పడు.)

౫. ఇది సకర్మకక్రియలకు ఆత్మనేపదార్థమునందు
ను అకర్మకక్రియలకు స్వార్థమందును అనుప్ర
యుక్తమగును.

ఉదా: చంపికొను, కొట్టుకొను, దాఁగుకొను, పం
డుకొను, మొ.

చంపికొను:-

చ. ... భీష్ముని నెనకొల్పి సేనలకు ముఖ్యుఁడ వీ
వని యుబ్బఁజేసి యీ,నునఁ దలపెట్టి చంపికొ
నఁ జూచె సుయోధనుఁ డింత నేమగున్. భా
ర. ఉద్యో. ౪. ౨౦౭.

రవులుకొను:-

సీ. ...అవుల నాపాట్నూరు రవులు కొనియె. ఆ
ము. ౧. ౩౬.

(కోన్, కోఁగన్, కోఁగాన్, కొంచు, కొన్న,
కొక, కొని, కొందును, కొంద్రు, కొందురు, కొం
ద్రు, కొమ్ము, కో, కోకొమ్ము, కోవయ్య మొదలగు

విశేషరూపములు వ్యాకరణములనుబట్టియు ప్రయోగములనుబట్టియు గ్రహింపవలయును. కొన్ని ప్రయోగము లీక్రింద ఈయఁబడినవి.

చూచికొండము=చూచికొందము.

ఆ. ... చూచి,కొండ మెల్లపనియు రండు వేగ. భార. వూ. ౧౭౩.

కొండ్రు=కొందురు.

సీ. ... మీలయట్టుల బలవంతు లల్పులఁ దమకు నాహారములుగఁ.గీ.గొండ్రు భూపతి లేకున్న మండ్రె జనము,లు...భార.శాం. ౨. ౨౫౫.

కొండు=కొనుఁడు.

ఉ. కొండని వేడ్కతోఁ బసిఁడికొండ ధనార్థుల కెల్లఁ బంచి యీ,కుండుట...నైష. ౧.౫౧.

కొంద్రు=కొనుదురు.

శా. స్వామిద్రోహము వాపికొం ద్రచట... కాశీ. ౬. ౩౭.

చవిగొను=౧. రుచిమూచు, ఆస్వాదించు.

సీ.ఏమి దాఁ జవిగొన్న హృదయేశుకెమ్మోవి దోఁపక యది మున్న దోఁపకుండె. కళా. ౬. ౨౧౪.

౨. తిను; అనుభవించు.

మ. వివిధాజ్యాహుతిధూపదీపములు నైవేద్యంబు నీయగ్ని ముక్,జవిగొన్ బిమ్మట భుక్తిముక్తులు నవశ్యప్రీతిగా నెప్పుడున్,జవిగొంద్రం బురుహాసనాచ్యుతమహేశానాదిబృందారక, ప్రవరుల్ ...కాశీ. ౩. ౨౦౬.

తెవులుగొను, తెవుళులుగొను=రుగ్ణమగు, వ్యాధిగ్రస్తమగు. భార. ఆది. ౫. ౫౩, అను.౫. ౨౧౪.

భయముగొను=భయపడు. భార. అర. ౨. ౭౪.

భుక్తిగొను=భుజించు. కాశీ. ౨. ౭౫.

జ:కొంటు,కొండాట[1],కొండాడు[1],కొనితెచ్చు, కొనిపోవు, కొనిపెట్టు, కొనిపోవు,కొనియాడు,కొనివచ్చు, కొనుగోలు[1],కొనుబడి, కొనుమొదలు, కొలువు[4], కో[2], మొ.

కొనుగోలు[1]. వి. (√కొను) కొనుట, క్రయము. (శ. ర.)

కొనుగోలు[2]. వి.నాట్యయోగ్యతద్ధిత్తాదిశబ్దోచ్చారణము.

మ. ఎకతాళంబున వీరమర్దళరవం బేకంబుగా నట్టువుల్,ధికతోంతత్తకఝుంకుఝుంకుకిణతోం ధిత్తాంకియల్లోధకు,ద్ధికు కెత్తెయ్య ధిమికుక్కత కుక్కధిగుతాంధిత్తాత్తతాళంబులన్, గకుబంతంబులు మాఱుపల్కకొనుగో ల్గన్పట్ట నప్పట్టునన్. ప్రబంధ. ౯౪.

కొనుజో=కొఱుజో. వి. పిడుఁజు, పసులదేహమందు చేరి రక్తము పీల్చెడిజంతువిశేషము.

సీ.ఎరువు తిప్పలుగొని యెల్లమందలు గొనుజెక్కమేపులచోటు ద్రొక్కఁబడియె. హరి. పూ. ౬. ౫ (శ. ర.ప్రాఁత ప్రతిపా-కొనుజెక్క=కొనుజాలుపట్టి.)

కొనుబడి. వి. (√కొను) కొనుగోలు, క్రయము. (శ. ర.)

కొనుమొదలు. వి. (√కొను) క్రయధనము,కొనుటకిచ్చినసొమ్ము. (శ.ర,బ్రా.)

కొన్నాళ్లు. వి. బ. (కొన్ని+నాళ్లు) కొన్నినాళ్లు, కొన్నిదినములు, కొంతకాలము.

గీ. మున్ను కొన్నాళ్లు పలుగాకిమూఁకలోనఁ, గలసి మెలఁగినతెఱఁ గెల్లఁ గానిపింపఁ,జేడియలమీఁద గ్రుడ్లొత్తుచేయ రాకు,కోయిలా యింక నీయిల్లు గూలిపోను. నీలా. ౩. ౨౫.వసు. ౧. ౧౨౩.

కొన్ని=కొని. స. బొ. (చూ. కొంచెము-'కొంత' శబ్దమునకు అమదర్థకబహువచనరూపము) కతిపయార్థము.

సీ. బాగాలు వెస నొక్క పద్మాక్షి యొసఁగిన వెగ్గలం బని కొన్ని వెడల నుమిసి. మనుచ. ౩. ౭౭.

ఉ. కొన్నిటిఁ బాణ్యముల్ నఱియఁ గొన్నిటి వీపులు పిండిపిండిగా,నన్నిటి భీముఁ డుద్భటగదాహతి నేనికవేఁటలాడెఁగన్. భార.భీష్మ. ౨. ౨౧౧. (ప్రాఁత ప్రతులపాఠము.)

ద్వి. ... మఱికొన్ని వేల్పులు...బస.పు.౪.౩౧౩. (ఇట మహన్మహాత్మ్యర్థకముగా నుపయోగింపఁబడినది.)

**కొపురు.** వి. (సం. గోపురమ్.) ౧. శిఖరము.

క. దాఁటుటయుఁ గొండకొపు ౌలు, బీఁటలువాఱెం గడిందిబీతున జేజే,దాఁటు పడంకం బాఱెను,గాటపుఁబయ్యెరలు మొగులు గడలకుఁ బాఱెన్. అచ్చ. రా. కిష్కి ౧౧౨.

౨. ఉన్నతి.

ఆ. ... గొనబుఁగొను,గొం చెతనముఁ బిఱుఁదుఁ గొపురును బొక్కి ,లోఁతు సెన్న సెన గలుగుట యరిది. అచ్చ.రా.అర.౨౩. (శ.ర.పా)

**కొపెర=కొప్పెర.** వి. పెద్దమూతి గలపాత్రము.

సీ. సారాయికొపెరగంజాపొడుల్ దెమ్మంచు హారిణితోఁ గడు నెగ్గులాడి రనుచు.కువల.౧. ౪౧.

**కొప్పరము=కొప్రము.** వి. ౧. శిఖరము, అగ్రము. (శ. ర.) ౨. మూఁపు.

గీ. కొప్పరము మూఁపటంచన నొప్పు నంస,ము ... ఆంధ్రా. ౨. ౧౩౭.

క. అప్పుడు భయవిస్మయములు, ముప్పిరిగొన నశ్వశిరుఁడు ముందటఁ బైపై,నుప్పరము లెగయుగరుడుని,కొప్పరమున నున్నకపటగోవిందునకున్. వరాహ. ౧. ౧౪౨. ఉ. హరి. ౬. ౧౦౮.

విశ. విజృంభితము, ముమ్మరము.

ఉ. ... రోగముల్,కొప్పర మైనచో...దా.శ. ౧౬.

జ: కొప్పరించు, కొప్పరింత.

**కొప్పరించు.** అ. క్రి.(√కొప్పరము) ౧. విజృంభించు; అతిశయించు.

వ. ...అడిదంబులు జళిపించిన ఝుణఝుణఝుంకారంబులుం దదీయపరస్పరఘర్షణ క్రేంకారంబులుం ఉపహుంకారంబులును ముప్పిరిగొనం గొప్పరించియు... అదలించియుం గదలించి యుఁ బోరునవసరంబున... అవ్వీరద్వయంబుం గనుంగొని...ఉ. హరి. ౪. ౨౫౬.

వ. రేవెలుంగురాచిప్పలం గప్పురంపుఁగుప్పెలం గొప్పరించినసరసమనురసంబులు నించి ... పారి. ౨. ౫౨.

౨. (కోపాదులచే) రోమాంచము కలది యగు.

సీ. కొప్పరించఁగ మింటఁ గ్రొవ్వాఁడి రోమముల్ చొచ్చి వచ్చినతోలు ల్పుక్కగుంపు. చంద్రా. ౧. ౭౫.

సీ. గాలి సోఁకిన నైనఁ గనలి మైఁగొప్పరించి తటాన నట బయల్ సెలసికొనుచు. చంద్రా. ౨. ౯౨. ఉ. రా. ౭. ౪౧౩.

౩. పండ్లిగిలించు. (బ్రౌ)

ద్వి. కొప్పరింపుమఁ బండుకోఁతి యై యుండె. అభిమన్యుచరిత్ర. ౧౭౪.

స. క్రి. నిండుగాఁ బోయు.

సీ. దైవతైర్థికులు మందాకినీతోయముల్ గొప్పరించిన గాజుకుప్పె లనఁగ...గీ...కనుపట్టెఁ దారకానసముదయంబు. విప్ర. ౩. ౭౦.

**కొప్పరింత.** వి. (√కొప్పరించు) అతిశయము; విజృంభణము. (శ. ర.)

**కొప్పు¹.** వి. (త. కొప్పు.) ౧. స్త్రీధమ్మిల్లము,కబరి, వేనలి.

చ. ... మోమున, న్వాల పలరారఁ గొమ్ముగులున

న్నియఁ గేరును గొప్పుతీ రహిఁ, చిలుకలకో
ల్కిసౌరు నెతిఁ జెప్పఁగ నల్వకునైనఁ దీరు
నే. నీలా. ౨. ౧౯. దశా. ౬. ౩౪.

౨. మగవానిసిగ, జుట్టుముడి.

ఆ. అగ్నిదాహభీతి నంగారపర్ణుండు, బమ్మరిల్లి నే
లఁ బడిన వానిఁ, గొప్పు పట్టి యీడ్చుకొని వ
చ్చె ధర్మజా, కడకు నింద్రసుతుఁడు కడిమి
మెఱసి. భార. ఆది. ౭. ౪౪.

౩. ఇంటికప్పుయొక్క యూర్ధ్వభాగము; ఉన్నత
స్థానము.

గీ. చని యధిశ్రయణిని పట్టి సంగ్రహించి, యిం
టినడికొప్పు తగిలించి యెఱుఁగనట్లు, నుంగి
టికిఁ బోయి... శుక. ౩. ౩౧౪.

క. లలిఁ గొప్పెక్కించితి మధుపుల శుకుల నడు
గుపఱచితి పుష్పాస్త్రా మా, లలకును మంచం
బులు బాఁ, పలకును బీఁట లనుమాట బళి నిజ
మయ్యెన్. చంద్రా. ౫. ౯౧.

౪. (వింటి) కొన, గనయును, కోపు.

చ. తెగువ మనోభవుండు తియతియ్యనిసింగిణి
వింటికొప్పునన్, దగిలిచె దత్తువాటిపనితాచి
కుసంబులఁ బోలుశింజినిన్. భీమ. ౫. ౯౫.

సీ. కబరియు శిఖయును గాత్మకాగ్రంబును గొ
ప్పని పల్కఁగా నొప్పు[illegible]ండు. ఆం. భా. ౩.
౬౧.

జ: కొప్పుగొలుసులు, కొప్పువల.

**కొప్పు**[2]. వి. నాట్యవిశేషము, కోపు.

గీ. పెక్కువగజక్కిణీ కొప్పు ద్రొక్కి నొక్కి,
చక్కనిమిటారి నరపతు ల్సొక్కి చూడ.
దశా. ౭. ౧. ౨౯౭. ('కోపు' అనియును చదు
వవచ్చును.)

**కొప్పుగొలుసులు.** వి. బ. (√ కొప్పు[1]) కొప్పు
నకు నుభయపార్శ్వములయందు పెట్టుకొనుగొ
లుసులు, అభరణవిశేషము. (వా)

**కొప్పువల.** వి. (కొప్పు[1] + వల) వాలపాశ్యావిశేష
ము. ('తలవెండ్రుకలను బంధించునట్టిముత్యాలస
రము' బ్రౌ.)

సీ. ...తవరును వాలపాశ్యావిశేషములు నూసక
తురాయి, ముత్యాలకుచ్చు కొప్పువల పాపట
బొట్టు జిలిబిలి జల్లియుఁ జేరుచుక్క, యు
నఁగ... ఆం. భా. ౨. ౧౪౭.

గీ. చెవులపూవులు బవిరలు చేరుచుక్క, కొప్పు
వలయును సవరించి కొప్పు పిూఱ, భూషణము
లకుఁ దా నొకభూషణ మయి, పడఁతి యుప్పు
డొప్పెఁ గన్నులపండు వగుచు కళా. ౭. ౬౬.

గీ. బవిరలును గొప్పువలయును బసఁతి యొత్తు,
దిద్ది ...యయా. ౪. ౧౯.

**కొప్పెర=కొప్పెర.** వి (సం. కర్పరః.) ౧. కటాహ
ము, కాఁగు; నెడల్పుమూతి గలచిన్నపాత్రము.

గీ. ఇట్టిసేనలతో నమ్మహీశ్వరుండు, వెడలుచును
శంఖలిఖితు లనెడిపురోహితుల నియోగించి
రానివారలను వైవుఁ, దరసి కాఁగినచమురుఁ
గొప్పెరలలోన. జై. భా. ౪. ౧౧౦.

సీ. ధనముకొప్పెరదండఁ బెనుభూత మున్నట్లు
గంగదరిని మొసలి గాచినట్లు. వైజ. ౩. ౧౨౫.

గీ. పసిఁడికొప్పెర లాతంబు పచ్చకోల, జోగప
ట్టియు కకపాల జోలెసంచి, కలికికాటుక గి
ర్బొట్టు పలుఁగు పేరు, జాతి గాఁ దాల్చి నెఱ
మిండజంగ మగుచు. హంస. ౫. ౪౦.

౨. తలపుర్రె.

క. అప్పుడు విడువక వ్రేసెం, గుప్పున నడునెత్తి
పగులఁ గొట్టఁగ వెడలెం, గొప్పెర నెత్తురు
భీమున, కప్పాండవలోచనముల నశ్రులు గా
ఱన్. దశా. ౮. ౧౫౭.

**కొప్రము=కొప్పరము.** వి. శిఖరము.

ఉ. పున్నమచందురుం దెగడుపాంకపుమోముల
రాచకన్నియల్, గ్రొన్నెలతాలమేలిపనికొ
ప్రపుమేడల నాటలాడ... నీలా. ౧. ౨౮.

**కొబ్బెర=కొబ్బెర.** వి. ౧. నారికేళము.

ఉదా: కొబ్బరకాయ, కొబ్బరపండు.

సీ. కోఁతి కొబ్బరకాయ కొన కెక్కి పడఁద్రో యు దానిజలంబులు ద్రావఁగలదె. రామలిం. ౧౭.

ఉ. మ్రొక్కు లొసర్త...చక్కెర కొబ్బరపండు లుండ్రముల్, మెక్కెడుపాఁపజందెములమే టికి...నీలా. ౧. ౭.

౨. కొబ్బరకాయలోనిభోజ్యపదార్థము, పేశము.

గీ. చాఱపప్పుఁ గసగసాల్ జాజికాయ, సెనగ లనుములు పత్రియు మునగపువ్వు, కొబ్బర యు మందపాలతోఁ గూర్చి త్రావి, యుబ్బుద బ్బరకాఁడు నీ కబ్బు టగుసె. ప్రబంధ. ౬౪౧.

సీ. ... కొబ్బరనఁ గొబ్బెర యటంచు నఁగఁ ద త్పేశ మెసఁగు... ఆం. భా. ౨. ౭౮.

క. తరణిదళరసమునను గొబ్బెర నించఁగ రాచి రాచి పెట్టిన దళవాసరములకు మస్తకీటక, మురలిసుకేశములు మొలచు మొదలిటెనియు తిఁగ. చికి. (చి. ని.)

జ: కొబ్బరపూవు, కొబ్బరయుండ.

**కొబ్బరపూవు.** వి. (√కొబ్బర) మొలక మొలచిన కొబ్బరకాయలో ఉండవలె నుండు మెత్తనిపదార్థము. (బ్రౌ)

**కొబ్బరయుండ.** వి. (√కొబ్బర.) భక్ష్యవిశేషము, కూశ్మాండము. (శ. ర.)

**కొమ[1]=కొమ్మ[1].** వి. శాఖ. (శ. ర.)

**కొమ[2]=కొమ్మ[2].**

(ఆఁడుది, స్త్రీ.)

క. కమలములనుజ్జగించు, గుముదంబుల బుజ్జగించుఁ గొమమాపులు పున్నమచందమామవెలుఁగుల, కొమ రంతయుఁ బుణికి పుచ్చుకొనఁ బోలుఁ జామా. విజ. వి. ౧. ౧౫౭.

క. కొమనాము మీఁదఁ బైకొని, సుమనారాచంబు లేసి స్రుక్కించకు... మదకీరగమన తంబురదమునా. రసిక. ౪. ౧౬౬.

**కొమరసామి.** వి. (చి.ని, శ.ర-సం. కుమారస్వామి) కుమారస్వామి.

లయగ్రాహి. హైమవతిపట్టి నఖిలామరశరణ్యునతకామితకరుఁగ గొమరసామి భజియించెఁగ. కాశీ. ౪. ౩౦౨.

సీ. కొక్కొరోకో యని కొమరసామిరథంబు కంఠంబు సాఁచి క్రేంకార మిచ్చె. భీమ. ౨. ౭౮.

సీ. ... అల్లదె కొమరసామయ్యనగరు. క్రీడా. ౧౪౯. ('కొమరుసామయ్య' ముద్రి.)

**కొమరాలు.** వి. దే. (కొమరు+ఆలు) ౧. యువతి, జవరాలు; స్త్రీ.

సీ. కొమరాలిసిబ్బెంపుగుబ్బపొందమ్మి మొగ్గలు పేరెదకుఁ జేర్పఁ గలిగె నేని. పె. శకుం. ౨. ౭౬.

గీ. ... మిత్రమోహార్తిఖిన్న, తమ్మికొమరాలు వక్త్రనేత్రములు మోడ్చె. వేం. పంచ. ౪. ౨౩౪.

౨. సుందరి, అందము గలస్త్రీ.

ఆ. చాల ముద్దరాలు జవరాలు కొమరాలు. భాగ. ౯. ౭౨.

క. ఆలవు బాలవు గదుఁ గొమ, రాలవు గోమలివి ముద్దరాలవు...కు. సం. ౬. ౬౭౨.

**కొమరిత=కొమారి, కొమారిత, కొమార్తె.** వి. (సం. కుమారీ. త. కుమరి) కూఁతురు, దుహిత.

గీ...అతనునారాచ మైన, రాచకొమరితఁ జూంచాలిఁ జూచునపుడు. పాంచా. ౨. ౩౧.

**కొమరు[1].** వి. (సం. కూబరః. త. కొమ్మై.) ౧. మనో[illegible]స్పదము.

ఆ. సోయగంబు సొబగు జోక యొప్పు కొమరు, చె
లువు తీరు సొగసు పొలుపు చెన్ను, చక్కఁదన
మనంగ సౌందర్య మొప్పును...ఆం. భా. 3. ౪౧.

సీ. వదనంబుకొమరు భావనఁజేసి వేఱుగా నదుటి
పెం పలకలఁ బొదువఁబడఁగ. భార. విరా. ౧. ౨౨౭. ఉ. రా. ౧. ౨౧౦.

౨. విధము.

క. కరితురగసమితి గాల్కొని, కురువీరుల మొన
లు మొగులుకొమరునఁ గవియఁగ. భార. వి
రా. ౪. ౨౭౦.

ద్వి. రెండుహస్తము లెత్తి రెక్కలతోడి, కొండ
తీవ్వన వచ్చుకొమరు దీపింప. రం. రా. బాల. ౨౭ పా. ౯ పం.

విశ. ౧. మనోహరము, మనోజ్ఞము, చక్కనిది.
క....హారరత్నము త,ద్వీమలోదధితీరంబునఁ,
గొమరుగ నేకతమ యిచ్చెఁ బ్రమ్మరుచున్నఁగ.
భార. ఆది. ౨. ౨౬.

గీ. చిఱుచెమటఁ బేర్చువింత క్రొమ్మెఱుఁగుతోడఁ,
గొమరు మే నొప్ప...కళా. ౪. ౯౬.

౨. (సం. కుమారః) పడుచువాఁడు; పడుచది.
గీ. పాటితూమున రసము దైవాఱఁ గొలిచి, కొమ
రుజంగమునకు నిచ్చెఁ గోర్కి తీఱ. హర. ౧.
౨3.

లయగ్రాహి. లేనికొమరుప్రాయము లేని చెలువంబు
ను...కళా. ౪.౪౯. (కొమరుందనము=యౌ
వనము.)

కొమరుమిగులు=అందగించు,ఒప్పు, చెన్నొందు.
సీ. చందురునుమఁ గాంతికం దెచ్చి కూర్చి బాగు
నకుఁ దెచ్చిన ట్లుగొమరుమిగిలి. భార. వి
రా. ౨. ౫౨.

సీ. రమణీయమాణిక్యరత్నహారంబులు మెడమీఁద

ములమీఁదఁ గొమరుమిగుల. విక్ర. ౧. ౭.
కొమరారు=కొమరుమిగులు.
(సూర్యోదయవర్ణనము) సీ. చక్రవాకద్వయసం
తతి యొఱకలకొమరారు కెంజాయఁ గ్రొత్తఁ
జేసి. భార. ఉద్యో. ౨. ౧౧౪.
సీ. కొండంతకల్మి చేఁ గొమరారియుండియు నుద
వాసమున నుండె నువిదకుచము,లు...చంద్రా.
౨. ౧౨3.
కొమరొందు=కొమరుమిగులు.
క. కొమరుం బ్రాయము మిక్కిలి, కొమరొందెడు
దినముఁ గ్రొత్తక్రొత్తగ నెలమిఁగ.కళా. ౪.
౪౬.
సీ. సర్వపర్వతకులసార్వభౌముం డనఁ గొమరొం
దుపడమటికొండదండ. విక్ర. ౨. ౧౦౨.
జ: కొమరుఁదనము, కొమరుఁబాయము.

క్రొమరు². వి. (చూ. కొమరేలు-సం. కుమారః.)
కుమారస్వామి.
క. కొమరు సా మన నేసాని కొమరుమిగులు ...
ఆం. సం. దేవ. ౧3. సాం. ని. దేవ. ౭.

కొమరుఁడు¹=కొమారుఁడు. (సం.కుమారః. ప్రా.
కుమారో.) ౧. పుత్త్రుఁడు, కొడుకు.
సీ. ... కన్నకొడుకు కొమారుఁడు కొమరుఁ డ
నఁగఁ బుత్త్రాభిధానంబు...ఆం.భా.౨.౧౧౧.
ద్వి. అమలకీర్తులఁ బుణ్యుఁ డగువిభాండకుని,కొ
మరుండ బుష్యశృంగుండు నాపేరు.రం.రా.
బాల. ౧౨ పా. ౨౪ పం.
౨. పురుషుఁడు, మగవాఁడు.
ఉ. కొండొకనేపు నిల్చి చనుకోరిక రాకొమరుం
డు...విక్ర. 3. ౭౭.
3. కౌమారవయస్సువాఁడు, యౌవనమునకు పూ
ర్వవయస్సువాఁడు. ఆం.భా. ౨. ౧౧౭.

కొమరుఁడు². వి. (సం. కుమారః) కుమారస్వామి.
క. కొమరుఁడు సామి కొంచమల గొట్టినజాణఁ

డు...బారకే,ళ్లమరినవాఁడు వా నగు గుహా ఖ్యలు...ఆం. భా. ౧. ౪౪.

**కొమరుఁదనము.** వి. (√కొమరు[1]) యౌవనము.
లయగ్రాహి ... తోఁచుఁగా, లేనికొమరుందనము లేనిచెలువంబు...కళా. ౪. ౪౯.

**కొమరుఁబాయము.** వి. (కొమరు+పాయము.) యౌవనము, పడుచుఁదనము.
వ. ... గాటంపుమరువాటలకుం దివురుకొమరుఁ బాయంపుండుటారికత్తియలును...నీలా. 3. ౧౦.
ఇట్లే: కొమరువాఁడు, కొమరుఁబ్రాయము.
మ. ...కొమరువాఁడే చెల్లె మా శైఖరుల్. కకు. ౪. ౨౬.
క. ... కొమరుంబ్రాయము మిక్కిలి, గొమరొం దెడు...కళా. ౪. ౪౬.

**కొమరులు.** వి. బ. మేలుదూలనుమీఁదిగుజ్జులు.
(శ. ర, బ్రౌ-కొమరలు అని వాడుక.)

**కొమరేలు.** వి. జై. (√కొమరు[2].) పేఠికాపురస మీపమునయుండు కుమారారామగ్రామమున నుం డుదివ్యవాహిని, స్వామిపుష్కరిణి.
సీ. కొమరేటికల్యాణకమలషండంబుల సౌరభ్య భారంబు సంతరించి. భీమ. ౨. ౬౨, ౬3.

**కొమారి**=కొమరిత.

(స్త్రీ)
గీ. ఆకొమిరెప్రాయపుమిటారిరాకొమారి,యడుగు లను వ్రాలి ... చంద్రా. ౪. ౧౯౧.

**కొమారిత**=కొమరిత.

(పుత్రిక, కూఁతురు.)
క. చెలువంబు గలకొమారిత,గలిగినయందులకు ఫ లము గాదే విభవో,జ్జ్వలమతిబలధృతిలీలా, కలితుఁడ పసునీకు నొసఁగఁ గాంచుట లనఁ గఁగా. సమీర. ౨. ౫3.
ఉ. ... బోటి వచ్చి యో,పల్లవపాణి నిన్నిలువఁ బంపిరి నన్నిట రాజు గారనం,బల్లకి యెక్కి యాదొరకొమారిత...పాంచా. ౨. ౧౦.

**కొమారుఁడు.** వి. (బ. కొమారులు,కొమార్లు)౧. కుమారుఁడు, పుత్రుఁడు.
సీ....కన్నకొడుకు కొమారుఁడు కొమరుఁ డనఁ గఁ, బుత్రాభిధానంబు... ఆం. భా. ౨. ౧౧౧.
మ ...తల్లిదండ్రుల్ మనం,బు విరాజిల్లఁగఁ గూడఁబెట్టినధనంబుల్ లోకమందుగా గొమార్లకు విగా కెవ్వరి పమ్మ...సారం౫. ౨. ౧౫.
౨. పురుషుఁడు, మగవాఁడు.
గీ. కన్య దనకంటె కింపైనధన్య నొకనిఁ, గోరికొ నుఁ గాక రాచకొమారులందు. భోజనుతా. ౨. ౫౨. కళా. 3. ౧3౦.

**కొమార్త**=కొమరిత.

(కన్య)
చ. చెలువలచెంతకుం జనియె సిగ్గులపెండ్లికొమార్త యయుంబలేక. కువల. ౨. ౨౫.

**కొమిరె.** వి. (సం. కుమారీ) ౧. కౌమారవయస్సున నున్న స్త్రీ, యౌవనమునకుఁ బూర్వవయస్సున నున్న స్త్రీ. ఆం. భా. ౨. ౧౦౬.
౨. యువతి, యౌవనము గలస్త్రీ.
క. అమరావతిఁ గలవేలుపుఁ,గొమిరెలలో నెల్ల రూపగుణశీలములం, గొమరారుదు...విక్ర. ౨. ౨౪౫.
ఉ. కొమిరెలు నీకు లేరె పది కోటులు వత్తురు కోరితేని...ఉ. రా. ౪. ౨౦౦.
3. కూఁతురు, పుత్రిక.
చ. కొమిరె మనోవ్యథం బొగుల గ్రుచ్చి కవుంగిటఁ జేర్చి తల్లి...వసు. 3. ౧౦౫.
౪. స్త్రీ.
గీ. మాను మీమోహ మని తెల్పి మానవేంద్రు, చిత్త మొగ్గించి యొకమాటఁజేసి రాచకొ

మిరె నిదురించుతఱి మందసమున నుంచి, వీడు వెడలించుకొని తెచ్చువేళ నెదుట. శుక. ౧. ౩౭౫.

విణ. యౌవనముగలది. (స్త్రీ)

వ... కొమ్మిరెహరిణలోచనలచలితకంకణసంకుల క్రేంకారంబు లానవామోదమేదురాళిఝుంకారంబులబింకంబు లడంప... ఆము. ౪. ౩౫.

**కొమ్మ**[1]=కొమ[1]. వి. (త. కొంబు, కొంబర్.) ౧. శాఖ.

సీ. అభ్రంకషాభోగ మగుమఱ్ఱికొమ్మను గట్టిన ప్రేవెడునుట్టి యెక్కి. విక్ర. ౨. ౪౪.

మ. హరిశౌర్యం డగురామభూవిభునితీవ్రాటోపవద్వాహినీ, శరవేగంబున నాత్మమూలబలము ల్లాఱ దళాడంబరం, బఱుగం గొమ్మలు వోవ లా పతి నిజామాదుల్ వజీరు ల్భజిం, తురు నమ్రత్వముఁ గానలో ముసలిమాను ల్గా వితర్కింపఁగ౯. పసు. ౧. ౪౫. ('పుత్రపౌత్రాదులు' అని ధ్వని.)

౨. (కోట గోపురము మున్నగువాని) శిఖరము, శృంగము.

సీ. చీలలు చెదరి బచ్చెన చిట్లి వానలఁ గూలు కొమ్మలతోడి గోపురములు. చంద్ర. ౩. ౪౮.

సీ. శ్రీకలితానూనచిత్రరేఖాయుక్తి కొమ్మలందును గోటకొమ్మలందు. విక్ర. ౭. ౧౩౩.

లయగ్రాహి. అన్నగముపై జరఠపన్నగపతిస్ఫటలన న్నెగసి కోటతుదల న్నెగడుకొమ్మల్. మనుచ. ౫. ౩౦.

జ: కొమ్మతిమ్మరి, కొమ్మదాసరి, కొమ్మమెకము, కొమ్మలువోవు.

**కొమ్మ**[2]=కొమ[2]. వి. ఆఁడుది, స్త్రీ; భార్య.

క. ఆమ్మేటివిద్య నాచే, నిమ్ముగ నంతయు నెఱింగి నృప నన్ను వివాహమ్మగు మనవుడు రెండవ, కొమ్మ మదిన్ బ్రేమ గడలుకొన నిట్లని యెన్. మనుచ. ౬. ౧౮.

గీ. సేవకులపాలిసురశాఖిపూవుఁగొమ్మ, కోమలార్ధేందుధరుకొమ్మ గోఁగులమ్మ. భీమ. ౧. ౯౮.

**కొమ్మచెట్టు.** వి. (√కొమ్మ[1]?) వృక్షవిశేషము. (దీని కఱ్ఱ కాఁగడావలె వెలుఁగును - బ్రౌ.)

**కొమ్మతిమ్మరి.** వి. (కొమ్మ[1] + తిమ్మరి) వానరము, కోఁతి.

గీ. మమ్ముఁ గొలువుము సుగ్రీవు మడిపి నీకుఁ, గొమ్మతిమ్మరివా డౌనగూడఁజేతు. అచ్చ. రా. యు. ౧౨౩. (శ. ర. పా.)

**కొమ్మదాసరి.** వి. (కొమ్మ[1] + దాసరి) ఊరినడిమి చెట్టెక్కి బిచ్చముకొఱకుఁ గేకలువేయు ఒకజాతి దాసరివాఁడు. (వా)

**కొమ్మనగొబ్బిపిండిచెట్టు.** వి. పూతికళీ. (శ. ర.)

**కొమ్మనగొలిమిడి.** వి. మూలఫలీ. (శ. ర.)

**కొమ్మనగోర.** వి. వృక్షవిశేషము. (శ. ర - ఉపలభేదకము, కొండపిండిచెట్టు. బ్రౌ)

**కొమ్మనఁటి**=కొమ్మనరఁటి. వి. (√కొమ్ము) - కొమ్ములవలె నుండుకాయలు గలఅనఁటి - కదళీవిశేషము.

గీ. పనసపండ్లీడపండ్లు కొమ్మనఁటిపండ్లు, కప్పురపుదబ్బపండులు నిప్పపువ్వు, మొదలుగాఁ గానుకలు పెట్టి ప్రోల నిలిచి, పలికిరి... రసిక. ౧. ౬౪.

**కొమ్మనరఁటి**=కొమ్మనఁటి. వి. (ఇది 'కొమ్మనగోర, కొమ్మనగులిమిడి' వంటిది.) కదళీవిశేషము.

ఆ. తోలఁగఁబెట్టి రోషకలికించితంబులోఁ, గొమ్మనరఁటిపండ్లు గూర్మిమఱఁది. నైష. ౬. ౧౩౯.

**కొమ్మమెకము.** వి. (కొమ్మ + మెకము.) శాఖామృగము, వానరము, కోఁతి.

క. అనిన విని రాముతమ్ముఁడు, పెన రోదవఁగ నత డిట్లు చెప్పెఁ బలికెన్, విను కొమ్మమె

కపుబలియుండ, గొనకొని మాచంద మెల్ల గులు తెలేఁగింతుక్. అచ్చ. రా. కిష్కిం. ౮.

కొమ్ములువోవు. అ. క్రి. (కొమ్ములు[1] + పోవు.) అతిశయిల్లు.

చ. ... రతికోర్కులు గొమ్ములువోవ... విభుండును వారిజపత్త్రనేత్రయుక్, గడపల లేనికేలితమకంబున నుల్లము లుల్లసిల్లఁగాక్. నిర్వ. ౮. ౭౩.

కొమ్మి. వి. అడవిలో పెరుఁగునొకవిధమైనఫలవృక్షము. (దీనిపూవులు సువాసన గలవిగను ఆకులు కఱకు గలవిగను ఉండును. బ్రౌ)

గీ. కొమ్మిపం డ్లీఁతపండ్లును గొంజిపండ్లు, మేడిపండ్లును మొదలుగాఁ గూడిమాడి, చెంచెతలు దెత్తు రిత్తు విచ్చేయుమయ్య. కళా. ౩. ౬౯.

సీ. మామిడికాయయు మారేడుకాయయుఁ గొండముక్కిడికాయ కొమ్మికాయ. గీ. ... అది, దైనయూరుఁగాయలు గల వతనియింట. హంస. ౪. ౧౩౫.

కొమ్ము. వి. (క. త. కొంబు) ౧. పశుశృంగము, విషాణము.

ఉ. కొమ్ములఁ గ్రుమ్ములాడు మదఘోరవృషంబుల మాడ్కిఁ బోరుచో ... ఉ. రా. ౩. ౨౫౦.

క. పొడ చెదరి బూది చటచిన, యొడళ్లతో నాల్గు రెండు నొకటియుఁ బ్రంగల్, విడలినకొమ్ములబరువున, నడుగిడఁగా లేవు బలిసి యందలిదుప్పుల్. మనుచ. ౪. ౨౧.

సీ. ...శృంగంబు కొమ్మనఁ జెలఁగుచుండు. ఆం. భా. ౨. ౨౬౨.

౨. ఏనుఁగుదంతము.

ఉ. కొమ్ములు ద్రుంపఁబడ్డనవకుంభివిధంబునఁ గూలెఁ గుంభినిక్. భా. రా. అర. ౧. ౨౨౪.

సీ. మదహస్తి నయినను చెదిరి కొమ్ములు పట్టి పదిలేఁబడఁ ద్రోచుసత్త్వములును. ని. కృ. ౧. ౭౭.

౩. పందికోఱ, వరాహదంష్ట్ర.

సీ. నీటిలో మునిఁగిన నేలచేడియఁ గొమ్మున నుబ్బ నెత్తినఘోణి వీవ. పారి. ౧. ౪౯.

౪. చోఱ మున్నగుచేఁపలముఖభాగమున అంచుమునలె నుండుఅవయవము.

సీ. తిమితిమింగిలముఖ్యదీర్ఘమత్స్యంబులఁ గొమ్మన గుములుగా గ్రుచ్చి యెత్తు. దశా. ౧. ౨౮౯.

సీ. బిరుదువజ్రపుగండపెండారమై మీఱఁ గొమ్మన శేషాహి గ్రుచ్చి యెత్తు. దశా. ౧. ౨౨౫.

౫. బాలచంద్రరేఖయందలి రెండుకొనలలో నొకటి.

సీ. వర్షగర్భము నడవకపోయె విదియలఁ గుముదాప్తుదారణకొమ్ము దలఁగె. కాశీ. ౩. ౧౪౯. (దారణకొమ్ము = వెలహెచ్చుతగ్గులను సూచించుకొన.)

౬. (విల్లు కావడిబద్ద తక్కెడదండె మున్నగువాని) కొన.

క. మృడుఁడు కనకాద్రిచాపము, గుడుసువడం దివియఁ గూడి కుశలప్రశ్నం, బడిగిరి యొండొరులను గని, కడకొమ్ముల నున్నయదితికద్రూతనయుల్. భీమ. ౪. ౧౩౪.

సీ. ధనువుక్రిందటికొమ్ము ధరణిపై మోపి మీఁదటికొమ్ము వామహస్తమునఁ బట్టి. భోజరా. ౫. ౨౭.

సీ. పెల్లులోహండికావళ్లకొమ్ముల వ్రేలుగిడ్డిమొత్తము నేతిలడ్డిగలును. ఆము. ౨. ౯౭.

౭. పసుపు లోనగువానినిడు పైనదుంప.

ఉదా: చాయపసుపుఁగొమ్ము, అల్లపుఁగొమ్ము, సొంటికొమ్ము, మొ.

౮. చిమ్మనగ్రోవి.

గీ. అనుమ నొకదిక్కు చేరి లావునను మీఱి, కొమ్ముదగఁ బూని యుడుపాళిఁ గోర్కి వాని, చలము దొరలంగ నాడు వెచ్చెలులఁ గదిసి, సఖులు సరసత జలకేళి సల్పి రపుడు. చంద్రా. ౪. ౨౮౭.

చ...జీవితేశసమితి గొమ్ములం గరచి చల్ల... ఆము. ౫.౧౧౩.

౯. (పర్వత) శిఖరము.

క. గుబ్బలికొమ్మెక్కటి గడు,నిబ్బరమునఁ బెఱికి యాతనికిన్ వైచిన వాఁ,డుబ్బు పెడక మల్ద్రిమ్మరి,బెబ్బులిపై మొనలవాలు పేర్చికిన్ వైచెన్. అచ్చ. రా. యు. ౭౮౧.

౧౦. కోటశృంగము, కోటకొమ్ము.

క. ఇమ్ముల నప్పురివప్రము,కొమ్ములపై నుండి పురముకొమ్ములు వేడ్కన్, దమ్ములచుట్టముపదజల, జమ్ములఁ బూజింతు రొగి నజస్రముఁ బ్రీతిన్. మొ. రా. బాల. ౪.

సీ...వరణశృంగ మ్మగుఁ గొమ్ము నా... ఆం. భా. ౨. ౧౨.

౧౧. కొమ్మ, వృక్షశాఖ.

ఉ. అం దొకకొండచేరువ సితాబ్జవనంబులతీరభూమి మాకందముకొమ్మునన్ బిగియఁ గాళులు రెండుఁ దగిల్చి వ్రేలుచున్, గ్రింద హుతాశనార్చుల నభేదమునం గబళించి మ్రింగుచు,న్నెందము కాంతి నొంద మహనీయతపంబొకఁ డాచరింపఁగన్. నిర్వ. ౧౦. ౭౧.

సీ. కలఁచుఁ బున్నాగంబు లలుఁగొమ్ముల మహోన్నతి గలయనభీకమతుల నైన. హ.న.౨.౧౮. (నలార్థమున)

౧౨. చెఱువుకోన, కలుఁజు, మరిగొమ్ము

వ. సుకుమారుండు చెఱువుకొమ్ముదాపలం బట్టుకొని విపినషండంబునడుము గాఁ బక్కణంబునకు దక్షిణంబుగా నొరసికొని పోయి ...శివరా. ౩. ౧౦౨.

గీ. చరమగర్వోన్నతము లురభ్రములు రెండు,చెఱువుకొమ్మునఁ గయ్యంబు సేయుచుండె. వేం. పంచ. ౧. ౭౩౨.

౧౩. ఆందోళికాదండము, పల్లకీ మున్నగువానికి ముందువెనుకల నుండుదండె.

సీ. అపరంజి మొసలివాయనుసులశిరసులోఁ గనుపులు తొమ్మిది గలుగుకొమ్ము,నలసూర్యపటము పొన్నొ లెంపుసరిగమేలుక్కట్టుపనుల హెచ్చు పట్టుఁగుచ్చు. రా. వి. ౨. ౪౩.

గీ...ఆందోళికకు సంజ్ఞ యందల మనఁ, గొఱలుఁ దదుభయదండంబు కొమ్మనంగ. ఆం. భా. ౨. ౭౦౧.

(వ్యవ) అనవారి ముందుకొమ్ము ముగ్గురును వెనుకకొమ్ము ఇద్దఱును పట్టి మోయుచున్నారు.

గీ. ఈచెలువ నన్నుఁ జేరన నింక నెపుడుఁ, గొమ్ముదించకయుందు నుడన్ము మీఱ. దశా. ౨. ౭౭౪. (కొమ్ముదించకయుండుట్=ఎప్పుడును అందలములోఁ బెట్టి మోయుచునే యుందును.)

౧౪. ఊఁదెడివాద్యవిశేషము.

మ...వేణుస్వనం,బులు గావించుచుఁ గొమ్ము లూఁదుచు...భాగ. ౧౦పూ. ౭౨౫.

క. కొమ్ములనినదమ్ములు శం,ఖమ్ములశబ్దములు...రా. పి. ౫. ౬౦.

సీ. కొమ్ము నా వాద్యభేదమ్మును శృంగ మా...ఆం. భా. ౩. ౫౨.

౧౫. గాండ్లవాఁడు బండము తగిలించుకొనుటకై నడికట్టునకు అమర్చినవంకరకొయ్య. (వా.)

౧౬. బలము, సేన.

క. కొమ్మా దానవనాథుని, కొమ్మాహవమునకుఁ దొలఁగె గురుజయము నై,కొమ్మా మెచ్చితి నిచ్చెదఁ,గొమ్మాభరణములు నీవు కోరిన నెల్లన్. భాగ. ౧౦ ఉ. ౧౯౭.

౧౭. ఉత్సాహము.

ఆ. అంత గోపసింహుఁ డసురకొమ్ములు పట్టి,ధరణిఁ ద్రొబ్బి త్రొక్కి దైత్యభటుల, కొమ్ము పీడ నురలకొమ్ము వర్ధిల వాని,కొమ్ము పెఱికి మొత్తి కూల్చె నధిప. భాగ. ౧౦ పూ. ౧౧౪౪.

౧౮. ...తెల్పు 'ఉ'కారచిహ్నము.

**క్రతుపతి.** సం. వి. ఇ. పుం. యజ్ఞకర్త, యజమానుఁడు.

**క్రతుభు(క్కు)జుఁడు.** సం. వి. జ్. పుం. దేవత, జన్నపుఁదిండి.

**క్రతురాజము.** సం. వి. అ. పుం. ౧. రాజసూయము. ౨. అశ్వమేధము.

**క్రతురాట్టు(టు).** సం. వి. జ్. పుం=క్రతురాజము.

**క్రతువిక్రయి.** సం. విణ. (న్. ఈ. న్) ధనమును దీసికొని క్రతుఫలమును ఇతరులకు ధారపోయువాఁడు.

**క్రతువు.** సం. వి. ఉ. పుం. ౧. యజ్ఞము. ౨. విష్ణువు. ౩. ఒకానొక ప్రజాపతి.

**క్రథత్.** సం. శత్రు. హింసించుచున్న.

**క్రథనము.** సం. వి. అ. న. ౧. హింస. ౨. ఛేదనము, నఱకుట.

**క్రథనీయము.** సం=క్రథితవ్యము.

**క్రథిత.** సం. విణ. (బు. త్రీ. బు.)=క్రాథకుఁడు.

**క్రథితవ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) హింసింపఁదగినది.

**క్రథ్యమానుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) హింసింపఁబడుచున్నవాఁడు.

**క్రథ్యము.** సం=క్రథితవ్యము.

**క్రన్న**=క్రన్నన. క్రి. విణ. ద్రు. ౧. శీఘ్రముగా.
తరల. తరుణి ద్రౌపది యిట్లు పాండవధార్తరాష్ట్రుల
దైనఫీ,కరపరస్పరకోపవేగము గ్రన్నఁ బాచి విపత్తిసా,గరనిమగ్నుల నుద్ధరించె...నిజేశుల... భార. సభా. ౨. ౨౬౮.

౨. పిమ్మట.
గీ...మున్ను తనొట్టు,పడియెనో నన్ను మనోట్టువడి విభుండు, గ్రన్న [illegible]

నో యన్న వాకు, సెలుఁగఁ జెప్పుము దీని నీ వెఱుఁగుదేని. భార. సభా. ౨. ౨౦౯.

౩. మరల.
ఆ. ఇన్న కేంద్రుచేత మున్న గృహీతమై, యున్న నాకరంబు గ్రన్న నింక, నోరులకర్ణ మగును... భార. ఆది. ౩. ౧౬౮.

**క్రన్నన**=క్రన్న.
(శీఘ్రముగా, చయ్యన.)
గీ... క్రన్నన నవ,నవ్వళి మన బిరాన నా నొవ్వుచుండు, ఝుడితిపదతుల్యములు గాను జంద్రనూళి. ఆం. భా. ౩. ౭౧.

(పిమ్మట)
మానిని. కన్నుల నివ్వులు రాలఁగ నిట్లను గర్వమునన్విహాగాధమ నీ,యన్నకు మృత్యువు నన్ను సెఱుంగవె ప్రాణము లిప్పుడు వ్రాల్చెద నం,చున్నతశాతకృపాణము ద్రిప్పుచు నుగ్రతఁ దాఁకిన నిద్దఱకుక్, గ్రన్నన శక్రసుపర్ణులకయ్యము కైవడి ఘోరరణం బొదవెన్. మార్క. ౧. ౩౭.

**క్రమకము.** సం. విణ. (అ. మికా. అ) ౧. సక్రమము, క్రమము కలది. ౨. పోవునది, వెళ్లునది.

**క్రమకుఁడు.** సం. వి. అ. పుం. ౧. వేదమందలి క్రమపాఠమును దెలిసినవాఁడు. ౨. వేదమందలి క్రమపాఠమును జదువుచున్నవాఁడు. (కల్ప)

**క్రమణము.** సం. వి. అ. పుం. గుఱ్ఱము. న. ౧. పాదము. ౨. పాదవిక్షేపము, అడుగిడుట. (శే. ని.)

**క్రమము.** సం. వి. అ. పుం. ౧. అడుగిడుట, పాదవిక్షేపము. ౨. అడుగు. (శే. ని.) ౩. జరుగుట. (ఉదా: కాలక్రమము) ౪. వరుస. ౫. అనుష్ఠానము, ఆచరణము. (శిశు. ౧౪. ౫౩. వితతక్రమే =విస్తృతానుష్ఠానే-మల్లి. వ్యా.) ౬. కల్పము, విధి. (మే. ని-శే. ని.) ౭. ఆఱుముట, ఆక్రమించుట. ౮. బలిమి, శక్తి, సామర్థ్యము. (వి. ని.)

౯. పద్ధతి, ప్రకారము, విధము.

(శ్లో.) నేత్రక్రమేణోపరురోధ సూర్యమ్. సం.రఘు.౭.౩౯.(నేత్రక్రమేణ=బట్టవిధమున)

సీ. వల్లంబు పోనాడు వైశ్యునిశేవను గాలు గాలి నపిల్లి క్రమము దోఁప... గీ. ఎనసి చరియించు వీట నాహేమరేఖ. హంస. ౧. ౨౨౦.

౧౦. ఒకవిధ మగువేదపాఠము. ౧౧. విన్యాసము. (వాచ.) ౧౨. కంపము, వణఁకు. (వి. ని.)

**క్రమించే**=క్రమియించే. సం. స. క్రి. ౧. అతిక్రమించు, దాఁటు.

శా. మందాక్షాంచలము ల్గ్రమించి కులధర్మస్రోతసుల్ దాఁటి తన్నిండాభీతిమహాటవు ల్గడచి పొందెన్ బుంశ్చలీకోటి నిస్సందేహస్ఫురణ న్భుజంగనివసత్సాంకేతికస్థానముల్, కందర్పుం డనుమంత్రదేవత సమాకర్షింపఁగా నయ్యెడన్. అని. ౩. ౧౮.

౨. చంపు.

సీ... ఆచక్రధరుని,జర యనురాక్షసి నెరవునఁ బట్టి క్రమింపఁ బోం డని చెప్పి ... భార. మా. ౧౦.

౩. కడపు, వెళ్లఁబుచ్చు.

మ. ఘనవిష్ఠన్ జలపాయియై పటుతటిత్కాంతిచ్ఛటన్ జెంజడల్,దనరన్ మించె సహస్రవర్షము లనంతక్షాంతివాతాశనం,బున వేయేండ్లు క్రమించె మే నచలముల్ బోలన్నిరాహారుఁడై,తను వాశింపక యేండ్లు వేయుఁ గడపెన్ దైత్యలోక్య మారా యనన్. ఉ.రా. ౧. ౨౧౮.

ఉ. చిత్తము వంచుటో హరి భజించుటో బంధము లూడ్చ ధైర్యపుం,గత్తి ధరించుటో నియతి గైకొని మించుటొ యార్తిఁ గాంచుటో, చిత్తజరోగముల్ పెనుచు నీ కనుమాలపుఁ దోలుబొమ్మతో,హత్తుట ... మ్ములు మూఁడు వితా క్రమించితిన్. సమీర. ౩. ౨౮౯.

**క్రమికము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. క్రమముగా వచ్చినది. ౨. వంశపరంపరగా వచ్చినది. (వాచ.)

(క్రమిత,క్రామత్ మొదలగురూపములు 'అతిక్రమిత, అతిక్రామత్' మొదలగురూపములవలె గ్రహించునది.)

**క్రమియించే**=క్రమించే. సం. స. క్రి. (అతిక్రమించు, దాఁటు.)

ఉ... అవ్వీరుఁడు ద్వారషట్క మతివేగమునన్ గ్రమియించి సప్తమద్వారము నేరఁగాఁ జని ప్రధానుఁడు చెప్పినయట్ల యచ్చటన్. ఉ. రా. ౮. ౯.

(కడపు, వెళ్లఁబుచ్చు.)

చ... ఇంచుకయుఁ గంటికిఁ గూరుకు రాక శయ్యపైఁ, బొరలుచు లేచుచున్ మరలఁ బొందుచుఁ గూర్కొ...కభంగి నవ్విభావరిఁ గ్రమియించె రావణుఁ డవారితశోకసమాకులాత్ముఁడై. భా. రా. యు. ౭౩౦.

**క్రముకము.** సం. వి. అ.పుం. ౧. గువాకము,పోఁకచెట్టు. ౨. ఎఱ్ఱలొద్దుగు చె. ౩. గంగరావి చె. ౮. నాగముస్తె చె. ౫. ప్రత్తిచెట్టు. న. పోఁకకాయ.

**క్రముఁవు.** సం. వి. ఉ. పుం. పోఁకచెట్టు.(వాచ).

**క్రమేలకము.** సం=క్రమేలము.

**క్రమేలము.** సం. వి. అ.పుం. ఉష్ట్రము, ఒంటె.

**క్రమ్మన**=గ్రమ్మన. అవ్య. ద్రు. శీఘ్రముగా.

గీ... పుడమి పగులఁ, బెల్లగిలి కూలెఁ దరువులు గొల్ల లెల్లఁ, గూడఁబడి రట్టు కొందఱు గోపసతులు, చూచి క్రమ్మనఁ బాతి యశోద ... పూ.౫. ౨౮౩.

క. తమ్ముఁ తో నపు డాస్థా,నమ్మునఁ గొలువుండి
ధర్మనందనుఁడు క్రమ్మో,దమ్మునఁ దమ్ముఁడ
రమ్మని, క్రమ్మఱఁ గదియంగ భీముఁ గౌఁగి
టఁ జేర్చెన్. జై. భా. ౩.౫.

చ. చనుగొడ దాని మన్మథశిలాచము సోఁకిన నొ
చ్చె నంచుఁ దూ,యని కలఁడూఱుఁ దూపా
డిచి యల్లనఁబుప్పొడి రత్నవెట్టి క్ర,మ్మఱ నధ
రామృతంపుఁబలుమం దొకయించుక యిచ్చి
మించులం, బొనరినచూపులం బడిసిపోనటు
వైచుచుఁ గౌఁగిలించుచున్. విక్ర. ౭.
౫౯.

క్రమ్మఱ, క్రమ్మఱఁగ. అవ్య. దే. (√ క్రమ్మఱు) ౧. పునరర్థకము, మరల.

క. క్రమ్మఱ రథ మెక్కి బలి,ష్ఠమ్మగుచాపంబు
దాల్చి సంకర్షణుఁ డ,స్త్రమ్ములు పఱఁగించి ర
ణా,గ్రమ్మునఁ బలువురఁ బధించెఁ గాశ్యులఁ
గడిమిన్. హరి. ఉ. ౩. ౧౨౫.

క. ... చచ్చి క్రమ్మఱఁ,బుట్టినచందమున... వై
ప. ౨.౪. ఆం. భా. ౩. ౬౯.

౨. వాక్యాలంకారము.

క. ...సురముని, క్రమ్మఱ నాకస్మికమ్ముగా నచ్చె
టికిన్.

క. చనుదెంచి యమ్మురారికి...ఒక్కదివ్యకుసుమ
మ్మొసఁగెన్. పారి. ౧.౮౫, ౮౬.

క్రమ్మఱి. అవ్య. (√ క్రమ్మఱు) పునరర్థకము, క్రమ్మఱ, మరల.

గీ. మగుడఁ గ్రమ్మఱఁ గ్రమ్మఱి మరల సారె, వెం
డి మాటికిఁ దిరుగ నా వెలయును బున,రర్థక
ముగ...ఆం. భా. ౩. ౬౯.

క్రమ్మఱించు=క్రమ్మఱుచు. స. క్రి. (√ క్రమ్మఱు.) మరలించు, త్రిప్పు.

ఉ. ...విప్రుఁ డొకఁ డో,యం దతికాంతుఁ డ
య్యొ నరపాలుఁడు శాపము గ్రమ్మఱింపఁ
గన్. భార. ఆది. ౧. ౧౦౧.

చ. అనిలజవంబునం బఱచు నమ్మదనాగ మెదిర్చి
క్రమ్మఱిం,చినఁ బరికాఁడపోలెఁ గురుసింహావ
రూథము నిట్లు గ్రమ్మఱిం,చుచు నితఁ డం
చునుం దగిలి చూపఱు సాళ్వమహీశువిక్ర
మం, బొనరఁగ నగ్గడం బొగడుచుండిరి విస్మ
యాసక్తచిత్తులై. భార. ఆది. ౪. ౨౦౬.

సీ. పురికిఁ జోరికండర్లై పోయిన మనభానుమతిఁ గ్ర
మ్మఱించినయతఁ డితండు. రాజ. చ. ౨.౧౧౨.

సీ. రోసారుణాక్షులరుచులను సిందూరకాంతి
యు రవిదీప్తిఁ గ్రమ్మఱింప. భార. విరా. ౩.
౧౬౪. (ఇట ఔపమ్యద్యోతకము.)

క్రమ్మఱిల్లు(లు)=క్రమ్మఱు. (√ క్రమ్మఱు)
(మరలు; మరలివచ్చు.)

చ. పఱచిన దేవకీసుతుఁడు పక్కన నవ్వినఁ గ్ర
మ్మఱిల్లి మైఁ,దఱచుగ రోమహర్షణ ముదంచి
తభక్తిభరాకులత్వ మే,ర్పఱచుచుఁ గేల్మోగి
డ్చి పలుపల్కులతళ్కులసన్నవెన్నెలన్, బ
ఱపుచుఁ బ్రస్తుతించె మునిబంధవిభంజను భ
క్తరంజనున్. పాండు. ౪. ౭౦.

ఉ. గౌరి వివాహమై కుసుమకార్ముకుఁ గ్రమ్మఱి
లంగఁ జేసి బృం,దారకవర్గము న్నిజపథంబు
న కన్పి హిమాచలంబుపైఁ,బారిషదవ్రజంబు
దను భక్తి భజింపఁగ నాదరించె సం,సారసు
ఖంబు శంకరుఁడు...హర. ౫. ౩.

వ. అతిపరుషపవనసంపాతాహతం బైన దీపంబు
నుంబోలె నీపరమమిత్త్రుండు క్రమ్మఱిలండుఁ
నుమ్మి. హర. ౩. ౯౩. (పై రెం డుదాహరణ
ములందును 'పునర్జీవితుఁ డగు' అని భావము.)

క్రమ్మఱు. అ. క్రి. నివర్తిల్లు, మరలు; మరలివచ్చు;
మరలిపోవు.

మ. కఱచున్ దవ్వుగఁ జేయలంతి నిలుచుం బట్టీ
క యాసాసలం, బిఱువోవున్ ... క్రమ్మఱి
చూచుం జెవి దార్చి నిల్చు...మాయామృగం
బిట్టులన్. భార. అర. ౬. ౩౨౪.

ఉ. అమ్మెయిన సొచ్చుచొప్పు తెలియక విశేనం
తియకాని యిమ్ములం, గ్రమ్మఱుభంగి వాఁడు
వినఁగానఁడు...భార. ద్రో. ౨. ౨౩౫.

క. ఈవేళ బలియు నతనిం, బోవిడిచితి పొమ్ము
పాడిఁ బోయినరాజ్యం, బేవిధిఁ గ్రమ్మఱు
నా వెర, వీ వెర వని వ్రేలు మడఁచి యేర్పడఁ
జెపుమా. అము. ౩. ౪౪.

గీ. ఎలమి నెవ్వనిగృహమున కేఁగుదెంచి, యఫలి
తాశుఁడై క్రమ్మఱు నట్టిచుతిథి, తనదుదుష్కృ
త మాగృహస్థునకు నిచ్చి, యతనిసుకృత మం
తయుఁ గొని యరుగుఁ బుత్ర. మార్క. ౩.
౧౫౯.

మ. ... నీకు నెంతటివాఁడైన నెదిర్చి ప్రాణము
లతోఁ దాఁ గ్రమ్మఱఁ డేమి ప్ర,స్ఫుట
మోభూప యరాతిచేష్టలు భవద్భ్రూభంగప
ర్యంతముల్. రాఘవ. ౩. ౧౦౯.

జ: క్రమ్మఱు,క్రమ్మఱి, క్రమ్మఱించు, క్రమ్మఱిల్లు,
క్రమ్మఱుచు.

క్రమ్మఱుచే=క్రమ్మఱించే.

(మరలించు, త్రిప్పు.)

చ. అక్కజ మైనచెల్వమున నాత్మకు వ్రేఁగయి
పొల్చుపాల్ర్తిపై, నెక్కొనుచూడ్కిఁ గ్రమ్మ
ఱుప నేరక యూరక నిల్చె...భార. విరా.
౨. ౨౩.

గీ.అనుటయును వార లామాట లాదరించి, క్రమ్మ
ఱుప రాదు పలు కమోఘమ్ము మాకు. భీమ.
౪. ౧౮౯.

ఉ. ...ధర్మనందనుఁడు గ్రమ్మఱిచెన్ యదువీర
కోపముల్. భార. అర. ౩. ౧౭౦. (ఉపశమి
ల్లఁజేయు అని భావము.)

క్రమ్మించే. స. క్రి. క్రమ్మఁజేయు. (√క్రమ్ము)

(వ్యాపింపఁజేయు.)

సీ. కౌదమగుబ్బలదానిఁ గ్రొమ్మించుఁ గ్రమ్మించునె
మ్మెనినిగనిగన్నిగలదాని. దశా. ౨. ౧౧.

సీ. వెలిదాలు గ్రమ్మించువిచ్చుకత్తులవేల్పుమూఁ
క లెల్లెడలఁ గ్రమ్ముకొని నడువ.దశా.౨.౧౯.

క్రమ్ము. అ. క్రి. ౧. వ్యాపించు, ప్రసరించు; ప్రవ
హించు; కాలు.

చ. కరమున నున్నశూలమునఁ గ్రమ్ము మెఱుంగు
లు శత్రుసైన్యభీ,కరములు గా...భార.భీష్మ.
౩. ౧౦౮.

ఉ.. రక్తజలంబు పైపయిం, గ్రమ్మఁగఁ గూలె
...భా. రా. అర. ౨. ౩౯౧.

క. గ్రమ్మన నెత్తురుటేఱులు, గ్రమ్మ నఖండప్ర
చండకాలానలకీ,లమ్ములఁ దెగడు మెఱుఁగువా,
లమ్ముల నక్షౌహిణీత్రయము మడిమించెన్.
జై. భా. ౭. ౧౬౧.

గీ. రమణి పొరిఁబొరిఁ గన్నీరు క్రమ్మఁ జొట్టు, మె
లఁగి కాకుల గ్రద్దలఁ దోలఁగ నడుచు,చున్న
యది...భార. స్త్రీ. ౨. ౬౪.

౨. కవియు, పైఁబడు; పడు.

క. పతి పురికొలిపిన నమవస,నతిశయముగఁ బొం
గుజలధి యనఁ గ్రమ్మినయు,ద్ధతబలము నిలిపె
నమ్మా,రుతి సెలియలికట్టక్రియ నిరూఢస్థితి
రైు. భార. భీష్మ. ౨. ౨౧౭.

ఉ. తోరపుటుక్క నారిపులు దొమ్మిగఁ బైపయిఁ
గ్రమ్మ వారి లీ,లారణవృత్తిఁ గిట్టె...రాఘవ.
౨. ౨౧.

౩. ఉబుకు.

గీ. ఆరమాకాంతరూపరేఖాతిశయముఁ, గాంచు
వారి కప్పు డంతరంగమున నిండి, వెలికిఁ గ్ర
మ్మినయనురాగజల మనంగ,స్వేద మానంద
బాష్పముల్ చెలువమయ్యె. దశా. ౨. ౨౬౩.

౪. అతిశయించు, అధిక మగు.

క. గొనయంబు నెక్కఁ ద్రోచిన, గనయంబున శ
క్కుకున్నఁ గ్రమ్మినతమకం,బున విల్లు విడిచి
వేటాక,యనిమిషభటుఁ డనికి వెడలె నడిద
ముఁ గొనుచున్. పారి. ౪. ౭౧.

౨. కలుగు, పుట్టు.

సీ. ఒకసింహ ముగ్రమై యుటికి గుత్తమ్ము నాతనిఁ జంపి బలుకండ యనుతలంపు, గ్రమ్మ రత్నము నోరఁ గబళించునంతలో నేతెంచి మృగపతి నెలుఁగుఱేఁడు, జాంబవంతుఁడు మహాసత్త్వుండు వధియించి...హరి. పూ. ౩. ౧౭౭.

చ. మలయసమీరణాభిహతి మ్రాఁకుల నాకులు డుల్లిడుల్లి...కుట్మలములు గ్రమ్మి గ్రమ్మి...కు. సం. ౪. ౪౪౩.

స. క్రి. ౧. కలియు, కూడు.

మ. మతిఁ గ్రీడారతి గ్రాలెనేని సకలక్ష్మాపుణ్యదేశాళి గాంచి తపస్స్ఫూర్తి మెయిం గృశించి వనరాశిం జెందుమాబోంట్ల నుద్ధతిచేఁ గ్రమ్మఁగ నేల నీకుఁ గఱవే తారుణ్యలావణ్యజృంభితరంభాదినిలింపభామ లన భూభృన్మాళి రాగాంధుఁడై. వసు. ౨. ౧౩౬.

౨. (ప్రత్తులు ఱెక్కలతో గ్రుడ్లను) కప్పు, పొదుగు.

ఉ. తమ్మి పతంగపత్ని తమిఁ దాల్చినపాండురకోరకాండముల్, గ్రమ్మి నిమీలితచ్ఛదపరంపరచేఁ బ్రసవాప్తి వేళ రా, నిమ్ముగ వాని నొయ్య విరియించిన హేతుగుణాప్తిఁ బాంథవ, గ్రమ్ముల నేఁచు తేఁటిపిలుక ల్వెడలెన్ సహజాసితచ్ఛవిన్. వసు. ౪. ౧౩౪.

౩. ఆవరించు, చుట్టుకొను.

గీ. పొదివెఁ గవిసెను గ్రమ్మె నాఁ బోలుచు నావరించె ననుమాట గాను...ఆం. భా. ౩. ౧౧౭.

౪. చుట్టు.

(రథవర్ణనము) సీ. జత గూర్చి తారవజ్రాలఁ బమ్మి నకమ్మి గ్రమ్మినమణిరథాంగములగములు. వసు. ౧. ౧౪౪.

జ: క్రమ్మించు, క్రమ్ముకొను, క్రమ్ముదల, క్రమ్ముదెంచు, క్రమ్మువడు.

**క్రమ్ముకొను.** అ. క్రి. (క్రమ్ము + కొను-స్వార్థమున.)

(మూఁగు)

సీ. దర్పకు నెఱకొతుఁదనము పేర్మికిఁ గ్రమ్ముకొను సతేజఃకీర్తిఘనము లనఁగ... గీ...జలదపథమున నుండి భూస్థలికి డిగ్గు హంసములు వర్ణనాసీమ నలకరించె. ప్రభా. ౨. ౪౧.

**క్రమ్ముదల.** వి. (√క్రమ్ము) ౧. క్రమ్ముట. (శ. ర.)

౨. కప్పట, మఱుఁగుపఱచుట. (బ్రౌ.)

**క్రమ్ముదెంచు.** అ. క్రి. (క్రమ్ము+తెంచు- స్వార్థమున) క్రమ్ము.

(వ్యాపించు.)

(నృసింహవర్ణనము) సీ. ప్రళయాభ్రచంచలాప్రతిమభాస్వరములై ఖరనఖరోచులు గ్రమ్ముదేర. భాగ. ౭. ౨౯౧.

(త్రోసికొనివచ్చు.)

చ. కనుఁగొని దర్పమంథరముగా నతఁ డిట్లనుఁ బాండవాగ్రజన్మునకు వడిం బెనంగఁగ ననుం బవనాత్మజుఁ జూచు వేడ్క నిజ్జనతతి యంత కంత కిటు సందడిగాఁ దనయిచ్చఁ గ్రమ్ముదెంచునో యుపవేశనిశ్చలతఁ జూచిన మే లఖిలప్రియంబుగన్. భార. శల్య. ౨. ౨౩౧.

(ఉబుకు)

గీ. గాఢసంస్పర్శభంగులు గలుగునట్టి, హోమసమయకృత్యంబుల నొదవి సౌఖ్యరసము పెన్నిట్టి పొరిఁబొరిఁ గ్రమ్ముదేర, సమ్మదాంబుధిఁ దేలిరి సతియుఁ బతియు. భార. విరా. ౫. ౪౦౨.

(వెడలు, ఉద్గత మగు)

చ. బెగడక శూల మెత్తికొని భీమతరంబుగ నోర మంటలుం, బొగలును గ్రమ్ముదేర మును బోరన మృత్యువు వచ్చి ... భా. రా. యు. ౧౪౨.

**క్రమ్మువడు.** అ. క్రి. (క్రమ్ము+పడు.)

(మూఁతపడు.)

గీ. ఘనుఁడు గృహమేధి పెరటిలోఁ గ్రంతఁ జూచి, క్రమ్మువడ మంచి దోశ లేఁగుకొమ్మ పే... భృత్యునిఁ బలుకంగ నంబుజా-

క్షి, వానిగొడ్డలి వడబావిలోన వైచె. గంధ. ౬౬.

**క్రయణము.** సం. వి. అ. న. కొనుట, విలుచుట.

**క్రయణీయము.** సం = క్రేయము.

**క్రయపత్త్రము.** సం = క్రయలేఖ్యము.

**క్రయపెట్టు.** మి. స. క్రి. (క్రయము + పెట్టు) వెలకు పెట్టు, అమ్మఁజూపు.

సీ. పొరుగూళ్లఁ గలమాన్యభూముల ధాన్యంబుఁ క్రయపెట్టి విడుచు...నిరం. ౨. ౨౬.

**క్రయము.** సం. వి. అ. పుం. ౧. వెల. ౨. (వెల యిచ్చి) కొనుట, కొనుగోలు.

**క్రయలేఖ్యము.** సం. వి. అ. న. క్రయమును సూచించుపత్త్రము.

**క్రయవిక్రయికుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) క్రయవిక్రయములచే జీవించువాఁడు.

**క్రయారోహము.** సం. వి. అ. పుం-కొనుటకు వచ్చుచోటు-హట్టము, అంగడివీథి.

**క్రయించే.** సం. స. క్రి. (సరకును వెలయిచ్చి) కొను, విలుచు. (శ.ర)

**క్రయికుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) (సరకును వెలయిచ్చి) కొనువాఁడు, విలువకాఁడు. (వై. ని.)

**క్రయ్య = కయ్య.**

(కుల్య, కాలువ)

ఉ. ... కృత్తవానరశిరశ్చరణాదులు నేమిఘట్టనం, గ్రయ్యలు గట్టి యున్నరుధిరస్థలులుం బతితాస్త్రసంస్తులుం, గయ్యపునేల సుగ్రగతిఁ గానఁబడం దలుచయ్యె నెంతయుఁన్. భా. రా. యు. ౬౯౭.

ఆ. అధికబలము గల్చి యవనీపతులు గొంద, అతివిహీనరిపులయాక్రమమున, మడిసి రకటజలధి వెడలి సన్నపుఁగ్రయ్య, మునిఁగి రూపడంగుజనులమాడ్కి. భార. సౌ. ౨. ౧౩.

క్రయ్యూట = కాలువయూట, కాలువనీరు.

ద్వి. ఇందులక్రయ్యూట లీప్సితార్థంబు, లంది చ్చరసరసాయనసుధావారి. పండితా. పర్వ. ౩౧౩ పొ.

**క్రయ్యఁబడు.** అ. క్రి. (క్రయ్యన్ + పడు-స్వార్థమున) ౧. కలియఁబడు; చొరఁబడు.

క. నెయ్యమున నడిగిపుచ్చుట, యియ్యకొనక యర్థ మీక యీర్ష్యాపరుఁడై, కయ్యమున గలిచి కన్యకఁ, గ్రయ్యంబడి చేసికొనిన రాక్షస మయ్యెన్. విజ్ఞా. ఆచా. ౧౦౦. (బలాత్కారము గా అని భావము.)

క. ఒంటి చరింపకు పొలమున, నింటికిఁ గడుఁబ్రొద్దు గలుగ నేతెంచుచు రా, వెంటఁబడి పొడుచుగోవుల, జంటఁ జనకు క్రయ్యఁబడకు సందడి యగుచోన్. భోజరా. ౬. ౩౨.

౨. కలియు, కూడు.

క. వెయ్యేండ్లయ్యెను సీతోఁ, గ్రయ్యంబడి యున్నవాఁడ...భాగ. ౯. ౫౭౭.

**క్రయ్యఁబాఱు.** అ. క్రి. (క్రయ్యన్ + పాఱు) కలయఁబాఱు.

(గంగ) వ... మానిని యన లోఁతు సూపక గరిత యన సడిచప్పుడు సేయక ముగుద యన బయలుపడక ప్రమద యనఁ గ్రయ్యంబాఱుచుఁ బతివ్రత యన నిట్టట్టు చనక...ప్రవహించి. భాగ. ౯. ౨౩౦.

**క్రయ్యము.** సం. విశే. (అ. ఆ. అ) కొనుటకు అంగడియందు సిద్ధపఱుపఁబడినది.

**క్రయ్యు.** అ. క్రి. కలియు.

(గంగావర్ణనము) వ ... ముద్దుఁజందురుతోడ నెయ్యంబునఁ గ్రయ్య నడరి చొప్పు దప్పక సాగి చనుదెంచుసుధార్ణవంబుకై వడిఁ బెంపు గలిగి...భాగ. ౯. ౨౩౦.

జ: క్రయ్యఁబడు, క్రయ్యఁబాఱు.

**క్రల్లపడు.** అ. క్రి. దగ్ధమగు, కాలు.

క. తరు లెల్లఁ గ్రల్లపడఁగా, విరళములై నీడ లున్నవిధ మెప్పె వహ్నిస్ఫురరుచులతోడఁ దలపడి,యరవరలై తుమురుతుమురులై పడినక్రియన్. హరి. పూ. ౬. ౩౬. (శ. ర. పా.)

**క్రవ్యఘాతనము.** సం. వి. అ. పుం-మాంసముకొఱకు చంపఁబడునది-లేడి, జింక.

**క్రవ్యము.** సం. వి. అ. న. మాంసము, పొల.

**క్రవ్యాత్తు.** సం. విణ. (ద్) మాంసమును తినువాఁడు. వి. ద్. పుం. ౧. రాక్షసుఁడు. ౨. మాంసమును తినుజంతువు. (పులి, గ్రద్ద, మొ.)

**క్రవ్యాదము.** సం. వి. అ. పుం. ౧. మాంసమును తినుజంతువు (పులి, గ్రద్ద, మొ.) ౨. రురువు, నల్లచాఱలు గలదుప్పి. (కల్ప.)

**క్రవ్యాదుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) మాంసమును తినువాఁడు. వి. అ. పుం. రాక్షసుఁడు.

**క్రవ్యాశి.** సం. విణ. (న్. నీ. న్.) వి. న్. పుం= క్రవ్యాత్తు.

**క్రశితము.** సం. విణ. (అ. ఆ. అ.) కృశీకృతము, కృశింపఁజేయఁబడినది.

**క్రశిమ(ము).** సం. వి. న్. పుం. కృశత్వము, బక్కటిల్లుట.

**క్రష్ట.** సం. విణ. (ఋ. ష్ట్రీ. ఋ.) ౧. కృశించువాఁడు. ౨. లాగువాఁడు. ౩. దున్నువాఁడు.

**క్రష్టవ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. దున్నఁదగినది. ౨. లాగఁదగినది.

## క్రా

**క్రాంతదర్శి.** సం. విణ. (న్. నీ. న్.) ఇంద్రియాతీతవిషయజ్ఞానము కలవాఁడు, సర్వజ్ఞుఁడు.

**క్రాంతము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. పోయినది, వెళ్లినది. ౨. ఆక్రాంతము, వ్యాప్తము. శకు. ౪. ౩. వి. అ. పుం. గుఱ్ఱము. వ. ౧. పోవుట, వెళ్లుట. ౨. అడుగు, చరణము. ౩. (జ్యోతి) ఏకనక్షత్రమున చంద్రునితో మఱియొక గ్రహము కలియుట.

**క్రాంతి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. పోవుట. ౨. అడుగిడుట, పాదవిక్షేపము. ౩. మీఱుట, అతిశయించుట. ౪. అణుచుట, ఆక్రమించుట. ౫. ఖగోళమండలిసూర్యమార్గము.

**క్రాంతికక్షము.** సం. వి. అ. పుం. ఖగోళమండలి సూర్యమార్గము.

**క్రాంతిమండలము.** సం. వి. అ. న= క్రాంతికక్షము.

**క్రాంతివలయము.** సం. వి. అ. న. పుం= క్రాంతికక్షము.

**క్రాంతివృత్తము.** సం. వి. అ. న= క్రాంతికక్షము.

**క్రాఁక**= కాఁక. (√ క్రాఁగు-శ. ర.)

**క్రాఁగు**= కాఁగు. అ. క్రి. ౧. దగ్ధమగు, కాలు; తపించు, మండు; పరితాప మొందు.

ఉ. గౌరవకోటి దర్పమునఁ గానక నిన్నుఁ బరాభవించి దు,ర్వారభవత్ప్రతాపశిఖిఁ గ్రాఁగెదరిక్ వగఁ పేల దీనికిన్. భార. శాం. ౧. ౫౩.

క. ఈగంగాదికతీర్థము, లీఁగంగా నీవు తమసమిద్ధాంబువులం, దోఁగెడువారల గనఁగనఁ, గ్రాఁగెడునంగారసింధుకల్లోలములన్. పాండు. ౧. ౧౫౦.

సీ. పరదేసులై భూమిఁ దిరిగెడివారును గతి లేక యాఁకటఁ గ్రాఁగువారు. వి. పు. ౪. ౧౫౪.

౨. పోవు, నశించు.

ఆ. కడుఁ బ్రసిద్ధ మిదియుఁ గర్కోటకుని దమ, యంతిఁ బుణ్యమూర్తి యైననలుని, నుతచరిత్రుఁ డైనఋతుపర్ణుఁ గీర్తింపఁ, గలిభయంబు లెల్లఁ గ్రాఁగు నధిప. భార. ఆర. ౨. ౩౦.

... తమైనపాపంబు గ్రాఁగ వలయుఁ, గడఁ

గి నాకును సద్గతి గలుగ వలయు. భార. ఆర. ౨. ౨౬౨.

సీ. ఘనతపోనియతిఁ గ్రాఁగనికలుషంబులు జపము సేసిన నశించనియఘంబు,లు... గీ. అచ్యుతానంత గోవింద హరి మురారి,యని తలంచినయప్పుడే యడఁగిపోవు. వి. పు. ౩. ౧౩౯.

౨. కాఁగు, పెద్దబాన.

సీ...క్రాలుఁ గటాహంబు క్రాఁ గనంగ. ఆం. భా. ౨. ౨౪౫.

గీ. క్రాఁగుపై మ్రొగ్గు తెలినిగ్గుఁ గ్రాఁగి పొంగ,సాగుపాలని పై నీరు చల్లి చల్లి, యల్లుకొనునట్టివెన్నెల నల్లుకొన్న, యన్నుమిన్నలు విహరించిరన్నివగల. రా. వి. ౩. ౧౩.

క్రాఁగిపోవు=క్రాఁగు.

(నశించు.)

గీ. తామ్ర మాదిగఁ గలయట్టిధాతుచయము,గొలిమి నిడి యూఁదఁ గి డెల్లఁ బొలియునట్లు, ప్రాణపవననిగ్రహమునఁ గ్రాఁగిపోవు,నవఘు యింద్రియజనితదోషాదు లెల్ల. మార్క. ౩. ౩౧౯.

జః క్రాఁక, క్రాఁగుడు, క్రాఁచు.

**క్రాఁగుడు**=కాఁగుడు. వి. (√క్రాఁగు) తపించుట, తపనము. (శ. ర.)

**క్రాఁచే**=కాఁచే. స. క్రి. (√క్రాఁగు) ౧. కాల్చు; కరఁగించు; తపింపఁజేయు.

సీ. పటుతరం బగుచటచ్చటరవం బెసఁగంగ బ్రాఁకులుఁ బొదలును గ్రాఁచికొనుచు...గీ...పరఁగ, నద్భుతోద్భవం బైనమహానలంబు. భార. ఆశ్ర. ౨. ౧౫౧.

చ...త్రిజగంబులకన్నలబ్రహ్మవిష్ణురుద్రమహిమ లోకకైకలయఁ గ్రాఁచినయుండ త్రివేదమూలకంద మని నుతింప నొప్పెసఁగెఁ దామరసప్రియబింబ మత్తఱిన్. నిర్వ. ౬. ౭౭.

గీ. తపనతపనీయ మాతపతాపవహ్నిఁ,గ్రాఁచుకాలశలాదుధూత్కారచయమొ, నాఁగఁ దగెఁ బశ్చిమానిలోగ్రాగమంబు. కృ. శకుం. ౧. ౩౦.

వ...వాద్యంబులు తడిసిన విద్యోపజీవులు పుష్కరంబులు గ్రాఁప నగ్గి రోయుచుండ...ఆము. ౪. ౩౫.

సీ. కనకగిరిస్ఫూర్తిఁ గరఁచె గౌతమిఁ గ్రాఁచె...

గీ... కృష్ణరాయబాహుప్రతాపజాగ్రన్మహాగ్ని. మనుచ. ౧. ౩౭.

౨. నశింపఁజేయు, పోఁగొట్టు; చంపు.

క. నను నీస్తవమున నెవ్వం, డనుదినమును భక్తితో సమాహితమతియై, వినుతించు నతనియాపద,లనయంబును నే నసంశయంబుగఁ గ్రాఁతున్. మార్క. ౬. ౨౩౧.

గీ. విప్రుకడుపులో నున్నయవ్వీరు నసుజుఁ, బిలిచె ర మ్మని వాతాపి ప్రియముతోడ,జీవితుండయివాఁడు సెచ్చెరను విప్రు,కడుపు వ్రచ్చిచు వెలువడి క్రాఁచె విప్రు. భార. ఆర. ౨. ౩౨౦.

౩. పీడించు.

శా. ఆచారంబు జితేంద్రియత్వము విధేయత్వంబు లజ్జాగుణ, ప్రాముర్యంబును నామనష్టము లగుణ్ బష్మాంకితంబుల్ దృఢ,భ్రూచాపచ్యుతముల్ శ్రవఃపథగతంబుల్ తన్విదృగ్బాణముల్, క్రాఁచ న్జాగినయంతలో సురభిమల్లా ...మల్లభూ. శృం. ౮౪.

క్రాఁచిపుచ్చు=క్రాఁచు, నశింపఁజేయు.

గీ. సప్తగోదావరమునీట జలకమార్చి, పుష్పగంధాక్షతంబులఁ బూజసేసి, కలిభవం బైనకలుషంబుఁ గ్రాఁచిపుచ్చి, మర్త్యుఁ డొందును పేగం బమర్త్యపదవి. భీమ. ౩. ౧౧౯.

**క్రాకచికుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) అంపపుఁగోఁతగాఁడు.

**క్రాథకుఁడు.** సం. విణ. (అ. థికా. అ.) హింసించువాఁడు.

క్రాథము. సం. వి. అ. పుం. హింస, వధము.

క్రాయకుఁడు. సం. విణ. (అ. యికా. అ.) క్రేత, కొనువాఁడు.

క్రాయు. అ. క్రి. కాండ్రించు.

సీ. ధవళలాంగూలపల్లవచాలనంబులు గా ముదీచ్ఛాయలఁ గ్రాసి యుమియు. కాశీ. ౪. ౨౬౯.

సీ. ధర్మరాజు లటన్న దబ్బరలే తిట్టుఁ గంబము య్యౌ యటన్నఁ గ్రాసి యుమియు. శుక. ౩. ౪౯.

స. క్రి. ౧. కక్కు.

ఉ. మ్రింగియుఁ గ్రాయ వచ్చిలువ మెల్తవిధుం గనుగందకుండఁగన్. నైష. ౮. ౧౭౩.

క. కొలఁది యెఱుంగక తిని కో,కిలకామిని వెడలఁ గ్రాసెఁ గిసలయఖండం,బులు... వరాహ. ౩. ౭౮.

౨. ఉమియు.

ఉ... నెత్తురు చవిచూచుఁ గండలు తుథూ యని క్రాయు... పిశాచవిభుండు ... ఉ. హరి. ౨. ౧౨౪. అచలా. ౨. ౭౧.

క్రార=క్రారవడి. వి. (క్రయ్యు+ర-శ. ర.) జడ్డయై ఒకయక్షరముతోఁ గలియురేఫము.

గీ. కొమ్ముక్రారలు మఱి ద్విపర్ణమ్ము లగుట, వానియెడమవి గురువులు వట్రసుడులు, ప్రాణములు గాన వానిడాపలను గల్గు,నక్కరము లెల్ల లఘువులు నిక్కముగను. అప్ప. ౪. ౪౯.

గీ... క్రార,గిలక యన రేఫ మెసఁగును... ఆం. భా. ౨. ౧౯౭.

క్రారవడి=క్రార. వి. (క్రార + వడి-స్వార్థమున) జడ్డయై ఒకయక్షరముతోఁ గలియురేఫము. (శ. ర, బ్రౌ.)

క్రాలు. అ. క్రి. ౧. చలించు, కదలు.

ఉ. అలియుఁబోలె విప్పడు ... జరించుని,న్నోలలితాంగి కా దనుచు నున్నది మందసమీరణంబులం,గ్రాలుప్రవాళమంజరులు కమ్రకరంబులవిభ్రంబు గా, బాలరసాలపుష్పరసపాయివనప్రియకంఠహుంకృతిన్. నైష. ౨. ౪౮.

వ... ఈరాజానీరాజనకరణంబులకు రం డనుచు నమరకాంతలఁ బిలుచునోజం గ్రాలునూతనకేతనంబులును... భా. రా. అయో. ౧౦.

౨. సంచరించు, తిరుగు.

క. నేలకు నర్లెడుపాడువునఁ, గ్రాలుమ మును మెఱయుగురునిరథచక్రము ల,క్కాలంబున సమరజయ, శ్రీలోపము దెలియ నంటసిలఁ బడియె నృపా. భార. ద్రో. ౫. ౩౧౭.

గీ. అలజాలంబు నీరిపై నాకుజాడ, గాలిపడగ యాకసమునఁ గ్రాలుత్రోవ, నిదురలోపలఁ గలఁ దోఁచునీడ పిదపఁ, గానవచ్చునె యప్పుడ కన్నఁగాక. ఉ. హరి. ౫. ౧౧౦.

౩. ప్రవర్తిల్లు; వర్తిల్లు.

చ. గుణ మిది దోష మిట్టి దని కొంత యెఱింగినఁ గాక యిట్లు ని,ర్గుణతచు పట్టి క్రాలుతమకుం దగువారలు సెప్పుసౌమ్యభా,షణము నిరర్థకంబు...నిర్వ. ౬. ౬.

క. కైలాసనగమునందును,గ్రాలెడుప్రావృట్పయోధరముచందమునన్, లాలితకటిభాగంబున,నీలాంబర మమరు రామునిం బొడగాంచెన్. వి. పు. ౭. ౩౩౯.

సీ. మకుఁగులోపలఁ జొచ్చి కడుపార నుదకంబు గ్రోలంగ దిగ నందుఁ గ్రాలుమొసలి, పాదముల్ కబళించి పట్టిన ... మొ. రా. యు. ౨. ౭౪.

౪. చెదరు.

ఉ. కాలమునాఁటిమృత్యువుముఖంబునఁ బోలెను విస్ఫులింగముల్, గ్రాలఁగ దేవసంఘము ... నొంద... భాగ. ౬. ౪౨౫.

౫. క్రమ్ము.
గీ. గళితశృంఖల లయ్యు వశాలనిద్ర,గనుఁగవలఁ
గ్రాలఁ దమయంతిఁ గదల వయ్యె,దారుణా
ఘోరణప్రయత్నమునఁ గాని,నముచిమథనుని
వీట కుండాలఘటలు. పారి. ౪. ౬౭.

౬. అతిశయించు; విజృంభించు.
గీ. దేవలోకజిగీష చేఁ ద్రిపురహంతు,కామకా
మాంతకోద్భటాకారు లగుచు, లంక విడిచి మ
నోవీథి శంక విడిచి,యసురు లుత్సాహములు
గ్రాల నరుగువేళ. ఉ. రా. ౨. ౩౦.
క... అతఁడు బలువిలు గొని, క్రాలుచు నాభీమ
ముఖ్యరథికుల నొంచెన్. భార. ద్రో. ౪.
౨౯.

౭. సంచలించు, క్షోభపడు.
ద్వి. ఏలె వధూమణి యెన్నిచందములఁ, గ్రాలు
చున్నాఁడఁ గటకటా యనవు. రం. రా.
అర. ౧౫౭ పా. ౧౩ పం.

౮. ఒప్పు.
శా. ప్రాలేయాంశుమరీచినిర్మలతనూభాగంబుఁ
గృష్ణాజిన, వ్యాలోలామలయజ్ఞసూత్రములు
వంసాసక్తవీణాలతా, లాలిత్యంబు లలాటి
కారుచులుఁ గ్రాల న్నారదుం డిచ్చలం, గై
లాసంబుననుండి వచ్చె... ఉ. హరి. ౩. ౯.
సీ... క్రాలెను వలలెఁ దుఱంగలించె ... అనంగ
నొప్పె నన్నాటగాఁ జెప్పఁబడును. ఆం. భా.
౩. ౮౩.

జ: క్రాలుఁగన్ను,క్రాలుకొను, క్రాల్గంటి.

క్రాలుఁగ(ల్గ)న్ను. వి. ఔ. ౧. చంచలేక్షణము,
లోలనేత్రము.
శా... లోలోపల వేడుకల్ నిగుడ సిగ్గుల్ దేఱు
నొయ్యారపుం, గ్రాలుంగన్నులఁ గ్రొమ్మెఱుం
గులు దొలంకన్ మందయానంబులో, వాలీ
లానిలయంబు చేయుదురొకో నాళీకపత్త్రేక్షు
ణల్. వరాహ. ౪. ౮.

సీ. ఇందీవరంబుల నీను క్రాల్గన్నులకరదిందుముఖు
లు చామరము లిడఁగ. మను చ. ౧.౧౨.
౨. రోగవిశేషయుక్తమైన నేత్రము.
ద్వి... ప్రంగుడుకన్ను,క్రాలుఁగన్నను నీరు గా
రెడికన్ను. పండితా. మహిమ. ౨౬౩ పా.

క్రాలుకొను. అ. క్రి.(క్రాలు+కొను-స్వార్థమున)
=క్రాలు.
(ప్రకాశించు)
వ... కరంగుకురంగధరకాంతికందళంబులజలజలని
తెలినీటిజాలునం గ్రాలుకొనుచు నచ్చవెన్నెల
విచ్చలవిడిఁ జెచ్చెరఁగి... వసు. ౪. ౨౩.

క్రాల్గంటి. వి. (రూ. క్రాలుఁగంటి-క్రాలు+కన్ను)
తరళాక్షి, చంచలాక్షి; స్త్రీ.
క... కోర్కుల్, బిట్టొదవెఁ బిఱుఁదులుం జను,
కట్టులుఁ గడు బలిసె నపుడు క్రాల్గంటుల
కున్. అచ్చ. రా. బాల. ౭౬.
ఆ... వలపుఁ,గాఁక బలిత మయ్యెఁ గ్రాల్గంటి
కి... నీలా. ౩. ౩౬.

## క్రి

క్రి=క్రీ. విశ. క్రిందిది. (చూ. క్రిందు. విశ)
ఉదా: క్రిందల, క్రియ్యాట.

క్రించే=కించే. విశ. ౧. అల్పుఁడు, నీచుఁడు; అ
ల్పము, నీచము.
ఉ. వంచన రాముదేవిఁ గొనివచ్చినయట్టులు గా
దు కోరిన, క్రించర నన్ను నాహవముఖంబు
న డాయుట లన్న నయ్యారే,క్రించ సహోద
రుం గరము గీడ్పడి మానవు చేతఁ బొంది యే,
యించుట గాదు లే... భా. రా.యు.౪౭౪.
క. క్రించా మాధుని నినుఁద,క్కించుట యన నెం
త సింధుకీలాలమునకన్, వంచింపఁబడదె ము
న్నొక,వంచక మభిజాతక మతవల్లభు చేతన్.
శుక. ౧. ౫౧౭.

గీ. పాడిమానిను లండ్రు నివ్వాలు నోకనిఁ, బోదివి రిస్సిరో పెక్కండ్రు ప్రోడ లిదియు, మగఁటిమిరో క్రించుపని కిట్లు దెగినయప్పు, డుల్లములు వారలకు నెట్టు లుండెనొకో. భార. స్త్రీ. ౨. ౭౬.

౨. దుష్టుఁడు.

ఉ. వారలు వాలిపంపునన వచ్చినవా రనుశంక నామదిన్, వారక నాటి యున్నయది వాలియు నాయెడఁ గ్రించు రాజు లే, పార ననేక మార్గముల నప్రియులం దెగఁ జూతురు ... భా. రా. కిష్కి. ౧౧.

ఉ. కాన లెఱుంగ వీవు బలుగాములుఁ బాములుఁ గ్రించు చెంచులున్, దానవమాయలుం గలకుఘంబులు... భా. రా. అయో. ౮౩.

జ: క్రించుఁడు, క్రించుఁదనము.

క్రించేఁడు = క్రించె, కించె. విణ. (√క్రించె) నీచుఁడు, అల్పుఁడు.

మ ... నిన్నుఁ గఠినస్వాంతంబుతోఁ గానసంబునఁ ద్రోయించినతప్పు చాలక జగంబుల్ చూచి శోకింపఁ గ్రించునిచందంబున రచ్చఁ బెట్టితి నటంచున్ డాఁగి పో నేల... నీనగు మొగంబుం జూపవే జానకీ. ఉ. రా. ౮. ౫౬.

క్రించేఁదనము. వి. (క్రించు+తనము.) అల్పత్వము, నైచ్యము.

క... కమనీయగుణ, స్తోమ నిజభామ నొల్లక, ధామమున నటించెఁ గ్రించుఁదనమున జడుఁడై. భాగ. ౬. ౧౦౬.

ఉ... నీ, ప్రేమకు వచ్చుదానులకుఁ గ్రించుఁదనంబున నెగ్గు చేసితిన్. భాగ. ౫. ౧౧౬.

క్రిందంటు = అడుగంటు. (క్రిందు + అంటు) (నశించు.)

ఉ. మంటకుఁ జేరి కామిదుర్వమార్కి నశించక మట్కుమారిమే, నంటియు నింటి కేఁగి చద లంటినదుర్మతి సేవతోఁ గ్రిందంటఁగ మం...

టివాన గురియుం గల దేడుదినంబులు ... ఉ. రా. ౭. ౩౩౭.

క్రిందల. వి. (క్రిందు+తల) క్రిందగుతల.

సీ. మోముఁదమ్మికిఁ దేఁటిమొత్తమై పాగ పర్వ బ్రేలుఁ గ్రిందల గాఁగ వృక్షశాఖ. పాండు. ౨. ౭౯. (క్రిందలగాఁగ=తల క్రిందుగా, అధోముఖముగా.)

క్రిందు. వి. దే. ౧. అధోభాగము, దిగువ.

గీ. నాభికందంబు క్రిందట నలినగంధి, మండలీశక్తి దేవత యుండు నెలవు. కాశీ. ౨. ౧౨౫, ౧౨౭.

క. ఊఁదుకొనఁబడుమధూళిక, యోడికలకుఁ గ్రిందఁ గ్రమ్మియుండెడు తేంట్లన్, నీడలు తిరిగియుఁ దిరుగని, జాడఁ దరుల్ వ్రాలిచె నవ్వసంతపువేళన్. ఆము. ౫. ౧౩౭.

దండకము. చాగంపుబల్ రక్కసుం గ్రిందికిం ద్రొక్కవా. నీలా. ౨. ౮౧. (క్రిందికిన్:- పాతాళలోకమునకు అని భావము.)

౨. పూర్వకాలము.

(నరకంబులను) వ. అతనితోడఁ గ్రిందటఁ బదితరంబులవారును ముందటఁ బదితరంబులవారును బొందుదురు. భాగ. ౧౦ ఉ. ౮౫౧.

౩-అధస్థితి-వశము.

సీ. తాను రుక్మిణి యయ్యెఁ దగ దన దాత్మ నాయకుఁ డొకనరు క్రింద వారులఁ బట్టె. వసు. ౧. ౬౫.

ఉదా: అతని క్రిందఁ బనిచేయుట కష్టము.

విణ. (వృత్తియందు వికల్పముగా 'ందు' లోపించును. అట్టియెడల కొన్నిపట్లను గాగమమును, కొన్నిపట్ల మీఁదివర్ణమునకు ద్విత్వమును, కొన్నిపట్లలు ప్త శేషమునకు దీర్ఘమును వచ్చును.)

ఉదా: క్రిందల, క్రిఁగడుపు, క్రియ్యాట, క్రీనీడ.

౧. అధోభాగమం దున్నది.

గీ. క్రిందటి ప్రయ్య భువియు మీఁది, ప్రయ్య...

డివియును...హరి.పూ. ౧. ౫౩.

సీ. చరమాంగపీఠికాస్థాపితశేషుండు కితవకచ్ఛప రాజు క్రిందిమట్టు. హర. ౬. ౮౦.

గీ. చచ్చిపోయినవారికై చాల వగల, దుఃఖపడు దురు మఱునాఁడు తొడరి చనరొ, తాము బ్రదుకుట లేది తథ్యంబు తడవ, వనిత క్రిం దాకుమీఁదాకువాసి గాదె. కుచేల. ౧. ౭౦.

౨. తక్కువ.

సీ. శ్రీకాంత దానయ్యుఁ బ్రియు నిరోధింపదు క్రిందై విరోధికిఁ గేలు సాఁప. వసు. ౧. ౬౫.

సీ. అజసమాగమనవిఖ్యాతి వచింపవే యంచలనడక క్రిం దౌను గాని, చక్రేశ్వరకథాప్రసక్తిఁ గ ణింపవే మలయమారుతధాటి నిలుచుఁ గాని. ఇందు. ౩. ౨౮.

౩. కడచినది.

ఉదా: క్రిందటియేఁడు, క్రిందటినెల.

(వ్యవ) మంచి చెడ్డ క్రిందఁ బరిణమించినది. (చెడ్డ క్రింద=చెడ్డగా)

జ: క్రిందంటు, క్రిందల, క్రిఁదుపడు, క్రిందు పఱుచు, క్రిందుసేయు, క్రిగ్గాలి, క్రియ్యాట. క్రీఁగడుపు, క్రీఁదొడ, క్రీఁబడు, క్రీగాడ్పు, క్రీగోరు, క్రీనీడ, క్రీనీరునేల, క్రీవాడ.

**క్రిందుప(వ)డు.** అ. క్రి. (√ క్రిందు) ౧. తక్కువయగు, తగ్గు.

సీ. బ్రతుకుభాగ్యము క్రిందుపడఁగఁ బాఁపన యిండ్ల కరిగి యాఁకటికిఁ గూడడిగె ననుచు. శుక. ౨. ౫౮౭.

ఆ. వెల్లివిరిసెఁ బెంటివిద్యలు మగవిద్య, లడుగువ ట్టెఁ గ్రిందువడిరి బుధులు, హీనజాతిపురుషు లెచ్చిరి...వేం. పంచ. ౨. ౧౩౨.

ఉ. అంతట లజ్జ క్రిందుపడ నత్యధికంబుగ మించి మానసా, భ్యంతరపూర్ణ [illegible] కతంబు నఁ దల్లిమాట యొక్కింతయుఁ దాను గైకొన క...కళా. ౮. ౯౮.

౨. లోఁబడు, లొంగు.

చ. పగవాఁడైనను వచ్చి క్రిందుపడి తాఁ బ్రార్థించినన్ వానికిం, దగుసంభావన లిచ్చి ప్రోచ్చుటకాదె పో ధర్మంబు...వి. పు. ౬. ౧౬౦. మనుచ. ౩. ౫౦.

౩. ఓడు.

సీ. బిరుదంటివా నీకు బిరుదెక్కడిది పాండునృప కుమారునకుఁ గ్రిందుపడినావు. నిరం. ౩. ౨౯.

సీ. పలుచందములఁ జిందములఁ గ్రిందుపడఁజేసి నెలతాల్పుబలు వేల్పు చెలువు నవ్వి. గీ ... తన యసం బెల్లకడల, వెలుఁగ...నీలా. ౧. ౮౫. (ఇట ఔపమ్యద్యోతకము) హర. ౪. ౧౭౯.

**క్రిందుపఱు(ఱ)చు.** స. క్రి. (√ క్రిందుపడు) క్రిందుపడఁజేయు.

౧. అధస్థితముగాఁ జేయు.

మ...లం, ఘనచాతుర్యము నింగి క్రిందుపఱుపం గా వానరానీకముం, గినుకం బొంగుచు ... భా.రా.యు. ౧౮౨౭.

౨. భంగపఱుచు, అవమానపఱుచు.

సీ. అఘుడై త్యుఁ బొరిగొని నడరి వత్సకుఁ ద్రుంచె గిరి యెత్తి దేవేంద్రుఁ గ్రిందుపఱచె. భాగ. ౧౦ పూ. ౧౩౨౭.

౩. ఓడించు.

సీ. బ్రష్టమధ్యస్థుఁడై పరికింపఁ గుండలీశ్వరుఁ గ్రిందుపఱచినశాబ్దికుండు. వరాహ. ౯. ౮౩.

సీ. విమలధైర్యంబున హిమమహీధర మేరుమందరా ద్రుల నైనఁ గ్రిందుపఱుచు. వి. పు. ౫. ౬౫. (ఇట ఔపమ్యద్యోతకము)

**క్రిందుసే(చే)యు.** స. క్రి. (క్రిందు+చేయు) క్రిందుగాఁ జేయు.

(అధోముఖముగఁ జేయు)

గీ. నియతిచేతఁ గదర్థితుం డయినధైర్య,ధురనిధై ర్యగుణంబు మాన్పంగఁ దరమె, క్రిందుసేయం గఁబడినట్టికృష్ణపథుని, కీల లెండైన మీఁదు గాఁ గెరలుఁ గాదె. భర్తృ. ౧. ౬౬.

(తక్కువపఱచు)

చ. అనుడు నగస్త్యుఁ డిట్లనియె హైమవతీసుతు తోడఁ దోడిస,న్మను లలరంగ నోయనఘమూ ర్తి సమస్తముఁ గ్రిందుచేసి మిం,చినబలువే ల్పుఁ దీర్ఘమును క్షేత్రము నొక్కెడఁ గూడి యుం డెనే,ని నిరుపమాద్భుతిం దెలిపి నీవు మ ముం గరుణింపఁగాఁ దగున్. పాండు. ౧. ౧౫౨.

క్రిక్క. వి. వంది, బట్టు.

గీ...బట్లు, క్రిక్క లనఁ బాఠకాఖ్యలు గేరుచుం డు. ఆం. భా. ౨. ౧౮౭.

మ...అభ్రవిభ్రమము నేలా సర్వలోకాశ్రయ, క్షమతం బేర్చుచఘశ్యపిశ్వవిభుశశ్వద్దానధా రాజలా, ఘముతో సాటికిఁ బాటిసేసెదవు క్రిక్కా చక్కఁ దర్కింపుమా. కావ్యా. ౬. ౭౩.

సీ. పసిఁడిజీరాపట్టెపనికీలుటందియ లడుగుఁదమ్ము లఁ గ్రిక్కలట్ల తనర. మల్లుపు. ౪. ౫౬. వేంక. ౩౦.

క్రిక్కటిల్లు(లు). అ. క్రి. కంపించు.

శా. క్షోణీచక్రము గ్రిక్కటిల్లఁగ దిశల్ ఘూర్ణిల్ల దట్టించుచున్, జాణూరుం డతిభీషణస్ఫు రణతో శార్ఙ్గిన్ వెసం దాఁకి ... పద్మ. ౯. ౩౨౧.

క్రిక్కిఱి. విశే. (ఇది వృత్తియందే కనఁబడుచున్న ది-√ క్రిక్కిఱియు.) మిక్కిలి యిఱుకైనది, కాంచె మైన ఎడము లేక యుండునది.

ఉ. క్రిక్కిఱిచన్నుదోయియురగ్రైవలకాంతియుఁ బంచబాణుఁ గ్రొ,న్నొక్కఁగఁజేయ హాస్తయు గ మెత్తి...నైష ౬. ౧౯౪.

క్రిక్కిఱించు. స. క్రి. (√ క్రిక్కిఱియు-చూ. ఇఱించు) క్రిక్కిఱియఁజేయు.

(ఎడము లేకుండఁ జేయు)

క. పలుకు నెడఁ బార్థుసేనా,కలకలములు నిజపు గోపకంఠసరణిది,క్కులఁ గ్రిక్కిఱింప ... జై. భా. ౮. ౧౨౬. (శ. ర. పా- 'నిండిచు' అని భావము)

వ. ...నడి నెక్కఁ గ్రిక్కిఱించుచు నొక్కయె డం గాలువాడిచి ముక్కున నక్కంఠహారత రళంబు నొక్కుచు ... పాండు. ౪. ౨౩౬. ('ముడుఁచు' అని భావము)

క్రిక్కిఱియు. అ. క్రి. (క్రిక్కు+ఇఱియు. శ. ర- ఇది ఉభయయతులలోనిది. మా. కావ్యా. ౬. ౭౯)

౧. ఎడము లేకయుండు, నిండు.

ఉ. దిక్కులు నాకసంబు జగతీతలభాగము నెల్ల చోటులుం, గ్రిక్కిఱియంగఁ గ్రందుకొని కీశబలంబులు వెన్క ముందటం, బెక్కువిధం బులన్ నడువ భీకరభంగులఁ గ్రొవ్వు లారఁ గా, నక్కజ మంద వచ్చి ప్లవగాధిపుపట్టన మెల్ల ముంచినన్. భా. రా. కిష్కిం. ౫౧౩.

క. క్రిక్కిఱిసినశరములలో ... కు. సం. ౧౧. ౬౪౩.

చ. తఱిమి సుశర్మఁ గిట్టి యతిదారుణభంగి రణం బు సేయ వాఁ, డుఱక నిశాతసాయకము లొ క్కమొగిం బది మేనియందుఁ గ్రిక్కిఱియఁ గఁజేసి నాలుగిట నేసెఁ దురంగములన్... భార. విరా. ౩. ౨౧౫. కవిజ. ౩. ౧౬. కు. సం. ౮. ౯౭.

౨. చేరు, కూడు.

సీ...కూడ జేరసెఁ గ్రిక్కిఱిసెను బెనఁగ దొ ... గదిసెఁ జేరె నన వం బె నని తోఁ

చు...అం. భా. ౩. ౧౧౯.

క్రుక్కు = కుక్కు². వి. త్రిప్పు. (శ. ర)

జ: క్రుక్కుటి, క్రుక్కుటించు, క్రుక్కుటియు, క్రుక్కొను.

క్రుక్కొను = క్రుక్కుటియు. అ. క్రి. (క్రుక్కు + కొను.)

(నిందు)

సీ. తళుకొత్తుమిన్నేటితరఁగలఁ గ్రుమ్ముకొన్నను
పులఁ గురులపై విరులఁ బెనుచు, మెఱుఁగులఁ
గ్రుక్కొనుకొఱనెలఁ గేతకిదళములతో వేణి
నెలవు కొలుప. కు.సం. ౩. ౨౯.

క. మృదుబలము లుర్విఁ గ్రుక్కొన, విడిసిన...కు. సం. ౭. ౭౭.

క్రుగ్గాలి. వి. (క్రుంకు + గాలి) తూర్పుగాలి. (బ్రౌ)

ద్వి. వఱఁగిన పెనుగాలిబలుపునఁ జేసి, చిఱిఁగిన కే
తకులఛిద్రపుష్పములు, క్రుగ్గాలి దూలఁ దాఁకి
నఁ బొంగి తుదలు, బుగ్గరించినయట్టి మొగ్గపు
ష్పములు...కావని వర్ణించి ... బస. పు. ౪. ౧౨౫ పం.

క్రుతము. వి. పూర్వము, మునుపు.

ద్వి. క్రుతము నీప్రాణపరిత్యాగమునకు, మతి మె
చ్చి యవసరోచిత మిచ్చి వన్ను. బస. పు. ౭. ౯౩౭ పం.

చ. ఇట క్రుత మెన్నితోయదుల నిందుముఖీ వఖ
శేషమద్యముల్, గుటుకునఁ గ్రోల నీకుటిలకుం
తలయొంగిటిమాధ్విఁ గల్గువి, స్ఫుటమధురత్వ
వాసనలు చూడదు గాక దివౌకసుల్ సుధా,
ఘుటికలలోని చొలి మతి కోరుదు రే యిది గ్రో
లఁ గల్గినన్. ప్రబోధ. ౩. ౫౬.

(వ్యవ) ఈపని నాలుగునెలలక్రుతము జరిగినది.
ఇంతకుఁ గ్రుతము వానిని నేను చూడ లేదు.

క్రిమి. సం. వి. ఇ. పుం = కృమి.

క్రిమిఘ్న. సం. వి. ఆ. స్త్రీ. ...

క్రిమిఘ్నము. సం. వి. అ. పుం. వాయువిళంగము ⚘.

క్రిమిఘ్ని. సం. వి. ఈ. స్త్రీ. సోమరాజి, కారుగచ్చ ⚘.

క్రిమిజ. సం. వి. ఆ. స్త్రీ. లాక్షు, లక్క.

క్రిమిజము. సం. వి. అ. న. అగురువు, అగలు ⚘.

క్రిమిజాతము. సం. వి. అ. న. ౧. లత్తుక. ౨. లక్క.

క్రిమిజాపము. సం. వి. అ. పుం. అగురువు, అగలు ⚘.

క్రిమిశత్రువు. సం. వి. ఉ. పుం. బాడిశచెట్టు.

క్రిమిశాత్రవము. సం. వి. అ. పుం. దుర్గంధము గలచండ్ర ⚘. (వెలితుమ్మ అని కొందఱు)

క్రిమిశైలము. సం. వి. అ. పుం. వల్మీకము, పుట్ట.

క్రియ. సం. వి. ఆ. స్త్రీ. ౧. ధాత్వర్థము. ౨. చేయుట. ౩. చేష్ట, వ్యాపారము, పని. ౪. శిక్ష, విద్యాభ్యాసము. ౫. నిష్కృతి, ప్రాయశ్చిత్తము. ౬. పూజ. ౭. చికిత్స. ౮. వ్యవహారసాధనము లగుసాక్షిలిఖితపత్త్రాది. ౯. ఉపాయము. ౧౦. సాధనము, ఉపకరణము. ౧౧. ఆరంభము. ౧౨. విధము. (ఈయర్థము తెనుఁగుననే కలదు.)

సీ. అలికికి మేల్కొనునకని ధృష్టద్యుమ్నుఁ బట్టిన
క్రియఁ దలపట్టి యీడ్చి. భార. సౌ. ౧. ౧౬౮.

క్రియగొను. మి. అ. క్రి. ౧. కలుగు, ఒనగూడు.

క. ఉడుగక మే మహితముఁ బలి, కెడువారము
నీవు హితవు క్రియగొనఁ గాఁ బ, ల్కెడువాఁ
డవు...భార. ఆది. ౮. ౪౦.

౨. పూను.

ద్వి. ఒనర ముందర శరం బుండ మోఁకాలి, కిని
నేన వెట్టంగఁ గ్రియగొనినట్లు. పండితా. దీ
క్షా. ౯౮ పా.

క్రియము. సం. వి. అ. పుం. (జ్యోతి) మేషరాశి.

క్రియాకారుఁడు. సం. విశే. (అ. ఈ. అ) పని సేయువాఁడు. వి. అ. పుం. క్రొత్తశిష్యుఁడు. (త్రి.ని.)

క్రియాకారము. సం. వి. అ. పుం. ప్రతిజ్ఞ.

క్రియాద్వేషి. సం. విశే. (న్. ణీ. న్) వ్యవహారమందు సాక్షిలిఖితపత్త్రాదులకు వ్యతిరేకముగాఁ జెప్పు ప్రతివాది.

శ్లో. అన్యవాదీ క్రియాద్వేషీ నోపస్థాతా నిరుత్తరః, ఆహూతప్రపలాయీ చ హీనః పంచవిధః స్మృతః. (వాచ.)

క్రియాపవర్గము. సం. వి. అ. పుం. కార్యసమాప్తి, పూనినకార్యముయొక్క ముగియిక. సం. కిరా. ౧. ౧౪.

క్రియాపాదము. సం. వి. అ. పుం. వ్యవహారాంగములు నాల్గిటిలో మూఁడవది.

క్రియాభ్యుపగమము. సం. వి. అ. పుం. సేద్యము మున్నగువానియందు భూస్వామియు రయితు మున్నగువారును చేసికొనెడిఒడంబడిక.

క్రియావంతుఁడు. సం. విశే. (త్. వతీ. త్) పనియందు పూనిక గలవాఁడు, క్రియాసక్తుఁడు.

క్రియావసన్నుఁడు. సం. విశే. (అ. ఆ. అ) సాక్ష్యములు మొదలగువానిమూలమున వ్యాజ్యమునందు ఓడినవాఁడు.

క్రియావిశేషణము. సం. వి. అ. న. క్రియతో అన్వయించువిశేషణము.

క్రియాసమభిహారము. సం. వి. అ. పుం. ౧. పని మరలమరల చేయుట. ౨. పని అధికముగా చేయుట. ౩. పనిని మరల మరల అధికముగా చేయుట. శిశు. ౨. ౪౩.

క్రియ్యు=ప్రయ్యు. అ. క్రి. కృశించు.

క. క్రొక్కారు మెఱుఁగు మేనులుఁ గ్రిక్కి చిక్కిన చన్నుఁగవలుఁ గ్రిస్సినవడుములున్. భాగ. ౮. ౨౬౫.

సీ. ఒడిసి భక్షించిన మున్న మీనము లెల్ల ఖిన్నంబులై పఁగఁ గ్రిస్సియున్న. భాగ. ౧౦ పూ. ౭౦౭.

క్రియ్యాట. వి. (క్రిందు+ఊట) క్రిందియూట.

గీ. ఏకమై కాలువలు గట్టి యేకహేలఁ, బఱవ నందలి క్రియ్యాటపనిమి తేటఁ, బండు నవ్వీటమున్కారుఁ బసిఁడిగాఱు, సరసధాన్యంబు మలచిరాజనపుఁజేల. పాండు. ౧. ౧౧౫.

## క్రీ

క్రీ. విశే. క్రిందిది. (చూ. క్రిందు. విశే.)

క్రీఁగడుపు. వి. (క్రిందు+కడుపు) వస్తి, పొత్తికడుపు.

సీ...పొత్తికడుపు క్రీఁగడుపు నాఁగను వస్తి చెన్నొందు...అం. భా. ౨. ౧౩౬.

క్రీఁదొడ. వి. (క్రిందు+తొడ) క్రిందితొడ, తొడఅడుగుభాగము.

గీ. కర్ణునుత్సంగమున మస్తకంబుఁ జేర్చి, గుహుఁడు నిద్రింప వికృతాతిఘోరరూప, మళక మనియెడునొకకీట మద్రినేంద్ర, తనయు క్రీఁదొడఁ దొలిచె సత్వరముగాఁగ. భార. శాం. ౧. ౨౧.

క్రీఁబడు. అ. క్రి. (క్రిందు + పడు) తక్కువయగు.

సీ. నురకరి యూయచ్ఛ్రిఁ జరియించుసేనంగుఁ గొదములఁ గ్రీఁబడ్డకొదమయొక్క. మార్క. ౧. ౫౭. (కృతపడు-శ.ర.పా)

క్రీగాడ్పు. వి. (క్రిందు+గాడ్పు)-క్రిందిగాలి-అపానము.

గీ. మానసాంబుజకర్ణికామధ్యమునను, గొన్నిదిశ

ములు శశిమాళిఁ గదురుకొల్పి, మీఁది గాడ్పుఁ
గ్రీగాడ్పుతో మేళవించి, భానుశశిమార్గములు
గట్టువడి తగను. పి. శకుం. ౨. ౧౧౩.

**క్రీఁగోరు.** వి. జా. (క్రిందు + గోరు)- క్రిందనున్న గోరు_కాలిగోరు.

శా. చేటం బేటముగా నిభంబు కరిణిం బ్రేమంబు
తోఁ జేరి... క్రీఁగోట స్తే యొరయుఁగ ...
కు. సం. ౧. ౧౦౦.

**క్రీడ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. బంతులు మున్నగువానితో ఆడుఆట. ౨. ప్రియులు మున్నగువారు చేయుపరిహాసము. ౩. అవజ్ఞ, అనాదరము. (మే.ని) ౪. విహారము.

**క్రీడత్.** సం. శత్రు. క్రీడించుచున్న.

**క్రీడనకము.** సం. వి. అ. న. క్రీడాసాధనము. (ఆటబొమ్మ, మొ.)

**క్రీడనము.** సం. వి. అ. న. ౧. ఆట. ౨. ఆటబొమ్మ.

**క్రీడనీయకము.** సం=క్రీడనకము.

**క్రీడము.** సం. వి. అ. పుం. పరిహాసము. (కల్ప.)

**క్రీడాగృహము.** సం. వి. అ. న. కేళీగృహము.

ఇట్లే క్రీడామందిరము, మొ.

**క్రీడానారి.** సం. వి. ఈ. స్త్రీ. వేశ్య, ఆటవెలఁది.

**క్రీడారత్నము.** సం. వి. అ. న. ౧_ఆటలలో శ్రేష్ఠమైనది_రతి, సంభోగము. ౨. క్రీడార్థమైన రత్నము.

**క్రీడావనము.** సం. వి. అ. న. ఉద్యానము, ఆటతోఁట.

ఇట్లే క్రీడాకాననము, మొ.

**క్రీడి.** వి. (సం. కిరీటీ. ప్రా. కిరీడి) అర్జునుఁడు.

సీ... వేగంటికొమరుఁడు వెన్నునంటు, వెన్నుమ
చ్చదునీఁడు విప్పచ్చు కవ్వడి గెలుపుపేరగ
లాఁడు క్రీడి యనఁగ, న...

...పాం. ని. దేవ. ౧౬. భార. విరా. ౪. ౧౫.

**క్రీడించు.** సం. అ. క్రి. ౧. విహరించు.

సీ. ఏకాంతమునఁ దనయిచ్చఁ గ్రీడించు దర్పకుఁ
బాసి వచ్చినరతి యనంగ. మార్క. ౨. ౭౪.

౨. రమించు.

మ... ఎలమిం గ్రీడింపు నాతో మనోహరకేళీ
గతి నొందుఁ బోకుము సుహృద్వ్యామోహము
ప్పొంగఁగన్. మార్క. ౪. ౭౦.

**క్రీడిత.** సం. విశే. (బు. త్రి. బు) క్రీడించువాఁడు, విహరించువాఁడు.

**క్రీడితము.** సం. వి. అ. న. క్రీడ.

**క్రీణత్.** సం. శత్రు. కొనుచున్న.

**క్రీణానుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) కొనుచున్నవాఁడు.

**క్రీతకుఁడు.** సం. వి. అ. పుం. ధన మిచ్చి కొన్న కొడుకు, క్రీతుఁడు.

**క్రీతము.** సం. విశే. (అ. ఆ. అ.) వెల యిచ్చి కొనఁబడినది, విలువఁబడినది.

**క్రీతి.** సం. వి. ఇ. స్త్రీ. కొనుట.

**క్రీతుఁడు.** సం. వి. అ. పుం. తల్లిదండ్రులనుండి కొనఁబడినపుత్త్రుఁడు. (వీఁడు పన్నిద్దఱుపుత్త్రులలో నొకఁడు.)

**క్రీనీడ.** వి. (క్రిందు+నీడ) క్రిందినీడ.

గీ. లతల క్రీనీడఁ దిలతండులితము లగుచుఁ, గాంత
యానిందుశేఖనికరము లమరు. వైజ. ౧.
౧౭౪.

**క్రీనీరునేల.** వి. (క్రిందు+నీరు+నేల) అనూపము, జలప్రాయదేశము.

గీ. నీరుముం పవఁ గ్రీనీరునేల యనఁగ, ఖ్యాతి
గాంచు ననూపంబు మాతృభూత. ఆం. భా.

క్రియమాణము. సం. విణ. (అ. ఆ. అ) కొనఁబడుచున్నది.

క్రీవాడ. వి. (క్రిందు + వాడ.) పాటిపొలము. (శ.ర)

## క్రు

క్రుంకించు. స. క్రి. (√క్రుంకు) క్రుంకఁజేయు. (అస్తమింపఁజేయు)

గీ. అనుచుఁ గ్రుంకింప రానిప్రొద్దరసి యరసి. భార. విరా. ౨. ౩౧౪.

క్రుంకు. అ. క్రి. ౧. మునుఁగు; స్నానముచేయు.

చ. ఇటు తగునే సుయోధన...ఏమిటికిఁ గ్రుంకితి నీళ్లను జావు దప్పనే. భార. శల్య. ౨. ౫౪.

గీ. కణఁకఁ గాంతేయమున వృద్ధగంగఁ గ్రుంకి. కాశీ. ౩. ౧౬.

౨. అస్తమించు.

సీ...కూఁకె నాఁ గనుపట్టుఁ గ్రుంకె ననుట. ఆం. భా. ౩. ౯౭.

క. మాయరవి యేల క్రుంకఁడొకో యను నిట్టేల తడసెనో యను...భార. విరా. ౨. ౩౧౨.

గీ...ప్రొద్దు గ్రుంకెడుదాఁకఁ బోరు జరుపు, చున్న విజయహాని జనింప కున్నె...రాఘవ.౪. ౧౭౪.

౩. చచ్చు, మృతి నొందు.

శా. శంకాకీర్ణమనస్కు దానవరిపుల్ చక్రాయుధుం డింతతోఁ, గ్రుంకెం బో యని భీతులైరి యచటన్...ఉ. హరి. ౬. ౧౮౦.

వ. దనుజులు మనుజులం జుట్టుముట్టి బలిమి నలమి యలిగి యలుఁగులతోడం గూడ మ్రింగినఁ గ్రుంకక. రాజ.చ. ౨. ౭౪.

సీ. క్రుంకె నేఁగను బోయె డింకవేసెను మగ్గ నసఁ జచ్చె ననుమాట కాఖ్య లయ్యె. ఆం. భా. ౩. ౮౭.

౪. గ్రుచ్చుకొను.

ఉ. కోటలసంధి సెంపములు గ్రుంకిన సంతదినక్రమంబునన్, మీఁటినఁబొవ్వి భుక్తిఁ గొన నేరక యాననగహ్వరంబునన్, గాఁటెడులాల తోడఁ బులి గ్రచ్చతి లోఁబడి యుండ మ్రానిపైఁ, గూటినవంత నొక్క ద్రుమకుట్టవిహంగము దానికిట్లనున్. కేయూర. ౩. ౧౧౫.

౫. అడుగునకుఁబోవు.

మ...రవిదీప్తిం గ్రుంకి పాతాళగహ్వరముం దూఱినవాని...ఆము. ౨. ౬౬.

౬. అస్తమయము.

సీ. తమియును మత్సరము డెందమున నంతంతకుఁ బొడమి కానఁడు ప్రొద్దుపొడుపుఁ గ్రుంకు. పి. శకుం. ౪. ౧౬౪.

క్రుంకిడు, క్రుంకులిడు=స్నానముచేయు.

శా. ఏయేతీర్థములందుఁ గ్రుంకిడితిరి...మనుచ. ౧. ౬౮.

సీ. తెల్లవాఱె నటంచుఁ దివిరి యజ్ఞన్నిగట్టేటి పొంతకుఁ గ్రుంకులిడఁగఁ జన్న. అచ్చ. రా. బాల. ౧౪౬.

క్రుంకువెట్టు, క్రుంకులువెట్టు=౧. క్రుంకిడు,స్నానముచేయు.

ఉ. చొచ్చి చనంగ భోగవతిచొప్పున నొప్పు స్రవంతి యుండఁగా,నచ్చటఁ గ్రుంకువెట్టి వెస నవ్వలి కేఁగి...భోజరా. ౫.౨౨.

సీ. యజ్ఞతటాకంబునందుఁ గ్రుంకులు వెట్టి బ్రహ్మర్షిపితృతృప్తిఁ బ్రస్తరించి. భీమ.౩.౧౧౭.

౨. క్రిందికి వంగు.

గీ. ఎట్లు గ్రుంకులువెట్టుచు నేఁచి పట్టి,నీళ యొట పాఱెనేని బోనీక శరము,పొలువడఁ జేసి తెమ్ము భూపాల యొప్పఁ,జారుతర మైనయీ మృగచర్మ మైన. భా. రా. అర. ౨. ౩౭.

తప్పఁగ్రుంకు=తప్పించుకొను.

శా. ...కైలాసయానంబు పేరఁ, గొంత

కాల మస్తమయిఁ దప్పఁ గ్రుంకిపోయి, తీవు లేకున్నఁ జూవె మహావిభూతి, మెఱయ వచ్చియు నీయూరు పెలుపనైతి. పారి. ౪. ౬. ౨౦౭.

గీ. తప్పఁ గ్రుంకెడువేళ వాత్మఁ దలఁచి తలఁచి. దశకు. ౫. ౯౧.

జ: క్రుంకించు, క్రుంకుఁగడలి, క్రుంకుగట్టు, క్రుంకుడు, క్రుంకుడుగట్టు.

క్రుంకుఁగడలి. వి. ( క్రుంకు + కడలి ) పశ్చిమ సముద్రము.

గీ. నీట ముంచిన మేలివన్నియపసిండి, పూడె యనఁ గ్రుంకుఁగడలిలోఁ బ్రొద్దు వ్రాలె. నీలా. ౩. ౩.

క్రుంకుగట్టు=క్రుంకుడుగట్టు. వి. అస్త పర్వతము, పడమటికొండ.

క. ఈవిధమున నయ్యామవ, తీవైభవ మొప్పమిగుల దృష్టించుచు ని, ద్రావశత నయ్యాకుంజను, లైపడి రేరాజు గ్రుంకుగట్టున కరిగెన్. వైజ. ౧. ౧౧౦.

చ. పెనిమిటి యైనవెన్నుఁ డొగిఁ బ్రేముడి నిచ్చినఁ బుట్టు గ్రుంకుగ, ట్లనుదనరెండుచేతుల నొయారము మీఱఁగ నేలకొమ్మ దాల్చినపవడంపుఁజొట్టలుఁగుఁ జెందమునుంబలెఁ జూడ నొప్పెనం, తను దగఁ దూర్పునన్ వెనుకఁ దమ్ముల విందును జందమామయున్. యయా. ౫. ౩౦.

ఇట్లే క్రుంకుగుబ్బలి, మొ.

సీ. క్రుంకుగుబ్బలి... అచ్చ. రా. అయో. ౧౩.

సీ. క్రుంకుమల... ప్రబంధ. ౧౬౧.

సీ. క్రుంకుమెట్టు... యయా. ౨. ౭౦.

చ... క్రుంకుమెట్ట... పారి. ౨. ౩౨.

సీ... అస్తాద్రి పడమటికొండ, క్రుంకుఁగొండ యనగను... ఆం. భా. ౨. ౫౮.

క్రుంకుడు. వి. (√ క్రుంకు) (అస్తమయము.) చూ. క్రుంకుడుగట్టు.

క్రుంకుడుగట్టు=క్రుంకుగట్టు. వి. అస్తాద్రి.

సీ. సెలతాల్పు దేవర యలిగినఁ బని గాదు వెండిగుబ్బలి దేక యుండనిండు... వలి రేయుఁ బగలును నడక గానఁగ రాదు పుట్టు గ్రుంకుడుగట్టు వెట్టి రండు. యయా. ౩. ౩౪.

క్రుంగఁబడు=క్రుంగు. అ. క్రి. ( క్రుంగన్ + పడు-స్వార్థమున) దిగఁబడు, క్రిందికి పోవు.

ఆ. ధరణి గ్రుంగఁబడఁగఁ ద్వరతోడ దవ్వఁగాఁ, దుంగభంగి నిడుదచెంగ లిడుచు. భా. రా. కిష్కి. ౪౩౧.

క్రుంగిలు(ల్లు)=క్రుంగు. (√ క్రుంగు) ముడుఁగు, సంకుచితావయవ మగు.

ఉ. ఇగ్గడు పన్కఁ - కుం బయికి నీడ్చినఁ బైఁట దొలంగఁజేయఁ గే, లొగ్గడు రెమ్మి పోఁకముడి యూడ్చినఁ గ్రుంగిలి రెండుకొంగులుం, బిగ్గ నడంచుచున్ విడిచిపెట్టదు బాల ననం బనేమి యా, సిగ్గుకు సిగ్గు లే దిటులు సేసినపిమ్మట నుండ వచ్చునే. విజ. వి. ౨. ౩౦.

క్రుంగు. అ. క్రి. ౧. దిగఁబడు.

సీ. ఆకాశవాహినీసైకతంబుల ఖురాంచలటంకములు గ్రుంగ జడనుపడిన. కాశీ. ౩. ౧౨.

౨. అడఁగు.

సీ. క్రుద్ధకుంభోద్భవభ్రూలతాకౌటిల్యవికృతిఁ గ్రుంగని నాఁటివింధ్యశిఖరి. నైష. ౧. ౩౫. దశా. ౧. ౨౬౧.

౩. తగ్గు; నశించు; మరణించు.

ఉ. కోపము పొంగఁ గ్రుంగు నొకకొన్నిదినంబులు... దశకు. ౫. ౨౩. ఆం. భా. ౩. ౭౫.

సీ. పరమసాధుజనంబుభావంబు లుప్పొంగఁగలుషచారిత్రులబలిమి గ్రుంగె. కళా. ౪. ౧౨౩.

శా. కాశీదేవనదీజలంబులను గ్రుంకం గ్రుంగు వ... సురా. ౨౦.

సీ. సమయుట యీల్గుట చావు చక్కడఁగుట
క్రుంగుట త్రుంగుట కూలుట...మిత్తి పెన్ని
దుర నా మీఁఱుసు మరణము. ఆం. భా. ౨.
౨౨౫.

౪. వంగు, క్రింది కొదుఁగు; పొట్టిదగు.

(మల్లయుద్ధవర్ణనము) సీ...బలువిడి వాఁడు పై
నడరిన జరగక యువనిఁ గ్రుంగి, నిలుచు...
భార. విరా. ౨. ౧౫.

మ. చరమాశాంతరవీథిఁ గైకొని సరోజాతప్రి
యుం డేఁగఁగా,సరి నంతంతకుఁ గ్రుంగి క్రుం
గి కనకస్తంభఁబు చిత్రంబుగా, నరసీపూర
సమస్థితం బగుటయుఁ సర్వాంసహాధీశుఁ
డుఁ, వారవారం దిగి వచ్చి యప్పురిని దా
విశ్రాంత చేతస్కుఁడై. విక్ర. ౨. ౧౧౪.

క్రుంగిపోవు=క్రుంగు.

(నశించు)

గీ. కొండియంబున సఖ్యంబు గ్రుంగిపోవుఁ, గఠి
నభాషలఁ బడిపోవుఁ గాతరుండు.నా.పంచ.
౧. ౧౪౪.

(హీనసత్త్వుఁ డగు.)

(వా) వాఁడు కష్టములచేత క్రుంగిపోయినాఁడు.

జ: క్రుంగఁబడు, క్రుంగిలు.

**క్రుంచ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఆఁడుకొంచ, ఒక విధ మైనఆఁడుకొంగ. ౨. ఆఁడుహంస.

**క్రుంచము.** సం. వి. చ్.పుం.౧. క్రౌంచము, కొంచ, ఒకవిధ మైనకొంగ. ౨. హంస, అంచ. అ.పుం. ౧.కొంచపిట్ట, ఒకవిధమైన కొంగ.౨. ఒకవిధమైనవీణె. ౩. క్రౌంచపర్వతము, కొంచగుబ్బలి.

**క్రుక్కించు.** స. క్రి. (√ క్రుక్కు) క్రుక్కఁజేయు.

(అదిమించు, కూరించు)

వ...కేదారపంకంబులోనఁ [illegible]
ర్ణమయం బైనచేరంబుఁ గ్రుక్కించి... పర
మ. ౫. ౨౭.

**క్రుక్కిదము.** విశే. (√ క్రుక్కు) ౧. నిండినది.

ఉ. అక్కజమై మహార్ఘనివహంబు సదుక్తులు మె
చ్చఁ జూచినన్, గ్రుక్కిద మైనసత్కృతి
...కు. సం. ౧. ౩౮.

౨. పూడినది.

ద్వి. గ్రుక్కన భస్మంబు గాఁ బురంధ్రంబు, గ్రు
క్కిదంబై కట్టుకొని కీలుకొనుదు.పండితా.
పురా. ౧౩౪ పా.

**క్రుక్కు.** స. క్రి. (క. కుక్కు) ౧. (పేను మొదలగువానిని) బొటనవ్రేలిగోటితో నొక్కు.

గీ. ఎలయుసీత్కారములతోడ నీళ్లు గ్రుక్కి,
యంటుసొంటులు పరికించి యంట్లఁ బొడిచె,
గోరుముక్కల దిగమువ్వ తూరుపెత్తి, సెలు
లఁ గలిగినపేల నన్నింటెఁ దిగిచె. పాండు.
౩. ౩౦.

సీ. కన్నగాండ్రగుచు నగళ్లు ప్రవేశించి యం
దు సెంతటివార లడ్డమైనఁ. ఆ. జక్కడఁ
చుచుఁ బేను గ్రుక్కినపాటిగా, నిష్ట మైన
యర్థ మెల్లఁ బడసి. ప్రభా. ౧. ౧౧౮.
(పేనుగ్రుక్కినపాటిగా:-కొంచెమైన నిత
రులకు తెలియకుండ, చప్పుడు లేకుండ)

౨. అడఁచు.

వ...కార్యేచ్ఛం గన్నీరు గ్రుక్కుకొని...ఆము.
౬. ౬౬.

సీ. పాడమురసావేశమున వచ్చునగ్నోక్తు లాదవి
వాలుకకు రాకుండఁ గ్రుక్కి. మనుచ. ౩.
౯౭. నరస. ౧. ౬౪.

౩. అదుము, కూరు.

ఉదా: పిల్లలకు అన్నము క్రుక్కి క్రుక్కి పెట్టఁ
గూడదు.

౪. కూర్చు, చొప్పించు.

ఉ. అక్క[illegible]ములాయతాక్షుఁడు భయంకర బాహు

  

వు దైత్యుకుక్షిలోఁ, గ్రుక్కినఁ దద్దయుఁ బలిసి రోగములేశ్శులచేత మేనికిన్, వెక్కసమైనచందమున విహ్వలభావముఁ జేసి దేహమున్, వ్రక్కలు వాపి చంపె...వి. పు. ౭. ౩౨౮.

వి. వంచన, మోసము.

సీ...వంచన మెపంగు. గీ. జుమ్ఁగు క్రుక్కి కిసుకు పిక్కు జుణుఁగు మొఱఁగు, డనఁగ... ఆం. భా. ౨. ౨౯౨.

జ: క్రుక్కించు, క్రుక్కిడము, క్రుక్కుడు.

**క్రుక్కుడు.** వి. (√క్రుక్కు) ౧. క్రుక్కుట. (శ. ర.) ౨. పీడనము, అదుముట.

సీ...క్రుక్కుడము డొత్తు,డ మ్మొత్తు నాఁ బీడనమ్ము విరాజిల్లు...ఆం. భా. ౧. ౧౫౦.

**క్రుచ్చు**=కూర్చు. స. క్రి. (చూ. వా క్రుచ్చు)

**క్రుత్తు.** సం. వి. ధ్. స్త్రీ=క్రుధ.

**క్రుధ.** సం. వి. ఆ. స్త్రీ. కోపము, కినుక.

**క్రుద్ధము.** సం. విణ. (అ. ఆ. అ) కుపితము, కోపము నొందినది. వి. అ. న. కోపము.

**క్రుధ్యత్.** సం. శత్రు. కోపపడుచున్న.

**క్రుమ్మరించు**=కుమ్మరించు. స. క్రి. క్రుమ్మరిలఁ జేయు.

(అధికముగా ప్రసరింపఁజేయు.)

గీ. కమ్మనిపిసాళివలపులు గ్రుమ్మరించు, కమ్మజవ్వాదిఁ దలయంటెఁ గలికి యొకతె. వసు. ౫. ౧౦౯.

(అధికముగా వెలువఱుచు)

సీ. క్రోధపావకుఁ డుండుకుంభంబులన నేత్రగోళముల్ మంటలు గ్రుమ్మరింప. ఉ. రా. ౩. ౩౮౫.

(కుండలు లోనగువానినుండి యొక్కసారిగా జలాదులను పడఁజేయు.)

గీ. కడవలను గ్రుమ్మరించినవడువు... యుమండంగ వఱదల గ్రుంతమిట్టి, లొక్కకొలఁదిగఁ బాఱె నీళ్లక్కజముగ. ద్వా. ౧౦. ౮౮.

జ: క్రుమ్మరిల్లు.

**క్రుమ్మరిల్లు(లు)**=కుమ్మరిలు. అ. క్రి. (√క్రుమ్మరించు) కుండ లోనగువానినుండి యొక్కసారిగా జలాదులు పడు; పడు.

క. భృంగీసంగీతస్వన, మాంగళ్యసుగంధకుసుమమంజరుల బయల్, పొంగుమరందము సెవమున, శృంగారరసంబు గ్రుమ్మరిలుపొదరింటన్. కవిరా. ౨. ౧౬౧.

వ...చూర్ణంబులైనకర్ణంబులును వ్రక్కలైన ప్రక్కలును మురిసినశస్త్రంబులును విరిసిన జోళ్లును గ్రుమ్మరిల్లినబొమ్మిడికమ్ములును గుంపులుగొనుపడగలును...పద్మ. ౧౦. ౨౯.

**క్రుమ్మరు.** అ. క్రి. ౧. తిరుగు, సంచరించు.

ఆ. క్రూరవనమృగములు గ్రుమ్మరుచున్నయీ, విజనవిషమశైలవిపినభూమి. భార. ఆది. ౭. ౭౫.

క. ఇమ్మడువు మీనములతో, నిమ్ములఁ గూడాడి పెరిఁగి యిన్నాళ్లును బ్రేమమ్మున నుండితి నొంటిగఁ, గ్రుమ్మరలే నింక నన్నుఁ గొనిపోవఁగదే. నా. పంచ. ౧. ౨౨౬.

౨. విహరించు.

ఉ. ఈమెలదోఁట నుండఁ దగ దింకొకచక్కి వసింప నేఁగుఁ డో, ధీయుతులార పాండ్యవరదేవతనూభవ కేళికాగృహ, ప్రాయత నిందు నెప్డు నిరపాయమున న్విహరించుచుండు నేఁ, డాయెలనాఁగ గ్రుమ్మఱుటకై యెద వచ్చెఁ దలంగుఁ డిత్తఱిన్. శుక. ౧. ౩౨౮.

వ...సుకన్య యనునది యిష్టసఖులతోఁ గ్రుమ్మరుచున్న...భార. అర. ౩. ౧౭౬.

౩. ప్రవర్తించు.

క. ఉరులింగము బోధించిన, కరణిన్ గ్రుమ్మరుచు... లోకమోహకరముగ వారలగ

పో,వరణములో బయలనుండి వైచుచు నుం
డెన్. చెన్న. ౫. ౨౨౪.

క్రుమ్ము=కుమ్ము[1]. స. క్రి. పొడుచు.
వ. ఇట్లు మధుసూదనుం డేయుసాయకంబులు... నొసళ్లు గ్రుమ్మియు...ఉ. హరి. ౧. ౧౪౭.
సీ. కంసారి ఓగియారఁ గౌఁగిటఁ జేర్చిన గుబ్బ లఁ గసిదీఱఁ గ్రుమ్మెఁ గొమ్మ. రాధికా. ౨. ౧౩౬.
దండకము. మ న్నంతయుం గొంచు బల్పాఁపరా యిక్కకుం బ్రాఁకు బంగారపుంగంటికేద్రి మ్మరిం జన్నుపుంబందిపై చెండి వాల్గొమ్మునం గ్రుమ్మవా ... అచ్చ. రా. యు. ౧౬౧. ఉ. రా. ౧. ౬౭.
వి. పోటు, పొడుపు.
సీ. కలుకుగుబ్బల బొమ్మఁ గ్రుమ్ము లేర్పడ గ్రుచ్చి తనివారఁ గౌఁగిట ననఁగి పెనఁగి. ఉ. హరి శ్చ. ౪. ౧౩౨.
క్రుమ్మడఁగించు=అడఁచు.
సీ. దయ పిఱిఁదికి వైచి నయము క్రుమ్మడఁగించి బాంధవం బురివి పాపమునఁ బొదలి. దశకు. ౩. ౯.
క్రుమ్మెసలాడు=కుమ్ములాడు, పొడుచు.
మ... రాచబి,డ్డలునున్ వెల్మదొర ల్దురమ్మునకు నొడ్డారించి క్రొవ్వాఁడి బాఁ,కులతోఁ గ్రుమ్మె సలాడ సాగి రలుకన్ గోవిందశబ్దార్భటిన్. రంగా. ౩. ౨౧౭.
జ: క్రుమ్ముడు, క్రుమ్ముడుపడు, క్రుమ్ములాడు.

క్రుమ్ముడు. వి. (√క్రుమ్ము) పోటు, పొడుపు. (శ. ర.)

క్రుమ్ముడుపడు. అ. క్రి. (√ క్రుమ్ముడు) పోటుపడు. (శ. ర.)

క్రుమ్ములాడు=కుమ్ములాడు. అ. క్రి. (క్రుమ్ములు+ఆడు) పోట్లాడు.
గీ. కొసర కాఁబోతు నాఁబో... క్రుమ్ములాడ నడిమియాఁజెయ్యగతి వచ్చె నాకు నిపుడు. కాశీ. ౨. ౧౦౪.
ఉ. కొమ్మ బెడంగుసొంపుఁ గనుఁగొన్న కనుంగవ దత్తఱింపఁగా, నమ్ముని యాఁప నోప కపుడల్లన ఱెప్పలు విచ్చుఁ గ్రమ్మఱం, గ్రమ్మఱఁ గృష్ణ కృష్ణ యని గ్రక్కున మోడ్చు మగుడ్చుఁ గ్రమ్మఱం, గ్రమ్మఱ మూయు మన్మథ వికారము ధైర్యముఁ గ్రుమ్ములాడఁగన్. కళా. ౩. ౧౯.

క్రుయ్యఁబాఱు=క్రుయ్యు. (క్రుయ్యన్+పాఱు-స్వార్థమున.)

(కృశించు)

సీ. పలికి యొంతయుఁ గ్రుయ్యఁబాఱిన నునుఁజెక్కులందంద తడిపెడు నశ్రువారి. హరి. ఉ. ౩. ౪౭. (వావిళ్లప్రతిపా.)

క్రుయ్యు. అ. క్రి. (సం. కృశ్.) ౧. కృశించు; తగ్గు, క్షీణించు.
మ. మలినుండై కడు డస్సి క్రుస్సి...కు.సం.౧౦. ౪౫౬.
చ...తలల్ దిగవైచి నోరఁ ద్రే,గుడు దొరఁగంగ నెంతయును గ్రుస్సి ఖురంబులు ప్రస్సి పుర్వులు,గ్గడువుగఁ బాఱఁ దద్దయును గాతియఁ బొందె ప్రజంబునన్ బసుల్.హరి.పూ. ౬. ౪౩.
క. వెయ్యేం డ్లయ్యును నీతోఁ, గ్రయ్యంబడి యున్నవాఁడఁ గామసుఖములం, గ్రుయ్యు దొరయించు కైసన్, దయ్యాదు కొనలిడియెఁ దృష్ణ నవపద్మముఖీ. భాగ. ౯. ౫౭౭.
మ. నినుఁ జింతించిన విన్నఁ జేరుకొనిన్ నిర్మాలమై క్రుస్సి పా,పనికాయంబు వినష్టమానఁట... భాగ. ౧౦ పూ. ౧౧౧౭.
౨. వెనుదీయు; వెనుకపడు.
ఉ. ఎయ్యెడఁ గయ్యముల్ గలవొ యెవ్వరు చి... క్రుయ్యక యంచుఁ

గోరి వెనఁ గ్రుమ్మరుచుండుము కొండు నేను ...హరి. పూ. ౮. ౧౧౬.

వ.... తరుణతరుణీజనంబులు...వినోదంబుల నద టఁపిరాతి కడచి చనం బంగ్యాంధజరత్ప్రము ఖులు క్రుస్సి యోలాడుపడ నెపనెడం గా పలియై తగువారు నడిపింప...హరి. పూ. ౬. ౨౨.

జ: క్రుయ్యాఁబాటు.

క్రుళ్లగించే. అ. క్రి. (✓ క్రుళ్లు)-మనస్సులో-దుఃఖించు. (శ.ర)

క్రుళ్లగింత. వి. (✓ క్రుళ్లగించే) -మనస్సులో-దుఃఖించుట. (శ.ర)

క్రుళ్లు=కుళ్లు. అ. క్రి.

(అవియు, పగులు)

గీ. గుండియలు గ్రుళ్లఁ దన్నినఁ గ్రుక్కుమిక్కు, రనక యాతనికినుక చల్లారనిచ్చె. శుక. ౩. ౬౩౩.

(-మనస్సులో-దుఃఖించు)

సీ. కోపశోకంబులఁ గ్రుళ్లుచుఁ దనలోన మండు చు దితి సాల మఱుఁగఁ దొడఁగె. భాగ. ౬. ౫౦౯.

జ: క్రుళ్లగించు, క్రుళ్లగింత, క్రుళ్లుపోతు.

క్రుళ్లుపోతు=కుళ్లుపోతు. విశ. (✓ క్రుళ్లు.) క్రుళ్ల గించుస్వభావము కలవాఁడు. (శ. ర)

క్రుశ్యమానుఁడు. సం. విశ. (అ.ఆ.అ) ౧. తిట్టఁ బడుచున్న వాఁడు. ౨.పిలువఁబడుచున్న వాఁడు.

క్రుశ్వము. సం. వి. న్. పుం. ౧. నక్క. ౨. కొం గ. (కే. ని.)

క్రుశ్వరి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఆఁడునక్క. ౨.ఆఁ డుకొంగ. (కే. ని.)

క్రుష్టము. సం. విశ. (అ. ఆ. అ) ౧. అఱచినది.౨. యుద్ధాదులకు పిలువఁబడినది. ౩. తిట్టఁబడినది. ౪. ఏడ్చినది. వి. అ. న. ౧. కూఁత, అఱపు. ౨. ఏడ్పు. ౩. చప్పుడు, ధ్వని.

## క్రూ

క్రూర. సం. వి. ఆ. స్త్రీ. ౧. రక్తపునర్నవ, ఎఱ్ఱగలిజేరు కీ. ౨. బదరి, రేఁగు కీ. ౩. కంటకారి, వాఁకుడు కీ.

క్రూరకోష్ఠుఁడు. సం. విశ. (అ. ఆ. అ) -క్రూరమైనకోష్ఠము కలవాఁడు-బద్ధకోష్ఠుఁడు,మలబంధము గలవాఁడు.

క్రూరగంధము. సం. వి. అ. పుం-చెడ్డకంపు కొట్టునది-గంధకము.

క్రూరదృక్కు. సం. విశ. (శ్) క్రూర మైనచూపు కలవాఁడు. వి. పుం. ౧. పిసునుఁడు, దుష్టుఁడు. ౨. శని. ౩. అంగారకుఁడు. స్త్రీ. క్రూరదృష్టి, క్రూర మైనచూపు.

క్రూరధూర్తము. సం. వి. అ.పుం. నల్లఉమ్మెత్త కీ.

క్రూరము. సం. విశ. (అ. ఆ. అ) ౧. కనికరము లేనిది. ౨. పరుసనిది, కఠినము. ౩. ఉగ్రము,భయంకరము. ౪. హింసకము, నాశము సేయునది. ౫. ఉష్ణము, వేంద్రము కలది. ౬. కఱ్ఱనైనది.౭. దరిద్రము, ధనము లేనిది. వి. అ. పుం. ౧. డేగ. ౨. కంకము, రాపులుఁగు. (రా. ని) ౩. (జ్యోతి)మేషాదిరాసులలో బేసిరాశి. న. అస్థి, ఎముక. (కే.ని)

క్రూరరావి. సం. వి. న్. పుం. ద్రోణకాకము,మాలకాకి. (రా. ని)

## క్రై

క్రై. (వృత్తియందు 'క్రైవ' శబ్దమునకు తుదివర్ణము లోపింపఁగా మిగిలినరూపము.)

ఉదా: క్రైగస్సు, మొ.

**క్రేంకారము.** సం. వి. అ. పుం=క్రేంకృతి.
(రథనేమియొక్క-ధ్వని.) వ... తక్కినదండనాథులం దానును రథనేమీక్రేంకారభేరీభాంకారశింజినీటంకారవీరభటహుంకారంబులన్ వియత్తలంబు నొంది యెదుర్చుటయు ...శాం. ౫. ౨౧.

క్రేంకారమిచ్చు=ధ్వని చేయు, కూయు.
సీ. కొక్కొ-రోకో యని కొమరసామిరథంబు కంఠంబు సాఁచి క్రేంకారమిచ్చె.భీమ. ౨. ౨౮. (క్రొక్కా-రమిచ్చె. శ. ర.పా.)

**క్రేంకృతి.** సం. వి. ఇ. స్త్రీ=క్రేంకారము. ౧.శారికాదిధ్వని.
ఉ...కలారవ, క్రేంకృతి శారికాపికశుకీవిహగాదులచే వినంబడెన్. రామా. ౨. ౧౦౪.
చ. కలయఁగ వారిదేవతలు గాంచుసరోవరదంభదర్పణం,బులపయి దట్టపుంజిలుము వోవఁగఁదా రలకంచు గీయఁగా,బలె నలువంకలం గలయఁ బాయక తేలుచుఁ బద్మరేణువుల్, కలఁకులఁ బాసి పోఁ జెలఁగెఁ గ్రేంకృతు లిచ్చు మరాళమాలికల్. ఆము. ౪. ౧౮౦.
౨. నూపురాదిధ్వని.
చ... అందియల క్రేంకృతి గంకణమేఖలాధ్వనిం, బ్రకటముసేయ...కాశీ. ౪. ౧౫౪.

**క్రేఁగన్ను.** వి. టొ. (కేవ+కన్ను) నేత్రాంచలము; కటాక్షము.
సీ... కడకన్నునంగఁ గ్రేఁగన్నునంగ. గీ. నగునపాంగంబు...ఆం. భా. ౨. ౧౪౪.
గీ. కడలికడనుండి మగిడి క్రేఁగంటిదృష్టి, యిడుచుఁ బాఱుచు జడదారియొడయు లపుడు. దశా. ౧. ౧౭౮.
సీ. క్రేఁగంటనైన వీక్షింపవు ... వరాహ. ౨. ౫౬. కాశీ. ౪. ౧౪౮.

**క్రేఁగయి.** వి. (క్రేవ+కయి) ప్రక్కచేయి.
చ. మంతపుఁ గోడుతాలుపరిమన్కి-బిదారపువెట్టుఁ గ్రేఁగయిం,గొంచక యొత్తినట్టి నిను... అచ్చ. రా. యు. ౧౩.( క్రేగయి-శ.ర.పా.)

**క్రేఁటు.** అ. క్రి. ౧.గొంతు సవరించుకొనుటకై ఒకవిధ మగుధ్వని చేయు, సకిలించు. (శ. ర.)
వ. ఉమ్మలిక యింత యేటి కనుటయు నబ్బోటి గ్రేఁటుచు నిట్లనియె. మనుచ. ౬. ౯.
౨. తొట్రుపడు.
ఉ...అమాసచీకటిం, గ్రేఁటుచు నేఁగుదెంచె నడురేయిని జోరుఁడు కన్నపెట్టఁగన్.భల్లా. ౧. (శ. ర.)
వి. గద్గదకంఠమును బాగుచేసికొనుటకై చేసెడి ధ్వని, సకిలింత.
సీ. తత్సాధుకృద్ధ్వని దనరును గ్రేఁటన...ఆం. భా. ౧. ౧౨౨. (గ్రేఁటు-అని.ప్రా)
జ: క్రేఁటుకొను.

**క్రేఁటుకొను=క్రేఁటు.** అ. క్రి. (క్రేఁటు+ కొను-స్వార్థమున)
(గొంతు సవరించుకొనుటకై యొకవిధ మగుశబ్దము చేయు)
క...గండఫలకభాగఁబులపైఁ,గాటుకకన్నీ రొలుకఁగ,మాట వెడలఁ గ్రేఁటుకొనుచు మానిని పలికెన్. మనుచ. ౩. ౯౨.
(వరూథిని) క...అతనిఁ జూచి మఱి, గోపమునం జూచి గ్రేఁటుకొనుచుం బలికెన్. మనుచ. ౨.౬౯.

**క్రేఁదొట్టు.** అ. క్రి.(క్రేవ+తొట్టు) గట్టొరయు.
వ. ఇరువురగదలును మసకంబునం బెనంగుపాములపగిదిం దాళించుపాసికలపోలికఁ గ్రేఁదొట్టు కరళ్లకైవడిఁ గలయ బెరయ...ఉ. హరి. ౩. ౬౪. (కైతొట్టు. ముద్రి-క్రేతొట్టు. శ. ర. పా.)

**క్రేఁగాలి.** వి. (క్రేవ+గాలి) ప్రక్కగాలి.

గీ. వాఁడు నానాఁటి కభివృద్ధి వఱలఁ బెరిఁగి, కాకలను దేఱి గడి మీఱి గట్టిపాఱి, రాలుగాయత నాన బేరజపుదారి, నారితేఱియు బలుగుంట మారి యయ్యె. హంస. ౫. ౧౦౦.

గట్టిల్లు. అ. క్రి. (సం. ఘట్) సమకూడు, సంభవించు, ఘటిల్లు.

ద్వి. సెట్టికిఁ గష్టంబు లిట్టు దేవరకు, గట్టిల్లె నింతియ కావున మఱియు, భక్తుని మ్రింగినపచ్చిగక్కనుఁడు, భక్తుని జంపఁ జాల్పడునూనగాఁడు. బస పు. ౪. ౬౪౩ పం. (ప్రయోగాంతరము కనఁబడలేదు.)

గట్టిన=గట్టివా.

విశ. (ధూర్తుఁడు.)

ఉ. గట్టిన చేఁతలుం బసులఁ గల్లతనంబులు నీవు పుట్టఁగాఁ, బుట్టినవి... పారి. ౧. ౧౨౭.

గట్టివా. విశ. (గట్టి+వా) ౧. మాటకారి.

(కార్తవీర్యార్జునుని క్రీడావర్ణనము)

గీ. గట్టివా యొక్కఁతె సహస్రకరునిమీఁదఁ, దఱమ గాఁక్కనుశైవాలకమును నించి, తలఁప నిది యొక్కటియె యయుక్తం బటంచు, విభుఁడు చిఱునవ్వు నవ్వ నవ్వించె సఖుల. ఉ. రా. ౩. ౨౧౫.

౨. కఠినమైనవాక్కు గలది, పరుషమైనవాక్కు గలది; ధూర్తురాలు; దుష్టురాలు.

గీ. తల్లి పలుకులఁ జెవులు చీఁదఱగొనంగ, బిట్టు మొరసెడు వస త్రాగినట్టు లట్టి, గట్టివాజాడ లెట్టుగాఁ బట్టువడియె, బెట్టుగా నిన్ను వెనఁ జెఱఁ బెట్టియుడను. నీలా. ౩. ౨౯.

మ. ...లోఁ దాల్మియూ, దనిఁ బాడం బులకాంకురంబు లొనకూడం గట్టివాయుంతి వేఁచని యవ్వాకిటి కడ్డమై నిలిచి కాంక్షం బట్టఁగాఁ బోయినన్. సారంగ. ౨. ౯౩.

చ. ఉడుగక బుత్తిముత్తు లిడ నోపి యొసఁగల్ల లేక యుండఁ గాఁ, గడు సెదలోఁ దలంచుకొని గాటపుమక్కువఁ బ్రోదిసేయున, య్యొడయనిఁ బాసి యాగడపుటోజలఁ ద్రిమ్మరునట్టి గట్టివా, పడఁతుక యెయ్యెడన్ దలఁకుఁ బాసిన వెండ్రుక గాదె యెన్నఁగన్. అచ్చ. రా. అయో. ౭౨.

౩. దుష్టుఁడు.

దండకము... కన్నతొల్లొబ్బుటైనిం బట్టి యిట్టట్టుగా బిట్టు దట్టింపుము జట్టిల జెట్టుబ్బట్టి వారక్కసు న్వెక్కసంబైన పేరుక్కుతో నుక్కుఁ గంబంబునం బుట్టి గిట్టింపవా... అచ్చ. రా. యు. ౧౬౧.

౪. దిట్టఁడు.

సీ. పెనుఁబాఁపపేరు వేసినగట్టివా కుంభిదైత్యవరోధవైధవ్యదాయి. వరాహ. ౬. ౮౯.

౫. ధూర్తస్త్రీ, గట్టివాయి.

సీ. గట్టివాజంత టాఁగ గయాళి యనఁగను ధూర్తనామాభిధ దోఁచుచుండు. ఆం. భా. ౨. ౧౧౭.

గట్టివాతనము. వి. (గట్టివా+తనము) గయ్యాళితనము, ధార్త్యము.

వ. వెంట వెంట వచ్చు నిజచ్ఛాయలం గని తమ్ము నంత నంతఁ జూపెట్టుక వచ్చుచొంటుఁ దమ్మికంటు లని యుప్పట్టున గట్టివాతనంబులు గనుపట్టఁ దమనేరమి వారిపై నారోపించి ... చంద్రా. ౫. ౬౩.

గట్టివాయి=గట్టివా.

వి. (ధూర్తస్త్రీ, గయ్యాళి.)

క. వంచాడించక తాలిమి, డించక బిగుసాళి దల్లడించక మదిలో, నించుక యైనను ..జలి, యించక యాగట్టివాయి యిట్లని పల్కెన్. సారంగ. ౩. ౨౦౬.

సీ. గట్టివాయి యనంగ గయ్యాళి యనఁగ య

న ధూర్తసతికిఁ నాహ్వాయము లమరు. ఆం. సం. మాన. ౮. సాం. ని. మాన. ౫.

**గట్టివాలు.** వి. ('గట్టువాలు' అని శ. ర. కాని భారతాదుల పెక్కుప్రతులపాఠమును బట్టియు, కన్నడమును బట్టియు 'గట్టివాలు' అని గ్రహింపఁబడినది.-క. గట్టి=పరిమళద్రవ్యములయుండ. వళ్తి - స్త్రీప్రత్యయము. గట్టివళ్తి=సైరంధ్రి, గంధకారిక.) సైరంధ్రీజాతిస్త్రీ, పరులయింట నుండి గంధపుష్పములచే నలంకరించు స్వతంత్రస్త్రీ; గంధపుష్పాదుల నమ్ముస్త్రీ.

ఆ. ఏను గట్టివాలు నాన నా కివ్వరు, కడుపుకూడు
వెట్టి కట్టఁ జీర, యిచ్చి సాకతమున నేలుదు
రట్టివాఁ, డలకుఁ బనులు సేసి మెలఁగుబుద్ధి.

క. వచ్చితి ... భార. విరా. ౧. ౨౯౭, ౨౯౯

సీ. గట్టివాలై లక్ష్మి గైసేయుచున్నది చేరి యంతః
పురస్త్రీజనముల. కాశీ. ౭. ౫౭.

(కుబ్జ అనినమాట) మ. కలపం బెవ్వరు గూర్చి తెచ్చి
న నిక్కం బొల్లఁ డెల్లప్పుడున్, జలకం బా
డి మదాగమంబ మదిలోన న్వ్యార్చుఁ గంసుం
డు రా, జెలమిన్ మెచ్చినగట్టివాలిది యనన్
హృద్యక్రియావిద్యఁ జే, శలనై యుండుదు
...హరి. పూ. ౯. ౨౮. కాశీ. ౨. ౧౮౬.

గీ. ఏకజాతిసుమంబు లనేకజాతి, కలితసుమనఃక
దంబమ్ముగా నొనర్చి, వలచి తరితీపు పుట్టించి
పిలుతు రర్థి, గట్టివాలుపడంతు లప్పట్టనమున.
తపతీ. ౧. ౬౧.

చ. దల మగుచంద్రఖండములు దారలు సాంకవ
మొప్పపాణిపాటల మగుదంతభృంగరవటంబు
శశాంకుఁడు గుంకుమైనచీ, గలజిగి కెంపుగా
బయటిరథ్యల నొప్పుదు రిందుకాంతవే, దులప
యి సంధ్యయే బహుళిఁ దోఁచె నన న్పురి గ
ట్టివాల్పతుల్. అము. ౨. ౨౩. చంద్రా. ౧.
౩౬.

**గట్టు.** వి. ౧. పర్వతము.

ఆ. గాడ్పువేల్పుపట్టి గట్టెక్కి యుక్కునఁ, జా
చె నూటిరేటి కోటి మగని, భావినేతు వచ్చు
పడ లంకకడపను, నూత్రపట్టుమాడ్కిఁ జా
డ్కి వెలుఁగ. రామా. ౬. ౯౨.

సీ... గట్టు నాఁ దీరనగంబు లలరు. ఆం. భా. ౩.
౫౩.

౨. తీరము, ఒడ్డు. ఆం. భా. ౩. ౫౩.

గట్టులమొకిమీఁడు=అద్రిరాజు, హిమవత్పర్వతము. రామ. ౨౧౩.

గట్టురాజల్లుఁడు=శివుఁడు. రామా. ౧. ౮౩.

గట్టుచాటునిక్షేపము=పర్వతముక్రింద నుండునిధి. (అసాధ్యము, వశము గానిది అని భావము)

గీ. జనమనోరమ ధాన్యమాలిని గళావతియుఁ ది
లోత్తమ పూర్వచిత్తియుఁ బ్రమోహి, మొ
దలుగా నింతులకుఁ జింత యొదవె నళని, చిత్త
మది గట్టుచాటునిక్షేప మనుచు. కవిరా. ౩.
౮౭.

జ: గట్టుఁద్రిమ్మరి, గట్టుతాలుపు, గట్టుదాయ, గట్టుపట్టి, గట్టురాచూలి, గట్టులరాయఁడు, గట్టులఱేఁడు, గట్టువిలుకాఁడు, గట్టువిల్తుఁడు, గట్రాచూలి, గట్లనూఁడు.

**గట్టుఁద్రిమ్మరి.** వి. (గట్టు + త్రిమ్మరి.) మలత్రిమ్మరి, వానరము, కోఁతి.

క. ఉమ్మలిక యుడిగి తద్దయు, నెమ్మదితో నుండు
మిపుడు నీ చెంతకు బీ, ర మ్మొదవఁగ నగ్గట్టుం,
ద్రిమ్మరి మొన గానిఁ బట్టి తెచ్చెద నెలమిన్.
అచ్చ. రా. సుం. ౧౨౯, ౧౧౨.

**గట్టుతాలుపు.** వి. (శ. ర-గట్టు + తాలుపు) వగధరుఁడు, విష్ణువు.

సీ. మశకపంక్తులయట్లు మాత్స్య రుద్ధతిఁ జావ గ
ట్టుతాలుపు చెట్టు బెట్టుఁ జెంద, మకరవైఖరి
వైరినికరంబు చెలరేఁగ వనజనాభుఁడు వార్ధి
వహి వహించె. ఉ. రా. ౨. ౫౦. ('గట్టుఁదా
ల్పు' పాఠాంతరి)

**గట్టుదాయ.** వి. (గట్టు+దాయ) గోత్రభిత్తు, దేవేంద్రుఁడు.

గీ. బమ్మయ మ్మెర్చి యజ్ఞగబంటుమీఁద, వైవనది సంపఁ జాలక వానిఁ గుదియఁ, గట్టి వైచిన మేనల్లఁబట్టి వైచి, తండ్రికడ నిల్పె నగ్గట్టుదాయనూఁడు. అచ్చ. రా. సుం. ౧౩౨. (గట్టుదాయనూఁడు=ఇంద్రజిత్తు.)

**గట్టుపట్టి.** వి. (గట్టు+పట్టి) ౧. మైనాకుఁడు.

సీ. గట్టుపట్టినిఁ జెట్టపట్టి చట్టువ లేలినట్టి జెట్టినిఁ గ్రోలుదిట్టతపము. అచలా. ౩. ౪౧.

౨. పార్వతి. వరాహ. ౯. ౫౯.

**గట్టురాచూలి.** వి. (గట్టు+రాచ+చూలి.) హిమవత్పుత్రి, పార్వతి.

దండకము... ఈశునిల్లాలవై యున్న యాగట్టురాచూలివి నీవ కావే... రాజ. చ. ౨. ౯౯.

**గట్టుల(ల్ల)రాయఁడు**=గట్టులఱేఁడు. సాం. ని. స్థా. ౫౫.

**గట్టుల(ల్ల)ఱేఁడు.** వి. (√గట్టు) హిమవంతుఁడు, నగాధిపుఁడు. (శ. ర.)

**గట్టువిలుకాఁడు.** వి. (√గట్టు) శివుఁడు. అచ్చ. రా. సుం. ౧౫౨.

**గట్టువిలుతు(ల్తు)ఁడు**=గట్టువిలుకాఁడు. ఆం. సం. దేవ. ౬.

**గట్రాచూలి**=గట్టురాచూలి.

శా. ఎట్రా శేషుఁడు పోతరించి సభలో నెగ్గాడె నా రత్నమిూఁ, దట్రా వాసుకితక్షకాదిధృతరాష్ట్రామాత్యకర్కోటకుల్, చుట్రా నిల్తురు గాక నన్ను సమరక్షోణిన్ విజృంభించి యా, గట్రాచూలివిభుం డెదిర్చిన నహంకారంబు వారించెదన్. జై. భా. ౭. ౯౨.

(ఇట్లే 'గట్లఱేనిబిడ్డ' ఆం. భా. ౧. ౪౦.)

**గట్లనూఁడు.** వి. (√గట్టు) గోత్రభిత్తు, దేవేంద్రుఁడు.

(ఇట్లే గట్లగొంగ.) అచ్చ. రా. యు. ౪౭౪, కిష్కి. ౦. ౯౬.

**గడ¹.** వి. (సం. కాండః. క. గడె.) ఇక్షురంభాదికాండము.

సీ. ఇక్ష్వాదికాండాఖ్య యొసఁగును గడ యన... ఆం. భా. ౨. ౭౫.

సీ. కమలపుపాళంబు గాలాపుఁ బ్రాడుగాఁ గాలోగ్రదండంబు గడయుఁ గాఁగ. కు. సం. ౧౦. ౫౩౫.

సీ. పరిభూతబిసపద్మభాతులు చేతులు కదలికాయుగళంబు గడలు దొడలు. భా. రా. సుం. ౧౫౩.

౨. యుద్ధసాధనవిశేషము. (ఈఁటె ?)

సీ. విరివియై మేఘముల్ పెరిఁగివచ్చినజోక ఘనపతాకలశతాంగములు హత్తి, వెదురుపొదల్ పేర్చువిధమునఁ గనిపించుగడలపోఁజాలు సమగ్రముగఁ గూడి. విజ. వి. ౩. ౧౫౨.

గీ. గడలపోఁజాలరొద లిరుగడలఁ జెలఁగ, దొరలనందఱు మన్ననల్ దొరల ననిచి. సారంగ. ౨. ౧౯౦.

౩. ఓడకంబము, తెరచాఁపకొయ్య.

క. గడ కట్టినయోడపగిది ... శివయోగసారము. ౨. ఆ. (శ. ర.)

జ: గడచీల, గడసాదన.

**గడ².** వి. (సం. ఘటా. ప్రా. ఘడ.) సమూహము.

సీ. మక్కువఁ దేఁకువ దక్కి లోఁ దవిలి యాడెడు చక్రవాకపుగడలతోడ. నిర్వ. ౮. ౫౩. (శ. ర. పా.)

**గడ³.** ప్ర. చేర్వాదులకంటె వచ్చు నొకానొకప్రత్యయము. (చూ. అత్తుగడ, చేరుగడ, మొ.)

**గడగడ.** వి. (త. కడకడప్పు) వడఁకుట మున్నగువానియం దగుఅనుకరణము.

క. గడగడ వడఁకెడు మేన, న్నిడుచెంట్రుక వెట్ట... ఉ. హరి. ౬. ౯౬.

ద్వి. కూటమి నొకజోడుకో డై యున్న, నాఁటి
సఖ్యము మది నాటి ప్రేరేఁప, గడగడ వను
దేవుకడ కేఁగ నతఁడు. అ. మ. క. ౧. ౨౬
పా. (వడివడిగా వెడలు అని భావము.)

గడగడపఱచు=వణఁకింపఁ జేయు, భయపెట్టు.

ద్వి. కనకరేఖాకాంతి గడగడపఱచు, తనువల్లిక
యు వీణఁ దలపించు నెలుఁగు. రం. రా. ఉ.
౭౦ పా. ౭ పం. (ఇటు లౌపమ్యమును తెలు
పును.)

జ: గడగడలాడు.

**గడగడలాడు.** అ. క్రి. (గడగడలు + ఆడు) వ
డఁకు.

ఉదా: వాఁడు నన్నుఁ జూచిన గడగడలాడును.
(శ. ర, వా.)

**గడచీల.** వి. (√ గడ[1]) ఏతపుబానయం దమర్చ
యుండెడుదండెపుఁ బీఁటలు తగుల్చుటకు గడతల
నుండెడుచీల, కుండ గట్టెడుచోట ఏతపుగడకొన
కు అమర్చుచీల. (శ. ర.)

**గడన[1].** వి. (√ గడించు[1]. సం. ఘటనా) సంపాద
నము, ఆర్జనము.

క. గడన గలమగనిఁ జూచిన, నడుగులకును మ
డుఁగు లిడుదు రతివలు తమలో, గడ నుడుగు
మగనిఁ జూచిన, నడపీనుఁగు వచ్చె ననుచు న
గుదురు సుమతీ. సు. శ. ౮౩.

క. నీ వీవైష్ణవు విటునిం, గావించిన లంజెతనపుగ
డన విడిచెదవ్, గావింప లేకయుండిన, నీవు
న్విడిచెదవె యనిన నెలఁతుక యొప్పెన్.
వైజ. ౨. ౩౦. బహు. ౫. ౮.

**గడన[2].** వి. (√గడించు[2]. సం. గణనా) ౧. ఎన్ని
క, లెక్క.

సీ. లక్షించి మలయశైలమ్ముఁ దేఁ దని కాని గం
ధసారమునకు గడన లేదు. శై. భా. ౫. ౧౬౭.

౨. స్తోత్రము.

ఆ. అనిన రౌద్రరసము మనమున నడరంగఁ, బడ
గ యెత్తునురగపాలుకేళి, సెనయఁ జేతిసారెఁ
గొని ద్రెసఁ బతి షేడి, గడన యుడుగు మన్న
నుడుగ వనుచు. భార. విరా. ౫. ౨౫౯.

౩. దొంగ మేపు.

గీ...గడన యనఁగ, లంప మన దొంగ మేపు చెలం
గు నభవ. ఆం. భా. ౩. ౩౫.

గడనకత్తె=గడనచేడియ. (శ. ర-గడన[1] + కత్తె)

**గడనచేడియ.** వి. (గడన[1] + చేడియ) బోగముది,
వేశ్య.

గీ. దొరలు మన్నీలు చెలులు బందుగులు జెట్లు,
బంట్లు కబ్బంపుఁ గూర్పరు లొప్పె గాండ్రు, గ
డనచేడియ లూడిగీల్ గాణ లొజ్జ, బాఁపన
య్యలు దీర్పరు ల్బలసి కొలువ. నీలా. ౨.
౮౯.

**గడనము.** వి. (క. గడణ) గడ, సమూహము.

క. పినుగు లయి తాఁకు నలుగడ, జడనిధులై ముం
చు గోత్రశైలములై పైఁ, పడుఁ జదియఁ గా
రుమొగుళుల, గడనములై కప్పఁ బన్నగము
లై చుట్టుకన్. కు. సం. ౧౨. ౯౬౩.

గడప=కడప. వి. దేహళి, ద్వారముయొక్క క్రింది
కమ్మి. (వా, చి. ని, శ. ర.)

సీ...గడప యన దేహళీసంజ్ఞ యడరు నభవ. ఆం.
భా. ౨. ౧౭.

గడబడ, గడిబిడి. వి. (హిం. గడ్ బిడ్.) ౧. అ
ల్లరి. (శ. ర.) ౨. తొందర, బాధ. (బ్రౌ)

**గడము.** వి. కుండ లోనగువానిమూఁత, గడి.

గీ ... గడి యన గడంబు, నాఁగను ఘటాదికపి
ధాన మా గిరీశ. ఆం. భా. ౧. ౭౬.

**గడము.** సం. వి. అ. పుం. ౧. తెర. ౨. వెలుగు, కం
చె. ౩. అగడ్త. ౪. విఘ్నము. ౫. గండశైల
ము. ౬. కోశదేశము.

గడలవణము. సం=గడోత్థము.

గడవం(మం)చె. వి. (శ. ర-గడ1 + మంచె?- హిం. ఘరోంచి.) మూటలు మున్నగునవి పెట్టుట కై కోళ్లు అమర్చినచట్టము.

గడసాదన. వి.(గడ1 + సాదన) సాము,వ్యాయామము. (శ. ర.)

గడసియ. వి. ౧. అటుక. ౨. మచ్చు, మిద్దె. 3. మదురు. (చి. ని.)

గడసిల్లు. అ. క్రి. కడనుండు, చివర చగు? (గడిసిల్లు=క్రుంగు ? చూ. గడిసిల(బడు)

సీ. ఎవ్వాఁడు వింధ్యాద్రి నిట్టింకులింకించె గంభీరహుంకారగర్జనమున ... గడసిల్లుధర యొడ్డగడ వైన నెవ్వాఁడు త్రాసుపైఁ గట్లెచందమున వంచె. భీమ. ౨. ౭౭.

గడసె. వి. ౧.గడసియ, అటుక. (అప్ర-శ.ర.)

గడి1. వి. (క. గడి) ౧. సీమ, పొలిమేర; సరిహద్దు; మితి, మేర.

క. పొలిమేరన గడి యనఁగాఁ, బొలిమెర యన నెల్ల యనఁగఁ బోలును సీమా,స్థలనామధేయములు...ఆం. భా. ౨. ౨౮.

క. పరఁగును నచ్చట వాహిని, విరజ యనఁగ మిగుల నొకటి విమలామృతని, ర్భరపూర్ణ యగుచు నది గడి,పరమపదమునకు భవప్రపంచంబునకుఁ. పరమ. ౧. ౨౮.

క. అడవులు గడిదేశము లవి, దడములుగాఁ బెంపుమా...ఆము. ౪. ౨౫౬.

ఆ. కలఁగి తేఁటవోదు గడి దప్ప వెలిమను, నీటికుప్పనీరు నేటుమనసు. అచ్చ. భా. ౪. ౫౭.

చ. ఎదిరినయోబళౌరినరసేంద్రునికీర్తి నిజాంశుపంక్తికిన్, మదనవిరోధి భీతుఁ డయి మార్కొన శేఁగినఁ దద్రథంబు దత్పదనము నాక్రమించి రథసంబున ... ౬౫.

జుకా, వెదకెఁ జామీ యజాండముల వే వెడలెం గడి లేనియానునకా. నరస. ౪. ౬౩.

౨. చదరంగపుబల్ల మున్నగువానిమీఁద గీచినయిళ్లు.

ఉదా: చదరంగపుగడి.

3. దరి, సమీపము.

క. తరుగుల్మాదులమయమువునఁ, దరతరమ చలించి గడికిఁ దారుచుఁ బురసంహారు నెయిదఁ జొచ్చెఁ గాముఁడు...కు. సం. ౫. ౪౯3.

౪. కుండ లోనగువానిమూఁత, గడము.

గీ...గడి యన గడంబు,నాఁగను ఘటాదికపిధాన మా గిరీశ. ఆం. భా. ౧. ౭౬.

౫. (రెండురెండుపశువులకు) ఒక్కొక్క కాలు చేర్చి వేసెడిబందము. (చూ. గడిత్రాడు)

౬. మర్యాద, కట్టుబాటు.

గీ. వాఁడు నానాఁటి కభివృద్ధి వఱలఁ బెరిఁగి,కాకలను దేటి గడి మీఱి గట్టిపాటి, రాలుగాయత నాన బేరజపుదారి, నారితేఱియు బలుగుంటమారి యయ్యె. హంస. ౫. ౧౧౦.

జ: గడికాళ్లువేయు, గడిత్రాడు, గడిదేఱు, గడిదొంగ, గడిపోతు.

గడి2=గడీ. వి. దుర్గము, కోట. (చి. ని.)

క. ఆబొబ్బిలిగడిపై తేఱఁ,గా బురుజులపై నెసంగు నాగ్నేయకళా,క్షీబదయోమయ మైనయ, రాబాసాంపన్న నెన్నరా దెవ్వరికిన్. రం గా. ౨. ౨౭.

గడి. సం. వి. ఇ పుం. గిత్త, కోడెదూడ.

గడి(యి)ంచు1. స. క్రి. (సం.ఘట్). ౧. సంపాదించు, ఆర్జించు.

ద్వి...నూటపదార్లు,గడియించి యావనకాలంబునందు. ద్వి. సారంగ. ౨. ౬౭ పా. ౨౩ పం.

చ. పుడమి సమస్తవర్ణములపొల్పులు నీలువు దప్పి లంజెలై, పడిచి గండింతు రర్థములు...వరా ... ౧౫౬.

ద్వి. గోఁచి గట్టిన నాఁటఁగోలెఁ బీనుఁగుల, మోచి గడించినమూలధనంబు... ద్వి. హరిశ్చ. ఉ. ౭౭౭ పం.

౨. కల్పించు.

మ... దోషము సుస్మైందు నిరాపనిందలు గడించ౯... సారంగ. ౩. ౧౨.

చ. అటు దలఁ డౌర యెంతటిమహాత్ములు మీర లు నాదుమీఁదనా, కటకట మీవచోరచన శౌశల మోభువనప్రపంచసం, ఘటనధురీణ యున్న నగి కామిని యిం దివు డేమి గాంచి యూ, కిటుకు గడించి పల్కె దెఱఁగింపుము కల్గిన నాకు నావుడు౯. కళా. ౫. ౩౭.

జ: గడన[1], గడనకత్తె, గడనచేసికాఁ.

**గడి(యి)ంచు[2].** స. క్రి. (సం. గణ్) గణన సేయు, పాటించు.

క. వెడదరువు లిచటఁ జెల్లవు, పుడమి నహహ దొంగ లానపాడిచినఁ గోకల్, విడుతుర గడింతునే యెక్కడిగతిమాలినపిశాచికవో నీమాటల్. కళా. ౩. ౧౯౩.

ద్వి. వడు గని యిది యేమి గడియించె దీవు, జడుఁ డనె ట్లయితి పీశ్వరునిఁ గొల్చియును, బరమా త్మ గురునిగాఁ బడసి దుర్నరుల, గురు లని త లఁచుట నరకంబు గాద. బస. పు. ౧. ౮౫౭ పం.

**గడికాళ్లువేయు.** స. క్రి. (√గడి[1])-రెండు రెండు పశువులను-ఒక్కొక్క కాలు చేర్చి లంకె వేయు.

ఉదా: ఆవులను పొలములో గడికాళ్లువేసి రా. (శ. ర.)

**గడితపడు.** అ. క్రి. (గడితము + పడు) గట్టిపడు, ఘనీభవించు.

గీ... వలరాచమేపుదుకంటివేల్పు, జడలలోనుండి వడియుచు గడితపడిన, లేటవేలుపుటేటిపె న్నీటిబొట్టు, లనఁగఁ జుక్క లుకనుపట్టె... యయా. ౨. ౮౧.

**గడితము.** వి. (సం. ఘటితం. ప్రా. ఘటిఅ) ౧. ముదురైనది, మోటుది; చిక్కనిది, తఱచైనది.

సీ. గడితంపుటెలుఁగుతో లక్కప్పిన నొప్పారుబలు తేరు వేయి మావులు వహింప. హరి. ఉ. ౮. ౨౧౩.

సీ. పచ్చియేనికతోలుపచ్చడంబుఁ ద్యజించి గడితంపుఁబట్టుపచ్చడము గట్టు. హర. ౫. ౫.

సీ. కుండబొజ్జల క్రింద క్రిందుగా బిగియించి గడితంపుమడుఁగులు గట్టినారు. నైష. ౮. ౬౩.

౨. అధికము, మిక్కుటము; పెద్దది.

క... పదివేలముద్దుఁదలిరుంబోఁడు, లగ్గిగవ రిటు వలె గడితపు, వలపంతం జెంది కందపలుము న్నృపాలా. రసిక. ౩. ౧౪౧.

గీ... జగములు గడితంపుఁగనికరంపుఁ, బెంపు రాణింప నెపుడు పాలింపుచుండు. రసిక. ౧. ౨.

సీ. గడితంపుఁగీల్జడ కటిమండలంబునఁ బలుదెఱంగుల లాస్యకలన నెఱప. రసిక. ౫. ౧౩౩.

క. బెడిదపుటడిదముఁ గైకొని, గడితపుబాఱ దుస్సి వాఁడిఖడ్గము చేత౯ ... జడ గోసి య తండు వేగ చనియె లతాంగీ. శుక. ౨. ౨౨౩.

వి. ౧. తఱచు, బాహుళ్యము.

క. మిడుతలగడితము తొలుకరి, పిడుగులబెడిదంబు చిలువపింజులవడియు౯. అచ్చ. రా. యు. ౩౨౫.

౨. సాంద్రత్వము, చిక్కన.

క. పడఁతుక యొక్కతె పోఁగుల, గడితము గల చల్వవల్వ గైకొని... పార్వ. ౫. ౧౨౭.

౩. ముదుగుఁదనము, మోటుఁదనము. (శ. ర.)

జ: గడితపడు.

**గడిత్రాడు.** వి. ౭౦. (√గడి[1])-రెండు రెండు పశువులను-ఒక్కొక్క కాలు చేర్చి లంకవేసెడు పలుపు. (చి. ని, శ. ర.)

**గడిదల.** వి. ఒకవిధమైనయాయుధము.

క...కూలిరి గడిదలలు దాఁకి కుంభినిమీఁదన్. కు. సం. ౧౧. ౬౯౬.

వ...గడిదల లూని జళిపించియును ... ప్రబంధ. ౭౮౮.

**గడిదేఱు.** అ. క్రి. (గడి¹ + తేఱు) నిపుణుఁ డగు, ఆరితేఱు.

గీ. ఆరితేఱె ననం గడిదేఱె ననఁగఁ, గసిమసంగె ననంగ నాఖ్యలు దనర్చు, నిపుణుఁ డయ్యె ననుటకు...ఆం. శే. ౩౫.

క. వెడవెడ దుర్వ్యవహారవు, నడవడి గడిదేఱి గురుజనము శిక్షింపన్, గడుసువడి విప్రతనయుఁడు...పాండు. ౩. ౧౪.

గీ. జారవిద్యలఁ గడు గడిదేఱి యామి,టారి విడివడ్డమరు తేజిదాడి మీఱి. శుక. ౨. ౧౦౧.

**గడిదొంగ.** వి. (√గడి¹) గడిదేఱినదొంగ, నిపుణుఁ డగు చోరుఁడు. (బ్రౌ)

**గడిపోతు.** వి. (గడి¹ + పోతు) ఆఁబోతు.

ద్వి. ఉడుగక వాతఁ గ్రొవ్వులుకంగఁ గుడిచి, గడిపోతువలె మేనికండలు వెంచి. ద్వి. హరిశ్చ. ఉ. ౫౯౭ పం.

**గడియ¹** (డె). వి. ౧. అర్గళము, తలుపునకు వద్దుగా వైచుకఱ్ఱ.

సీ...అర్గళాఖ్య,గడియ నాఁ దగును...ఆం. భా. ౨. ౨౨.

గీ...తలుపు,మూసి గడియ బిగించెద మోసపోక. శుక. ౨. ౧౨౨.

గీ. అతివ బంగారువటలోని కరిగి మిగులఁ, బెరుఁగుసిబ్బెలిచే గడెఁ బెట్టుకొనియె. యయా. ౫. ౩౪.

గడియలుపడు = గడియలు వేసినట్లగు.

క. ఉడుగనిపన్నులఁ జెవులను, గడియలుపడ మేను వడఁక...పాండు. ౩. ౧౦౩.

**గడియ²** (డె). వి. (సం. ఘటికా) ౧. ఘటిక, ఇరువదినాల్గునిమిషములకాలము.

గీ. గడె గడియ నాఁగ ఘటిక యగు...ఆం. భా. ౧. ౯౫.

చ. గడెలు పదాఱు చెల్లె ననఁగా విని...కువల. ౨. ౪౭.

౨. ముహూర్తము, అల్పకాలము.

గీ. కంతుశత్రు జయించెద గడియలోన. దశా. ౩. ౩౭.

గీ. గడియతడవులోఁ బొడిపొడిగా నొనర్చె. హరి. ఉ. ౬. ౧౯౯.

జ: గడియకుడుక.

**గడియకుడుక.** వి. (గడియ² + కుడుక) గడియలను దెలుపుపాత్రవిశేషము. (ఇది అడుగున చిల్లులు గలిగియుండి తేలికగా నుండును. ఇది నీటిలో తేల విడువఁగా క్రిందిచిల్లులనుండి నీరు పోసికొని ఒకగడియ నేపటికి మునుఁగును. దీనినిబట్టి పూర్వులు కాలమానమును దెలిసికొనెడివారు.)

ఆ. గడియకుడుకభంగి గ్రహరాజు జలధిలో, వ్రాలె...ద్వా. ౪. ౨౩౯.

గీ. గడియకుడుక మునుంగుట గని గుఱుందు, తెల్లవాఱెను నని పఱతెంచి పలుక. కువల. ౨. ౧౨౫.

**గడియారము.** వి. (క. గడియార. త. గడికారం. తు. గడియాళ్) గడియలు తెలుపుయంత్రవిశేషము; కాలము తెలుపుయంత్రవిశేషము.

మ. ఉడువీథిన్ శిఖరావలంబి యగునభ్రోర్వీషుమోసాలపై, గడియారంబున మ్రాసె రెండెనిమిదుల్ ఘంటాఘణాత్కారముల్... క్రీడా. ౧౫౫.

ఉ. ఆనలినాయతాక్షుగడియారమునం దభిసారికాజిఘాం,సానిరతప్రసూనశరచాపగుణధ్వనులో యనంగ ఘం,టానినదంబు లయ్యెడ వినంబడియెం గుపితాబ్జలోచనా,మానసముల్ చలింపఁ బ్రథమప్రహరాపగమప్రశంసులై. పారి. ౨. ౫౦.

ద్వి. ఒక్కొకగడియ కొక్కొకచందు వ్రాలు, వక్కజం బగు గడియారవృక్షములు, ఒక్కొక గడియ కొక్కొకమాటు చెలఁగు, వక్కజం బగుగడియారశైలములు. బస. పు. ౩.౧౦౦౫, ౧౦౦౬ పం. (ఇటవృత్తియందు 'ము' వర్ణలోపము.)

(వ్యవ)గడియారము పండ్రెండుగంటలు కొట్టినది.

**గడిసిలఁబడు.** అ. క్రి. (బొమ్మ) భారాదులచే క్రుంగఁబడు. ('గరిసిలఁబడు' అని బ్రౌ)

సీ. ఇగురుమేఁతల నొగ రెక్కఁ గోకిలకును వడి బొమ్మ గడిసిలఁబడియె నేని... గీ...బట్టబయ లగు గర్వరేఖ,విషమసాయక...పి.శకుం. ౩. ౧౯౦.

**గడీ**=గడి[2].

గీ. రావువారిగడీమీఁద రాచవారి, పనుపునఁ బరాసువారు కోపంబుఁ జేసి.రంగా. ౨.౧౨౨.

**గడు**=గడ్డు. (చూ. గడుఁగాయ, గడుమన్నెము.)

జ: గడుఁగాయ, గడుమన్నెము.

**గడుకము.** సం. వి. అ. పుం. భృంగారము, బంగారుగిండి; గిండి.

**గడుఁగాయ.** విణ. (గడు+కాయ) రాలుగాయ, తుంటరి. (వా)

**గడుమన్నెము.** వి. (గడు + మన్నెము) గడ్డుమన్నెము, లోమన్నెము. (వా)

**గడురుఁడు.** సం=గడులుఁడు.

**గడులుఁడు.** సం. విణ. (అ. ఈ. అ) కుబ్జుఁడు, మరుగుజ్జు. (విల్యమ్సు.)

**గడువు.** వి. (క. గడువు)-కాలముయొక్క-అవధి, మేర.

గీ. గడు వనఁగ మేర యనఁగ నుగ్గడి యనంగ, నడరు మర్యాద...ఆం. భా. ౨. ౧౯౧.

ద్వి...కొన్ని,దినములు గడు విడి...ద్వి. పరమ. ౭. ౫౮౬ పా.

ద్వి. ఆగడువుకు రానియట్టివానరుల, వేగంబె తల దెగవ్రేయుము నీవు. రం. రా. కిష్కిం. (చి. ని.)

**గడువు.** సం. విణ. (ఉ) కుబ్జుఁడు. వి. ఉ. పుం. ౧. బల్లెము. ౨. గిండి. ౩. ఎఱ్ఱ, వానపాము. ౪. మెడమీఁదికంతి. ౫. కంతివలె నిరర్థక మగుపదార్థము.

**గడుసరి.** విణ. (గడుసు+అరి-క. గడుసరి) ౧. కఠినము; కఠినుఁడు.

ద్వి. నమ్మిక పుట్టించి నయములు సేసి, గడుసరిమనసులు గరఁగించి వుచ్చి. ద్వి. హరిశ్చ. ఉ. ౬౧౯ పం.

సీ...కఠినాత్ముఁ డొప్పును గడుసరి యన. ఆం. భా. ౩. ౧౨.

౨. మాయలమారి, పంచకము.

క. అడుగులు తొట్రుపడంగా, నడ లొందినయది యపోలె నయ్యెయెడలన్,బుడమిఁ బడి మ్రొగ్గి లేచుచు, గడుసరి యగుశకట మొయ్యఁ గదియం బోవన్. నా. పంచ. ౧. ౨౫౪. వైజ. ౪. ౯౪.

౩. దుష్టుఁడు, క్రూరి.

క. ఒడయఁడ నే నొకజన్నము, గడు వేడుకతో నొనర్పఁ గడఁగిన నెపుడున్, గడుసరిరక్కసు లిరువురు, దొడరి వడిన్ జెలువుమంచు దురు చల మెదవన్. అచ్చ. రా. బాల. ౯౫.

ద్వి. గొడవగొట్టులు ముడివిడుపులు చాల, గడుసరుల్గయ్యాంపుఁగ్రచ్చలు...పండితా. పురా. ౧౧౬ పా.

౪. అసాధ్యుఁడు. (శ. ర, బ్రౌ.)

**గడుసు.** విణ. (క. గడుసు. త. కడిదు) ౧. కఠినము, గట్టిది.

కవిరాజ ... గడుసుఁజనుంగవ ... కవిరా. ౫. ౨౪౫.

గీ. గడుసుచిక్కులు గరగినమడమ లమర, వెంట

నిరువంకఁ బెంపుమువేఁపు లరుగ. హర. ౨. ౪౧౨.

సీ. గడు సైన పెనుమొద్దు గాలికి వెఱచునా విఱుగఁ గాచినమ్రాను వెఱచుఁ గాక. రామలిం ౨౪.

౨. కుజనుఁడు, కూళ.

ఆ. ఆతతాయి గడుసు వన్యదేశ్య వధర్మ ... ఆము. ౪. ౨౧౯.

గీ. కూళ గడుసన వర్తిల్లుఁ గుజను పేళ్లు. ఆం. సం. మాన. ౧౧.

వ... నీవు చని యీనడుమ వంకురితదర్ప లగుచు నెదుర్చడం గడంగుగడుసుపోర లెక్కడెక్కడం గలరో వారి నుక్కడంచి ... కళా. ౭. ౨౬౮.

౩. గాఢము, అధికము; హెచ్చైనది.

(రతివిలాపము) క. పుడమిఁ బడి పొరలి తను నొక్కఁడు చుట్టం బనుచు నెత్తఁగా లేకుని కిన్, గడు సగు శోకము నెమ్మది, నడఁగక మెల్లఁగ వరాళి కారంభించెన్. పార్వ. ౩. ౭౪.

౪. అసాధ్యము. (శ. ర.)

వి. ౧. కాఠిన్యము. (శ. ర.) ౨. మొండితనము. (చూ. గడుసుపడు.)

గడుసురాలు=గడుసుఁదనము గలస్త్రీ.

ఆ. ఎవ్వరిగుణములును నేమన్న మానవు, చక్కఁ జేయ రాదు కుక్కతోఁక, గడుసు రాలు మగని గంపఁ బెట్టును రా. వేమన. ౧. ౧౬.

జ: గడుసరి, గడుసుఁదనము, గడుసుపడు.

**గడుసుఁదనము.** వి. (√ గడుసు) ౧. కాఠిన్యము.

గీ. శైల యేపీఁకఁ బవలింప లేక లేక, కలిగినక ళత్ప్రవంశ శేఖరునిమృదులతను వయో యీను నెనయునీమనసుకంటె, గడుసుఁదన మొందును పలసంఘముల యందు. చం. రా. ౪. ౨౯.

౨. మోటుఁదనము.

సీ. రాఁ గూడ దని పల్కు రమణుని వెంబడి సేఁగి కానలో విహరించు గడుసుఁదనము, మాయా మృగము వెంట మగఁడు పోవఁగ వంటమ ఱది నంపెన నాఁటిమంకుఁదనము... కృ. శకుం. పీఠి. ౫౦.

౩. ధార్ష్ట్యము.

వ... మీర లీన్రుమ్ముల నెచ్చరికం గను పెట్టుకొని యుండుఁ డనుటయు నుపిరిపడుము నప్పుడు చులు గడుసుఁదనంబున నతం నధిక్షేపించె. ప్ర. భా. ౧. ౧౦౭.

**గడుసుప(వ)డు.** అ. క్రి. (గడుసు + పడు) మొండితనము వహించు, బంద యగు.

క. వెడవెడ దుర్వ్యవహారపు, నడనడి గడిదేతి గురుజనము శిక్షింపకన్, గడుసుపడి వివృతవ యఁడు, నడి కోరిచి వంగపరకచాబుకన్ మానెన్. పాండు. ౩. ౧౪. (శ.ర.పా. 'వంకపరక' ముద్రి. పా)

క. అడుగఁ దగునాని నడిగిన, నిడినయొసఁగు నొసర నీలే ననఁగా, గడుసుపడి యాస చేఁ దా, నడిగిన దుర్మార్గవృత్తుఁ డగు రా వే మా. వేమన. ౨. ౧౯౪.

**గడేకారి.** (ఇది అరవము అని శ.ర.కాని అరవనిఘంటువులలోఁ గానరాదు) వి. బల్లెము గలవాఁడు; పోకిరి. (శ.ర.పోకిరి అనునర్థమున 'గడేకారి' పా)

**గడేరము.** సం. వి. అ. పుం. మేఘము.

**గడోత్థము.** సం. వి. అ. న. గడ దేశమునఁ బుట్టు కాతియుప్పు.

**గడోలము.** సం. వి. అ. పుం. ౧. గ్రాసము, కబళము. ౨. గుడము, బెల్లము.

**గడ్డ.** వి. (సం. గండః. క. గడ్డె. త. కట్టి.) ౧. వ్రణము.

౨. దుంప, మూలము.

సీ. మోర కగ్గల మైనకోఱచేఁ దుంగగడ్డలు ద్ర వ్వుకిటి రాజు చెలిమి పేసి. కాశ్రిక. ౧. ౫౯.

౩. మంటిపెల్ల, లోష్టము, బెడ్డ.

క. ఘనతర మగుహ్రీగౌరవమున ముంచిగినఁ బాప మఖిలమును రూపు సెడుం, బెనుపునయగ్గలి కఁ బొగడు, గనినపయోరాశిఁ బడ్డగడ్డయుఁ బోలెన్. భార. అను. ౨. ౪౦. ఆం. భా. ౨. ౨౩౦.

౪. (ఏటిమొక్క) ఒడ్డు.

ద్వి... కావేరి, ఘనవేగమున రెండుగడ్డలు జవు రు, కొని పాఱి...ద్వి. పరమ. ౫౪౧ పా. ౩ పం.

శా. ఓసామీ ... నట్టడవిలోఁ గల్జువ్విక్రీనీడనే, యాసం గట్టితి వేటిగడ్డ నిలు...కాశ. ౩.౬౫.

గడ్డపెరుఁగు=గడ్డవలె నుండు పెరుఁగు. (వా.)

నడుగడ్డ=ద్వీపము, ఏటినడుమ నుండుదిబ్బ.

సీ. కావేరినడుగడ్డఁ గాఁపురంబుండుచు దివసాం తమున నిటఁ దిరిగి వత్తు. కకు. ౧. ౨౧౫.

చ. చరణవిహీనుఁ డట్టె ఘనసాగరభీకరవీచికా సముత్కరపరిఖాంత మైననడుగడ్డకు వచ్చి నిజోదరాగ్నిచే, నెరియుచు నున్నయట్టిశు ది సెవ్వరికిం బడయంగ రానినుందరి యిది పత్ని యయ్యెడిని దైవము చేతల కడ్డ మున్న దే. భోజరా. ౫. ౩౪౬.

జః గడ్డపలుగు, గడ్డపాఱ, గడ్డప్రాయ్యి.

**గడ్డపలుగు.** వి. (√గడ్డ) గునపము. (వా)

**గడ్డపాఱ.** వి. (గడ్డ+పాఱ-క. కట్టహారె) -గడ్డ లు పెల్లగించునది-గునపము, ఖనిత్రము.

గీ. వాఁడు కళ్యాణపురం దన వనునఁ బరఁగు, క ల్యాణపతనునికిఁ దచ్ఛిలలదయును, గడ్డపాఱ లతె పసిఁ గానిపించి, పే...

డని పేరు గలదు. కళా. ౬. ౨౩.౨౦. భా. ౨. ౨౩౦.

**గడ్డప్రాయ్యి.** వి. (గడ్డ+ప్రాయ్యి) గడ్డలతో కే ర్పఱిచినప్రాయ్యి. (శ. ర, వా.)

**గడ్డము.** వి. (క. గడ్డ) ౧. చిబుకము.

గీ... చిబుకాఖ్య యలరు గడ్డ,మనఁగ గద్దవ నాఁగ...ఆం. భా. ౨. ౧౪౨.

మ...తా నొక్కచే, తన కంఠంబును గౌఁగిలిం చి యొకచేతన్ గడ్డము న్బట్టి చెక్కునఁ జె క్కునుచు నొక్కచన్గొనయురఃకోణంబు తో రాయఁగన్. కళా. ౫ ౬౧.

౨. చిబుకశ్మశ్రువు, గడ్డముమీఁదిపొడుగుపాటి వెండ్రుకలమొత్తము.

సీ...చిబుకశ్మశ్రు వడరు. గీ. గడ్డ మన... ఆం. భా. ౨. ౧౪౬.

సీ. నిగిడి పూ కెపుబాగు నఁ గత్తిరించినగడ్డంబు కొన రొమ్ము గప్పింప. నైష. ౭. ౯౩.

వ...అర్ధనారి గావునం బురుషుండు గాఁడు గడ్డం బు గలిగినకతంబున యోష గాదు ... కాశి. ౭. ౪౭.

**గడరము.** సం. వి. అ. పుం. గోత్రి. (వాచ.)

**గడ్డరిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఉత్పత్తిస్థానము తెలి యక ఎవ రెగకుండ ప్రవహించుకొకానొకనది. ౨. మగగొఱ్ఱె ననుసరించి పోవు ఆఁడుగొఱ్ఱె. (వాచ-మగగొఱ్ఱెలచేత ననుసరింపఁబడు ఆఁడు గొఱ్ఱె-కల్ప)

**గడ్డి.** వి. కసవు, తృణము.

సీ...గడ్డి గాదము గవతము కసవు కవను, పుల్లు పూరి యనంగఁ జెల్లును తృణసంజ్ఞ ... ఆం. భా. ౨. ౭౬.

జః గడ్డిపాము, గడ్డిపిట్ట, గడ్డిబొద్దు.

**గడ్డిపాము.** వి. (√గడ్డి.) ఒకజాతిపాము. (శ. ర)

**గడ్డిపిట్ట.** వి. (గడ్డి+పిట్ట) పక్షివిశేషము.

సీ. పికిలిపిట్టలు గడ్డిపిట్టలు గోరలు బంగరుపిచ్చిక లౌనుపుముద్ద. గీ.లాదిగాఁ గలుగుపుల్గులు ...రసిక. ౧. ౬౩. (శ.ర.పా)

**గడ్డిబొద్దు.** వి. (గడ్డి + బొద్దు) ౧. చుట్టకుదురు. (శ. ర.) ౨. కొన్ని మోపులపరిమాణము గలిగి బండిమీఁదఁ దీసికొని వచ్చెడి పెద్దగడ్డికట్ట.

గీ. గడ్డిబొద్దువలెను మేను గానిపింప, బారకట్టల తెఱఁగున బాహు లలర, జనకయాగంబుఁ జూడవచ్చెను లలాట,సాంద్రతరరోమరేఖ యాచంద్రరేఖ. చంద్ర. వి. ౧. ౬౯.

**గడ్డు.** విశే. ౧. అధికుఁడు, ఎక్కువవాఁడు.

సీ. అలు సైనవానియి ల్లాక్రమింపఁగఁ జూచుఁ డవకు గడ్డైనఁ బాదములు పట్టు. రామలిం ౨౬.

౨. అసాధ్యము.

ఉదా: గడ్డురోగము

క్రి. విశే. అధికముగా, మిక్కిలి. (చూ. గడ్డుటుకు)

వి. ఆధిక్యము, అతిశయము. (చూ. గడ్డుకొను)

జ: గడ్డుకొను, గడ్డుటుకు.

**గడ్డుకొను.** అ. క్రి. (గడ్డు + కొను.) అతిశయించు.

వ. యాదఃపతి మేదురామృతంబుజిడ్డున గడ్డుకొని వపూషాదిత్యువదనంబున నుప్పతిల్లుతుల్లమెలుంగులు...భీమ. ౫. ౮. (శ. ర. పా.)

**గడ్డుటుకు.** అ. క్రి. (గడ్డు + ఉటుకు.) ౧. పైపడు, కవియు.

వ. అనఁ కంఠీరవృందు... శరాసనకళావిశేషంబున నీసు నెఱపుముం దెఱపి గొని రథంబు వణఁపించి యొఱపుపఱుపున నడ్డగించుపగఱయొడ్డు గడ్డుటికి చించుకొని... రాఘవ. ౮. ౧౫౨.

వ...గడ్డుటుక నీక యడ్డంబుగా నొడ్డుకొనియొడు నెదిరిపిడికిలివాయం డట్టి...కళా. ౩. ౨౬౬.

౨. పాతిపోవు, తప్పకొనిపోవు.

వ...అడ్డగించి నించినయొడ్డువలలకు నడ్డించి బాడునం బడక గడ్డుటికియు మృగంబు లశకంబులు వోలియుటయును...ఉ. హరి. ౮. ౹౯.

**గణకి.** సం. వి. ఈ. స్త్రీ. గణకుని పెండ్లాము.

**గణకుఁడు.** సం. వి. అ. పుం. ౧. జోస్యుఁడు. ౨. కరణము, గ్రామపులెక్కలు వ్రాయువాఁడు.

**గణగణ.** వి. (క.త. కణకణ.) ఘంటాధ్వనికి అనుకరణము.

సీ...గణగణ మొలనూలిగంట లులియ. ప్రబంధ. ౧౯.

**గణచక్రకము.** సం. వి. అ. న. సత్పురుషులసహభోజనము.

శ్లో. ధార్మికాణాం తు సంభూయ భోజనం గణచక్రకమ్. (త్రి. ని.)

**గణదీక్షి.** సం. వి. న్. పుం. పెక్కండ్రకుఁ బురోహితుఁ డగువాఁడు. (యాజ్ఞ. ౧. ౧౬౧.)

**గణదేవతలు.** సం. వి. అ. స్త్రీ. బ. గణములుగా నుండు దేవతావిశేషములు.

శ్లో. ఆదిత్యవిశ్వవసవస్తుషితా భాస్వరానిలాః, మహారాజికసాధ్యాశ్చ రుద్రాశ్చ గణదేవతాః. (అమరము.)

**గణద్రవ్యము.** సం. వి అ. పుం. సాధారణద్రవ్యము, పెక్కురసొత్తు.

**గణన.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఎన్నిక. ౨. తలఁచుట.

**గణనము.** సం. వి. అ. న. ౧. ఎన్నిక, లెక్కపెట్టుట. ౨. భావించుట, తలఁచుట.

**గణనీయము.** సం. విశే. (అ. ఆ. అ) గణింపఁ దగినది.

**గణపతి.** సం. వి. ఇ. పుం. వినాయకుఁడు.

**గణపూర్వుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) గ్రామణి, గణమునందు ముఖ్యుఁడు.

**గణము.** సం. వి. అ. పుం. ౧. సమూహము. ౨. ప్ర

మ్మథులసమూహము. 3. సేనావిశేషము. (ఇర్వదే డురథములు అన్ని యేనుఁగులు ఎనుబదియొక్క గుఱ్ఱము నూటముప్పదియేవురు కాల్బురును గలసేన.) ౪. (ఛంద) మగణము, మొ. ౫. (వ్యాక) ఒక్క సూత్రముక్రింద వచ్చుపదాది. ౬. శబ్దము, ధ్వని. (శే. ని)

**గణయత్.** సం. శత్రు. గణించుచున్న.

**గణయితవ్యము.** సం=గణనీయము.

**గణరాత్రము.** సం. వి. అ. న. పెక్కురాత్రులసమూహము.

**గణరూపము.** సం. వి. అ. పుం. జిల్లేడు.

**గణవృత్తము.** సం. వి. అ. న. గణబద్ధ మగువృత్తము. (శార్దూలాది. వ్యతి. మాత్రావృత్తము.)

**గణహాసము.** సం. విణ. (అ. ఆ. అ) పెక్కురను పరిహసించునది. వి. అ. పుం. చోర మనుగంధద్రవ్యము.

**గణాచారి.** సం. వి. న్. పుం. శివమెక్కి గంతులు వేయువాఁడు. (ఇది తెలుఁగున నే కలదు.) (వేశ్యామాతృవర్ణనము) సీ. తా నున్న శ్రేణి శంతటికి గణాచారి పెక్కుసుద్దులు ప్రాయుపెద్దబేరి. శుక. 3. ౧౮.

**గణాధిపుఁడు.** సం. వి. అ. పుం. ౧. వినాయకుఁడు. ౨. శివుఁడు. 3. ఒకసమూహమునకు ముఖ్యుఁ డైనవాఁడు, గామిడి.

**గణాన్నము.** సం. వి. అ. న. ౧. పెక్కండ్రకొఱకు వండినయన్నము. ౨. పెక్కండ్రసొత్తయిన యన్నము.

**గణి.** సం. వి. ఇ. స్త్రీ. గణనము, లెక్కించుట. పుం. సాంగముగా వేదాధ్యయనము చేసినవాఁడు. (వై. ని.)

**గణి(యి)ంచు.** సం. స. క్రి. ౧. లెక్కపెట్టు.

సీ... భూరజోంబుధిజలపరమాణుగణము. గీ. సెవ గణియింపఁగా వచ్చుఁ గాని వినుము, తత్కృతయుగంబులో పలిదైత్యమథన, కృతచరిత్రంబు లన్నియు నెన్న రాదు, వనజభవునకు శతకోటివత్సరముల. వరాహ. ౫. ౪౬.

౨. ఎంచు, ఆలోచించు.

శా. దారస్వీకృతియు న్దయాభిరతియుక్... దీనదా, సీరాజీసుతబాంధవాతురజనశ్రేణీసమృద్ధాన్నస, త్కారోదారతయు న్గణింప గృహికి న్ధర్మంబు లుద్యన్మతిక్. మార్క. 3. ౧౪౫.

3. లక్ష్యపెట్టు, పాటించు.

చ. వరద నిరీహయోగిజనవర్గసుపూజిత నీపదాబ్జముల్, నిరతము నంతరంగమున నిల్పి భవత్పదను గ్రహాదిక, స్ఫురణఁ దనర్చునన్ను నతిమూఢు లవిద్యులు మున్న మంగళా, వరణుఁ డటంచుఁ బల్కిన భవన్మతి నే గణియింప నచ్యుతా. భాగ. ౪. ౧౭౫.

౪. స్తుతించు, పొగడు.

మంజులగతిరగడ. నైమిశపుణ్యావనంబునఁ బొందినహరికిని మంగళహారతు లెత్తుచుఁ, దనరుహరిక్షేత్రంబున నెలకొనుసాలగ్రామస్వామి గణింపుచు. హంస. ౪. ౨౦3.

౫. చూచు.

ఉ. ఎక్కడఁ జూచినన్ జనమదేభతురంగమనోజ్ఞరావ మ్మేదిక్కునఁ జూచినన్ మదవతీమృదుగానజతానమాన మే, చక్కి గణించినన్ వివిధచామరకేతనభూషణద్యుతుల్, మిక్కిలి వింతచంద మయి మెచ్చొనరించె మహోద్యుతంబుగన్. ఇందు. ౫. ౬౮.

౬. ఉగ్గడించు, చెప్పు.

క. ఏన జను లాడుకొనియెడి, నానోమ్ములు వినఁ దలంచి నన్నడిగిన మీ, యానకు వెఱచి గణించెద, భానుకులాధీశ వినుము పౌరులపలుకుల్. ఉ. రా. ౬. ౧౯౯.

చ. కినియమి సంగవర్జన మకించనభావము దాన్తి విప్రవాసనము ప్రశాంతి యార్జవము శౌచ

ము సద్ర్వతనిష్ఠ హైతుభో,జన మిల నిద్ర నేఁ
త కృప సంతతతత్త్వవిచింతనంబు మా,నిని
యతిధర్మముల్ శ్రుతి గణించినభంగిన యేను
జెప్పితిఁ. భార. అను. ౫. ౧౯౬. భాగ. ౧౦
పూ. ౩౩౪.

**గణిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. వారాంగన, వేశ్య. ౨. ఆఁడేనుఁగు. ౩. అడవిమొల్లి. ౪. నెల్లి.

**గణికారిక.** సం. వి. ఆ. స్త్రీ. నెల్లి.

**గణితము.** సం. విణ. (అ. ఆ. అ.) గణింపఁబడినది. వి. అ. న. ౧. గణించుట. ౨. లెక్క. ౩. గణితశాస్త్రము.

**గణితి.** సం. విణ. (న్. నీ. న్) ౧. గణించినవాఁడు, గణన చేసినవాఁడు. ౨. గణితశాస్త్రజ్ఞుఁడు.

**గణుతి.** వి. (సం. గణితమ్) ౧. ఎన్నిక, లెక్క.

(సంతవర్ణనము) సీ. పెనుఁగోలుకాండ్రకు జనస
మూహంబులగణుతి చూపెడునాయకప్రభుం
డు. హంస. ౨. ౪౭.

౨. నుతి, స్తోత్రము.

క. గురుదేయాధికనిస్పృహ,ధరణీసురుఁ డర్థికా
మితధనాధికదా,యి రఘువు సాకేతజనో,
త్కరముల కయ్యెరువురైరి గణుతి ఘటిం
పఁ. రఘు. ౩. ౬౦.

శ్లో. జనస్య సాకేతనివాసినస్తౌ,ద్వావప్యభూతా
మభినంద్యసత్త్వౌ, గురుప్రదేయాధికనిస్పృ
హోర్థీ,నృపోర్థికామాదధికప్రదశ్చ. సం.రఘు.
౫. ౩౧.

౩. లక్ష్యము, లెక్క.

(అశ్వవర్ణనము) సీ. కసవుమోపరి గాలి గణుతియే
మాకంచు నగినట్ల వదనఫేనముల రాల్చు. శ
కాం. ౨. ౨౧.

జ: గణుతించు.

**గణుతించు.** స. క్రి. (√ గణుతి) ౧. ఎంచు, భావించు.

క. యాగంబునందు శ్రద్ధా,యోగము గల[illegible]శుచి
శ్రద్ధాయువరనిశుచి పు,ణ్యాగమసంపన్నుఁ డు
ల్యులు,గా గణుతించిరి నిరూపకత సమరవ
రుల్. భార. శాం. ౫. ౨౪౭.

శ్లో. శుచేరశ్రద్దధానస్య శ్రద్దధానస్యచాశుచేః, దే
వా విత్తమమన్యంత సదృశం యజ్ఞకర్మణి. సం.
భార. శాం. ౨౬౦. ౧౦.

౨. లెక్కించు.

క. గుణనిధి యగుప్రహ్లాదుని,గుణము లనేకములు
గలవు గురుకాలమునన్, గణుతింప నశక్యం
బులు,ఫణిపతికి బృహస్పతికిని భాషాపతికిన్.
భాగ. ౭. ౧౨౦.

౩. లక్ష్యపెట్టు, సరకుసేయు.

ఉ. దిగ్గన లేచిపోయె గణుతింపక వాఁడు విరో
ధులబిక్కి,యగ్గలికంబునన్ మనల నందఱఁ జీరి
కిఁ జేకొనండు...నిర్వ. ౩. ౧౦౭.

౪. స్తుతించు, కొనియాడు.

సీ. గణుతింతు నిరవద్యగద్యపద్యనిబంధపరితోషి
తస్థాణు భట్టబాణు. భీమ. ౧. ౭.

**గణె(ణియ)ము.** వి. వేషధారులు ధరించెడిలక్క
సొమ్ము. (చి. ని, శ. ర.)

**గణేయము.** సం=గణనీయము. సం. నైష. ౩. ౪౦.

**గణేరుక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పంటెనకత్తె. ౨. పని
కత్తె.

**గణేరువు.** సం. వి. ఉ. పుం. కర్ణికారము. స్త్రీ. ౧.
వేశ్య. ౨. ఆఁడేనుఁగు.

**గణేశభూషణము.** సం. వి. అ. న. సిందూరము.

**గణోత్సాహము.** సం. వి. అ. పుం-సజాతీయ
ములగుంపుతోఁ గూడి తిరుగుటయం దుత్సాహము
గలది-ఖడ్గమృగము.

**గణ్యమానము.** సం. విణ. (అ. ఆ. అ.) గణింపఁ
బడుచున్నది.

**గణ్యము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. సంఖ్యేయము, లెక్కింపఁ దగినది. ౨. లెక్కసేయఁ దగినది, లక్ష్యము సేయఁ దగినది. ౩. గణములోఁ జేరినది.

**గతపడు.** మి. అ. క్రి. (గతము + పడు) ౧. కడచు. (శ. ర) ౨. చచ్చు.

ద్వి. హతశేషులగు రాక్షసావళి సెప్ప, గతపడ్డయామ్మహాకాయునిఁ దలఁచి. రం. రా. యు. ౩౭౭ పా. ౨౧ పం.

**గతభర్తృక.** సం. వి. ఆ. స్త్రీ. విధవ.

**గతము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. పోయినది. ౨. కడచినది, గతించినది. ౩. చచ్చినది, నశించినది. ౪. ప్రాప్తము, పొందినది, చెందినది. ౫. జ్ఞాతము, తెలియఁబడినది, గ్రహింపఁబడినది. వి. అ. న. ౧. పోవుట. ౨. గతి, నడక. ౩. ప్రకారము, విధము. (కే. ని)

**గతసన్నకము.** సం. వి. అ. పుం. మద ముడిగిన యేనుఁగు.

**గతాగతము.** సం. వి. అ. న. రాకపోకలు.

**గతానుగతము.** సం. వి. అ. న. ఒకరు ప్రవర్తించునటులు ప్రవర్తించుట.

**గతానుగతికుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) ఒకరు ప్రవర్తించునటులు ప్రవర్తించువాఁడు.

శ్లో. తామేవానుగతా గతానుగతికాస్త్యక్తానురాగాః ప్రజాః. ముద్రా. ౬. ౫.

**గతాయువు.** సం. విణ. (స్) ౧. మృతుఁడు. ౨. వయసు గడచినవాఁడు, వృద్ధు.

**గతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. గమనము, పోక. ౨. నడక. ౩. త్రోవ. ౪. ఉపాయము. ౫. ఎఱుక, జ్ఞానము. ౬. స్థానము. ౭. నాడీవ్రణ మార్గము, నారిపుంటికంటిత్రోవ. (మే. ని, వి. ని.) ౮. ప్రమాణము.

శ్లో... మృగః క్షతః క్షణా, దనేన పూర్వం నమయేతి కా గతిః. సం. కిరా. ౧౪. ౧౫. (కా గతిః=కిం ప్రమాణమ్. మల్లి. వ్యా.)

౯. స్వరూపము.

శ్లో... న వయం నిరూపయితుమస్య గతిమ్. సం. కిరా. ౬. ౩౬. (గతిం=స్వరూపమ్. మల్లి. వ్యా.)

౧౦. విషయము.

శ్లో... మనోరథానామగతిర్న విద్యతే. సం. కు. సం. ౫. ౨౪. (అగతిః=అవిషయః. మల్లి. వ్యా.)

౧౧. పరిణామము.

శ్లో. దురధిగమా హి గతిః ప్రయోజనానామ్. సం. కిరా. ౧౦. ౪౦. (గతిః=పరిణతిః. మల్లి. వ్యా)

౧౨. శరణము, దిక్కు.

గీ... అందఱకు నీవ గతి గాక యన్యుఁ డొకఁడు, నీకు గతి యొకండు సకలలోకైకనాథ. దశా. ౧. ౧౬౧, ౧౫౭.

౧౩. పరె; విధము, రీతి.

ద్వి. ఎన్నికకెక్కి యీరేడులోకముల, వెన్నెల గతిఁ గీర్తి వెలిఁగించె ... ద్వి. హరిశ్చ. పూ. ౧౫౨ పం.

సీ. చంద్రమతీనాథుచందాన నఱి వైఖరిఁ బురుకుత్సునిగతిఁ బురూరవు రీమాడ్కి ... శుక. ౧. ౧౦.

గీ... వీర, లేమిగతిఁ బల్కినను నది యెల్ల మనము, కైకొనవలయుఁ గాక... భార. విరా. ౫. ౨౭౫.

**గతించు.** సం. అ. క్రి. ౧. కడచు.

చ. వినయవిశేషహృద్యలగు విద్యలు నేర్చుట లేమ నీతిచే, ధనమును గూర్చ లేదు తలిదండ్రులసేవయుఁ జేయ లేదు ...... గొబ్బున సమయంబు కాకులకుఁబోలె గతించెఁ బరాన్నభుక్తులకా. భర్తృ. వై రా. ౪౭.

౨. చచ్చు. (శ. ర, వా)

**గతిగొను.** మి. అ. క్రి. (గతి + కొను) ఏకగతి కలదియగు.

క. కలికివయమదనకదనపుఁ,బలుకులకలకలము చె
డఁగువడు మేఖలము,వ్యాలరవలిఁ దగిలి గతిగొ
నఁ, గలకంఠి రతంబు సలుపుగమకము గని
యెఁ. భాగ. ౬. ౯౯.

**గతిపడు.** మి. అ. క్రి. (గతి + పడు) లభించు.

క.... వానితలఁ ద్రెంచి సమ్మోత్కటముగ నసల
ములో నొక్కట వైవుము సిద్ధు లెల్ల గతిప
డు నీకుఁ. ద్వా. ౧౨. ౬౫.

**గతిల.** సం. వి. ఆ. స్త్రీ. ౧. వరుస, పరంపర. ౨. ఏ
టు, నది. 3 పేత్రలత, పేము ?.

**గతుకు**[1]=కతుకు స. క్రి. (కుక్క మొదలగునవి)
కొంచెముకొంచెము గాఁ దిను; నాలుకతో కొం
చెముకొంచెము గాఁ ద్రాగు.

క. ప్రతిగృహము నెపుడుఁ దిరుగుచు, నతిశయ
మున భుక్తశేష మాతురమతినై, గతుకుచు
వీథుల నుండుచుఁ, గతిపయసంవత్సరములు గ
డపితి నచటఁ. బ్రహ్మో. ౨. ౧౨౪.

(వ్యవ) కుక్క గంజి గతికినది.

వి. ఎంగిలి తినుట. (శ. ర.)

**గతుకు**[2]. వి. గొయ్యి. (బ్రౌ, చి. ని.)

(వ్యవ) చీకటిలోఁ బోవుటచే గతుకులలోఁ బడి
నాఁడు.

**గత్త(ము).** వి. ఎరువు. (బ్రౌ, శ. ర.)

**గత్తర.** వి. ౧. క్రమము లేక కలిసిపోయి యుండు
ట. (బ్రౌ) ౨. ఉపద్రవము. (శ. ర)

**గత్తు.** వి. మాత్రగంధము. (శ. ర.)

**గత్వరము.** సం. విశ. (అ. ఈ. అ) ౧. పోవునది.
౨. నశించునది, నశ్వరము. 3. కదమునది.

**గద.** సం. వి. ఆ. స్త్రీ. గుదియ, దుడ్డువలె నుండు
ఆయుధవిశేషము.

**గదమాయించు.** స. క్రి. గద్దించు. (శ. ర.)

**గదము.** సం. వి. అ. పుం. ౧. రోగము, ౨. కుష్ఠు. ...

౨. ఉఱుము. ౫. విషభేదము. (వాచ)

**గదయిత్నువు.** సం. విశ. (ఉ) ౧. వాచాలుఁడు,
వదరుపోతు. ౨. కాముకుఁడు. వి. ఉ. పుం. కా
ముఁడు, మన్మథుఁడు.

**గదాంబరము.** సం. వి. అ. పుం. మేఘము. (త్రి. ని.)

**గదాగ్రజుఁడు.** సం. వి. అ. పుం- గదుని యన్న-
విష్ణువు.

**గదాధరుఁడు.** సం. వి. అ. పుం. ౧. విష్ణువు. ౨.
ఒకతర్కగ్రంథకర్త.

**గది.** వి. ఇంటిలోపలియఱ. (శ. ర.)

(వ్యవ) నిన్న నేను మా మేడగదిలో పరుంటిని.

**గది.** సం. విశ. (న్. నీ. న్) ౧. గదను ధరించిన
వాఁడు. ౨. రోగి, తెవులు గలవాఁడు.

**గదితము.** సం. విశ. (అ. ఆ. అ) ౧. చెప్పఁబడి
నది. ౨. రోగము కలది.

**గదుకు**=కతుకు.

(కుక్క మొదలగునవి కొంచెముకొంచెము గాఁ
దిను; కొంచెముకొంచెము గా గ్రహించు.)

చ. కదిసిన నోరవోయి యొఱుకబ్బపుదొంతులస
త్పదార్థముల్, గదుకుచు నెట్టివారిఁ బొడగ
న్నను గుఱ్ఱని స్నేహసౌఖ్యముల్, మనికి నస
హ్యమై శునకమార్గమునం జరియించుచున్న
దుష్పదకవు లెల్ల మక్కువితఁ బట్టక దవ్వు
లు విందు గావుతఁ. వాసిష్ఠ. ౧. ౭. (పైరెం
డర్థములకును ఇది యుదాహరణము)

వి. ఎంగిలి తినుట. (శ. ర.)

**గదుము.** స. క్రి. అదలించు, గద్దించు.

సీ. అదలించె గద్దించె నడలించె నదఁగను గదిమె
నం చనుమాటగాఁ జెలంగు. ఆం. భా. 3.
౧౨౪.

సీ. కాలుపుల్ దిని యాము గవిసి మస్నోరులు కా
రుపోతులనైన గదుముఁ జూము. పారంగ. ౧.

చ. ...విన్న వే, కద వినుఁ బట్ట మర్వరకుఁ గట్టెద నన్నది యందు కింతి దక్, గదిమికొం వం దలం కినది కన్నది విన్నది గాని దేమి చెప్పెదు ...చం. రా. ౪. ౪౧.

**గదురు.** వి. (క. గదరు) దుర్గంధము, దుర్వాసన.

సీ. పులితోళ్లపై వాఁటుఁబోసినరక్తార్ద్రకరిశిరోము క్తాళిగదురుకంపు. చంద్ర. ౫. ౧౨౧.

చ. ముదమున సోమకాసురుఁడు మ్రుచ్చిలి యచ్చ లమారఁ గొన్న ప్రాఁ, జదువులు తెచ్చి తజ్జఠర పాంద్రతరాంత్రము లంట నంటుబల్, గదు రు దొలంగఁ గీర్తియునుగంగఁ దొలంచి ... పాండు ౨.౫౬.

విశ. విస్రము, పచ్చివాసన గలది.

ఆ...గదురు నాఁగ నగును విస్రాఖ్యయై.ఆం.భా. ౧. ౧౦౭.

సీ. జాభువాపైతాణిసాలుఁ దూలఁగఁ జేసి గదు రుతో ల్కటిసీమఁ గదురుకొనియె. ఘటికా. ౧. ౧౫౩.

**గద్గదము.** సం. విశ. (అ. ఆ. అ.) డగ్గుత్తికపడిన ది. (స్వరము.)

**గద్గదస్వరము.** సం. వి. అ. పుం. ౧. డగ్గుత్తికపడి నయెలుఁగు. ౨. ఎనుపోతు.

**గద్గదిక.** సం. వి. ఆ. స్త్రీ. డగ్గుత్తిక.

**గద్గదితము.** సం. విశ.(అ.ఆ.అ.)గద్గదస్వరముగలది.

**గద్ద=గ్రద్ద.** వి. పక్షివిశేషము, గృధ్రము. (చి. ని, శ. ర, వా.)

జ: గద్దగోరు, గద్దముక్కువాఁడు.

**గద్దగోరు.** వి. దే. (√గద్ద.) ౧. గద్దయొక్క గోరు. ౨.ఒకానొకచెట్టు. (దీనియాకులు గద్దగో రువలె నుండును.)

వ...ఇప్ప కప్పురమద్ది గద్దగోరు గోరంట వెలమ యులిమిరి ... మొదలుగఁ బెక్కుతెఱంగుల వ్రాఁకులు...వి. శకుం. ౨.

౩. చోరసాధనవిశేషము.(ఇది గద్దగోరువలె నుం డును)

గీ. కావు మలుబంతి సికముళ్లు గద్దగోరు... లో లునిచ్చెన మొదలు ముందుగ ధరించి. ప్రబం ధ. ౭౫౯.

సీ. భవనదీపాహితభ్రమరపేటిక వాలుకాభస్త్రి తలముళ్లు గద్దగోళ్లు... గీ... ఎట్టనికన్ను ల మర, దూరితత్రాసుఁ డపు డొక్కడొంగబం టు. వేం. పంచ. ౩.౧౯౯.పరమ.౪.౧౭౪.

౪. ఒకవిధ మగుగొండ్లెము. ( ఇది గద్దగోరువలె నుండును-వా.)

**గద్దన.** వి. గద్దింపు.

సీ...గద్దింపు వెలయును గద్దన యన. ఆం. భా. ౩. ౩౦.

**గద్దముక్కువాఁడు.** విశ. (గద్ద+ముక్కు+వాఁ డు)-గద్దముక్కువంటిముక్కు గలవాఁడు-ఖరణ సుఁడు, వాఁడిముక్కు గలవాఁడు. (శ. ర.)

**గద్దరి.** విశ. ౧. నేర్పరి, నిపుణుఁడు.

చ. కరితురగాధిరోహముల గద్దరులై విలువిద్ద లందు నేర్పరు లయి ... చం. రా. ౨. ౫౨.

౨. ఉద్ధతుడు, పొగరు గలది; పొగరు గలవాఁడు.

చ...గద్దరిపంది నొకండు పిన్న చే, యుదరక ముప్పిడిం బొడిచి యంటఁగఁ బట్టుమఁ గో లఁగొట్టినన్, మొసలఁగ నీక తెచ్చినను మె చ్చు లొసంగెను రాజు వానికిన్. యయా. ౨. ౧౧.

శా... ఇట్లింతే గద్దరివై గురుం దొలఁగి పోసి వు...పరమ. ౫. ౩౬౩.

౩. దుష్టుఁడు; దుష్టము.

ఉ...తద్వనసీమ వసింపనీయ దీ,గద్దరి గ్రద్ద చేరి కలకాలము పోరెడిఁ బోరు మాన్పవే.ఉ.రా. ౭. ౨౩౦.

చ...చొక్కట మగుసేపువాని కొకగద్దరిజా లముగూరుచుం, గటకట తమ్మిచూలికో

ఆగాములు బొములు గాఁ దలంచెదన్. నీలా. ౧. ౧౧౦.

క. ముద్దులపట్టివి నీ కీ, గద్దఱిచందముల మెలఁగఁ గా రాదు సుమీ. నీలా. ౨. ౧౦౫.

౪. సాంద్రము, దట్టమైనది.

చ... ఆ,యత మరుచక్రవాళగిరియంపిలిగద్దఱి యంధకారముల్, పితనిజకీర్తిచంద్రికలచేత నతం డపఁగించు చుండఁగన్. నీమం. ౧. ౧౬౦. అప్ప. ౨. ౧౯౭.

జ: గద్దఱించు, గద్దఱికాఁడు, గద్దఱితనము.

గద్దఱించు. అ. క్రి. (√ గద్దఱి. క. గద్దఱిను, గద్రిసు) గర్జించు.

(ఆదివరాహవర్ణనము) సీ. కఠినవాలము బెట్టు గాలించి యొకచోట. గడిమిమై రొప్పము గద్దఱించు. హ. వరాహ. ౩. ౪.

గద్దఱికాఁడు. వి.(గద్దఱి + కాఁడు - స్వార్థమున) గద్దఱితనము గలవాఁడు, ధీరుఁడు.

ఉ...ఇట్టి, ల్గద్దఱికాఁడు వాఁడిని జగంబులు గెల్చుట యేమి వింత...అచ్చ. రా. సుం.౧౨.

గద్దఱితనము. వి. (√ గద్దఱి) ధైర్యము.

క. పెద్దపులి వెడలి చనె నని, గద్దఱితనమునను నక్కకదుపులు పొదలో, నుద్దవిడిఁ జొచ్చి చిఱుతల, యొద్దం బడినట్టు లయ్యె నోయమరేంద్రా. దశా. ౪. ౪౦.

గద్దించు=గద్దఱించు. స. క్రి. అదలించు, బెదరించు.

ద్వి. ఎవ్వఁడు నావారి నెల్ల గద్దించి, చివ్వకు నామీఁదఁ జేచాఁచు... ప్రభులిం. ౩.౯౫ పా. ౨౪ పం.

సీ. గవి నున్నపులిఁ గన్నఁ గవిసి గద్దించి నొబ్బ న సిడ్చి తే నోపుప్రోడ నేను. ఉ. రా. ౭. ౪౦౪.

సీ. అదలించె గద్దించె నడలించె నవఁగను గదిమె నం చనుమాటగాఁ జెలంగు. ఆం. భా. ౩. ౧౨౪.

జ: గద్దింపు.

గద్దింపు. వి. (√ గద్దించు.) అదలింపు.

గీ. అతనిగద్దింపునకు భయ మందువారు. సుపల. ౨. ౬౯.

సీ...గద్దింపు వెలయును గద్దన యన. ఆం. భా. ౩. ౩౦.

గద్దిగ. వి. గద్దియపైఁ బఱచుకంబళి, గద్దెకంబళి.

సీ. బటువుగద్దియులపైఁ బట్టుగద్దిగలెత్తి జమునదేశముల హిజాలు లమర. సుపల. ౧. ౮౬.

గీ... సొగసులిద్దంపుఁబట్టుగద్దిగ వఱిచి. సుపల. ౨. ౮.

(ఈపద మీగ్రంథముననే కానిపించుచున్నది.)

గద్దియ[1] (ద్దె). వి. ( సం ఖట్టికా. ) ౧. సింహాసనము.

గీ. క్షత్త్రియునిఁ దెచ్చి తొలితొలి గద్దియ నిడి, పట్టబద్ధుఁ గావించుచో...హరి.పూ.౧.౧౦౩.

సీ. ఉచితంబు లగుషోడశోపచారంబుల నాగద్ద కతిభక్తి నాచరించి. విక్ర. ౨. ౯౫.

ఉ...మరు, న్యాయమఁడు నిల్పె సుమన, స్సాయకసరిగద్దెమీఁద సౌహార్దమునన్.హర.౩.౪౦.

౨. పీఠము, పీఁట.

గీ... పీఠంబు దనరుచుండు, గద్దె గద్దియ పీఁట నాఁగను...ఆం. భా. ౨. ౧౬౫.

౩. పువ్వులలో నుండెడిమిద్దె, దుద్దు.

గీ. తమ్మిగద్దియదాకట క్రమ్మి యట్టి, కొమ్మఁ గావింపఁబోలు నెత్తమ్మిచూలి. వసు. ౨. ౩౨.

౪. సోద. ( బ్రౌ, శ. ర.-సోదచెప్పెడిచోటు. వా.)

గద్దెకంబడి=గద్దెమీఁద వైచుకంబళి, గద్దిగ.

ద్వి...గద్దె,కంబళ్లు కప్పుడికంబళ్లు గోర్పు, డంబులు...పండితా. పర్వ. ౩౪౬ పా.

గద్దియ[2] (ద్దె). వి. (సం. గద్యాణమ్) బంగారునాణెము, వరహా.

సీ. పదివేల మొదవులు పదివేలగద్దలపసిఁడియు ని
మ్మహీపతుల కిమ్ము. భాగ. అర. ౨. ౩౪౪.
(శ. ర, క రాల. ప్రతులపాఠము.)

**గద్దువ.** వి. (క. గద్ద) గడ్డము, చిబుకము.

సీ. మడమలు మోవంగ మైలచీరలు గట్టి కర్ణముల్
మోవంగఁ గాటుక లిడి... వెడలి గద్దువ మో
వ వీడియంబులు చేసి కాంక్షఁ జెంపలు మోవ
గంద మలఁది. కవిక. ౪. ౯౪.

గీ. అమ్మ వగవకె యంచును నక్కుఁ జేర్చి, గద్దువ
ను బట్టుకొని వేఁడఁగాఁ దొడంగు. పార్వ.
౨. ౧౬౩.

గీ... చిబుకాఖ్య యలరు గడ్డమనఁగ గద్దువ నాఁ
గ... ఆం. భా. ౨. ౧౪౨.

**గద్దెపొంకములు.** వి. బ. పరువునకుఁ దగినగౌరవం
పుమాటలు.

సీ. కలవి లేనివి కొన్ని కొలువునఁ గూర్చుండి గ
ద్దెపొంకాల్ చెప్పఁ గలదు గాక. చంద్రా. ౩.
౪౬. (గద్దెపొంకము-శ. ర, చి. ని. పా.)

**గద్యము.** సం. విణ. (అ. ఆ. అ) చెప్పఁ దగినది.
వి. అ. న. వచనము. (వ్యతి. పద్యము.)

**గద్యాణకము.** సం=గద్యాణము.

**గద్యాణము.** సం. వి. అ. పుం. ౧. నలువదియెనిమి
దిగురిగింజలయెత్తు. ౨. వరహా, ఒకబంగారు
నాణెము.

**గద్యానకము.** సం=గద్యాణము. (కల్ప)

**గనగన**=కనకన. వి.

(తపించుట యందలియనుకరణము.)

సీ. వేసవి గనగన వేఁగుచట్రాతిపై నగ్గి నల్లడ మం
డ నక్కుఁ జూచి. నిర్వ. ౩. ౬౩.

చ. గనగన నెల్లప్రొద్దుఁ గొని కాలెడువేఁడిమిఁ
జేర్చుభర్తమే, నెనయును దగ్గఱన్ సయిఁప
కింతయు భీతి నొందుం[illegible]

౧౬౭. (ప్రాఁత ప్రతిపా).

(కోపముచే మండిపడుటయందలియనుకరణము.)

క. అనుటయు హంసుఁడు గనగనఁ, గనలి మదిం
జెలువు విడిచి కాలువఁ బొగడం, జను నే వీ
నికి నని యిట్లను... ఉ. హరి. ౪. ౧౫౬.

(త్వరితముగా చొచ్చుటయం దగుననుకరణము.)

ద్వి. గడియ గ్రుక్కునఁ బుచ్చి గట్టునఁ దలుపు,
గడుఁ బాఱఁ దెఱమును గనగన ద్విజాలు, సొ
చ్చుదు నంతలో... పండితా. దీక్షా. ౪౪పా.

విణ. ౧. గనగనయను కాంతి కలది. (కర్మధారయ
మున నిగాగమము.)

వ... మవ్వంపుదివ్వెలవలె నివ్వటిలుగనగననిమణు
లకై ... ఉ. రా. ౩. ౧౯౧.

వ... మినుకుమినుకు మనుగనగననిమణులకృణు
లపెంపు కంపలసొం పలరింప... సమీర. ౩.
౧౭౫.

వ... గనగనని నిప్పులన్ ... మనుచ. ౪. ౬౦.

గనగనలాడుకుంపటి=గనగనమండునిప్పులు గల
కుంపటి. సానందో. ౨. ౬.

**గనప.** విణ. (√ గనము?) పెద్దది; ఎత్తైనది.

(వృత్తియందే దీనికి ప్రయోగములు కనఁబడుచు
న్నవి.)

సీ. కాంచి యుదంకుండు గ్రమ్మన దిగదాఁటి వె
నుకొనుచుంతను గనపపుట్టఁ, జొచ్చె నయ్యుర
గము... భార. అశ్వ. ౩. ౧౦౫.

గీ. కావిసెలయేఱు లురిలెడుగనపకొండ, కరణి
నొందె బాణుఁడు బాహుకర్తనమున. హరి.
ఉ. ౫. ౨౧౨.

సీ. జాంబూనదచ్ఛాయచందంబువర్ణంబు గలిగిన
పలుచనిగనపమేను. భార. ఆశ్ర. ౨. ౪౦.
భార. శాం. ౪. ౪౦.

**గనపర**=గనిమెర. వి. గన్నేరు. (చూ. గనపరా
కులు)

**గనపరాకులు.** వి.బ.గన్నె రాకమ్ములయొక్క అలుఁగులు. (వావిళ్ల, వేదము. వ్యాఖ్యలు.)

గీ...గనపరాకులు నిగిడ్చి, చెప్పటిట్టులు శోధించి సిగలు విప్పి. ఆము. ౬. ౭౫. (గనపరాకులు నిగిడ్చి=గొడుగుల గన్నె రాకులు వలిపించి అని వ్రాఁత ప్రతివాఖ్య- 'కనపరాకులు=గన్నె రాకులవంటి అలుఁగులు.' అని బ్రౌ- ప్రయోగాంతరము కనఁబడలేదు )

**గనము.** విశే. (సం. ఘనమ్. క. గన.) అధికము.

సీ... పెను గొప్ప బలు పేరు పెద్ద దొడ్డ, గన మనన ధికాఖ్యలొనరు...సాం. ని. మాన. ౪౯.

**గనయము.** వి. ౧. పోఁకముడి, నీవి.

గీ. నాతిగనయంబు వదలింప నాథుమీఁద, నాభిపంకజగంధ మున్నతిఁ జరించె,నన జుగుప్సాభిధాళ్లిల మయ్యె నింతి,కపుడు పొక్కిలిరోంపికం పర్థమగుట. కావ్యా. ౬. ౯౧.

సీ. ఆనయంబుఁ దిన్ననియనువున గనయంబు ప్రిదులంగ మెలఁగి చొక్కొదవఁజేయు. ఆ. నిక్కరంబు...భార. స్త్రీ. ౨. ౧౩౩.

౨. వింటికొప్పు.

క. గొనయంబునెక్కఁ ద్రోచిన, గనయంబున కెక్కకున్నఁ గ్రమ్మినతమకం,బున విల్లు విడిచి వేఱొక, యనిమిషభటుఁ డనికి వెడలె నడిదము గొనుచున్. పారి. ౪. ౭౧.

**గని¹.** వి. (సం. ఖనిః) ౧. ఆకరము, బంగారము మున్నగునవి పుట్టుచోటు; స్థానము.

గీ. గని యనఁగ నాకరం బగు ... ఆం. భా. ౨. ౩౨.

క. జనపదములు పురగిరులున్, గనులు వను ల్నదులు ... కనుఁగొనుచుఁ బోయి ప్రోలన్ లీలన్. హంస. ౫. ౩౪౭.

గీ. ...అధికశుభంబులకు భ,వత్ప్రసాదంబు గని కాదె వాసుదేవ. భార. శల్య. ౨. ౩౩౯.

మ...ప్రచ్ఛనివిల్కానికి మామ చల్వగని పక్వశ్ఫలజాటాగ్రమో,హాసరత్నంబు సుధాకరుండు...పారి. ౪. ౪౭.

౨. బిలము, రంధ్రము.

చ. అనవుడు నిప్పగోత్రమమునందు ఘుహాబిల మొప్పుచుండు దా,నను గుహ యొక్క టెప్పుడును నవ్యముగాఁ గనుపట్టు నందు,లో, నను పమ మైనగుండు గల దందును నేడు బిలంబు లుండు న,గ్గనులఁ జరించుఁ దుమ్మెదల కైవడి నెప్పుడు వానిప్రాణముల్. మై. ౩. ౧౨౧.

**గని².** వి. (సం. ఘనమ్.) గడ్డ, ముద్ద. (చూ. గనికట్టు)

జ: గనికట్టు.

**గనికట్టు.** అ. క్రి. (గని² + కట్టు) ఘనీభవించు, గడ్డకట్టు.

వ... సేవంతిపూఁబొదలచినుకున ననఘహిమసలిలములు ... కస్తూరి మెకంబులమదభరంబులం దొరఁగు నాభీరక్తంబు లిగిరి గనికట్టిన నిగరములు గరఁచికొని పఱచి...వసు. ౨,౯ ౧౧.

**గనికెకుండలు.** వి. బ. బాల్యక్రీడావిశేషము.

సీ... చొప్పబెండ్లమంచంబులు గంగెద్దులాటలు గనికెకుండ,లు...హంస. ౩. ౧౪౬.

(ప్రయోగాంతరము లేదు-గరగకుండలు?)

**గనిమ.** వి. (పాదు మడి మున్నగువాని) గట్టు, సేతువిశేషము.

క. మహనీయమఘుఘుకేసం, గ్రహమునఁ గాలువలు వఱపి గనిమలుగ రజం,బహరహము నెఱపి మాకు,న్నహకారము లయ్యె నచటిసహకారంబుల్. వసు. ౧. ౧౩౮. ఆం. భా. ౨. ౮.

మ. గనిమల్ దీఁటిచి కాల్వలేగపఱచి ... బహు. ౨. ౨౦.

సీ. ఆడునుదుక్కులను మళ్లెడలఁ గాఁ బొఱలదురుసై నగనిమలు నతికి నతికి, పైరుమునుఁగ గాద

బలిసినచేలలోఁ జెరలక కలువులుతీసితీసి. ఉ. హరిశ్చ. ర. ౧౩.

**గనిమెర**=గనపర. వి. గన్నెరు ?.

ద్వి. గనిమెరపూఁజాయ గలుగునీర్కావి, గనుపట్టుకాటి మీఁగాళ్లతో నొరయ. ద్వి. పరమ. ౪. ౨౬౮ పా. ౧౧ పం. (చి. ని. పా.)

**గనియ(నె).** వి. (సం. కణికా) ఖండము, ముక్క.

సీ. గనె గండ్ర గండ్రిక గనియ యటంచన నిష్ఖాదిఖండంబు లెన్నఁ దగును. ఆం. భా. ౨. ౭౫.

గీ... మేని, గనియ లన్నియు సంధానకరణి నదికి. భా. రా. యు. ౧౧౨౦.

సీ... తనుపారురసదాడిగనెలతోడ. ఆము. ౨. ౭౩.

ద్వి... సభవారు నట్టిదురాత్ము... గనెలుగాఁ జేతులుఁ గాళ్లుఁ గోయింపఁ, జను నని...నవ. ౨. ౯౨ పా. ౧౩ పం.

**గనివోటు.** వి. (క. కణి=రాయి. త. కణె) అనవాలుకై వ్రాళ్లమీఁద వరుసగా వేయు పోటు ?.

ద్వి...ఉలు లోలి నాటి, పసలు మించఁగ సూత్రపట్టినపగిది, వినుపక గనివోటు వేయువారలును ... అనిమిషశిల్పి, గని యోటువడుచుండ గనివోటు వైవ. ద్వి. పరమ. ౭.౫౧౫ పా.

గనివోటుకొట్టు=గనివోటుపడునట్లు కొట్టు ?.

సీ. ఎప్పుడు చూచిన నెడపక ఖంగుఖం గనునుక్కుటులులమహాస్వనంబు, బెడిదంపుటడ్డీలు బిగియించి గనివోటు కొండ గొట్టెడుకట్టు గుండ్లరవము. పరమ. ౫. ౪౦.

**గనీబు.** వి. ఒఱ, ఖడ్గకోశము.

చ. కలకల నవ్వుచున్న ల్పపకిఖామణి పహొన్నుగనీబులోనియి,ట్టలపు మె ... ౨. ౫౩.

గుఁగటారి జకిన దూసి మం,త్రులు గన కూద్రుమస్తము కఱుక్కునఁ ద్రుంచె... ఉ. రా. ౭. ౨౧౧.

**గనుపు**=కనుపు. వి. వెదురు చెఱకు లోనగువానియందు ఎడనెడ నుండుముడి, పర్వము.

సీ...కన్ను కనుపు గంటు గను పంచనఁగఁ బర్వ,మమరు...ఆం. భా. ౨. ౭౪.

**గన్నెర**=గన్నేరు.

రగడ. తలిరుఁబోఁడి నీతలఁపునఁ గన్నెఱ,వలను తేనెలకు పంపకు గన్నెర.రాజ.చ.౨.౧౪౯.

సీ. గొజ్జంగి యుజ్జాజివజ్జం గిసల మొందు నెలకొకస్తురియు గన్నెరయుఁ బూచె.బహు. ౨.౨౧.

**గన్నెరాకమ్ము.** వి (గన్నెరు+ఆకు+అమ్ము)-గన్నేరాకువంటియలుఁగు గలబాణము-బాణవిశేషము.

వ...అట్లు తాఁకుటయు వారల నతండు గన్నెరాకమ్ములఁ జీకాకుపఱిచె...భార. భీష్మ.౩. ౨౧౯.

గీ. పసిఁడిపీఠంబుపై నుంచి పద్మనయనఁ, జెలువముగ గన్నెరాకమ్ము సేతి కిచ్చి. నైష.౬.౩౮.

**గన్నెరు**=గన్నేరు.

(గన్నేరుపువ్వు)

సుగంధి. చాలుఁ జాలు నెంతకైనఁ జాలు నున్న గన్నెరుల్. యయా. ౪. ౨౦.

ఉ. కన్నియ యెన్నియేండ్లు విరిగన్నెరులక్ హరుఁ బూజసేసిరో...రా. వి. ౪. ౨౩.

(గన్నేరుచెట్టు.)

సీ...కరవీర మలరును గన్నే రనంగను గన్నెర నఁగ. ఆం. భా. ౨. ౫౩.

(బ. ధాన్యవిశేషము.)వేంక. మాన.౭౬.

**గన్నేరు**=గన్నెర, గన్నెరు. వి. కరవీరము ?.

సీ. గన్నేరుఁబూఁజాయఁ గనుపట్టుజిలుఁగైనసరిలకాషాయవస్త్రంబు గట్టి. నైష. ౮. ౧౦౩.

(బ) ధాన్యవిశేషము. పాం. ని. మాన. ౫.౨.

**గప్పళించు.** అ. క్రి. ఇనుకు.

సీ. ఇవి పొత్తి సొలసినమృగనాభిమృగిసెత్తురులు గప్పళించినకలవు లయ్యె. రా. వి. ౩. ౫౩. (ప్రయోగాంతరము లేదు)

**గప్పాలు.** వి.బ.(హిం. గప్) జంభాలు, అతిశయపు మాటలు. (శ. ర.)

**గప్పు=గుప్పు**[2]. వి. వాసనగొట్టుటయందలియనుకరణము. (ఆమ్రేడితరూపము-గప్పుగప్పు.)

(వ్యవ) వాఁడు రాఁగానే అత్తరువాసన గప్పుమని కొట్టుచున్నది.

రగడ. కప్పురంపుటనంటు లివిగో గప్పుగప్పునఁ దావిఁజిల్కెడు. కిరా. ౩. ౨౦.

**గప్పున=గుప్పున.** క్రి. విణ. ద్రు. శీఘ్రముగా; అకస్మాత్తుగా.

సీ. పటచిత్రితాకారపతిరేఖ కనుడాయ విప్పు కెప్పులచేత నప్పళించె, నప్పళింపఁగనీక గప్పునఁ గనుదోయి నలమి పైఁబడ లజ్జ యడ్డకట్టె. చంద్రా. ౫. ౨౬.

(గుబ్బలు) ఉ. గప్పున వ్రాలఁగాఁ దివురుకైవడి నుబ్బున నిబ్బరింపుచుఁ. చంద్రా. ౬. ౧౪౨.

సీ. చెలులు సిబ్బెంపుగుబ్బలఁ జిల్కుపన్నీట నెగసి గప్పునఁ గప్పి సిగుదుపొగల. చంద్రా. ౪. ౨౨.

**గబగబ=గవగవ.** (బ్రా.)

(వ్యవ) వాఁడు గబగబ పరుగెత్తుకొని వచ్చినాఁడు. వాఁడు గబగబ ఉత్తరము చదివినాఁడు. వాఁడు గబగబ పని చేసినాఁడు.

**గబీలు.** వి. గ్రుద్దుట నీళ్లలో నుఱుకుట మండుట కలఁత నొందుట మున్నగువానియందలి యనుకరణము.

(వ్యవ) వాఁడు గబీలున నొక గ్రుద్దు గ్రుద్దెను. వాఁడు నూతిలో గబీలున ఉఱికినాఁడు. ఆయడవి గబీలున మండుచున్నది. (శ. ర.) కడుపులో గబీలు మనుచున్నది.

క...ఆతనిఁ గనినంతనె నా, డెందము గ…లు మనియెఁ...అహ. ౩. ౯.

**గబుక్కున=గవుకున.**

(వ్యవ) వాఁడు గబుక్కున నూతిలో దూఁకినాఁడు.

**గబుసు.** వి. కపటము.

సీ ... కపటాఖ్య విలసిల్లు గబ్బి గొరు, గబుసుకైపు కిటుకు కాదు డబ్బు కవుదు డంబవంగ...అం. భా. ౧. ౧౩౯.

**గబ్బాటు**[1]. వి. కలఁత. (శ. ర.)

**గబ్బాటు**[2]. విణ. నెల తక్కువైనది.(పసుపు కంద చేమ గెనసు పెండలము మున్నగువస్తువు-శ.ర.)

**గబ్బి.** విణ. (గబ్బు+ఇ-క. గబ్బి) గర్వి; దుష్టము.

సీ...రాచబిడ్డయై యుండి గబ్బితనం బెఱుంగఁడు...ఉ. హరి. ౫. ౨౬౯.

ఉ. ఆసతిఁ గూడి యాసరణి నన్య మెఱుంగక యుండ నీసునం, గాసిలి తత్సపత్ని జర గబ్బితనంబునఁ జెంపఁ గొట్టుచుఁ, దా సెక వుట్టి యప్పుడు దనర్చురతిఁ ముఖచుంబనంబునుం, జేసెనొకో యనంగ నరసెం బతి కయ్యయిచోటు లంతటఁ. పరమ. ౨. ౪౬.

క. గబ్బిమరుం డొలి పెఱుఁగక, గొబ్బునఁ బైఁబడును...విజ. వి. ౨. ౧౯౧.

౨. నిక్కినది, నిగిడినది.

వ...పలుకంబండినమారేడుపండ్ల గారాముఁ జెఱచుగబ్బిగుబ్బలబెడంగును...హర. ౩. ౨౩.

(స్తనవర్ణనము.) సీ. కొనలుబ్బి గబ్బులై గుబ్బలై యపరంజికుండలై కొండలై దండ నిండి. నరస. ౫. ౧౧౩.

౩. గొప్పవాఁడు, ఘనుఁడు.

గీ. కదలిఁ గోలకుఁ దెచ్చినగబ్బి వీవ. పారి ౧. ౪౯.

(మందరపర్వతము.) సీ.. కడలిరాయలలోఁతు గన్నగబ్బి. మనుచ. ౫. ౪౭.

౪. ధీరుఁడు.

గీ. ఒగి నిరాయుధహస్తుఁడై యొక్కరుండు,కాలయవనునికడ కేఁగి గబ్బితనము, వెలయఁ దనపేరు చెప్పి గర్వించి తన్నుఁ,దఱిమి పట్టంగ నోపినఁ దగిలి రమ్ము.

చ. అనుటయు...వి.పు. ౭. ౧౨, ౧౫.

౫. కపటము, కవుదు.

సీ... కపటాఖ్య విలసిల్లు గబ్బి గారు, గబుసుకైపు కీటుకు కాదు డబ్బు కవుదు డంబనంగ...ఆం. భా. ౧. ౧౩౭.

గబ్బిడా=గబ్బిలము.

సీ...గబ్బిలము గబ్బిడా గబ్బిలాయి చీకు,రాయనంగను తైలపాయికాఖ్యలు చెల్లు ... సాం. ని. తిర్య. ౭౧.

గబ్బిడాయి=గబ్బిలము.

గీ. గబ్బిడాయి యనంగను గబ్బిల మనఁ,దైలపాయిక చెన్నొందు దక్షశిక్ష. ఆం. భా. ౨. ౯౪.

గబ్బిలము=గబ్బిడా, గబ్బిడాయి, గబ్బిలాయి.వి. తైలపాయిక, ఇంటికప్పు మొదలగువానినుండి తలక్రిందుగా వ్రేలాడుఒకవిధ మగుపక్షి.

గీ. గబ్బిడాయి యనంగను గబ్బిల మనఁ, దైలపాయిక చెన్నొందు దక్షశిక్ష. ఆం. భా. ౨. ౯౪.

గబ్బిలాయి=గబ్బిలము. (క. గబ్బిలాయి)

సీ...గబ్బిలము గబ్బిడా గబ్బిలాయి చీకు, రాయనంగను తైలపాయికాఖ్యలు చెల్లు...ఆం. సం. తిర్య. ౭౧.

గబ్బిలి. వి. ఔ. పిడికిలి.

ఉదా: గబ్బేఁడుకూర తే. (శ. ర.)

గబ్బివాఁడు. విశ. (గబ్బి+వాఁడు) గబ్బితనము గలవాఁడు.

(కొంటెవాఁడు)

(కృష్ణుఁడు) ద్వి. మునిమేఁటనే ... పదుచు, చనుగుబ్బ గోరొత్తి చనుగబ్బివాఁడు ఆ.మ. క. ౧. ౩౪ పా. ౧౦ పం.

గబ్బిన. వి. ఒకానొకమూలిక. (శ. ర.)

గబ్బు. వి. (సం. గర్వః. క. గబ్బు) ౧. గర్వము;పొగరు.

ద్వి. గబ్బున జైనమార్గమె యాది యనుచు, మెట్టి మాతోఁ బ్రతిఘట్టించి యాడ. బస. పు. ౬ ౫౫౯ పం.

చ. కడఁగి కుమారుపేరురము గబ్బును నుబ్బును దొంగలింపఁగాఁ, బొడిచెను... నృసిం. ౪. ౧౧౪.

సీ. కెరలించి యమృతంబు గిలకొట్టఁగా రాదె ముద్దుచూపెడివీరిమోవులందుఁ, బచ్చబంగారు కుప్పలుసేయఁగా రాదె గబ్బు మీఱినవీరి గుబ్బలందు. పాండు. ౧. ౧౧౭.

౨.(గజాదుల)మదము.(చూ.గబ్బుచెంకమెకము)

౩. గంధము; దుర్గంధము.

ఆ. కంపు గబ్బు గవులు గందంబు వల పన,గంధ మొప్పు...ఆం. భా. ౧. ౧౦౬.

సీ...పొలగబ్బు...చంద్రా. ౨. ౭౭.

సీ. ఎడ లేక తఱుచు వ్రేలెడుజిబ్బటీలచే గబ్బులు వెదచల్లుగర్భగృహము. చంద్ర. ౩. ౪౭.

జ: గబ్బి, గబ్బివాఁడు, గబ్బుకొను,గబ్బుచీకటి, గబ్బుచెంకమెకము, గబ్బుదేలు, గబ్బెక్కు.

గబ్బుకొను. అ. క్రి. (గబ్బు+కొను) గబ్బు కలది యగు.

(వాసనగొట్టు, పరిమళించు.)

ఉ. గుబ్బలిపట్టిగబ్బివలిగుబ్బలజొబ్బిలుతావికుంకుమం, గబ్బుకొనంగఁ జాలుసెదఁ గప్పినదెబ్బలివన్నెవచ్చడం, బబ్బురమై తనర్పఁ బ్రమథావలి యుబ్బుచు వెంట నంటఁగా, గిబ్బవ

యాళి తేజి దుమికించుచు వచ్చె మహాసుఁడ
త్తుబిక్. దశా. ౨. ౬౯.

**గబ్బుచీకటి.** వి. (గబ్బు+చీకటి.) గాఢాంధకారము. (శ. ర)

**గబ్బుచెంకమెకము.** వి. (గబ్బు+చెంక+మెకము)-మదము గాఱు చెంపలు గలమృగము-ఏనుఁగు.

సీ. గబ్బు చెంక మెకంబుగట్టికళవసంబు కుబుసంబు
గాఁ జేసికొన్నదంట. ఆం. భా. ౧. ౩౭.

**గబ్బుదేఱు.** అ. క్రి. (గబ్బు+తేఱు.) గబ్బుకలదియగు.

(అతిశయించు)

సీ. మెఱుపులై మిట్టలై మిక్కిలి బటువులై క్రా
లుఁగన్నులచన్ను గబ్బుదేఱ. గీ. పత్త్రి పతికే
తనునిపురః క్షేత్ర మూఁడి,యున్న శ్రీక్షేత్ర
పాలకు యోగిలోక,రమణు ముప్పదిరెండక్ష
రములమంత్ర,రాజము జపించి కోల్వ దొరకు
శుభములు. పాండు. ౨. ౯౧.

**గబ్బులుఁగు**=గంపపులుఁగు. (గంప + పులుఁగు.)

ఉ. మానక యుబ్బి గబ్బులుఁగు మాటికి మాటికిఁ
గ్రోల్చెఁ గొమ్మపై ...హర. ౨. ౧౯.

వ... కాళికంబు డబ్బు గబ్బులుఁగు గౌళి కనుఁబెం
టి పైఁడికంటి లోనగుతిర్యక్కులు భావిప్ర
యోజనసూచకంబులై యున్నయవి. ఆము.
౬. ౬౬. ఆం. భా. ౨. ౯౭.

**గబ్బెక్కు.** అ. క్రి. (గబ్బు + ఎక్కు) గబ్బుమీఱు, సాంద్రమగు, దట్టమగు.

ఉ...గబ్బెక్కినమబ్బు శైలగుహ లీఁగె దిశల్
వెలుఁగొందె నిక్కలక్, జక్కవజోళ్లు గెరె
జలజాతహితుం డుదయించెఁ దూర్పునక్.
వేం. పంచ. ౩. ౧౦౭.

**గభస్తి.** సం. వి. ఇ. పుం. ౧. కిరణము. ౨. సూర్యుఁడు. స్త్రీ. స్వాహా, అగ్నిదేవునిభార్య.

**గభస్తిమంతుఁడు.** సం. వి. న్. పుం. సూర్యుఁడు.

**గభస్తిమాలి.** సం. వి. న్. పుం. సూర్యుఁడు.

**గభస్తిహస్తుఁడు.** సం. వి. అ. పుం.-కిరణములు చేతులుగాఁ గలవాఁడు-సూర్యుఁడు. (త్రి.ని.)
(ఇట్లే గభస్తికరుఁడు, మొ.)

**గభీరము.** సం. విణ.=గంభీరము.విణ.

**గభీరిక.** సం. వి. ఆ. స్త్రీ. గంభీరధ్వని నిచ్చునొక భేరి, పెద్దఢక్క.

**గభీరిమ(ము).** సం. వి. న్. పుం. గాంభీర్యము.

**గభోలికము.** సం. వి. అ. పుం. గుండ్రనితలగడ.

గమకము. వి. ౧. యత్నము, పూనిక; ఉత్సాహము.

క. గమకమున నెదురుపగతురఁ, గొమరుంబాయ
ములవేల్పుఁగొమ్మలఁ గడుఁ జుట్టములఁ గఁ
గూర్చెడు నేపపు, సమకూరినరాయపక్షిసా
ర్వంబునకుక్. యయా. ౧. ౭౨.

చ. సమదగజంబుపై కుఱుకుసామజవైరికి నూటి
పెట్టువా,గమకముఁ జూచి భూపతిముఖంబు
న వ్యాధులమూఁక నిల్వలే,కమికభయాప్తి
నోరసిలె...పారంగ. ౧. ౧౦౦.

మ. గమకంబుల్ సెడి కైదువుల్ విడిచి ... ఉ.
రా. ౨. ౯౧.

౨. పుష్టి.

సీ... తాటిదండములు త్రోయంగ రెట్టలగమకము.
ప్రబంధ. ౮౨.

౩. నైపుణ్యము.

క. కలికిపరుమదనకదనపుఁ, బలుపుబకలకలము బె
డఁగువడు మేఖలము, వ్వాలరవళిఁ దగిలి గతిగొ
నఁ, గలకంఠి రతంబు సలుపుగమకము గని
యెక్. భాగ. ౬. ౯౯.

విణ. ౧. అధికము, ఉరువు, గొప్ప.

వ. ఇట్లు మ్రొక్కి చేని నమ్ముద్దియ గద్దెపై నుంచి
తద్దయు నుద్దవిడి నతనిమీఁదిశమకంబు గమ
కంబై పర్వ నతనిమదియుఁ దనవయుం దగులు
...యయా. ౪. ౬౫.

**గుదిత్రాడు.** వి. దే. (గుది + త్రాడు.) దూడకాలి కి కట్టుత్రాడు. (బ్రా, శ. ర.)

**గుదిత్రోయు.** స. క్రి. (గుది + త్రోయు.) కాళ్లు కట్టి త్రోయు.

ద్వి. అటఁ జనుచుండ మిథ్యాపరి భ్రాంతి, నటి యించి సోలుచు వక్షత్ర కుండు, గుదిత్రోసిన ట్లు హా గురునాథ యనుచుఁ, జదికిలఁబడి హ రిశ్చంద్రుతో ననియె. ద్వి. హరిశ్చ. పూ. ౧౭౧౬ పం.

క. ఇదె యిచ్చెదనదె యిచ్చెదఁ, బదపదఁ డని యాసఁ జూపి పలుదెఱఁగుల నా, హృదయ ము నొప్పించితి విఁక, గుదిత్రోఁచెద నేఁడు ని న్నుఁ గొంకక యిచటన్. హరిశ్చ. ౪. ౩౪.

**గుదియ(దె).** వి. (సం. గదా. క. గుదిగె.) ౧. గద, ముద్గరము.

గీ... అతనిశిరమ్ముఁ జేతి, గుదియఁ బగులంగ నొక వ్రేటుగొనియె సీరి. మార్క. ౧. ౧౩౫.

సీ... శేరుచుండు. గీ. గుదె గుదియ దుడ్డు గునప ము గుదుప యనఁగ, ముద్గరము... ఆం. భా. ౨. ౨౧౬.

ఆ. తర్కవిద్యలను బ్రతాపించి మోఁదిరి, గుదె ల నెముక లెల్ల గుల్లలుగను. ప్రబోధ. ౫. ౯౯.

ఉపనిషత్ :- తతో దేవాయతనాన్నిర్గత్య గదా పాణిభిః పురుషైరతినిర్దయం తాడ్యమానా స్తా దిగన్తమతి క్రాన్తాస్స్వేహ్యాః. సం. ప్రబో ధ. ౬. ౨౪.

౨. దండము, కఱ్ఱ; (యమ) దండము.

క. ఇది పెక్కుఁడులు పట్టెన్, సదనంబులు గట్ట నాకు శంభునికొఱకున్, దుదిఁ గుమ్మరి కొక యేఁడును, గుదె కొకపెట్టన్న మాటకున్ సరి వచ్చెన్. కాశ. ౨. ౯౯.

చ. గుదియను గేల నూనుకొని క్రొవ్వున దగ్గుచు నోటితుంపరల్, చెదరఁ గ్రమంబుఁ జెప్ప చును శీతనగాత్మజఁ జేర... పార్వ. ౪. ౬౭.

సీ. గుదియఁ జేకొని తద్దు కుంటి పాఱు జముండు ... అచ్చ. రా. బాల. ౬౮.

౩. గుదిగఱ్ఱ. (బ్రా, శ. ర.)

జ: గుదియకఱ్ఱలు, గుదియతాలుపు.

**గుదియకఱ్ఱలు.** వి. బ (గుదియ + కఱ్ఱలు.) గుదిగుం జల కడ్డముగాఁ జొప్పించెడుకఱ్ఱలు. (బ్రా, శ. ర.)

**గుదియ(దె)తాలుపు.** వి. (గుదియ + తాలుపు) యముఁడు, దండధరుఁడు.

క. కొండలు పిండిఁయొనర్తునొ, గం డెసఁగఁగ వలువగ్రుడ్లు గాలింతునొ వే, చెండుదునొ గుదియతాలుపు, కండలు గుండియలు వెల్వగ మి నొంపుదునో. అచ్చ. రా. సుం. ౨౩. ౬౦. సం. దేవ. ౧౯.

గుదియతాల్పుతూపు = యామ్యాస్త్రము. అచ్చ. రా. యు. ౨౬౫.

**గుదివడు.** అ. క్రి. (గుది + పడు) - గుదివేసినట్లగు - బద్ధమగు, కట్టువడు; స్తంభించు, స్తబ్ధమగు.

ఆ. నాగపాశబంధనంబుల గుదివడి, వారు వివిధ బాణదారితాంగులై రథంబు విడిచిరి... భా ర. కర్ణ. ౨. ౨౩౪.

మ... నిశ్చేష్టం బద్దద్వంద్వముల్, గుదివడ్డన్ బె గడొందియున్ ... భార. విరా. ౩. ౨౭.

చ. చెదరినకుంతలంబులును జిన్నిమొగంబును విం తకాంతియున్, బెదరినవాలుఁజూపులును బింకము చూపుచు నొప్పుమోవియుం, గుదివ డుచున్న చన్నుడుముఁ గూరినదప్పియు మేన సొల్లెడం, గదిరినదివ్యగంధమును గాంచి ము నీంద్రుఁడు సంశయంబుతోన్. పద్మ. ౩. ౩౭.

**గుదివెట్టు.** స. క్రి. (గుది + పెట్టు) కట్టు, బంధించు.

చ... ఒక్కయంచఁ గని బోరనఁ బట్టి సరోజ నాళతంతుల గుదివెట్టి... దశకు. ౩. ౧౧౮.

గుదులుపట్టు. అ. క్రి. (గుదులు+పట్టు) కదలకుండ కూర్చుండుటచే కాళ్లు స్తంభించు, స్తబ్ధమగు. (వ్యవ) చాలసేపు కూర్చుండుటచే నాకాళ్లు గుదులుపట్టినవి.

గుదోద్భవము. సం.వి. అ. పుం-గుదమునఁ బుట్టునది-మూలవ్యాధి.

గుద్ద. వి. (సం. గుదమ్. క. గొద్ద) ౧. అపానము, పాయువు, ముడ్డి.

సీ. భారతకతలోన బాలరా జొక్కఁడు కుంభకర్ణునిబట్టి గుద్ద పించె. వేను. ౫౫.

సీ...గుద్ద పిత్తి యనంగ గుదము దనరు. సాం. ని. మాన. ౧౯.

౨. యోని, ఆఁడుగుఱి. (వా-చూ. గుద్దబిల్ల.)

జ: గుద్దబిల్ల.

గుద్దబిల్ల(ల్లి). వి. ఆఁడుపిల్లలమొలను గట్టెడిబిల్ల, అంగబిళ్ల. (వా

గుద్దలి. వి. ఔ. (సం. కుద్దాలః. క. తు. గుద్దలి. త. కుందాళం) వేళ్లు మొదలగునవి పెల్లగించెడిసాధనము, కుద్దాలము.

సీ. గుద్దండ్లనుం బెద్దగునపంబులను గోట యొండొండ త్రవ్వట...హరి. ఉ. ౨. ౧౬.

చ. మును దమసీమ చేసికొని మ్రల్లిడి గుద్దట వెండి చేనిమెత్తన కయి వేరు పెల్లఁకియుఁ ద్రవ్వెడుకర్షకునట్లు...ఆము. ౪. ౨౧౯.

జ: గుద్దలించు, గుద్దలిగొను.

గుద్దలించే. స. క్రి. (√గుద్దలి.) ౧.గుద్దటితో త్రవ్వు; త్రవ్వు; త్రవ్వు, పెల్లడించు.

సీ...కొందలు తోడుగా గుద్దలించి. గీ. పెన్నిధులు గాంచి వెరవునఁ బెల్లగించి. దశకు. ౩. ౫౩.

సీ. గురుపయోధరభారపరిణాహవిస్ఫూర్తి గుద్దలించు హేమకుంభగరిమ. భీమ. ౧. ౫౧. (ఇట ఔపమ్యవాచకము.)

గీ. ఏలయొనోన్నతరంబుల నీడఁబడ్డ, పెద్దవాపులు శోధించి గుద్దలించ, వారకాంతాజనములకు వావి గలదె. హర. ౭. ౧౨౫.

౨. వెదకు.

సీ....లోలాయ్కానగరిమోసాల వెదకి, దండపాణ్యాసవభాండేశ్వరంబులుఁ గుక్కుటస్థానంబు గుద్దలించి. కాశీ. ౨. ౪౧.

గుద్దలిగొను. స. క్రి. (గుద్దలి+కొను) గుద్దలి పెట్టి త్రవ్వు; త్రవ్వు.

క. వటుమానసను క్షేత్రముఁ, గుటిలాలకచేష్టితముల గుద్దలిగొని యిట్టటు పాదుచేసి మోహపు,వటబీజము మరుఁడు నాటి వర్ధిల్లఁజేసెక్. వైజ. ౨. ౧౩౬.

(వరాహము.)చ. మునుకొని సస్యసంఘముల మోరను గుద్దలిగొంచు పెల్లెడం,దనవుపుమైఁ జరించు...విక్ర. ౨. ౧౨౯.

అ. క్రి. హాని చేయఁ దలఁచు.

వ... కురుకులంబునకు గుద్దలిగొని దుర్యోధనుండు నీవ తోడరితి...భార. శల్య. ౨. ౩౨౫.

ద్వి. కులమున కెల్లను గుద్దలిగొనియెఁ,గుల మెల్లఁ గొనిపోయి జలములోఁ గలిపె. పండితా. దీక్షా. ౪౩ పు.

గుధితము. సం. విణ. (అ. ఆ. అ.) చుట్టుకొనఁబడినది, క్రమ్మఁబడినది.

గుధేరుఁడు. సం. విణ. (అ. ఆ.అ) రక్షకుఁడు.

గునగున. వి. (త. కుణుకుణు.) వేగము గా నడచుటయందగుధ్వని కనుకరణము.

వ...కొందఱు గునగున నేఁగి చేరువఁ బుట్టలఁ జేరువారును...ప్రబంధ. ౭౫౫.

(వరాహవర్ణనము.) చ. గునగున వచ్చి లావరులఁ గొమ్ముల ప్రక్కలువాఱఁ జీరుచున్...విక్ర. ౨. ౧౨౯.

క. ఈపగిది పలేఁడు గునగున,గోపవ వెనువెంట న
రిగెఁ గొంకక...వి.ప్ర. ౮. ౫.

**గునప(న్ప)నకోడి.** వి. వనకుక్కుటము.

సీ. గువ్వ గున్పనకోడి గోర్వంక కోయిల...ప్ర
బంధ. ౨౩౮.

**గునపము.** వి. గడ్డపాఱ, ఖనిత్రము.

గీ...బలితంపుటినుపకట్లమర నొప్పు, వెండిగున
పంబులో కాక వెండికట్ల, యినుపగునపంబు
లో యనఁ దనరి కురిసె, నెంతయును జిత్తు
జల్లుగ సేదుముండ్లు. కళా. ౬. ౧. హరి.ఉ.
౨. ౧౬.

**గునామొలనూలు.** వి. బిడ్డలు కట్టుకొనుకటిసూ
త్రవిశేషము.

ఉ. కెంపులరావిరేక జామికీల్ పులిగోరును జం
దమామ సొన్నంపుసరాలు గాజులు గునా
మొలనూల్ రవగజ్జె లందియల్. భానుమ
ద్విజయము. ౧. ౬౯. (బ్రౌ, శ. ర.)

**గునియు.** అ. క్రి. ౧. నర్తించు, ఆడు; చలించు;
ఊఁగు; చెదరు.

ద్వి. అంచితప్రీతిమై నాడెడివారు, కో యని
యార్చుచు గునిసెడివారు. పండితా. దీక్షా.
౫౫.

కవిరాజ... కుచాగ్రములన్, విరులు నటింపఁ
గురుల్ గునియన్ ... వ్రజసుందరు లంద
అమందగతిన్. (చని.) భాగ.౧౦ ఉ.౮౧౧.

సీ. దురితాత్మురాలు మంథర సహింపఁగ లేక గు
నుకుపర్వున గూను గునియ నేఁగి. దశా. ౭.
౨. ౩.

వ.... కావళ్లు మోచికొని యొండొరులతోడం
బంతంబు లాడుచు గునిసి గునిసి నడుచువా
రును...వి. పు. ౭. ౧౮౭.

గీ. గునియుజార్పిగ చెక్కుట గోరు మోవిఁ, గం
పులత్తుక నుదుర గంధంపుఁజిటులు, వాసవ
సువంటువలువతో వచ్చినట్టి, పుత్త్ర యిది
కానివడతకుఁ బులుఁగుగాదె. ప్రబంధ ౬౯౩.

౨. కులుకు.

(ప్రమథవర్ణన) సీ. పులితోలు హొంబట్టుఁబుట్ట
ము ల్గలవారు కొమ్ముతేజాల నెక్కి గునియు
వారు. పాండు. ౧. ౧౬౫.

జః గునిసియాడు, గునుపు.

**గునిసియా(సా)డు=గునియు.** అ. క్రి. (గునిసి+
ఆడు)

(నర్తించు, ఆడు; చలించు.)

సీ. వేడుకతోఁ బోరు నూడంగఁ గంటి నే నని
నారదుఁడు వొంగి గునిసియాడ. కు.సం. ౧౨.
౧౧౮.

సీ. కనకాద్రి సానుసంగతకేకినులభాతిఁ గ్రొమ్ము
ళ్లు వీపుల గునిసియాడ. భాగ. ౧౦ ఉ.౧౦౩.
కాశీ. ౩. ౭౫.

ఉ. క్రొన్నెలవంటినెన్నుదుటఁ గుంతలముల్ గుని
సాడుచున్నయా, చిన్నికుమారుఁ గాంచి...
బ్రహ్మో. ౮. ౧౧౩ పా. (శ. ర. పా)

సీ. అట్టు నిట్టు దువాళి హవణించ నాసులోఁ గ్రో
వి నా వలిమెట్టు గునిసియాడ. బహు. ౩. ౬.

**గునిసె=గొనిసె.** విణ. పొట్టివాఁడు, వామనుఁడు.

సీ...మట్టసి మట్టము మట్టసము గొనను గొనవ
గొనిసె గునిసెగిటక తింగణా యనఁగను వా
మనాఖ్య దనరు. ఆం. భా. ౨. ౧౨౩. (వ్రాత
ప్రతిపాఠము)

**గునుకు[1](న్కు).** అ. క్రి. మఁదముగా పరుగెత్తు;
పరుగెత్తు.

గీ. క్రొవ్వి నడగొండకై వడి గునుకునొక్క, యొం
టిగాని మహీనాథుఁ డొదిఁగి యేయ. మనుచ.
౪. ౪౭.

గీ. పెదమొదవుకూడఁ బో లేనిపెచ్చుఁ గ్రొవ్వా,
కల్ప మెడనూవ పెడలెనో యనఁగ నెట్ట, కే
లకును గ్రుంగి తెచ్చుబంతులు నిగుడఁగ, మం

దగతి గుస్కి వృషభముల్ మందపిఱుఁద. ఆ
ము. ౪. ౧౬౯. (ప్రాఁత ప్రతి. పా)

ద్వి. అని మడమలు మోవ కతిసంభ్రమమున, గునుకుచు...ద్వి. హరిశ్చ. ౬. ౫౮౬ పం.

క. అని తలపోయుచుఁ దమలో, మనుకుచుఁ దికమకలుగొనుచు మురరిపుకడకుం, గునుకుచు గునుకుచు నేఁగిరి,ఘనరాత్రుసుఁ గన్నకన్నుఁగవ బెగ్గిలఁగ౯. భాగ. ౬. ౩౨౫.

వి. అల్పధావనము, మెల్లనిపరువు.

సీ.గునుకు డనంగను గును కనఁగా నల్పధావనసంజ్ఞయై తనరుచుండు. ఆం. భా. ౨. ౨౨౪.

జ: గునుకుడు, గునుకునడ, గునుకుపరువు, గును కెత్తు.

**గునుకు².** వి. తృణవిశేషము.

సీ. చీమలు ప్రాఁ లీడ్వఁ జివికినవెలుగుపట్టునఁ బండి యెండి క్రుంగినగునుకుల. ఆము. ౬. ౧౩. ప్రబంధ. ౨౦౦.

(బ). తృణధాన్యవిశేషము.

సీ...తృణధాన్యములు చెలంగు, గునుకులు దూసరు ల్గొలిచె లనంగను...ఆం. భా. ౨. ౨౩౯. కాశ. ౩. ౧౫౧.

గునుకుఁబ్రాలు=గునుకుబియ్యము.

క. ఓలింగమ విను నివ్వరి,ప్రాలును నోడిపిల్లు గునుకుఁబ్రాలును వెదురుం, బ్రాలును సవరపుమెకముల, పాలును గల పచట నీకుఁ బాయసమునకు౯. కాశ. ౩. ౬౭.

వ...చమరీమృగంబులపాలకు ననుకూలం బైనగునుకుంబ్రాలపాయసంబులకుండలు... కాశ.౩. ౩౬.

**గునుకుడు.** వి.(√గునుకు¹.) అల్పధావనము. ఆం. భా. ౨. ౨౨౪.

**గునుకునడ, గునుకునడుపు.** వి. (√ గునుకు¹) మెల్లనినడక, మందగమనము.

గీ. ఒవరుదుప్పట్లు కడ నిల్పి గునుకునడల, నుచితనిజభాషణంబుల నొంటియొంటి, హస్తమునఁ బూని యొక్కొక్కస్త్రీ బెస్తబిడ్డ, లందలము నిల్పి రవనిపాలాగ్రనీమ. రా. వి. ౨. ౪౪.

గీ. కోరమీసము మిడిగ్రుడ్లు గునుకునడుపు, బెదరుఁజూపులుఁ గఱిమేను గదురుకంపు, వలుఁదయొరచ్చులును గల్గి వచ్చె నెఱుకు,పారిగాఁ డొక్కఁ డాచంద్రభానుకొఱకు. చంద్ర. ౨. ౩.

**గునుకుపరువు(ర్వు).** వి. (గునుకు¹+పరువు.) మెల్లనిపరుగు, అల్పధావనము.

గీ. గోంద్రుగోం డ్రని గర్జించుఁగొంతతడవు, కోరచూపుల వీక్షించుఁ గొంతతడవు, గునుకుపరువునఁ దిరుగాడుఁ గొంత తడవు,కొయ్యతనమునఁ గోపించుఁ గొంతతడవు. వరాహ. ౧౧. ౭౬.

సీ. దురితాత్మురాలు మంథర సహింపఁగ లేక గునుకుపర్వున గూను గునియ నేఁగి. దశా. ౭. ౨౦౩.

**గును కెత్తు**=గునుకు¹.వి.(గునుకు¹+ఎత్తు)పరువెత్తు.

క. గును కెత్తుచున్న గాడిదఁ, గనుఁగొని సింహంబు వలికె ఘటకునితో నీ,చనుఖరముఁ దతిమికొన నా, తనువున పడి లేదు తెమ్ము దగ్గఱఁ జేర౯. వేం. పంచ. ౪. ౫౭౧.

**గునుపము.** వి. ముద్గరము, గద.

సీ...తేరుచుండును.గీ.గుద గుదియ దుడ్డు గునుపముగునుప యనఁగ, ముద్గరము ... ఆం. భా. ౨. ౨౧౬.

**గునుపు.** వి. (√గునియు.)విలాసము.(విలాసవిశేషము-శ. ర.)

సీ...గునుపు గొనబు మురిపము మురువు సొగసు ...హొయ లనఁగ విలాస మొప్పచుండు. ఆం. భా. ౧. ౧౩౯.

**గున్న.** వి. (సం. కుణకః. శ. గున్న.) ౧.పంది పేనుఁగు హంస మున్నగువానిపిల్ల.

చ... పిఱుందం దిరుగుచిఱుగున్నలకు వెన్నాడు తోడేళ్ల సివంగులం దిరిసి తిరిగి మొత్తి పోనొత్తి చరియించు నేకచరంబుల ...మనుచ. ౪. ౩౭. ద్వా. ౧. ౨౯. కళ. ౪. ౭౭.

గీ. మిన్ను ముట్టినయేనికగున్నలార. అచ్చ. రా. ఆర. ౧౬.

క...రాయంచల, గున్నలు...చిత్రభా. ౨. ౧౦౧.

౨. క్షుపము, కుఱుచయైనకొమ్మలును ఊడలును గలచెట్టు; గుబురుగాఁ బెరిఁగిన (మామిడి మొదలగువాని) మొక్క.

సీ... గున్న యంచనఁగను క్షుపసమాఖ్య. ఆం. భా. ౨. ౩౬.

రగడ. కొఱలెఁ జిగు రెలమావిగున్నలను ... రాఘవ. ౨. ౬.

చ ... మెఱుంగుఁబోఁడులు చిన్నిపొన్నగున్నలం గని...ఉ. రా. ౪. ౧౬౩.

విణ. వామనము, పొట్టిది.

పీ. పొట్టి మొట్టి గిటక పొదిటి పొదడు గున్న ... తింగణా యనఁగను వామనాఖ్య దనరు. ఆం. భా. ౨. ౧౨౩.

**గున్నంగి**[1]. వి. పక్షివిశేషము.

సీ...గున్నంగి పోపిట్ట గూడబాతు...గీ. అనఁగ నిట్లని పక్షిభేదాఖ్య లలరు. ఆం. భా. ౨. ౯౧. హంస. ౩. ౧౨. ప్రబంధ. ౨౩౪.

**గున్నంగి**[2]. వి. వృక్షవిశేషము.

గీ... గున్నంగి దిరిసెనంబు, మొదలుగాఁ గల్గు బహువిధభూరుహములు. హంస. ౪. ౧౧.

**గుపిలుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) రక్షించువాఁడు. వి. అ. పుం. రాజు. (వాచ)

**గుప్త.** సం. వి. ఆ. స్త్రీ. ౧. సురతగోపనముచేయుపరకీయనాయిక. ౨. అంతఃపురస్త్రీ. ౩. దూలగొండి.

**గుప్తగతి.** సం. విణ. (ఇ) రహస్యమైనసంచారము గలవాఁడు. వి. ఇ. పుం. వేగులవాఁడు, చారుఁడు. స్త్రీ. రహస్యసంచారము.

**గుప్తచరుఁడు.** సం. విణ. (అ. ఈ. అ) రహస్యముగా సంచరించువాఁడు. వి. అ. పుం. వేగులవాఁడు, చారుఁడు.

**గుప్తము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. రక్షితము, కాపఁబడినది. ౨. గూఢము, దాఁపఁబడినది.

**గుప్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. రక్షణము, కాపాడుట. ౨. దాఁచుట. ౩. మాయుట, కప్పుట. ౪. గొయ్యి త్రవ్వుట. ౫. పాఁతఱ; భూబిలము. ౬. చెఱసాల. ౭. రంధ్రము.

**గుప్తుఁడు.** సం. వి. అ. పుం. (ఇది సామాన్యముగా వైశ్యనామములతుదను జేర్పఁబడును.)

శ్లో. శర్మవద్బ్రాహ్మణస్యోక్తం వర్మేతి క్షత్రసంయుతమ్, గుప్తదాసాత్మకం నామ ప్రశస్తం వైశ్యశూద్రయోః. (విష్ణుపురాణము.)

**గుప్పళించు.** స. క్రి. ౧. (అడుగులు గంతులు) వేయు.

గీ. అప్పు డొప్పులకుప్ప కకుప్పవిభులఁ, దప్ప కందఱఁ బ్రభులఁ గందర్పనిభుల, గొప్పకన్నుల రెప్పలు విప్పి కనుచు, నిప్పుపూదండఁ గొని నడల్ గుప్పళించె. పాంచా. ౨. ౧౬.

వ... నిప్పుకలచొప్పున రెక్క లప్పళింపుచుఁ గుప్పిగంతులం గుప్పళించునప్పులు గప్పికొనం జొప్పడుపూఁజప్పరమ్ముల... అదలా. ౨. ౬౪.

౨. చల్లు.

వ...ఇసుకమెనుపునెలవులం బన్నినపసుపుటాకుంజప్పరంబులలోనం గుప్పళించినకప్పురంబుతోడికురువేరుపరిమళంబులును...పాండు. ౪. ౧౬.

౩. ఉప్పళించు, వస్త్రము మొదలగువానిని ఉనుము. (బ్రౌ. శ. ర.)

౪. కలిగించు, పుట్టించు.

సీ. కోడెమీలకు సిగ్గు గుప్పళించువినీలకైరవచ్ఛవిదాయి కన్నుదోయి. ఘటికా. ౧. ౨.

గీ. సోమబింబాస్యదశనవాసోమతల్లి, కొప్పుచంద్రిక సెఱడాలు గుప్పళించె, జిలుఁగుఁబలుచనివా

సోవికేషములకుఁ, జెన్నొసఁగుఁ గాద రొంటు
వంటికన్నె కలిమి. పాండు. ౩. ౧౯౦.

౪. క్రి. ౧. అతిశయించు.

చ. అరిగెలబంట్లచా లరిగె నప్పుడు చప్పుడు గు
ప్పళింపఁగాన్. రా. వి. ౨. ౫౪.

౨. పుక్కిలించు, గండూషము చేయు.

సీ. వననీట గుప్పళించెను గళావతి యోర్తు జిగి
మోవి బీఁటిక లెగయకుండఁ, బన్నీటిచాలు
లోపల నేఁగె నొక్కతె వదయుగంబున గా
సి యొదవకుండ. భాను. ౨. ౭౩.

**గుప్పించు.** స. క్రి. (గుప్పు[1] + ఇంచు-స్వార్థమున)

౧. (అధికముగా) ఇచ్చు.

వ...కవినైగమికవాదివాంశిక వైతాళికాదు లగు
నర్థిజనంబులకు నర్థంబులు గుప్పించియు ...
హర. పీఠి. ౭.

౨. గుప్పు, (బాణాదులను అధికముగా) ప్రయో
గించు.

మ...కల్పాంతభై, రవభీమాకృతి నేచి భీష్ముఁడు
శరవ్రాతంబు గుప్పించినన్. భార. భీష్మ. ౩.
౩౧౯.

ఉ...కోపించి శితాస్త్రము ల్గవలు భీముఁడు
సాత్యకియుం గడంక గుప్పించిన వానిఁ
ద్రుంచి శరపీడితదేహులఁ జేసె వారలన్.
భార. శల్య. ౧. ౧౯౨.

౩. కురియు, వర్షించు.

క. రప్పించి యధికసంభ్రమ, ముప్పొంగఁగ నం
దగోపుఁ డున్నవ్రజముపై, దెప్పరపుఱాల
వర్షము, గుప్పింపుఁడు గోగణములు గోపులు
మడియన్. వి. పు. ౭. ౨౪౪.

**గుప్పిలి.** వి. జా. (√ గుప్పు[1]) పిడికిలి.

వ...విప్పగ నాగొప్పకన్నుంగవం గప్పుకొనం
గప్పురంపురజం బొప్పగ గుప్పుగుప్పన గుప్పి
ళ్లకొలందిగ గుప్పుచు...రసిక. ౩. ౧౪౩.

ఉ. కప్పురభోగివంటకము కమ్మనిగోదుమపిండి
వంటయున్, గుప్పెఁడుపంచదారయును క్రొ
త్తగఁ గాఁచినయాలనే పెసర్పప్పును గొమ్మ
నల్లనఁటిపండ్లును నాలుగైదు నంజులున్,
లప్పలతోడఁ గ్రొంబెరుఁగు లక్ష్మణయొజ్జల
యింట రూకకున్. క్రీడా. ౧౬౬.

**గుప్పు[1].** స. క్రి. (క. గుప్పు.) ౧. (బాణాదులను
అధికముగా) ప్రయోగించు.

క. శరములఁ జక్రంబులఁ దోమరములఁ గుంత
ముల గుప్పి మానుగ ఖడ్గ, క్షురికాపాలపరిఘా
ముద్గరముసలపరశ్వధములఁ గప్పిరి కడిమిన్.
నిర్వ. ౩. ౧౬.

ఉ. తమ్మినయమ్ము దప్పఁ గుముదమ్ము ముదమ్మున
నొప్పఁ జక్రవాకమ్ములు జోడువిప్పఁ దమ
కమ్మునఁ బాంథులపై మరుండు పూటమ్ములు
గుప్పఁ జీకటి భయంబుగ దిక్కులఁ గప్ప
భాస్కరుం డమ్మెయి నస్తమించె నుదయమ్మ
యి మించె నుడుప్రభావళుల్. కవిరా. ౫.
౧౭౩.

౨. (అధికముగా) పెట్టు, ఉంచు.

ఉ. చెప్పినఁ బ్రీతుఁడై యతనిఁ జెచ్చెరఁ దోకొ
నిపోయి బూరెలుం, బప్పును నెయ్యిఁ బాయ
సముఁ బక్వఫలాదులు నేత్రతృప్తిగా, గుప్పి
తి ముక్తిపథశ్రమము గూరినమేనికి దప్పి దీ
ఱునట్లు...భోజరా. ౭. ౨౨౬.

౩. (రోఁకలి రెండుచేతులఁ బట్టి బియ్యము లోన
గువానిని) గట్టిగా దంచు.

చ. ... చందనపుంగోటను నేనుఁగుఁగొమ్ముఁరోఁక
టన్, బ్రిదిలెడుకొప్పుతో వెదురుబియ్యము
గుప్పునిజప్రియాంగనన్. వాల్మీకి. ౨. ౧౦౫.

౪. చల్లు; చిమ్ము.

సీ. కుంకుమ నేను సీగుబ్బల గుప్పితి నతనిబొమ్మన
గుప్పనైతిఁ గాద. పార్వ. ౬. ౪.

సీ. పూయరే క్రొమ్మావిపూఁదేనె సతులార గుప్పరే
కపురంబు కొమ్మలార. చంద్రా. ౪. ౧౬౩.

గీ. కప్పురపుఁదావి గుప్పుబాగా లొసంగి. కువల. ౫. ౧౦౮.

౫. పొడుచు.

ఉ... ధేనువుం, డాయఁగఁ బోయి వేడుక నొడ్లదలించుచు వాలమార్చుచుం, బాయక గుప్పుచుం గుడిచె బాలవృషంబు నిజాంశదుగ్ధముల్. భోజరా. ౬. ౨౧.

ఉ... వానియెడ గబ్బిచనుంగవచేత నెప్పుడే, గుప్పుదు గుప్పి వానిరతి కోరుట యొప్పు డటంచు నెంచుచుక్. శుక. ౨. ౩౭౯.

౬. వర్షించు.

ద్వి. అప్పుడు దివినుండి యఖిలదేవతలు, గుప్పిరి మందారకుసుమవర్షంబు. ద్వి. శ. సా. ౩.౧౨౦ పా. ౧౦ పం.

జ: గుప్పించు, గుప్పిలి, గుప్పుడు, గుప్పుతెప్పున, గుప్పున, గుప్పేఁడు.

**గుప్పు**[2]. వి. (త. కుప్పెవల్) ౧. వాసనగొట్టుట మ్రోయుట మున్నగువానియం దగునునుకరణము.

వ...కప్పురంపుటనంటి గుప్పు మనక్ గప్పుతావులకుఁ దావలం బగుతావుల...ఉ. రా. ౬.౨౪.

ఉ...దేవదుందుభులు గ్రక్కున ధింధిమినాదవైఖరిక్, గుప్పున మ్రోసె...శశాం. ౧. ౩౬.

౨. గ్రుద్దుట పొడుచుట త్రోయుట మున్నగువానియం దగుధ్వనికి అనుకరణము.

ద్వి. తప్పక రత్నాంగి తనయునిఁ జూచి, గుప్పుగుప్పున బొమ్మ గ్రుద్దుకొంచు...ద్వి. శ. సా. ౨. ౭౨ పా. ౮ పం.

సీ. జడలచుట్టు కుదిర్చి మెడలపై మోఁచేత గుప్పుగుప్పున పొరె గుమికి గుమికి. వాల్మీకి. ౨. ౯౬.

సీ. మిట్ట నెక్కించి బల్మిగ నూకి పల్లాల గుప్పునఁ ద్రోతురు కొంతసేపు. పానందో. ౨. ౨౪పా.

౩. దిగుట దూఁకుట లేచుట వెళ్లుట వచ్చుట మొదలగువానియం దగుఅనుకరణము.

క. అరదము గుప్పున డిగి సో,దరికిం బ్రణమిల్లి... జై. భా. ౮. ౧౫౮.

ఉ ... త్రిదశాధిపుఁ డెంతయు వాగ్రహంబునక్, గుప్పున గద్దె డిగ్గి...దశా. ౫. ౨౩.

చ. నలువురు గుప్పుగుప్పునను నాలుగుమూలలనుండి దూఁకి వి,చ్చలవిడిఁ బాఱ సాగినను ... హంస. ౩. ౧౧౦.

సీ. తలయూఁచు నెదలోనఁ దలఁకి గుప్పున లేచుఁ జిలుకలఁ గొట్టు నెచ్చెలులఁ దిట్టు. రసిక. ౪. ౮.

క. అప్పుడమికాన్పు నెత్తుక, తిప్పునఁ జవలునకు నెగసి తేసినకడఁకక్, గుప్పునఁ జనుతతినొడయుఁడు, తప్పక యొకకోల వానితలఁ దెగ నేసెక్. అచ్చ. రా. అర. ౫.

వ...గుప్పుగుప్పునం బడుపిడుగులవడిక్...గుహాకుహారశయాళుబిలేశయంబులు భయంపడి... సమీర. ౩. ౧౭౮.

**గుప్పుడు**. వి. (√గుప్పు[1]) గుప్పుట, పోటు.

వ...ఇట్టికొమ్ముసింగోటలగుప్పుడులును... ప్రబంధ. ౭౮.

**గుప్పుతెప్పున**. క్రి. విశ. ద్రు. (√ గుప్పు[1].) అతిశీఘ్రముగా.

ఉ. అప్పుడు తద్వధూటి చలితాధర యై వరు గుప్పుతెప్పునక్, జప్పుడు గా నదల్చి పరసారసగంధులఁ బొంద నంచు నా, కొప్పునిబాస నిచ్చితి వహో యిటు లెంతకు నెత్తికొంటివి ...శుక. ౧. ౪౫౦.

**గుప్పున**. క్రి. విశ. ద్రు. ( √ గుప్పు[1]. ) శీఘ్రముగా, వేగముగా; అకస్మాత్తుగా.

ఉ. అప్పుడు లాడుచు న్నగవు లాడుచు బారలు చాఁచి చాఁచి మూ,యప్పలు వచ్చి రంచు సయ ల్లనుఁదముల మోడ్చి పిల్వఁగా,గుప్పునఁ ద

వ్వతప్పటడుగున్నడల న్గొమరుండు పైప డుఱ్ఱ, దప్పక చూచుతల్లికిని దండ్రికి ముచ్చట దీఱునట్లుగఁ. చంద్రా. ౨. ౬.

ద్వి. గుప్పునఁ దెమ్మ పేర్కొని గ్రుక్కఁ డనుచు. బస. పు. ౭. ౬౭౬ పం.

ఉ. అప్పుడు వేళగాఁ దెలిసి యచ్చెరువారఁగ మోద్పుఁ గేలుతో, గుప్పన మ్రోల వ్రాలి రఘుకుంజరు సేమపువార్త మున్న గాఁ, జెప్పి... రామా. ౬. ౧౭౬.

**గుఫితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. కూర్పఁబడినది. (మాలికాది) ౨. రచింపఁబడినది. (కావ్యాది)

**గుబక.** వి. తలుపుగందపట్టెమీఁదిగుబ్బ. (బ్రా, శ. ర.)

**గుబగుబ.** వి. ౧. సముద్రతరంగములు మున్నగువానియొక్కధ్వనికి అనుకరణము.

సీ. గుబగుబధ్వనుల బల్ గుట్టలపైఁ బొర్లి మిడిసి త్రేళ్లుతికి త్రుళ్లిడికెరుళ్లు. ఉ. హరిశ్చ. ౨. ౧౨౬.

౨. నీరు మొదలగునవి పచ్చుటయం దగుననుకరణము.

సీ. గుబగుబఁ గన్నీరు కొలుకుల నానుచో హెచ్చి నమైకాఁక నింకఁజేయు. సుదంతా. ౨. ౧౫.

౩. కోవెలపలుకుటయందలిధ్వని కనుకరణము.

సీ. గుబగుబ మని పల్కు కోవెలపల్కులు విని యివి నేర్తువా యనుచు నవ్వు. శకాం. ౨. ౮౬.

**గుబాళించు.** అ. క్రి. ౧. పరిమళించు; (సువాసన) కొట్టు.

శా. చెంగల్వల్ శెతికొప్పునందు నొఱపై చెంతం గుబాళింపఁగా... విజ... కా. ... గుబాళించులేఁ, జెంగల్వఁ... సారంగ. ౧. ౧౩౨.

సీ. మిక్కిలి కస్తూరిమృగము చందంబున మంచివాసన గుబాళించుదాని. సురా. ౪౪.

**గుబిలి**[1]=గుమిలి. వి. (క. గుబిరి) కనకాక్షి, ఒకానొకశకున పక్షి.

గీ. పెలయుఁ గనకాక్షి సకినాలపులుఁగు గుబిలి, పైఁడికంటి నా... ఆం. భా. ౨. ౯౧.

**గుబిలి**[2]=గులిమి.

సీ. కర్ణమలనామ మొప్పును గులిబి నా గుబిలి నా గులిమి యనఁగ. ఆం. భా. ౨. ౧౩౪.

**గుబిలిగాఁడు.** వి. ఒకానొకపక్షి. హంస. ౩. ౧౨. (దీనికి పిదప నీపద్యమునందే 'కనకాక్షి' అని యున్నది. కావున నిది 'కనకాక్షి' గాక మఱియొక పక్షి యై యుండవలెను.)

**గుబుకు**=గుముకు. స. క్రి. (పిడికిటితో) పొడుచు. (శ. ర.)

**గుబురు**=గుమురు.

(సమూహము, గుంపు)

సీ... అత్తమ్ము దిమ్ము, గుబురు గుమురు గుంపు గుమి పిండు మొత్తము... గీ... వర్గు, వనఁగ వర్గము తగు... ఆం. భా. ౨. ౧౦౦.

క. వెఱచుచు వంగుచు వ్రాలుచు, వఱిముఱి గుబురులకుఁ జనుచు హరిహరి యనుచుఁ, మఱుఁగుచు నులుకుచు దిరదిరఁ, గుఱుమట్టపుఁబొట్టిపడుగు గొంత నటించెఁ. భాగ. ౮. ౫౩౮.

ద్వి. సరసమందారమంజరులు గోయుచును, గురివెందపందిళ్లగుబురు డాయుచును. విష్ణు. పూ. ౨. ఆ. (శ. ర.)

సీ. తొలుకడరాతావసలు గెబ్బునర్తి కేఁ దెద్దడి గుబురుకొత్తిళ్ల ప్రొద్దు. అచ్చ. రా. బాల. ౮.

జ: గుబురుకొను.

**గుబురుకొను.** అ. క్రి. (√ గుబురు) ౧. గుంపుకట్టు. (చూ. గుబురులుకొను.) ౨. సాంద్రమగు.

గీ. గుబురుకొనునట్టినీడలఁ గొలుఁ తెరువు, చెంత నొప్పారుఫలతరుశ్రేణు లొసఁగు, సుకృతగరిమంబునకుఁ జాడ జోడుగావు, సద్గుణాకర హాయమేధకలము లయిన. జాహ్నవీ. ౩. ౩౨.

గుబురులుకొను=గుంపులుగట్టు.

క. మును రమ్యపదార్థంబులు, గొని వీథు లలంకరించుకొని జనులు గనుం, గొనియెడువేడుక గుబురులు, కొని యున్న పురంబుఁ జొచ్చెఁ గొడుకుం దానున్. నిర్వ. ౫. ౧౪౧.

**గుబులు.** వి. ౧. గుప్పుమని కొట్టువాసన.

క. చొక్కపునడతోఁ దళుకుం, బుక్కాగుమగుమలు తట్టుపునుఁగుగుబులు సల్, దిక్కుల నిండఁగ నెంతయుఁ, జక్కనికాళింది యనెడుజవ్వని వచ్చెన్. చమ. ౧. ౧౨. (శ. ర. పా)

౨. భయము. (శ. ర.) ౩. ఉన్మాదము, పిచ్చి.

(వ్యవ) వాఁడు గుబులెత్తి లేచిపోయినాఁడు.

జ: గుబులుకొను.

**గుబులుకొను.** అ. క్రి. (గుబులు + కొను)-వాసనగుప్పునకొట్టు; పరిమళించు.

గీ...కమ్మఁదావి, గుబులుకొనుచున్న విడియంబు సాబగుతోడ, రమణఁ జాపట్టుపువ్వుకరండకుండు. విక్ర. ౮. ౭.

చ. గుమగుమవాసనల్ గుబులుకొన్నవపుక్కిటిలో నివీడియం, బుమియు...సారంగ. ౩. ౧౫౨.

వ... చంచలలోచనలమైదీఁగలం గదంబించుపరిమళంబుల గుబులుకొనుచు సమీపంబునం గూర్చున్నమన్నె రాజులభూషణరత్నకిరణరాజులచే విరాజితం బగుకొలువుకూటంబు సొచ్చి ...ప్రబోధ. ౧. ౨౫.

**గుబుసు.** వి. కపటము. (శ. ర.)

**గుబ్బ.** వి. ౧. కుచము.

ఉ. కుప్పసము ల్వదల్చి వలిగుబ్బల నొత్తిరి హత్తివేగుజా, మిప్పు లలప్పుగాడ్పుల కధీను...ఆము. ౫. ౧౧౪. ఆం. భా. ౨. ౧౩౭.

గుబ్బలకొమరాలు=గుబ్బెత, యువతి.

గీ. ఎల్లచిగురాకుఁబోండ్లకు నెంత వేడ్క, యంత వేడుక దనలోన నతిశయిల్ల, నొక్కగుబ్బల కొమరాలు చక్క వచ్చి, కనియె నొడ లెల్లఁ గన్నులై మనుజవిభుని. నైష. ౬. ౬౬.

౨. తలుపుగందపట్టెలు మున్నగువానిమీఁది బొగడ.

సీ. స్తనకవాటాంగము ల్దనరు గుబ్బ లనంగ ... ఆం. భా. ౩. ౪౪. ఆము. ౨. ౧౦.

సీ. బలుకంచుగుబ్బబోర్తలుపులు తీనెలవాకిలి నడవ చావడియు మగులు. హంస. ౨. ౧౩౭.

ద్వి. మొల నున్నగంటలు మ్రోయఁ దాళంబు,లులియ నొడ్డణము గుబ్బలు గజ్జియలును, ధ్వనియింప...బస. పు. ౩. ౫౨౦ పం.

౩. గొడుగుమీఁదిగుబ్బ.

మ. హరికోదండము గామ గుబ్బ శిఖరం బాలంబి ముక్తామణుల్, వరఁగం జాలెడుతోయబిందువులు...భాగ. ౧౦ పూ. ౯౨౧.

గీ. గుబ్బ వెట్టిన తెలిపట్టుగొడుగు...వరాహ. ౯. ౭౬. హరి. పూ. ౭. ౧౭౮.

౪. బాణమునలుఁగుక్రిందిగుబ్బ.

వ... ఒకటి రెండు మూఁడు గొరకల నెఱకులు గాఁడ గుబ్బకొలందికిం దిగ వైచి...మనుచ. ౪. ౧౧౫.

౫. గ్రంథి, కంతి.

గీ...గుబ్బ, బుడిపి... అనంగను బొసఁగు గ్రంథి. ఆం. భా. ౨. ౭౪.

 ... గుబ్బలి.

ఉ. ...వడంకుగుబ్బ పేరు బ్బడఁగించి పాల్కడలి నోర్చి వాసించు వాళావాళిం దగన్, గొబ్బు రివేంగళక్షితిపకుంజరుమంజులకీర్తి మంజులల్. రామా. ౧. ౨౬. (ప్రయోగాంతరము లేదు)

విణ. గుండ్ర మైనది.

ఉ. గుబ్బ మెఱుంగుఁజన్నవ గగుప్పొడువన్ మది లోనఁ గోరికల్, గుబ్బటిలంగఁ జూచె నల కూబరసన్నిభు నద్ధరామరున్. మనుచ. ౨. ౨౭.

సీ. కుదురునిండినమించుగుబ్బచన్నులమీఁద జిలుఁగుదువ్వలువకం చెలయుఁ దొడిగి. నైష. ౬. ౨౨.

జ: గుబ్బకాయ, గుబ్బలాఁడి, గుబ్బసరము, గుబ్బెత.

**గుబ్బకాయ.** వి. (గుబ్బ+కాయ.) వీణకు అమర్చెడిసొఱకాయ.

సీ. తళుకునీలపుదట్టములువోలె నీడలు గానంగఁ దగుగుబ్బకాయ లమర ... గీ...వీణె యొక యింతి నిల్పెను వెలఁదియెదుట. వాల్మీకి. ౩. ౧౩౨.

సీ. వీణె వీణియ యన వీణాఖ్య రాజిల్లు... తంతి యనంగను దంత్రి వెలయు, నలరును గుబ్బకాయ యన నలాబువు...ఆం. భా. ౧. ౧౨౬.

**గుబ్బటిల్లు(లు).** అ. క్రి. ఘూర్ణిల్లు, తిరుగుడు పడు.

గీ. మంగలములోని ప్రేలాలమాడ్కిఁ జొక్కి, లెక్కడక్కడ పడ దిక్కు లెనిమిదియును, బగులఁ బాతాళతలము గుబ్బటిలఁ జెలఁగె, శౌరి పూరింప వప్పాంచజన్యరవము. ఉ. హరి. ౪. ౨౧౬.

చ. కలఁగెఁ బయోనిధుల్గిరులు కంపము నొందెఁ జలించె భూమి దిక్కులు వడఁకెన్ వియత్తలము గుబ్బటిల్లెన్ గ్రహతారకంబు లుత్తలపడఁ జొచ్చె...భోజరా. ౪. ౬౬.

**గుబ్బతిల్లు(లు).** అ. క్రి. ౧. అతిశయించు.

ఉ. ...నీలకంఠములు మ్రోయు...షట్పదీమాలికఁ దోఁచునబ్బురపుమబ్బులయబ్బులు గుబ్బతిల్లఁగన్. వసు. ౧. ౧౩౬.

క. అబ్బావికిఁ జేయేతం బుబ్బుమఁ దంబళి యొనర్చ యుత్సాహంబున్, గుబ్బతిలఁ గొన్ని చెట్లకు, నిబ్బరముగ జలము లెత్తి నిస్త్రాణుండై. హంస. ౧. ౧౯౬.

౨. ఉప్పొంగు, పొంగు.

క. బాలహరిణములఁ జూచిన, లోలుపులిగతిన్ మనంబు గుబ్బతిలంగ...జై. భా. ౭. ౯౨.

చ. కులుకు లెసంగ నబ్బురపుగుబ్బలు గుబ్బతిలంగ...కంకణావళి గలుగ ల్లనంగఁ బఱవంగ మకించె లతాంగి సిగ్గునన్. కృ. శకుం. ౩. ౩౫.

౩. ఉడుకు, పరితపించు.

ద్వి. ...చిత్తజునిబారిఁ బడి యింటిలోన, నెక్కడ నింటివా రెఱిఁగెద రనుచుఁ, గ్రుక్కుచు లోలోనె గుబ్బతిల్లుచును, నుండితి నిన్నాళ్లు నొకరీతి...ద్వి. పరమ. ౫. ౪౨౦ పా.

ద్వి... మాపడుచు, గొందలపడుచు లోగుబ్బతిల్లుచును... అతనితోడిద లోకమని కూడు నీళ్లు, మఱిఁ దలంపక నేలమై శయనించు. ద్వి. పరమ. ౪. ౩౧౧ పా.

౪. ప్రజ్వలించు, మండు.

క. తమకంబు లేక కారుణ్యముఁ జూపక తఱఁడు కులాంగనాముఖవీక్షా, విముఖత్వ మిట్లు చూపిన, గుమగుమ మని శోకవహ్ని గుబ్బతిలంగన్. నిరం. ౨. ౯౯.

క. విను చల్లనిమాటలలో, మునిఁగి యలుక గుబ్బతిలు సముద్రజలములో, నన యుండి యాఱకప్పుడు, గనగన మను బాడబాగ్ని కరణి నరేంద్రా. భార. శాం. ౩. ౨౬౩.

**గుబ్బన.** క్రి. విణ. ద్రు. శీఘ్రముగా, వేగముగా.

చ. ...గుబ్బనఁ బతిచిత్తవృత్తిఁ గని భట్టి విదర్భుఁ

డు దాను నేడుకఁగా. విక్ర. ౪. ౧౩౪.(శ.ర.పా.)

చ...గుబ్బవఁ బతిదివ్యభవ్యమణిపాదుక లంఘ్రుల సంఘటించి యక్కనకపురంబు చొచ్చి... విక్ర. ౨. ౧౦౫.

**గుబ్బలాఁడి.** వి. (గుబ్బలు+ఆఁడి)- పెద్దగుబ్బలు గలది-యువతి.

ఉ. చక్కెర పెట్టవే వికచసారసలోచన మాటనేర్పవే, చొక్కపుగుబ్బలాఁడి ననుఁ జొప్పడఁ బాణితలంబుఁ జేర్పవే, చెక్కులనిగ్గులాఁడి యని చిల్కలు వల్కు నృసింహ పూర్వపు, న్మక్కువ నీవిరోధినృపమందిరచిత్రవధూపరంపరల్. వరస. ౫. ౧౭౭.

**గుబ్బలి.** వి. పర్వతము, కొండ. ఆం. భా. ౨. ౨౭.

గుబ్బలిపట్టి=కొండకూఁతురు, పార్వతి. దశా. ౨. ౬౯.

గుబ్బలిరాకన్నియ=హిమవత్పుత్రి,పార్వతి. అచ్చ. రా. బాల. ౧౭౦.

గుబ్బలిఱేఁడు=హిమవంతుఁడు. రామా. ౧.౮౪.

గుబ్బలివిలుకాఁడు=మేరుధన్వుఁడు, శివుఁడు. అచ్చ. రా. యు. ౫౦౦.

**గుబ్బసరము.** వి. (గుబ్బ+సరము.) ఒకవిధమైన హారము.(పెక్కుదినుసుమణులు గ్రుచ్చినసరము. శ.ర.)

ఉ. ఏనికతోలుపచ్చడము నెమ్ములగుబ్బసరంబు ...పూనిన ప్రేతవేల్పుఁ గని ... ఉ. హరి. ౨. ౧౭౨. కళా. ౩. ౨౦౪.

**గుబ్బిక.** వి. పక్షులను పట్టుటకై యొగ్గెడుఒకవిధమైన ఉచ్చు.

గీ. జారకీరిపంక్తుల మాటు సరసశారికములకుఁ గట్టువ యుపకాంతముఖ్యచటక, సంఘములకును గుబ్బిక శంబరారి, ఘోరరణహరిజయభేరి ఘోషనారి. హంస. ౨. ౮౩.

**గుబ్బిరి.** వి. వృక్షవిశేషము.

సీ...ఉత్తరేను గుబ్బిరి సంబరేను...గీ... మొదలు, గాఁ గలుగునట్టిచిఱుచెట్లఁ గాంచి యంత. హంస. ౪. ౧౦.

**గుబ్బిలికాఁడు.** వి. పక్షివిశేషము. (శ. ర)

**గుబ్బు.** వి. గుండె యదురుటయందగువనుకరణము.

ఉ...దానన గుండె గుబ్బు మన ... కళా. ౪. ౨౦.

గీ.దండు నులభంబె పురుషవేదండములకును, గూడి గావింప గుండియల్ గుబ్బు రనఁగ, దిగినదివసంబుసరిప్రొద్దుదీఱు వేళ, కోదనాదరదూరులై యుండుటకుదె. రా. వి. ౨. ౬౮.

౨. సముద్రఘోషమున కనుకరణము.

ఉ. పారి సంభోనిధి గుబ్బుగుబ్బు రనుచుల్ బోర్కల్గ దేవాసురుల్, ఖురశౌర్యోన్నతి గర్వితర్బిరి సుధాకల్లోలినీవల్లభుల్. వీర. ౩. ౨౦౦.

౩. పగులునప్పటిధ్వని కనుకరణము.

వ... పెనుబొబ్బలం బ్రహ్మాండకటాహంబు నిర్భరం బయి గుబ్బుగుబ్బని యురల... భాగ. ౮. ౨౦౮.

**గుబ్బెత=గుబ్బలాఁడి.** వి. (గుబ్బ+ఎత) యువతి.

సీ. జవరాలు గుబ్బెత జవ్వని యనఁగను యువతిసమాఖ్యలై యొప్పు...ఆం. భా. ౨. ౧౦౬.

ఉ. సిబ్బితి మాని నేఁటినిశఁ జిత్తములోపలికాంక్ష దీఱఁ జన్గుబ్బల నొత్తి యేనె మను గ్రుచ్చి కవుంగిటఁ జేర్చెద నీవిభుల్, గొబ్బునఁ బట్టి దంతశిఖ నొక్కెద మోవియు నంచుఁ గోరునా,గుబ్బెత రేపు లెల్లఁ దఱిఁ గొంకు నిరంకుశలజ్జఁబెంపువల్. ప్ర.భా. ౫. ౯౯.

మ...కాఁపుగుబ్బెతల పెన్గుబ్బల్ ... ఆము. ౪. ౧౩౩.

**గుభాలు=**గుభేలు, గుభిల్లు, గుభులు. (చూ. గుభులు. రూ. గుబాలు. గ్రా.)

వి. ౧. పడుట పగులుట దుముకుట మొదలగువాని యందగుధ్వనికి అనుకరణము.

మ...గుభాలునన్ లకుముకుల్ క్రందై పడున్ లేచు...ఆము. ౧. ౫౭. ('గుబాలునన్' శ. ర. పా.)

ఉ. భంగములై నగంబులు గుభాలునఁ ద్రెళ్లఁగ రళ్లదాఁటుతో,నింగికిఁ బొంగువారిధి మునిం గినభూవలయంబు...వరాహ. ౮. ౧౬.

చ. దరులు గుభాలునం బగుల...శేష. ౧ ఆ. ('గుబాలునన్' శ. ర. పా.)

చ. అని మొలవంకి డుస్సి సమరార్గ్భటిఁ జావడి క్రిందికిన్ గుభా,లన దుముకన్...అహ. ౧. ౧౦౮.

౨. వాసనవ్యాపించుటయం దగుననుకరణము.

చ...ముద్దుగాఅుపల్కులుఁ జెవికమృతేఁ దళుకు ఘుక్కనుచెక్కులుఁ బట్టేఁడేసిగుబ్బలుఁ గనుచూపుమేరకు గుభాలనుతావులు దీనికే తగున్. కువల. ౩. ౩౨.

## గుభిల్లు=గుభాలు.

(వ్రాలుటయం దగుననుకరణము.)

ఉ...దిక్కుటాహముల్, పిక్కటిలంగఁ బెల్లున గుభిల్లున శుక్తిమతీప్రవంతిపై, రక్కున వ్రాలి యాఁగె భువనావళి...వసు. ౨. ౧౮౬.

## గుభులు(ల్లు)=గుభాలు.

(నీరు మొదలగువానిలో రాయి మొదలగునవి పడుటయందలిధ్వని కనుకరణము.)

క. చని నూతిలోపల గుభుల్లన నొకగుండెత్తివై చి యల్లనఁ గనుచాటున నిలువఁబడియె నిజమని, జనవల్లభుఁ డాత్మలో విచారము మీఱన్. శుక. ౨. ౧౩౫.

(దుముకుటయం దగుధ్వని కనుకరణము.)

చ. రభసగతిం దెప్పలంగ నతిరాజితకేళిసరోవరంబులో,గుభులుగుభుల్లునం దుమికి ... భాను. ౨. ౮౦.

(భేరి తుపాకి లోనగువానిధ్వని కనుకరణము.)

సీ. గంధవాహములు సుగంధంబు వెదచల్లె గుభులున దేవదుందుభులు మొరసె. జాహ్నవీ.౧.౯౮.

చ. ఉభయరగండ తావకరణోగ్రజయానకము ల్గుభుల్గుభు,ల్గుభు లని మ్రోయఁగా భవదకుంఠిత వీరభటుః ల్రుభు ల్రుభు, ల్రుభు లని శత్రుభూపతులపైఁ జొరఁబాఱ నెడ న్విభుల్విభు, ల్విభు లని సంభ్రమింపుదురు వేడ్కు నఖర్వ సుపర్వభామినుల్. నరస. ౨. ౭౮.

వ... పెట్లుఁగ్రోవులవరుసలఖుంగు పెఠీల్ ఢిమిరిం గు కఠీల్ ఢమీల్ ఢాంగు ఖణీల్ గుభుల్ చఠాల్ ఢాంఢంకరణశబ్దంబు లబ్దంబులగర్జలఁ దర్జించి... ప్రబంధ. ౭౮౮.

(గుండెలు అదురుటయం దగుననుకరణము.

సీ. అఘుకుమానుసులగుండెలు గుభుల్లన...సారంగ. ౩. ౨౮.

## గుభేలు=గుభాలు.

(ఉఱుకుట మొదలగువానియందగుఅనుకరణము)

క. సలసలఁ గ్రాఁగెడుతైలము, కొలఁది యెఱుఁగఁ దలఁచు ఫంగి గుణరత్నసము,జ్జ్వలుఁడు గుభేలున నుఱికెను, జలనిధిలో నస్తమించుజలజాప్తుక్రియన్. ద్వా. ౬. ౧౩౫.

సీ. చిమ్మనఁగ్రోవులఁ జిమ్ములాడుచుఁ దటంబునకు వెల్వడి గుభేలున నుఱుకుచు. పరమ.౪.౧౦౭.

క. చని పేలఁ గాఁడి క్రమ్మఱ,మనుకులమణి దొనకు వచ్చె మఘువాహితుఁడున్,దనపాటునఁ గొరగఁగఁ, జెనుగుబ్బలి పడినగతి గుభేలునఁ బడియెన్. రామా. ౮. ౨౯౯. ('గుబేలున' శ. ర. పా.)

(శిలాదులు కూలుటయం దగుధ్వని కనుకరణము.)

సీ. నగశిఖాశిల లెగసి గుభేలు రనఁ గూలి ... రామా. ౬. ౯౯.

## గుమంజి. వి. సుగంధిద్రవ్యవిశేషము.

రగడ. సంకుమదంబు గుమంజియుఁ బూతియుఁ

జందనఖండంబులుఁ గర్పూరము. కవిక. 3. ౧౯౨. (ప్రయోగాంతరము లేదు.)

**గుమగుమ.** వి. (క. గుమగుమ) ౧. సువాసనకొట్టుటయందలియనుకరణము.

ఉ. గుమగుమ వాసనల్గుబులుకొల్పనపుక్కిటిలోని వీడియం,బుమియ... సారంగ. 3. ౧౫౨.

క. గుమగుమ యను నెత్తావులు, కొమరమరక్... విప్ర. ౧. ౭౪.

౨. గుమగుమ యనువాసన.

క. చొక్కపునడతోఁ దళుకుం, బుక్కా గుమగుమలు తట్టుపునుఁగుగుబులు నల్, సిక్కుల నిండఁగ నెంతయుఁ, జక్కని కాళింది యనెడి జవ్వని వచ్చెన్. చమ. ౧. ౫౨. (శ.ర.పా.)

౩. అగ్ని మండుటయందగు ననుకరణము.

క... గుమగుమ మని శోకవహ్ని గుబ్బతిలంగన్. నిరం. ౨. ౯౯.

**గుమి¹.** వి. ౧. సమూహము, గుంపు; రాశి, ప్రోవు.

ద్వి. వేడుకతో వినువీథిఁ జన్వారు, నాడకాడకు గుములై యేఁగువారు. రం. రా. యు. ౩౧౭ పా. ౨౧ పం. ఆం. భా. ౨. ౧౦౦.

సీ. చిమ్మఁజీకటి గ్రమ్ముక్రొమ్మావిగుమి నల్లిబిల్లిరు ద్రాక్షపందిళ్లనడుమ. ఉ. రా. 3. ౬౬.

మ... వేళామాతి తత్కాలసం, భ్రమసంకీర్ణతరోరుహారమణివారం బేటి తానొక్కచో,గుమిగాఁ బోసెనొ నా మిసుక్కు రనువేగుంజుక్కఁ గంటే చెలీ. వసు. ౪. ౧౨౮.

౨. గుది.

సీ. తిమితిమింగిలముఖ్యదీర్ఘమత్స్యంబులఁ గొమ్మన గుములుగా గ్రుచ్చి యెత్తు. దశా. ౧. ౭౮.

౩. పాద.

వ... ఫలవృక్షంబులు ప్రేయ సమకట్టిన సీమ వలదని యవ్వాదుసుగుమి నూపినం బడ ప్రేసె... భా. రా. అర. ౧. ౧౨౫.

జ: గుమికట్టు, గుమికాఁడు, గుమిగూడు, గుమిగొను.

**గుమి².** వి. మదుఁగు.

తోటకము. జమునన్ గుమిఁ బామని జంకక వే, దుముకన్... అచ్చ. భా. ౧. ౨౧ పా. (చూ. భాగ. ౧౦ పూ. ౬౩౫.)

**గుమికట్టు=గుమిగూడు.** అ. క్రి. (√గుమి¹) గుంపుగూడు, సంఘమగు.

సీ. గోడలవాపున గుమికట్టి నిలిచిన... దశకు. ౫. ౧౨౩.

గుములుగట్టు=గుంపులుగూడు.

వ... కురుపతిప్రేరితజనంబులు గిరీటిపరాక్రమ ప్రకారంబులం దమదస నానాదేశంబులచతురంగబలంబులు వొలిసిన పెల్లున నంతంత గుములుగట్టి చెప్పుకొను చుండ... భార. భీష్మ. ౨. ౧౬౬.

వ... వదులు వదులు నూఱులు నూఱులు వేలు వేలు గుములుగట్టి... మనుచ. ౪. ౩౭.

**గుమికాఁడు.** వి. (గుమి¹+కాఁడు.) కాకి,వాయసము.

సీ. గుమికాఁడు కాకి నాఁ గొఱలుఁ గాకము పేళ్లు... సాం. ని. తిర్య. ౮౨.

**గుమిగూడు=గుమికట్టు.** అ. క్రి. (√గుమి¹) గుంపుగూడ, ప్రోగగు.

చ. అటదితిభదానవాళిఁ బడ నైనమహిం గుమిగూడి పందులం,తట వెన బుడ్డగింప బెడిదం బగు లోయలఁ బక్వి... చంద్రా. ౨. ౬౨.

వ... దైవనమస్కారంబులు దూరంబు చేసి వదుగు రైదుగురు గుమిగూడుకొని కోడెకాండ్ర రూపాధిక్యహైన్యంబు లుపన్యసించు సామాన్యకన్యకలును... శుక. ౨. ౧౦౦.

క... మెఱుఁగు లన్నియు, నొక్కడ గు

మిగూడి నిల్చి యున్నవిధముగా ... ఉండె
లచ్చివేనిమెఱుంగుల్. వేం. మా. ౧. ౧౩౧.

గుములుగూడు=గుంపులుగూడు.

గీ. ఏఱులై పాఱునెత్తురు లెందుఁ జూడఁ, గొండ
లై పడుకండలు గుములుగూడి, దానికై పో
రుభూతబేతాళతతులు, గఱిగి భీకర మయ్యె
సంగరము గరము. దశా. ౨. ౪౩౪.

**గుమిగొను**=గుమిగూడు. అ. క్రి. (గుమి¹ + కొను) గుంపుగూడు.

చ. గుమిగొని పైఁబైఁ బడికొంచు భటావళి
చూడఁబోవ వెచ్చము గొనిపోవుదాదులు ని
జంబు గనుంగొని...శుక. ౨. ౪౦.

**గుమితి**=గుమ్మితి. వి. ఆయుధవిశేషము.

శా. బాణా వంకిణిఁ జెద్దకత్తి గుమితిన్ బాణాసన
ప్రౌఢిమన్...శశాం. ౨. ౧౭. (శ. ర. పా.)

**గుమిలి**=గుబిలి. వి. పక్షివిశేషము, కనకాక్షి. (శ. ర.)

**గుముకు.** స. క్రి. (త. కుముక్కు) పిడికిలి మోఁచేయి మొదలగువానితోఁ బొడుచు.

క. తమఁ దామె బెదరి పులుఁగులు, గుములై పై
కెగసి యల్లుకొని కొమ్మతుదల్, గమకముగఁ
దాఁకి తోటతోట, గుమికిన క్రియఁ బ్రెల్లనే
లకును వ్రేఁగగుచున్. చంద్రా. ౨. ౬౩.

సీ. జడలచుట్ట కుదిర్చి మెడలపై మోఁచేఁత గు
వ్వగుప్పన సారె గుమికి గుమికి. వాల్మీకి. ౨.
౯౬.

**గుముడు**=గుమ్ముడు.

(ఒకవిధ మగు టేఁకులి.)

ద్వి. గొన బైన లేఁకులు గుముడు తేఁకులును. ద్వి.
పరమ. ౨. ౫౪ పా. ౪ పం.

**గుమురు**=గుబురు. వి. సమూహము, గుంపు.

గీ. అచటిమణిచిత్రభూములు నచట నమరు, నమ
రతరువులగుమురులు నచటిలీవలు...వసు. ౨.
౫.

ద్వి... మము వృథా చంప నిశ్శేష...

యంచు సకలవానరులు, గుమురులు గుమురులై
కూడి యుండొరులు. రం. రా. కిష్కిం. ౨౩౧
పా. ౯. పం. చం. రా. ౪. ౬౩. ఆం. భా. ౨
౧౦౦.

౨. కొమ్మలు చిగుళ్లు ఆకులు మొదలైనవానిసమూహము, విటపము.

వ...మొగలిగములగుమురులనడుమఁ బొడవులుగ
దీపించుతోఁపుగుడారంబులచెలువు నలరించు
చివురుటెలమావితండంబులును ... కళా. ౬.
౨౨౪.

విశే. సాంద్రము, దట్టము.

రగడ. గుమురు లగులేమావిచిగురులు గోయఁ గో
యనికూసెఁ బికములు...పారి. ౪. ౧౬.

జ: గుమురుకొను, గుమురుగట్టు.

**గుమురుకొ(ర్కొ)ను**=గుమురుగట్టు.

సీ. కుఱుచలై గుమురులై గొనబులై లేఁబాఁప
కొమ్మఁ జుట్టినజడల్ గుమురుకొనఁగ. పాం
డు. ౨. ౯౧.

చ. కరఁగినడెందముల్ విడువఁ గానని కోర్కు
లు పారవశ్యముం, బొరసిననిట్ట చూపులు గు
ముర్కొను మత్పులకాంకురావళుల్, చిఱిఁగి
నసిగ్గులుం గలిగి...పాండు. ౩. ౬౯.

**గుమురుగట్టు.** అ. క్రి. (√గుముకు.) గుంపుగట్టు, గుంపగు.

క. హయముల మరల్పమి తల్లియు బంధులు నె
చ్చెలు సంచలింప గుముగుగట్టి యెమయసూతు
రు...భార. విరా. ౫. ౨౨౩.

గుమురులు(ర్లు)గట్టు=గుంపులుగట్టు.

చ. గుమురులుగట్టి యూరికలు గుట్టి ప్రవాళము వ
ట్టి కింకతో, నమలక మ్రింగి...అమనిని రేయి
పవల్ వడిఁ గూయఁ గోవెలల్. కు. సం. ౪.
౪౬౩.

గ... గుమురుగట్టి వీరభద్రరణంబుఁ జూచి భీతచి

త్తులై ప్రాణంబులు విడుచువారును...వీర.౪. ౧౬౨.

గుమ్మ[1]. వి. పాలు పిండునప్పుడు వచ్చెడుధార.

సీ...పాలు నాఁ బొల్చు బహుళత.గీ. క్షీర మగు గుమ్మయనఁగఁ దద్ధార వెలయు. ఆం. భా. ౨. ౨౫౯.

సీ. కామధేనువు నడ్డకట్టి గుమ్మలు గ్రోలి యాఁబెయ్యొయిది మంచి దనెడువారు. రంగా. ౧. ౬౨.

క. వేలుపుటావును గుమ్మెఁడు,పా లడిగెడుకేలి ధరణిపాల...అల్పదానము...అడుగ వచ్చితి నిన్నుఁ జ్. హరిశ్చ. ౪. ౧౯౯.

జ: గుమ్మకాంభోజి.

గుమ్మ[2]. వి. (త. కుమ్మలి.) ఆఁడుది, స్త్రీ.

గీ. చెలువ దన చెల్మికత్తెలఁ బిలిచి నాకుఁ, గూర్చు గుమ్మ లెవ రెవ రీకొమ్మలందు, వారు సేకొని రక్షింప వలయు వీని. కు. సం. ౬. ౬౭౪.

ఉ. రంగమహీశుకొమ్మ జిగిరంగులబంగరుబొమ్మ సంపదల్,పొంగుచు నిచ్చుగుమ్మ పతిప్రొమ్మెడఁబాయనిముద్దుగుమ్మ...అహ. ౧. ౨.

గుమ్మ[3]. వి. గాదె,కుసూలము; బొట్ట, కుసూలవిశేషము.

సీ. గాదె బొట్టయును దుగ్గాసారమును ముద్దుగుమ్మయు వెలయును గుమ్మ యనఁగ. ఆం. భా. ౩. ౬౪.

గుమ్మఁడు. విణ. అలంకరించుకొనువాఁడు, అలంకారి.

సీ...గుమ్మఁ డంచనఁగను జికిలికాఁ డనఁగ సొగసు,కాఁ డనంగను వన్నెకాఁ డనంగను నీటుకాఁ డనఁగా నలంకారి యొప్పు. ఆం. భా.౩. ౧౦.

గుమ్మకాంభోజి. మి. వి. (గుమ్మ[1] + కాంభోజి) మువ్వదిరెండునపుంసక రాగము[illegible]

సీ. కాంభోజియును గుమ్మకాంభోజియును సింధురామక్రియయు నాదనామక్రియయు. ప్రబంధ. ౯౬. హంస. ౫. ౧౨౪.

గుమ్మటము. వి. (క. గుమ్మట. త. కుమ్మట్టం.) రాయి కాగితము మొదలగువానితో నిర్మించినదీపము గూఁడు.

మ. కురువేరుల్ జగజంతక్రొందెఱఁగురంగుల్ మీఱు మేల్ బొమ్మచి, త్తరుబంగారుపటాలు నిచ్చలపునిద్దాకెంపుటాగుమ్మటాల్, మరువంపున్విరిమల్లెపూసరులు చల్వల్ చిల్కుపందిళ్లు ...సానందో. ౩. ౪౬.

గుమ్మడి. వి. (సం. కూశ్మాండః. ప్రా. కుమ్మాండే.) కూశ్మాండము I.

శా...గుమ్మడికాయయంత యగుముత్తెంబై మనం బేర్చ... ఆము. ౪. ౨౨౨. (గుమ్మడికాయయంత యగుముత్తెంబై:-అస్వాధీనుఁడై అని భావము.)

క. అమ్మగువ గనుంగొనియెన్, మమ్మరముగఁ బట్టెనామములు మైనెల్లన్, గ్రమ్మికొన నుట్టెఁ బెట్టిన, గుమ్మడికాయయును బోలెఁ గూర్చున్న తనిన్. వైజ. ౨. ౫౬. హర. ౨. ౯౯.

గుమ్మడికాయలో నావగింజయుఁ బోదు=గుమ్మడికాయలో ఆవగింజంతయుఁ బోలేదు:-కావలసినదానిలోఁ గొంచెమైనను గాలేదు అనిభావము.

సీ. ఇపు డేమి గంటి నా కెక్కుడిసిద్ధసంకల్పత గుమ్మ[illegible]ాయలోన, నావగింజయుఁ బోదు హంసి నాచింతాభరంబులో లేశమాత్రము నుడుగుటు, గలదె యీవేళకుఁ దలపోసి చూచిన... ప్రభా. ౪. ౫౨.

గుమ్మడిమూట=గుమ్మడిపండువలె నుండుమూట.

ఉ. ప్రక్కలు వంచు వంచి మునిపండ్లును బండ్లను రాచు రాచి రొ,మ్మక్కలఁజేయుఁ జేసి తల యల్లనఁ గాళుల సందు సంది లో,దక్కి[illegible]క్కు యిరుచంబన గుమ్మడిమూట

గట్టి పీ, పెక్కు దువాళి చేసి చలి యిక్కడ న
క్కడఁ బెట్టు చేకువకా. క్రీడా. ౪౬.
జః గుమ్మడిగింజనామము.

**గుమ్మడిగింజెనామము.** వి. (√గుమ్మడి) తిలకవిశే
షము, గుమ్మడిగింజవలె నుండుబొట్టు.
సీ. గీఱుచు గుమ్మడిగింజనామము దీర్చు... కువల.
౪. ౧౫౫.
ఇట్లే 'గుమ్మడివిత్తునామము' ప్రభా. ౪. ౧౩౭.

**గుమ్మలీలు.** వి. బ. కర్ణభూషావిశేషము, చెవితమ్మెల
నుంచెడిసొమ్ము. (శ. ర.)

**గుమ్మము.** వి. వాకిలి, ద్వారము. (చి.ని, శ.ర.)

**గుమ్మసరులు.** వి. బ. ధాన్యవిశేషము.
వ...షష్టికములు గుమ్మసరులు ననునూటనాలుగువ
గలపైరుల చేరడుబియ్యంపువట్టిచసాదంబులు
...ప్రబంధ. ౧౧౨.

**గుమ్మితి(తీ)=గుమితి.** వి.ఆయుధవిశేషము.
క...మొగలి రేకుగుమ్మితిఁ జిమ్మెకా. ఉ. హరిశ్చం.
౪. ౧౧౪.
ఉ...మరుఁడంతట నంతటఁ దమ్మిగుమ్మితిం, జేకొ
ని పీఁక మై మొనలఁ జిమ్మఁ దొడంగెను గొమ్మ
లొమ్మనకా. కళాం. ౨. ౭౦.
చ. మదనునిగుమ్మితీమొనలు మాటికి మర్మములం
టఁ బాటినకా...అహ. ౩. ౪౧.

**గుమ్ము=ఘుమ్ము.** వి. ౧. పరిమళించుట త్రిప్పట మొ
దలగువానియందగుననుకరణశబ్దము
సీ. పుణ్యావాసన పొంగి పొదలె నాఁ జెమట పైకొ
నఁ గప్పురపుఁబూఁత గుమ్ము రనఁగ. చంద్రి.
౬. ౫౦.
ఉ. గుమ్మనుకమ్మఁదెమ్మెరలకుం దులకించి... కృ.
శకుం. ౧. ౭౩.
ఉ. వేలుపులు న్నిశాచరులు వెండియుఁ గవ్వపుఁ
గొండ వార్ధిలోఁ, దేలిచి గుమ్ముగు మ్మనఁగఁ
ద్రిప్పఁగఁ జొచ్చిరి...

ద్వి. నెమ్మెనఁ బొదలలో నిండినవిరుల, గుమ్మన జ
డివాన గురియించుదాని. అభిమన్యుద్విపద.
(శ. ర)
గీ...కోదండకాండరవ మ,జాండభాండంబు గు
మ్మని నిండుకొనియె. చం. రా. ౩. ౧౦౩.
సీ. అనిలాభిహతదక్షిణావర్తశంఖంబు గుంఫితం
బై కేల గుమ్ము రనఁగ. (మొల్లచాటువు.)

**గుమ్ముడు=గుముడు.** వి. ౧. కుముదిక, టేఁకు ?.
గీ. గుమ్ము డనఁగను గుముదిక సమ్మతిపడు.ఆం.భా.
౨. ౪౬.
౨. ఒకవిధమగు టేఁకు, కాశ్మర్యము ?.

**గుమ్మెట=గుమ్మెత.** (త. కుమ్మట్టం.) వి. కుంభవాద్య
ము, తుడుము.
వ...బూరి భేరి గౌరు గుమ్మెటతమ్మటంబు...లో
నగునసంఖ్యాతవాదిత్రత్రితయపరంపరలు...
ఆము. ౪. ౩౫.
సీ. తటపెటనిమికిటధ్వను లోలిఁ బుట్టింపఁ జాలు
గుమ్మెట చంక వ్రేలుచుండ. క్రీడా. ౨౨౬.
కాశ. ౩. ౩౬.

**గుమ్మెత=గుమ్మెట.**
సీ. గుమ్మెత యనఁగను గుంభవాద్యము దోఁచు...
ఆం. భా. ౧. ౧౨౫. హంస. ౩. ౧౫౫.
జః గుమ్మెతకాఁడు, గుమ్మెతగుడారము.

**గుమ్మెతకాఁడు.** వి. (గుమ్మెత+కాఁడు.) తుడుము
వాయించువాఁడు.
ఉ. గుండనికిం బసిండిపనిగో రడిబండకు వెండి
తాయెతుల్, లండికిఁ జేకడెంబు పదిలంబుగ
గుమ్మెతకాని కందెలుకా...హంస. ౫. ౧౩౬.

**గుమ్మెతగుడారము.** వి. (గుమ్మెత+గుడారము.) గు
మ్మెతవంటిఆకారము గలగుడారము.
చ. తిరిగి యతండు వచ్చి... గుమ్మెతగుడారమునం
...కువల. ౨. ౭౬.

క...రంభోర్వనులుఁ, గుమ్మెతగుడారములకడ, ఘుమ్మనుకపురంపుజగతిఁ గూర్చుండి తగఁ. వాల్మీకి. ౩. ౧౦౧.

**గుయ్యారము.** వి. (సం. గుహ్యాగారమ్) కారాగృహము.

గీ. అడరుఁ గారాగృహంబు గుయ్యారము చెఱ, సాల బందిగ మనఁగను...ఆం.భా.౨.౨౭.

**గురగుర.** వి. ౧. పందికూఁత కనుకరణము.

సీ. గురగురధ్వనులు నిర్భరముగఁ బర్విన చెలసి బ్రహ్మాండంబు నెదురుమ్రోయ. హరి. పూ. ౪. ౧౭. (శ. ర. పా)

ద్వి. గరువునేలలఁ దుంగగడ్డలు త్రవ్వి, గురగుర మనుపందిగున్నలబార్లు. ద్వి. శ.సా. ౨. ౮౦ పా. ౧౪ పం. చెన్న. ౨. ౨౦.

౨. ఇత్తి చేసెడిధ్వని కనుకరణము.

ఆ...గురగుర,మనుచు వేఁటయిఱ్ఱులరుగుదెంచె. చంద్ర. ౨. ౨౧.

**గురణము.** సం. వి. అ. న. యత్నము, పూనిక.

**గురస్తు.** వి. (సం. గృహస్థః) గృహస్థుఁడు, గేస్తు.

గీ. అమ్మనేఁజెల్ల బాఁపనయ్యా మశేమి, రజ్జులాడెదు మంచిగురస్తు వగుదు. శుక. ౨. ౪౬౩.

సీ. రమ నేలినట్టిగురస్తు నందు రదేమొ నేలమిన్నులు గొల్వ నేర్చు టరుదె. శుక. ౩. ౨౩.

**గురి.** వి. అర్బుదఫలి, ములకి.

సీ... గురు గటం చన్నను గురి యనంగ, ముల కటం చన్న నర్బుదఫలి మనుచుండు ... ఆం. భా. ౨. ౭౪. ('అర్బుదఫలి' అనునది సంస్కృత నిఘంటువులలోఁ గాన రాదు.)

**గురిగి**=గురియ. ఆం. భా. ౨. ౨౪౬.

**గురిగింజ.** వి. (గురిజ+గింజ-త. కురువిఁదమ్.) గురిజపూస. (బ్రౌ, చి.ని, శ. ర.)

**గురిజ.** వి. (సం. గుంజా.) ౧. గురివెంద తీ.

సీ...గురిజ, గురివెంద నాఁగను గుంజాఖ్య విలసిల్లు...ఆం. భా. ౨. ౫౨.

సీ. భుజమధ్యమునఁ గ్రాలుభుజగహారంబులు గురిజపూసలగుబ్బసరులు గాఁగ... గీ...శంకరుండు కిరాతవేషఁబు దాల్చె. హర. ౬. ౪౧.

౨. గురిగింజ.

సీ...ఈయచ్చగురిజపే రెందుఁ గలిగె. యయా. ౧. ౪౮.

ఆ. గురిజపేరు లఱుతఁ గొమరార ధరియించి, యడవిమొల్లలఁ గురులందుఁ జెరివి. ద్వా. ౧౧. ౭.

జ: గురిగింజ, గురివెంద.

**గురియ**=గురిగి, గురుగు౩. వి. అత్యల్పభాండము, ఆఁడుపడుచులుఆడుకొనుచిన్న పిడుత.

సీ...అత్యల్పభాండం బొప్ప గురిగి యంచనఁగను గురియ యనఁగ. ఆం. భా. ౨. ౨౪౬. (బ్రౌ, వ్రాఁత ప్రతిపా.)

**గురివె(ర్వ)ంద.** వి. (గురిజ+వెండ-శ. ర.) గుంజాలత, గురిజ తీ.

రగడ. వెల్లి రైు తొఱఁగె గురివెందలమరందములు. ఉ. రా. ౭. ౭౧.

గీ. ప్రమదదిక్కాంత కెంగేలఁ బట్టి యాడు, క్రొత్తగురివెందపూసలగుత్తివోలె. హర. ౬. ౧౪౦.

ఉదా: బండిగుర్వెంద.

**గురు.** వి. గవయమృగము.

సీ. కాఁచి పిరునెయ్యి చేచాఁపఁ జాలినంతయుఁ గుమ్మరించి...పాండు. ౩. ౮౬.

ద్వి. గురువులువాతెడిగురుమెకంబులును. నవ. ౧. ౪౬ పా. ౭ పం. రుక్మా. ౩. ౯.

జ: గురుపోతు.

**గురుకారము.** సం. వి. అ. పుం. పెద్దచేయుట, గొప్పగా భావించుట; పూజనము, ఆరాధనము.

**గురుగు**[1]. వి. భక్ష్యవిశేషము.

వ...చాఁపట్టు లిడ్డెనలు తేనెతోలఁకు గురుగు కేల కికాయలు... ప్రబంధ. ౧౧౨.

**గురుగు**². వి. ఒకవిధ మైనకూరాకు (శ. ర, బ్రౌ.)

**గురుగు**³=గురియ. (బ్రౌ, వా)

**గురుగు**⁴. వి. ౧=గురి. ౨. శ్రీహస్తిని, భూరుండికి.

సీ...శ్రీహస్తినీసంజ్ఞ చెలఁగు గురుగు, నాఁగ ... ఆం. భా. ౨. ౫౨.

౩. గురుకటము, ఒకజాతికూరాకు చెట్టు.

గీ. గురు గనంగను జెలఁగును గురుకటాఖ్య. ఆం. భా. ౨. ౭౩. ('గురుకటము' సంస్కృతనిఘంటువులలోఁ గాన రాదు.)

మ. గురుగుం జెంచలిఁ దుమ్మి...ఆము. ౪. ౧౩౪.

**గురుఘ్నము.** సం. వి. అ. పుం-గురుత్వము పోఁగొట్టునది- తెల్లఆవఁ.

**గురుజే.** వి. ఒకజాతికూరాకు చెట్టు, ఉత్తుండికి. (శ. ర.)

ఆ. కటికియుజీలకఱ్ఱ గఱివేము గురుజ యుం, గువ ప్రవర్జనీయకోటి యగుట. భార. అను. ౩. ౧౮౯.

**గురుజా.** వి. వజ్రము. (బ్రౌ, చి. ని.)

సీ. పొలుచును వజ్రంబు మూలిరా లన మగరా లనంగను గురుజా లనంగ. ఆం. భా. ౨. ౨౭౮.

**గురుజో.** వి. తిరుగటికి కొట్టెడి కుఱ్ఱుఁ వంటికొయ్య. (వా)

**గురుదైవతము.** సం. వి. అ. పుం-బృహస్పతి దేవతాకము- పుష్యనక్షత్రము.

**గురుపత్త్రి.** సం. వి. ఆ. స్త్రీ-తొందరగా పక్వము కానిఆకులు గలది- చింత చెట్టు.

**గురుపత్త్రము.** సం. వి. అ. న. వంగము, తగరము.

**గురుపోతు.** వి. (గురు+పోతు.) పురుషగవయము.

సీ. తెరఁ దూఱి వెఱఁ బాఱుగురుపోతు పైనెనఁబడి యెక్కి- పొడుతు నీపాద మాన. మను. ౪. ౩౫.

మ...కోర్వగండ్లు గురుపోతుల్ కొండగొఱ్ఱెల్ కురంగులు నెం డందుఁ గనుంగొనంగ వని లోఁ గోటానఁగోటుల్ నృపా. ఇందు. స్కం. ౫౧. ఆం. భా. ౨. ౮౫.

**గురుమర్దలము.** సం. వి. అ. పుం. డిండిమవాద్యము.

**గురురత్నము.** సం. వి. అ. న. ౧- బృహస్పతికి ప్రియ మగురత్నము - గోమేదకము. ౨. పుష్యరాగమణి. ౩. శ్రేష్ఠుఁ డగుగురువు.

**గురువారము.** సం. వి. అ. పుం. బృహస్పతివారము.

**గురువు.** వి. పరుగు, ధావనము. (బ్రౌ-వేగపుపరుగు. శ. ర.) ఉదా: గురువు దేఱు, గురువులువాఱు. జ: గురువు దేఱు, గురువులువాఱు.

**గురువు.** సం. విశే. (ఉ. ఉ, స్త్రీ. ఉ.) ౧. బరువైనది. (వ్యతి. లఘువు) ౨. గొప్పది, పెద్దది. ౩. దీర్ఘమైనది. (కాలాది) ౪. దుర్భరము, భరింప రానిది. (విరహాది) ౫. పూజింపఁదగినది. ౬. (ఛంద) లఘువు కానిది. (అక్షరము) ౭. బలీయమైనది. ౮. దుష్పాకము, తొందరగా పక్వము కానిది. వి. ఉ. పుం. ౧. తండ్రి. ౨. కులజ్యేష్ఠుఁడు, కులము పెద్ద. ౩. తాత. (మాతామహపితామహులు) ౪. తండ్రితోడఁబుట్టినవాఁడు. ౫. అన్న. ౬. మేనమామ. ౭. ఉపాధ్యాయుఁడు. ౮. ఆచార్యుఁడు, మంత్రోపదేశము చేసినవాఁడు. ౯. రాజు. ౧౦. కాపాడువాఁడు. ౧౧. బృహస్పతి, దేవగురువు. ౧౨. (మీమాంసకుఁడగు) ప్రభాకరుఁడు. ౧౩. పుష్యనక్షత్రము. ౧౪. దూలగొండికి. (వాచ.)

**గురువుదేఱు.** అ. క్రి. (గురువు+తేఱు)-పరుగిడు- రకము మొదలైనది జిఱ్ఱున పైకి ఉబుకు.

ఉ. త్రెవ్వెడుగంటులన్ గురువు దేఱుచు నెత్తురు రాకమున్న... భా. రా. యు. ౨౧౭౫.

**గురువులువాఱు, గురువువాఱు.** అ. క్రి. (గురువులు + పాఱు) ౧. పరుగెత్తు.

చ... తల్లిముందఱన్, గురువులువాఱు త్రేకడు పుఁగుఱ్ఱఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్. వీర. ౧. ౫.

సీ. విరులగుత్తులమీఁద గురువులువాఱుచు ముద్దిచ్చు తేఁటులమొరపములకు. మార్క. ౫. ౭.

ద్వి. కరములఁ గొఱవులు గైకొని పేర్చి, గురువువాఱెడు పెద్దకొఱవిదయ్యములు. ద్వి. పారిశ్చా. ఉ. ౧౮౭౩ పం.

౨. అతిశయించు; విజృంభించు.

క. నరుఁడును రాధేయుఁడు నొం,డొరువులతోఁ జెనఁగువేడ్క యుల్లంబులలో,గురువులువాఱఁ గ నిల్చిరి...భార. ద్రో. ౧. ౧౩౫.

చ...క్రొవ్వునం, గురువులువాఱుకంటకులఁ గొండగవుల్ చొరఁ దోలి పౌరుషం, బటిముఱిఁ గ్రాలఁ బింగళకుఁ డన్ మృగరాజు చరించు నచ్చటన్. వేం. పంచ. ౧. ౧౦౧.

౩. వర్షముచే ఉప్పొంగు, ఉబుకు.

చ... మై,గురువులువాఱఁ గేలఁ బుడుకున్ జెరమాముల నవ్వు నింపు వొం,పిరిగొనఁ గార్తికేయుఁడు కుభృత్సుత కుల్లము పల్లవింపఁగన్. కు. సం. ౧౦. ౭౭౬.

**గురుసు.** వి. ౧. మర్మము, ఆయువుపట్టు.

క. తురగముల సూతుఁ జంపినఁ, గురుగురు పొలివోక యతని గురుసున నేయన్. భార. ద్రో. ౫. ౧౫౫.

సీ. తారగా రనువారిఁ దనవారితన మొప్పు గురుసు మోవకయుండ సరసమాడు. కాశీ. ౬. ౬౦. (గురుసుమోవకయుండన్:-మనస్సు నొవ్వకుండ అని భావము.)

౨. మూలము, కుదురు.

చ... గుండులెత్తి స్వత్వరగతిఁ గుంభముల్ పగుల దంతుల వైచుచు దంతకాండముల్, గురుసులఁ గూడి రాఁ దిగిచి ఘోరనిశాచరకోటి మోఁదుచున్... భా. రా. యు. ౬౭౭.

౩. పశురోగవిశేషము.

సీ. గురుసురోగము గొన్న గోవుల మాన్పంగఁ గలబందపలుకులు కడఁగి తెచ్చి. గోచికిత్స. ౧. (చి. ని) నవ. ౧. ౭౧ పా. ౧ పం.

**గుర్గురింత.** వి. అడవిపంది.

గీ. ఏకలము గుర్గురింతన నెసఁగు దంష్ట్రి. పాం. ని. తిర్య. ౭౫.

**గుర్జరము.** సం. వి. అ. పుం. ఘూర్జరము, గుజరాతి దేశము.

**గుర్వణఁగించు.** స. క్రి. (గుర్వు + అణఁగించు) -ఆధిక్య మణఁచు-నశింపఁజేయు.

ద్వి. పూర్వజన్మార్జితభూరికర్మములు, గుర్వణఁగించునాకొడుక రావయ్య. బస. పు. ౭. ౭౩౧ పం.

**గుర్వి.** సం. వి. ఈ. స్త్రీ. గర్భిణి, చూలాలు.

శ్లో. ఆపన్నసత్త్వా గుర్వీ స్యాదంతర్వత్నీ చ గర్భిణీ. (హలా. ని.)

**గుర్విణి.** సం. వి. ఈ. స్త్రీ. గర్భిణి, చూలాలు.

**గుర్వు.** వి. ఆధిక్యము, అతిశయము. (చూ. గుర్వణఁగించు.)

వి=అగుర్వు. (సం. గురు.) ౧. అధికము.

ఉ...మాలి యడ్డమై, బోరన వచ్చి యవ్విహగపుంగవకేతను నేసె నెంతయున్, గ్రూరము లైన యమ్ములను గుర్వుగ దానవు లుత్సహింపఁగన్. నిర్వ. ౩. ౨౫.

ద్వి. సర్వాంగసుందర శంకర యాశ,గుర్వగునడి దొరకొనె నయ్య నీకు.బస. పు. ౩. ౭౫౩పం. (ప్రాత ప్రతి. పా.)

౨. పూర్ణము.

 

ద్వి. సర్వమాన్యము నీకు గుర్వాగా నిత్తు, శర్వభక్తుండ వై చరియింపు మనుడు. బస. పు. ౪. ౨ పం. (గుర్వాగా:-సర్వాధికారములతో.)

**గుఱక.** వి. (క. గుఱకె) ౧. నిద్రయందలిధ్వని, గుఱ్ఱు.

సీ. గుఱక యనంగను గుఱుపెట్టనంగను శోభిలుచుండును సుత్తరవము. ఆం. భా. ౧. ౧౪౨.

క. సతి ప్రక్కఁ బఁడినప్పుడు, రతి కొగ్గక నిదురవోదురా యయోగ్యు నా, చతురుఁడ గుఱకలు చాలుఁగ, గతి చెప్ప మటంచు వానిఁ గడు బాధించుఁగ. శుక. ౨. ౧౦౭.

౨. కోపభయాదులు కలిగినపుడు వ్యాఘ్రాదులు చేసెడిధ్వని.

క. అని తెంపు చేసి కనకనఁ, గనుఁగొనల న్నిప్పులురలఁగా వాలము భూ, మిని దాటించుచుఁ దగ్గఱ, మును జూచుచు గుఱక నుఱుకఁబోవటు లున్నఁగ. శుక. ౨. ౨౫౨.

జ: గుఱకలిడు, గుఱకపెట్టు.

**గుఱకలిడు.** అ. క్రి. (గుఱకలు + ఇడు) గుఱకలుపెట్టు.

సీ...కొల్పులు లొప్పదరిండ్ల గుఱకలిడఁగ. మనుచ. ౨. ౭.

గీ...గుఱక, లిడుచు నిదురించు లేచు నల్గడలఁ దిరుగుఁ, గుంభకర్ణుండు నడయాడుకొండకరణి ఉ. రా. ౨. ౧౪౯.

**గుఱక(లు)పెట్టు.** అ. క్రి. (గుఱక + పెట్టు.) గుఱకలిడు, గుఱుపెట్టు.

గీ...పులివోలె గుఱకపెట్టి, నిదురవోవఁగ...ఉ. హరిశ్చ. ౪. ౧౫.

సీ. దిక్కరుల్ సెవు డొంద దేవతల్ వెఱ సెందబెట్టుగా గుఱకలుపెట్టుకొనుచు. ఉ. రా. ౨. ౨౯౫.

**గుఱగుఱ**=గులగుల. వి. (త. కుఱుకుఱుత్తల్.) ఒకవిధ మైనదురద. (శ. ర.)

విణ. దురద గలది.

చ. కరినివహంబు రాచుకొనఁగాఁ జలియింపదు బొద్దుబంటిగాఁ, బెరిఁగినపుట్టలో నెడలుభీకరభోగికులంబు ప్రాఁకఁగా, గుఱగుఱ గాదు గడ్డమున గూఁడులు పెట్టినపక్షికోటి పెక్, మొరప మెఱుంగ దట్లు మునిముఖ్యునియాతను వంచుఁ దాపసుల్. వరాహ. ౧౦. ౫౩.

**గుఱము**=గుఱ్ఱము. వి. (√గుఱ్ఱము) అశ్వము.

ఉ. మంది గుఱాలు నేనుఁగులు మావఁతులుక్...యయా. ౪. ౧౫౫.

క...నలువగుఱాలక్...పాండు. ౨. ౩౯.

**గుఱాలగోచే.** వి. (√ గుఱము) అశ్వపాలకుఁడు.

సీ. గుల్లా మన గుఱాలగో చనఁగా గులవ యనంగఁ దగు నశ్వపాలకుండు. ఆం. భా. ౨. ౨౦౪.

(గోచి, గోచు అనియు ఛేదింపవచ్చును. గుఱాల గోవనంగా. వ్రాఁతప్రతిపా. ఇంకను విచార్యము.)

**గుఱి.** వి. (క. తు. గుఱి. త. మ. కుఱి) ౧. లక్ష్యము.

చ...పువ్వులఁ జెట చిక్కనిచక్కనియమ్ము లేయుచో, గుఱి యఁజెటు చిత్తముల్... దశకు. ౩. ౧౨౯.

చ. తఱిమి ఘటోత్కచుండు బలదర్పము లేర్పడ ద్రోణుమీఁద నే, త్తెఱ నడతేరఁ గాంచి చనుదెంచి యలంబసుఁ డమ్మహాసురుక్, గుఱి యుఁగఁ జేసె శాతశరకోటికి ...భార. ద్రో. ౩. ౨౬౨. ఆం. భా. ౨. ౨౧౨.

౨. విశ్వాసము, నమ్మిక.

గీ. వఱలుకతిపేల్పు మది సెంతు గుఱి దలిర్ప. నీలా. ౧. ౩.

(వ్యవ) వైద్యునిమీఁద గుఱి లేనివానికి వ్యాధి కుదురదు.

౩. గుఱుతు, చిహ్నము.

గీ. వసుధలో సెట్టిశ్రీగలవారి వేని, కరభములు దాస్యములు చేయు సరసిజాక్షి, యూనవుల

కట్లటన్నఁ బైఁ దారు మోమ, గొడుగులును పల్లకులకము ల్గుఱులు గావె. ఆము. ౫. ౩౧.

౪. దృష్టాంతము, నిదర్శనము.

ఆ. గాలవుండ గుఱియుఁ గాఁడె మనకు. భార. ఉద్యో. ౩. ౩౦౫.

గీ. క్రౌంచ మొకకొన్ని గ్రద్దలు గాంచె మింట, నవి యహంసచ్ఛదాచ్ఛాదనానుభూతి, హంసతతు లయ్యెఁ గావన్న నరుణ మాష, గుప్తభుజగాశనాండము ల్గుఱులు గావె. ఆము. ౪. ౧౭౯.

౫. సాక్షి.

మ. నిజ మేఁ బల్కెద బాహు లెత్తి శ్రుతివాణీజాహ్నవీగోపతి, ధ్వజధుంకీశగణేశ్వరు ల్గుఱిగ నో వారాణసీదేవి...నిన్ బోల నం, బుజగర్భాండమునందు లేవు నగరంబుల్ తీర్థరాజంబులున్. కాశీ. ౨. ౧౩౬.

తరళ. కడఁగి విన్ను వెలుంగు దా గుఱి గాఁగ నబ్బలు కానలో, నడలుమన్న ననుం గనుంగొని యప్పు డర్మిలి నూతిలో, వెడలఁదీయుచుఁ గేలు వట్టితివే కదా యిఁకఁ బెండ్లికిన్, గడమ లెల్లను సొంపులు...యయా. ౪. ౬౦. భా. రా. యు. ౨౩౬౬.

౬. నిర్ణయము, ఏర్పాటు.

క. నా నెమ్మనమునఁ గలయను, మానము పరతత్త్వబోధమహిమ నుడుపుత్ర, జ్ఞానిధి యీపుల్కాము నిం, పూనఁగఁ గైకొనుట యనుచు నొక గుఱి చేసెన్. పరమ. ౪. ౧౯. (శ. ర. పా.)

౭. యుక్తి, ఉపాయము.

చ. కటకట మీర లాడు పెనుఁగష్టపువిద్దెలు చూడఁ డాయె ము, చ్చటకుఁ బ నేమి పోద మని చామయ పల్కినఁ దత్తనూజ మా, టటనురవేశ్యయో యనఁగ రాజిలుచుండెడి చెన్నసాని నీ, విటు వగఁ జెంద నేమిటికి నే గుఱిఁ జెప్పెద నంచు నిట్లనున్. చెన్న. ౨. ౨౩౦.

౮. పరిమితి, మితి; హద్దు; మర్యాద, గౌరవము.

ద్వి. అప్పుధనం బింత యని గుఱి నాకుఁ, జెప్పము చెల్లింతుఁ జేకొను మనిన. ద్వి. పారిజా. ఉ. ౧౪౭౯ పం.

సీ. ఏ దేవుఁ డింతకు నింత యై యంతకు నంత యై గుఱి లేక యతిశయిల్లు. పాండు. ౫. ౫౭.

సీ. గుఱి మీఱి రోదసీకుహర మొక్కట ముంప నుప్పొంగు ప్రళయపయోధికంటె. ఉ. రా. ౫. ౧౪౧.

మ. మనుజాలిన్ గుఱి దప్పి శూర్పణఖ వల్మాటిట్లు నిర్లజ్జ యై...చం. రా. ౫. ౩౯.

౯. (=గిఱి) వలయాకారపురేఖ.

గీ. ఎలమి నిన్నాళ్లు సైఁచితి నింక నైనఁ, బుద్ధ కొన్నట్టియ ప్పిచ్చి పొమ్మటంచు, హరిహయుఁడు భానుఁ జుట్టినగుఱి యనంగ, భీషణాటోపతను బరివేష మడరె. ఘటికా. ౨. ౪౧.

౧౦. కళంకము, మచ్చ.

సీ...గుఱిమచ్చ మచ్చము గుఱుతు చిన్నె, లక్ష్మనం బనఁగఁ గలంకు...ఆం. భా. ౧. ౮౦.

జ: గుఱించి, గుఱించు, గుఱికట్టు, గుఱికాఁడు, గుఱికొండి, గుఱికొను, గుఱిచేయు, గుఱిపడు, గుఱియగు.

**గుఱించి, గుఱియించి**=కూరిచి. (√గుఱించు)

చ. అన విని యన్నరేశ్వరుఁడు హాసముతో నతనిన్ గుఱించి యిట్లను ... భార. శల్య. ౨. ౭౩. ముకుంద. ౩. ౨౭౯.

మ. నిరవద్యస్థిరభక్తితోడ ననుఁ గానీ శంభుఁ గానీ రమేశ్వరుఁ గానీ గుఱియించి యెవ్వ రట యీ సారస్వతంబున్ జపింతురు...కాశీ. ౨. ౯.

**గుఱించు, గుఱియించు.** స. క్రి. (√ గుఱి) ౧. లక్ష్యముగా నుంచుకొను, గుఱిగాఁ జేసికొను.

వ ... అశేషమునీషిహృదయంగమంబుగా శబ్దం బనుసరించియు నభిప్రాయంబు గుఱించియు భా

వం బుపలక్షించియు రసంబు పోషించియు ...నైష. ౮. ౨౦౨.

క. అన మరలి చనిరి నవ్వ్రా,నన లైనన లైదు నేర్పునను శరములఁ జే, సినవిలుకాఁడు గుఱించిన, తనువుల పేరిప్రేరితనయులు ననయాల్. వరాహ. ౩. ౧౩౦.

౨. మిఱియుడు.

క. నగరిపురిపునగరుం డన్న గరిరథయూథసాధనానావిధరు,గ్గథగలుఁ జూమవేదుక,చిగిరింప గుఱింప రానిచిడిముడి పొడమక. కువల. ౩. ౧౫.

అ. క్రి. సంకల్పముచేయు, తలపెట్టు.

గీ. అట్లు వైవాహికాగ్రకృత్యములు నెఱపి, నాలుగవనాఁడు సకలబాంధవులు చెలఁగ, నరవరాగ్రణి లోచనానంద మొదవ, నాగవల్లి యొనర్పుటకై గుఱింప. రాజ. చ. ౩. ౧౭౪.

**గుఱికట్టు.** వి. (గుఱి + కట్టు) ౧. అంచు. (శ. ర.) ౨. మితి. (శ. ర.) ౩. కట్టుపాటు, ఏర్పాటు.

సీ. ఎఱుకవారల శల్ల గుఱికట్టుగా నిల్వ నొక్కచో టున్నది నిక్కముగను. వేం. మా. ౫. ౨౦. దశా. ౭. ౧౩౮.

**గుఱికాఁడు.** విశే. (గుఱి+కాఁడు) లక్ష్యము తప్పకుండ కొట్టువాఁడు, కృతహస్తుఁడు. (శ. ర.) వి. ఱేఁడు, పతి.

క. చలిగుఱికాఁడై నిగనిగఁ, గలువలచెలికాఁడు పుట్టెఁ గలశపయోధిన్. హర. ౬. ౭౯.

క. గుఱికాఁడు రాక మన మీ,తరుణీభూసురులఁ బట్టఁ దగ దని చుట్టుం,బురిగొనుచుండిరి యాతల,వరు లంతట నదియు నతనివాంఛలు దీర్చెన్. శుక. ౨. ౪౯౦.

**గుఱికొండి.** వి. (గుఱి+కొండి) ౧. ఆయుము, జీవస్థానము. (శ. ర.) ౨. గుఱుతునకై కొండివలె కట్టినత్రాడు, మెం.

ద్వి. పెడబొబ్బ లిడునీదు పెడకకైలిడ,కట్టినగుఱి

కొండ్లు కట్టిన ట్లుండ,నే యొల్లఁ ద్రావు దంతి మెసంగుసెలఁగ,కాయలగతి రిత్తకడవలే చిక్కు. అ. మ. క. ౧. ౩౫ పా. ౧౭ పం.

**గుఱికొను.** స. క్రి. (గుఱి+కొను) లక్ష్యముగాఁ జేయు.

చ. తఱి యనులోహకారకుఁ డుదగ్రతఁ బశ్చిమశైలశృంగమున్, గుఱికొని వేలుపుందెరువు గొప్పపిరంగిని జాయమందులోఁ, గొఱలెడు విన్నుమానికపుగుండు ఘటించి యగాదు చేసినన్, దఱచుగఁ గ్రమ్ముక్రొంబొగ లవంగ జగంబునఁ బర్వెఁ జీకటుల్. రసిక. ౪. ౯౫.

**గుఱిచి**=కూరిచి. (√గుఱించు?)

క. మధుమథనుఁ డాక్షణంబున, మధుర గుఱిచి కదలి...హరి. ఉ. ౧. ౧౬౯.

మ. అతఁ డొక్కించుక నవ్వి నన్ గుఱిచి యిట్లాశ్చర్యతాధన్యతా,మతికిం గారణ మేమి ...హరి. ఉ. ౫. ౨౫.

సీ. అజ్ఞానుఁడు తన్ను నర్థితో గుఱిచి యజించుట గోరి సృజించె సురల. హరి. పూ. ౨. ౯౭.

**గుఱిచే(సే)యు.** స. క్రి. (గుఱి+చేయు) ౧. లక్ష్యముచేయు; ఉద్దేశించు.

సీ. గుత్తంపుగుబ్బలు గుఱిచేసి వైచెఁ బయోజకుట్మలముల నొకతె నొకతె. కవిరా. ౪. ౯౫.

గీ. అన్యరాజన్యు గుఱిసేసి యరిగె వాణి. నైష. ౫. ౧౪౬.

౨. దృష్టాంతముగాఁ జేయు.

సీ. నీచందమున నన్ను నెఱయ సేవించిన మద్భక్తలగుదురు మత్పరులకు, గుఱిసేయ నీవ యోగ్యుఁడ వైతివి...భాగ. ౭. ౩౭౯.

౩. లక్ష్యపెట్టు, సరకుగొను.

సీ. ఇది యెంత లేదు నెమ్మది నిట్టివిఘ్నముల్ గుఱిసేసి మనకేలి మఱవ నేల. కళా. ౩. ౨౧౩.

క...నిన్నొక్కయించుకయును గుఱిసే,యక యి

మ్రోయఁ జెనకి తలఁకఁ దఱఁడు పెడమదికిన్. రాఘవ. ౪. ౪౭.

**గుఱిపడు.** అ. క్రి. (గుఱి+పడు) పేరువడు, ప్రసిద్ధి కెక్కు.

ద్వి. కొక్కోకమునఁ జాల గుఱిపడ్డరాతు, చక్కెరఖాణంపుసామ్రాణి పెక్కు. రఘునా. ౧౮ పా. ౧౩ పం.

**గుఱియగు.** అ. క్రి. (గుఱి+అగు) సమర్థుఁడగు.

మ. సరసీజాక్షునికూర్మిభక్తుఁడవు సంసారాబ్ధికిన్నావ యై, దరిఁ జేర్పన్ గుఱి యైనవాఁడు మురవిధ్వంసుండు నిన్ బ్రోవఁడే...కుచేల. ౧. ౫౧.

**గుఱు.** వి.=గుఱ్ఱు. (√గుఱ్ఱు-చూ. గుఱుపెట్టు, మొ)

**గుఱుకు.** వి. పశురోగవిశేషము.

సీ...పశువ్యాధిభేదాభిధ యొప్పుచుండును నుంగిడి యనఁ, జరుక నా గుఱుకు నా ... ఆం. భా. ౨. ౧౨౫. (బ్రౌ. పా. గుఱుక. ముద్రి.)

**గుఱుకొను.** (శ.ర, చి.ని, బ్రౌ.) అ.క్రి. (ఇది క్త్వార్థకముగానే ప్రయోగములందుఁ గనఁబడుచున్నది.) ౧. యత్నించు, పూను.

క...విష మన్నముతో, గుఱుకొని పెట్టించె గాడ్పుకొడుకున కలుకన్. భార.ఆది.౫.౧౭౮.

(గుఱుకొని:-బుద్ధిపూర్వకముగా అని భావము.)

చ. గుఱుకొని నేల వ్రక్కలుగఁ గ్రొచ్చియు మన్నులు మ్రింగియున్ శిలల్, వెదకియు... భా. రా. బాల. ౪౦౯. భార. అశ్వ. ౨. ౧౬౩.

౨. అతిశయించు.

క...నలుగడలఁ బడ నవారితవృష్టుల్, గుఱుకొని కురియఁగఁ బంచెను, మఱియును నయ్యనలుమీఁద మఘువుం డలుకన్. భార. ఆది. ౮. ౨౭౦.

క. పెఱసంజఁ గ్రుంకుగుబ్బలి,చటి జఱజఱ నినుఁడు డిగ్గజాఱుమఁ జనుసా, శటి నఱిముఱి వెగసినజే, గుఱుఘూర్ణి యనంగఁ గెంపు గుఱుకొని పర్వెన్. ద్వా. ౪. ౯౭.

**గుఱుగుఱు.** వి. (గుఱు + గుఱ్ఱు-శ. కుఱుకుఱు త్రళ్.)-పాము-ఊఱలుటయుం దగుననుకరణము.

మ ... ఓదేవ నీ,యఱకా లుద్ధతి రాహుమండలము బ్రహ్మాండమ్ముతో నొత్తినన్, గుఱుగుఱ్ఱుం జెసఁ బంది బిట్టొఱలునగ్గోరాహి నీయంఘ్రికిన్, గిఱుఁజె ప్రైవనవిధంబు నామనములోఁ గీలించిన ట్లయ్యెడున్. నైష. ౮.౧౨౫.

**గుఱుతి(ర్తి)ంచు.** స. క్రి. (√ గుఱుతు) ౧. ఆలోచించు.

సీ...తూమెఁ డిక్షురసమ్మున కన్నివలయుఁ, జేగాను గాడంగఁ జెఱకుదండము లని గుఱుతింపఁగా నూఱుకోల లైనఁ, జాలుఁ బొమ్మను బుద్ధి సంభవించెను...హర. ౧. ౨౦.

౨. ఆనవాలుపట్టు.

(వ్యవ) వాఁడు నన్ను గుర్తించినాఁడు.

**గుఱుతిడు.** స. క్రి. (గుఱుతు+ఇడు.) అపేక్షించు, కోరు.

ద్వి. ఫలములు గుఱుతిడుభక్తుల కెట్టు,లలవడు లింగనిరంతరసుఖము. బస. పు. ౫. ౧౯౯ పం.

**గుఱుతు(ర్తు).** వి. (క. గుఱుతు, గుర్తు.) ౧. ఆనవాలు, చిహ్నము.

క...లెస్సగ గుఱుతులు, కనుఁగొని ... దశా. ౭. ౨. ౯౧.

ఆ... విశ్వనాథదేవుతరుణి, గుఱుతు చెప్పి తన్నుఁ గొలువఁగఁ బుత్తేర,వచ్చినాఁడ నేల వలదె తనకు. భీమ. ౩. ౯.

౨. ప్రసిద్ధి, కీర్తి.

గీ. గుఱుతు గలరాజు మంగయగురవరాజు. పాండు. ౧. ౮౦. (చూ. గుఱుతువడు.)

౩. సాక్షి.

క. ననుఁ జూడ రాఁడ దేమో, యని నిను దూఱి కొను చుందు ననయము నాపై, నెనరు గలం దుకు గుఱుతిదె, కనిపించెను మనము వేడుక లు గనఁ గల్గెన్. సారంగ. ౨. ౬౧.

౪. పరిమితి.

సీ. దిక్కెవ్వరును లేనిదీనుల నరలఁ గైకొన్న నీ కరుణకు గుఱుతు గలదె. నృసిం. ౫. ౧౪౨.

గీ. ...కఱకుఁదనమున దుర్భాష లఱచెనేని, విధవ పెనిమిటితోఁ గూడ వివిధనరక, కూపబాధ లఁ బడుఁ గడు గుఱుతు లేక. జై. భా. ౩. ౩౪.

౫. ఆస్పదము, స్థానము.

చ. ...ని, క్కెలుకపడన్ మృగేంద్రునకు నింపుగఁ జెప్పి తదీయభక్తికిన్, గుఱుతుగ నిన్నుఁ జేసి... నా. పంచ. ౧. ౩౬౮.

క. విను మేఁకగొఱియలు మొదవు, లెనుములు తురగములు గజము లిం దొకటియు రెం, డును మూఁడును నేనును నా, లును నేడును నుం డునది గుఱుతు నీ కుండన్. మార్కం. ౪. ౮౪. (చూ. ౮౩, ౮౫.)

౬. విధము.

వ. ...కొందఱు దొమ్మరులగుఱుతున నహహో యని బరితీఁగెలవెంబడి నెగఁబ్రాఁకువారును... ప్రబంధ. ౭౮౮. (‘బడితీఁగె’ ముద్రి.)

౭. లక్ష్యము, లెక్క, సరకు.

ఉ. ఈ విటు రమ్ము పొమ్మనుటయే గుఱుతింతియ కాక మాకు నీ, యీవు లదేమి గుర్తు విడెమే పదిలచ్చలు... వైజ. ౨. ౮౬.

క. ...ముది మది వెసఁదప్పి కోపమున నాడిన నీ, పది రొఱుక చేసికొని యఱు, గుదువా నేఁ గాక యామె గుఱుతా నీకున్. వైజ. ౪. ౫౩.

౮. కళంకము, మచ్చ.

గీ. ...గుతి మచ్చ మచ్చము గుఱుతు చిన్నె, లక్క వం బనఁగఁ గళంకు... సం. భా. ౧. ౮౦.

గుఱుతగు=ఘనమగు.

ద్వి. గుఱుతైన సెలయేటిఘుమఘుమధ్వనుల, నుఱుము లటంచుఁ బెల్లుబ్బి... నెమలి, పారిఁ బోరి నాడెడు...రం. రా. అయో. ౧౩౫ పా. ౨౬ పం.

గుఱుతుగ (గా)=౧. స్పష్టముగా.

ద్వి. నెఱతనంబును గల్గు నేర్పరి యనుచు, గుఱుతుగ నలపరాంకుశముఖ్యమునులు, పలికినది వ్యప్రబంధరత్నముల, వలన నిచ్చలు విని... ద్వి. పరమ. ౩. ౨౩౭ పా.

౨. నిజముగా.

చ. గుఱుతుగ స్త్రీలకున్ మగలకున్ మది నిల్కడ లెందు లేవు నీ, వెఱుఁగనినీతియుం గలదె యేటికిఁ దత్తఱపాటు...సారంగ. ౨. ౧౪.

౩. శ్రద్ధతో, బాగుగా.

క. గుఱుతుగ విని యభిమన్యుని, వరతనయుఁడు శకునిఁ జూచి వాంఛలు నిగుడన్, బరికింపఁ గనె ట్లయ్యెడుఁ, దరువాతిమహాకథావిధా నం బనినన్. కుచేల. ౧. ౧౨౨.

జ: గుఱుతించు, గుఱుతిడు, గుఱుతుపడు, గుఱుతుపెట్టు, గుఱుతుమాట, గుఱుతెఱుఁగు.

**గుఱుతుపడు.** అ. క్రి. (గుఱుతు+పడు) ౧. తెలియు, విదితమగు,

ఆ. పర్వతవనవాసిపరిణామవర్తన, కూపవాని కట్టు గుఱుతుపడును, బ్రహ్మనిష్ఠవెంటఁ బ్రాకృతుఁ డరుగునా... వేమన. ౧. ౧౫౩.

**గుఱుతు (ర్తు) పెట్టు.** స. క్రి. (గుఱుతు+పెట్టు.) చిహ్నితము చేయు.

(వ్యావ) పుస్తకములోఁ జదువ వలసినభాగములు గుర్తుపెట్టుము.

**గుఱుతుమాట.** వి. (గుఱుతు + మాట)- ప్రసిద్ధి గలమాట-లోకోక్తి, నానుడి.

గీ. ఎఱుక పిడికెఁడుధన మన్నగుఱుతుమాట, త

ధ్య మా గాద యొండై వఁ దానవేంద్ర.కుచే ల. ౧. ౪౬.

**గుబు తెలుఁగు.** స. క్రి. (గుబురు + ఎఱుఁగు) ఆనవాలుపట్టు, తెలిసికొను.

ఆ. అట్టియెడను బచ్చపట్టుదట్టీచేత, నొప్పుతనదు ప్రియుని నుజ్జ్వలంపు, కీవి సెఱపుచంద్రకా విదట్టీచేతఁ, బరుని గుబు తెలెంగె సురవధూటి. కళా. ౩. ౨౬౭.

క...తుములమునను గుబు తెలుఁగక డా, సివనీ పెనిమిటిఁ దునిమితి, వెనుక సెటేఁగి పొక్కి పడితి వెలఁదిరో యచటన్. ఉ.రా.౪.౧౦౪.

**గుబుపె(వె,ర్పె,ర్వె)ట్టు.** అ. క్రి. (గుబు + పెట్టు.) గుఱకపెట్టు.

సీ. బెట్టుగఁ బలుమాఱు నిట్టూర్పులిమ్ముచు ఛీకరంబుగ గుబుపెట్టుకొనుచు...గీ... బ్రాహ్మణి నుప్పిఁ బొందె. హరిశ్చ. ౫. ౫౫.

మ...అజాండు...కీల్దలగడై యుండంగ నిద్రించుచున్, గుబువెట్టం దొడఁగెన్ గల ల్గనుచు నిర్ఘోషంబుతో భూవరా. భాగ.౮.౭౦౩.

శా...కాలుం గేలు సెఱుంగకున్న కరణిం గన్మోడ్చి గుర్వెట్టుచున్...భాగ. ౧౦ పూ. ౨౧౫. అచ్చ. రా. యు. ౨౨౫.

వి. గుఱక, సుప్తరవము.

సీ. గుఱక యనంగను గుబుపెట్టనంగను శోభిలుచుండును సుప్తరవము. ఆం. భా. ౧. ౧౪౨.

**గుబుపొడుచు.** అ. క్రి. (గుబు + పొడుచు) గుఱకపెట్టు.

సీ. లంక సొచ్చితి మంచు హుంకారములు సెల్లఁ గలవరించుచు బిట్టు తెలియువారు,వీచులతాఁకున నేచునర్ణవరవ మడఁగిపోవఁగ గుబుపొడుచువారు. భా. రా. యు. ౨౬౬.

**గుబుము.** వి. బీజము, గింజ. (శ. ర-గుబుమ. చివి.)

క. జీవుఁడు శుక్లచ్ఛాయా,భావితుఁ డైనపుడు విష్ణు భావించుటకున్, దా వెరవరి యగుఁ దద్దత,భావ మొసఁగు గుబుము లేనిపం డగుసెలవున్. భార. శాం. ౫. ౪౨౧. (గుబుము ముద్రి.)

సీ. కొందఱు పండులఁ గొటికి కొందఱు గన్న గుబుముల గువ్వల తెఱఁగు దోఁచ,నప్పటి కప్పటి కానవంబున నైచికొని...భార. అను.౫. ౨౮.

**గుత్తపుఁజెక్క.** వి. (గుత్తము + చుక్క) అశ్వినీనక్షత్రము. (శ. ర.)

**గుత్తపుఁదోఁకలు.** వి. బ. (గుత్తము + తోఁకలు) ధాన్యవిశేషము. ప్రబంధ. ౧౧౨.

**గుత్తపుబీఁట.** వి. (గుత్తము + పీఁట) ద్వారబంధమునొద నుంచెడుగుత్తపుమాతికొయ్య. (శ. ర.)

**గుత్తపుఁబెరజె.** వి. (గుత్తము + పెరజు) ఒకానొక జాతిసర్పము.

సీ...చిల్వగుదియలు ద్రాఁచులు పెరజులు గుత్తపుఁబెరజు లచటఁ, గలవు...ద్వా. ౮. ౯౭.

**గుత్తపుసారము.** వి. (గుత్తము+సారము) సప్తస్వరములలో నొకటి, ధైవతము. (శ. ర.)

**గుత్తము=గుఱ్ఱము.** వి. అశ్వము.

సీ. కళ్యాలఁ బదిలంబు గానిగుత్తంబులఁ గ్రొత్తముట్టున కియ్యకొలుపువెరవు. భార. విరా. ౧. ౯౫.

గీ...ఎంచి చూడ, లక్షగుత్తంబు గాద బలంబు మనకు. కృష్ణ. ౩. ౨౪.

చూపుగుత్తము=చూపులకు మాత్రమే గుత్తమువలె కనఁబడి పనికి ఉపయోగింపనివాఁడు.

ద్వి. ఒకవిచారము మాకు నొదవె నీరాజా, నుకవాసి పనిపంద చూపుగుత్తంబు. ద్వి. హరిశ్చ. ఉ. ౧౪౯౬ పం.

... సెమరునకు రానిచదువు, స్మృతికి

రాని చదువు. (వా- గుఱ్ఱములు నెమరువేయుజంతువులలోనివి కావు.)

జ: గుఱము, గుఱాలగోచ, గుఱ్ఱపుజాక్కి, గుఱ్ఱపుడేకలు, గుఱ్ఱపుబీట, గుఱ్ఱపుబెరజు, గుఱ్ఱపుసారము, గుఱ్ఱమెక్కుడు.

**గుఱ్ఱమెక్కుడు.** వి. (గుఱ్ఱము+ఎక్కుడు) బాల్యక్రీడావిశేషము.

సీ. గచ్చకాయలు కిఱ్ఱుగానుఁగ త్రిప్పుళ్లు గుఱ్ఱమెక్కుడు మంటిగూండ్లు...హంస. ౩. ౧౮౬.

**గుఱ్ఱు.** వి. ౧. కోపించుటయందగు ననుకరణము.

చ. కదిసిన నోరవోయి యొరుకబ్బపుసొంతులసత్పదార్థముల్, గదుకుచు నెట్టివారిఁ బొడగన్నను గుఱ్ఱని స్నేహసౌఖ్యముల్, మదికి నసహ్యమై శునకమార్గమునం జరియించుచున్నదుష్పదకవులెల్ల...వాసిష్ఠ. ౧. ౭.

౨. నిద్రాధ్వని, గుఱక.

ఉదా: నేను గుఱ్ఱు పెట్టి నిద్రపోవుదును. శ్లేష్మతత్త్వము గలవారలకు నిద్రలో గుఱ్ఱు ఎక్కువ.

జ: గుఱు, గుఱుగుఱ్ఱు, గుఱుపెట్టు, గుఱుపొడుచు, గుఱ్ఱుగుఱ్ఱు.

**గుఱ్ఱుగుఱ్ఱు.** వి. ('గుఱ్ఱు'నకు ఆమ్రేడితరూపము) ౧. దగ్గునపుడు వచ్చెడిధ్వని కనుకరణము.

సీ. గుఱ్ఱుగుఱ్ఱని కొళ్లుకొళ్లున దగ్గుచోఁ దవిలినచెవులు చిందఱ్లువోవ. విప్ర. ౪. ౧౯.

౨. మూలుగుటయందగుధ్వని కనుకరణము.

వ...గుఱ్ఱుగుఱ్ఱున మూల్గుచు... ప్రబంధ. ౭౨౨.

**గుల.** సం. వి. ఆ. స్త్రీ. స్నుహి ?.

**గుల.** వి. దురద, గులగుల. (బ్రా, వా.)

**గులక.** వి. ఒకవిధమైనఱాయి, గులకఱాయి.

ఉదా: సన్నగులకభూమి. గులకరేగడభూమి. (బ్రా.)

**గులకరములు.** వి. బ. పొలకలు. (చూ. గులకరములుగొను.)

జ: గులకరములుగొను, గులకరించు¹.

**గులకరములుగొను.** అ. క్రి. (గులకరములు+కొను) మొలకలెత్తు, గులకరించు.

వ...నునుఁజెమటం దడంబడి పులకరములు గులకరములుగొన హృదయానందకందం బగుకందుకంబు కరారవిందంబునం దమర్చి ... అనంతవిభ్రమంబుల జగన్మోహిని యై విహరించుచున్న సమయంబున...భాగ. ౮. ౩౯౬.

**గులకరించు¹.** అ. క్రి. ధ్వనిచేయు, శబ్దించు.

సీ. సరసిజద్వయముపై మొరయుతుమ్మెదపిండువలెఁ గాళ్లగజ్జెలు గులకరింప.వరాహ.౪.౧౨౭.

గీ...అందియలు గులకరింపఁ గొంతదవ్వరిగి యరిగె. వరాహ. ౩. ౧౨౬. గంధ. ౧౭౬.

జ: గులకరింత.

**గులకరించు².** అ. క్రి. అంకురించు; వ్యాపించు; వెలువడు, నిర్గమించు.

వ...మేనం బులకలు గులకరింప...సురా. ౯౬. (బ్రా. పా.)

గీ. మొలకనగవులు మొగమున గులకరింప.చంద్రా. ౩. ౯౨.

సీ. ఆణిముత్తెపుసరు లల్లనఁ జలియింపఁ గుండలంబులకాంతి గులకరింప. మల్లుపు. ౩. ౬.

సీ. మునుఁగువెట్టిన నేమి ముత్యాలకమ్మలక్రొమ్మించులీలలు గులకరించె. క్రీడా. ౯౫.

స. క్రి. వెలార్చు, బయలుపఱుచు.

వ...నిజాననాంభోజభాజనంబులం బట్టినమైరేయంబు మగలకుఁ ద్రావించునెడ వారు వాసనార్పితసహకారపల్లవం బని చక్కెరమోవి చుఱుక్కున నొక్కినఁ...కమనీయసీత్కారకంఠనాదభేదంబులం గులకరించుచుఁ...వసు. ౪. ౨౩.

**గులకరింత.** వి. (√గులకరించు¹) క్షుద్రజలజంతువిశేషము. హంస. ౪. ౧౭౬.

**గులగుల¹.** వి. ౧. ఎలుఁగుబంటి పుట్ట కోరాడుట యందగు ననుకరణము.

వ... చీమకున్ జెదలునకు నెలుంగులు గులగులన్ బుట్టలు నిశితనిజనఖరకులిశకోటుల న్గోరాడ ...మనుచ. ౪. ౩౭.

౨. పక్షులకూఁత కనుకరణము.

క. కలవింకకలకలాకుల, వలభీగర్భములు సౌధవాటములు పురంబులయందుఁ దుహినవేళలఁ, జలి గులగులఁ గూయఁ జట్టిచందం బొందెన్. శివరా. ౪. ౨౧.

వ... బిడ్డలారా యేలాగున నతితృష్ణాపిపాసాకులంబులై కులాయకులాలంబులం గులగులం గూసెదరని విలాపంబు సేయుచు... నైష. ౧. ౧౦౮.

౩. దురద. (శ. ర, బ్రౌ.)

**గులగుల[2].** వి. చూర్ణము.

చ. వెలఁదినిఁ జూపు మంచుఁ దొలివేలుపురాయనియెమ్ము లొక్కటన్, గులగులగా నడంతునో... అచ్చ. రా. సుం. ౨౨.

(ఖ.) ముక్కముక్కలు.

స్రగ్ధర. గ్రుద్దున్ గోత్రాచలంబుల్ గులగుల లయి పో గోతముల్ గ్రుద్దులీలన్. మనుచ. ౪. ౮.

వ... మిట్టకోలల గులగులలై నకిరీటంబులనుండి రాలినవజ్రమౌక్తికరజోగణంబుచవి మరగి మూలుగకుండ నుప్పుఁగండలు పెట్టఁ జూచుపిశాచమందగామినులక్రందును... కాశీ. ౨. ౬౨.

వ... గులగులలై పడుకిరీటంబులును డొల్లుతలలును... భా. రా. యు. ౧౯౬౬.

**గులగులయగు, గులగులలగు**=శిథిలమగు, నలఁగినదగు.

చ... గులగులయయ్యె గబ్బినుగుబ్బలు ముద్దుమొగంబు వాడెఁ గం, దలిరుకటారివానిబెడిదంపుదురంబు విభుం డొనర్పఁగన్. శుక. ౧. ౨౧౫.

క. అని శ్రీపతి యానతియిచ్చిన మందల విడిచె నతని సిద్ధవిభుఁడు వాఁడును...

వగలిననై విదిలించుకొనుచు లేచెఁ గిదుకుచున్. పాండు. ౪. ౨౯౭.

సీ. కూర్మాధిపునివెన్ను గులగులల్గా బిట్టు మట్టుదుమే మాటమాత్రలోన. రాజ. చ. ౨. ౫౭.

**గులప.** వి. అశ్వపాలకుఁడు.

సీ. గుల్లా మన గుఱ్ఱాలగో చనఁగా గులప యనంగఁ దగు నశ్వపాలకుండు. ఆం. భా. ౨. ౨౦౪.

**గులము.** సం= గుడము.

**గులాబి.** వి. (హిం. గులాబ్) పుష్పవిశేషము. (శ. ర)

**గులాము.** వి. (హిం. ఘులామ్. క. గులామ. తు. గులామె.) ౧. దాసుఁడు, బానిస; దాసి.

క. ఇత్తడి పుత్తడి యగునే, తొత్తుది నగ లెన్నియిడిన దొరసా నగునే, యుత్తమకులుఁడవునా గా, లత్తుకు సరి చేరినను గులాము గులామే. (అడిదమునూరనచాటువు.)

౨. బిచ్చము.

గీ. ధాన్యముష్టి గులామెత్తి దాన నిత్య, మేకతంబునఁ దా స్వయంపాక మాచ, రించి సాపాటుఁ జేయుదు నంచు నతని, మొఱఁగి తనయింటి కేఁగి ముష్టులు భుజించు. వైజ. ౨. ౧౨౨.

చ. లలనరొ యొందు నీ విఁక గులామునకున్ జన పద్దు... వైజ. ౨. ౧౨౮.

విణ. హీనుఁడు.

సీ. చెల్లుసెల్లముల కీక్షింప నిచ్చినసొమ్ము మగుడ నీలేనికొమటిగులాము. వేం. పంచ. ౧. ౭౬౩.

సీ. మానాభిమానముల్ మాని ప్రవర్తించుమంకు గులాములు మంత్రులైరి. వేణు. ౩౫.

**గులి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ఉండ, మాత్ర; గోలీ, బాలు రాడుకొను చిన్నఱాతియుండ. ౨. రోగభేదము.

**గులికము.** సం. వి. అ. పుం. పిచ్చిక. (విల్యమ్సు.)

గులిబి=గులిమి. ఆం. భా. ౧. ౧౩౪.

గులిమి=గుబిలి², గులిబి. వి. కర్ణమలము, పింజూష ము.

సీ... కర్ణమలనామ మెువ్వను గులిబి నా గుబిలి నా గులిమి యనఁగ. ఆం. భా. ౨. ౧౩౪.

జ: గులిమికదురు.

**గులిమికదురు.** వి. (గులిమి + కదురు) గులిమి తీసి కొనెడుకదురు, గులిమితెడ్డు. (శ. ర.)

**గుల్ఫము.** సం. వి. అ. పుం. చీలమండ.

**గుల్మకేతువు.** సం. వి. ఉ. పుం. అమ్లవేతసము, పుల్లప్రబ్బలికి.

**గుల్మము.** సం. వి. అ. పుం. న. ౧. బోదె లేనితీఁగ, తుప్ప, మొ. ౨. పొద, గుల్మిని. ౩. ప్లీహము, ఎడమపార్శ్వమున నుండుపచ్చనిమాంసఖండము. (వై. ని.) ౪. ప్లీహము పెద్ద దగురోగము. (వై. ని.) ౫. తొమ్మిది రథములును తొమ్మిది యేనుఁగులును ఇరువదేడు గుఱ్ఱములును నలువదేవురు కాల్వురును గలసేన. ౬. సైన్యరక్షణము. (మే.ని) ౭. గ్రామరక్షకభటస్థానము, పల్లెయందలితాణా. (ఆ. ని.)

**గుల్మమూలము.** సం. వి. అ. న. అల్లముకి.(వాచ)

**గుల్మి.** సం. విశే. (న్. నీ. న్) గుల్మరోగము గలవాఁడు.వి. ఈ. స్త్రీ. ౧. ఆమలకి, ఉసిరికకి. ౨. లవలి, ఒకానొకతీఁగ. ౩. ఏలకి కి. ౪.గుడారము, డేరా.

**గుల్మిని.** సం. వి. ఈ. స్త్రీ. ఉలపము, పొద.

**గుల్యము.** సం. విశే. (అ. ఆ.అ) మధురము, తియ్యనిది.

**గుల్ల.** వి. (సం. క్షుల్లకః) ౧.జలజంతువిశేషము,క్షుద్రశంఖము.

గీ. క్షుద్రశంఖము దనరారు గుల్ల యనఁగ. ఆం భా. ౧. ౧౬౧.

సీ...ఉలుచలఁ జిలుకగుల్లల నములుచు...గీ.తన రుబకపంక్తులకు...ఆము. ౨. ౫౩.

౨. చింతపండు మొదలగువానిమీఁద నాచ్ఛాదకముగా నుండి కోశమువలె బోలుగా నుండుపదార్థము (ఉదా: చింతగుల్ల, మొ.)

గీ...అన్నిశాచరుని నొడిసి, కాలు వట్టి మీఁదికెత్తి నేలతోడ, నొడలు గుల్లలత్తిగా నుదికి చంపె. భా. రా. యు. ౬౮౦. ప్రబోధ. ౫. ౯౯.

౩. బొబ్బ, పొక్కు. (శ. ర.)

౪. కప్పచిప్ప, శంబూక. (శ. ర.)

విశే. ౧. అల్పము.

క. ఇల్లాలు మెలఁగకున్నను, గుల్లా సౌఖ్యంబు పతికిఁ గొండం తైనన్, ఇల్లాలు మెలఁగుచున్నను, గొల్లా సౌఖ్యంబు పతికి గోరం తైనన్. శేష. ౧. ౧౩౯.

౨. బోలు, గట్టిది కానిది.

ఉదా: గుల్లకంటె, గుల్లముఱుగులు.

పెనుగుల్ల=శంఖము.

సీ. పునుకయుం బెనుగుల్లయును గేలుదమ్ముల నంచలమాడ్కిఁ బాటించువాఁడు. గీ...ముక్కంటియును వెన్నుఁడును ననంగఁ, బొల్చునావేల్పుకబ్బంబుఁ బ్రోచుఁ గాత.ద్వా.౧.౪౦.

జ: గుల్లకాఁడు, గుల్లకావి, గుల్లకాసు,గల్లసేఁత, గుల్లపడు, గుల్లపుఱచు.

**గుల్లకాఁడు.** విశే. (గుల్ల + కాఁడు)-అంతస్సారము లేనివాఁడు - ఏమియు లేనివాఁడు, అకించనుఁడు.

'గుల్లకాఁడై మనయింటిగుఱుతు లడుగ వచ్చెని' క్షేత్రయ. (శ. ర.)

**గుల్లకావి.** వి. (గుల్ల+కావి.) కొంచెము నీలపుడాలు గల ఎఱుపు. (చి. ని.)

సీ. నిజకటీతటిఁ జెక్కు నీలంపుఁబిడిబాఁకు కనకశాటిక గుల్లకావి గట్టి. బహు. ౪. ౧౩౧.

సీ.తనతనూరుచిపైనిఁ దగ నుల్లసిలుగుల్లకావి నాఁ
గనకాంశుకంబు దనర. రా. వి. ౧. ౧౫.

**గుల్లకాసు.** వి. (√ గుల్ల.) ౧. బోలుగాఁ జేసినకాసు. (వా) ౨. అల్పమైననాణెము, వెల తక్కువ నాణెము.

ఆ... వెంట గుల్లకాసురు రాదు. వేమన.౧.౧౫౦.

సీ. ఆటమటించినఁ బట్టెఁడంత సాదము గాక
కాదేని యొకగుల్లకాసు గాక...గీ ... ఈగి
న్నె మమ్ము, పంటివారలు గొన నెంతవారల
య్యా. విప్ర. ౫. ౧౯.

**గుల్లనేఁత.** వి. ( √ గుల్ల.) పలుచగా నేసిననేఁత, బాగుగా గట్టన లేనినేఁత. (వా.)

**గుల్లపడు.** అ. క్రి. (గుల్ల+పడు) అవమానపడు. (చూ. గుల్లపఱచు.)

**గుల్లపఱ(ఱు)చు.** స. క్రి. (√గుల్లపడు) అవమానపఱుచు.

ద్వి. నిను నేఁడు ముఖమున నెత్తురు ప్రామి,కొని
గుల్లపఱుపక కొలికికి రావు. ద్వి.హరిశ్చ.ఉ.
౧౬౯ పం.

**గుల్లాము.** వి. ౧. అశ్వపాలకుఁడు.

సీ. గుల్లా మన గుఱ్ఱాలగో చనఁగా గులప యనం
గఁ దగు నశ్వపాలకుండు. ఆం. భా. ౨. ౨౦౮.

౨. (=గులాము) దాసుఁడు.

ఆ. కూలి నాలి చేసి గుల్లాముపనిఁ జేసి, తెచ్చి
పెట్ట నాలు మెచ్చ నేర్చు. వేమన. ౧. ౬౩.

**గుళి(లి)క.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఉండ; మాత్ర; గోలీ.౨. క్రీడాకందుకము, ఆటబంతి. ౩. ముత్తెము. (విల్యమ్సు)

**గుళిగ.** వి. (సం. గుళికా) ఘుటిక, ఉండ.

క. గుళిగ లోనరించి నీడం, గిలగిలఁగ నార్చి
నారికేళపుబుఱ్ఱం, జెలు వొంద దాఁచి మే
హం,బుల ననుపానముల నీయఁ బోవుక...
చికి. ౨. (చి. ని.)

**గుళుంఛము.** సం.=గుసుచ్ఛము. (కల్ప)

**గుళుచ్ఛము.** సం. వి. అ. పుం. గుచ్ఛము, పుష్పులు లోనగువానిగుత్తి.

**గుళ్లు.** వి. బ. కుంటనగుడి యనుబాలక్రీడావిశేషము.

సీ. కుప్పిగంతులు పిడిగ్రుద్దులాటలు పిల్లదీవులు
గొబ్బిళ్లు గూవనాలు.గీ.గుళ్లు దాఁగిలిమ్రుచ్చ
లు గోడిపట్టె,లు...వి. పు. ౭. ౨౦౩.

**గువాకము.** సం. వి. అ. పుం. పోఁకచెట్టు.

**గువ్వ.** వి. ౧. కపోతభేదము, అడవిపావురము. (శ. ర.-దీని భేదములు :- కుకుకుటగువ్వ, పొడగువ్వ, పచ్చగువ్వ, చిటిగువ్వ,రాగువ్వ,ఎలుబొంతగువ్వ. బ్రౌ) హంస. ౩. ౧౩.

౨. పక్షి, పిట్ట.

సీ. పిట్ట పక్కి పులుఁగు జిట్ట గువ్వ యనంగఁ బ
క్షి సామాన్యమై పరఁగుచుండు. ఆం. భా. ౨.
౯౬.

జ: గువ్వకరి, గువ్వకరిగొను, గువ్వకుత్తుక, గువ్వకుత్తుకపడు, గువ్వకోలుకొను, గువ్వగుత్తి, గువ్వగుత్తుక, గువ్వరాయి.

**గువ్వకరి.** వి. (గువ్వ+కరి) విజృంభణము.

మ. తరుణి యొకర్తు పాదమునఁ దన్నినఁ గ్రొన్న
నగుంపునుజ్జిగిన్, మెఱసి యశోకభూజము
విమిశ్రితతత్పదయావకద్రవ,స్ఫురణమె చూ
పఁ దోడివిరిబోణులకుం బువు లంచుఁ దల్పె
ని,ర్భరగతి వ్రాలునమ్మధుకరమ్ములు గువ్వకరిన్
నటింపఁగన్. భోజసుతా. ౩. ౨౬.

**గువ్వకరిగొను.** అ. క్రి. (గువ్వకరి + కొను.) విజృంభించు, రేఁగు.

సీ. పిడికెఁడుపూరికై బెడిదంపుసాహసం బెట్టు
చేసితి వని తిట్టువారు. గీ. నై దిసంతులు గొ
ట్టుచు నమ్మునింద్రు, గువ్వకరిగొని కడు పెల్లఁ
బెరుఁగుచు...వరాహ. ౧౦. ౮౧.

ద్వి. కలయఁ జారులు గువ్వకరిగొని దూఱఁ, దల వంచుకొని పీకు దడయక విడలి. ద్వి.హరిశ్చ. పూ. ౧౬౮౫ పం.

క. అచ్ఛోటితీర్థవాసులు, వచ్చి తగుసె నీకుఁ బ్ర్యావాహిని నిటు వా,క్రచ్చితి వని పడి నం దఱు, గచ్చ కదలినట్లు గువ్వకరిగొని లిట్టర్. జై. భా. ౮. ౭౨.

**గువ్వకుత్తుక.** వి. (గువ్వ+కుత్తుక.) ఆఁకలిచేత క లుగుహీనస్వరము.

క. మితి గడచిన ఋణదాతలు, వెతనెట్టఁగ నూ రు వొరక వెలి వెలిఁ దిరుగుర్, దతిఁ గూడు లేక యాఁకటఁ, గుతిలపడు వతండు గువ్వకు త్తుకతోడర్. పాండు. 3. ౨౦.

**గువ్వకుత్తుకపడు.** అ. క్రి. (గువ్వకుత్తుక + పడు) -ఆఁకలిచేత హీనస్వరము గలవాఁ డగు-కృశించు.

ద్వి. సెవ్వగఁ గుందుము నీరసాన్నములఁ, గ్రొవ్వి బల్తురె గువ్వకుత్తుకపడక. ద్వి. హరిశ్చ. ఉ. ౧౨౭౦ పం.

**గువ్వకోలుకొ(ల్కొ)ను=**గువ్వకరిగొను.

గీ. కడుపు చుమ్మలుచుట్టఁగాఁ గన్నకన్నె,చిలుక పెడఁబాసి యేరీతి నిలుచువాఁడ, నెక్కుడివి వేక మన మంత్రు లెల్లఁ గదిసి, కువలయేంద్రు నితో గువ్వకోలుగొనుచు.

గీ. మాను మీమోహ మని తెల్పి ... శుక. ౧. ౩౭౨, ౩౭౮.

గీ. గొంట పనియెఁ దిలోత్తమ గూర్తిఁ గొనరె, ధాన్యమాలిని పుంజికస్థల యదల్చె, దివిజకా మిను లీరీతిఁ దిరుగువాతి, గువ్వకోల్కొం చుఁ దమలోన నవ్వుకొంచు. మనుచ. ౩. ౧౦౯. శుక. ౨. ౧౦౯.

**గువ్వగుత్తి(క).** వి. (√గువ్వ) కపోతాంఘ్రి ?.

సీ. గువ్వగుత్తిక యన గువ్వగుత్తి యనంగఁ జనుఁ గపోతాంఘ్రి...ఆం. భా. ౨. ౬౫. (బ్రా. పా.) హంస. ౮. ౧౦.

**గువ్వగుత్తుక.** వి.(గువ్వ + గుత్తుక)కపోతాంఘ్రి ?. (శ. ర.)

**గువ్వరాయి.** వి. (గువ్వ+ రాయి) మొరపరాయి. (బ్రౌ)

**గుసగుస.** వి. ౧. రహస్యపుమాటలచప్పుడు (శ.ర.) ౨. సల్లాపము; గుసగుసధ్వనితోఁగూడినరహస్య పుమాట.

సీ...గుసగుస ముచ్చట యన,సల్లాపసంజ్ఞయై యుల్లసిల్లుచు నుండు...ఆం. భా. ౧. ౧౧౭.

గీ. చేరి చెవిలోన గుసగుస లెప్పినట్లు,మోహము న వాని చెక్కిట మోముఁ జేర్చు. శశాం. ౨. ౭౭.

జ: గుసగుసలఁబోవు, గుసగుసలాడు.

**గుసగుసలఁబోవు, గుసగుసలువోవు=**గుసగుస లాడు. (√గుసగుసలు)

వ...విన్న మనము విన్నది నిజంబై తోఁచుచున్న ది చూడుఁడు చూడుం డని గుసగుసలంబో వువారును...ఉ. రా. ౬. ౩౮౩.

క. పొసఁగ దది యనుచు మంత్రులు, గుసగుసలం బోవ రాజసంజయుఁ డొడర్. శుక. ౧. ౩౧౯. విజ. వి. ౩. ౩౭.

సీ. అపుడు వచ్చినవార లాఁ జెలి యెవతె యీ కొమ్మ యంచును గుసగుసలువోవ. కువల. ౨. ౨౯.

**గుసగుసలాడు=**గుసగుసలఁబోవు. అ. క్రి.(గుసగు సలు + ఆడు.) ౧. రహస్యముగా మాటలాడు.

(వ్యవ) వా రిద్దఱు గదిలో గుసగుసలాడుచున్నా రు.

వ...మాటిమాటికిఁ గొరవివిరిగుత్తి పై వ్రాలి యొగ యుభసలపంక్తిఁ గొమ్మ పుష్పమంజరులు గ్రా

యయు ముసలం బని గుసగుసలాడుము... రా. వి. ౩. ౧౧౪.

చ. ముసిముసినవ్వు మోమునను ముచ్చటలాడ స
వంది మ్రోఁతతో, గుసగుసలాడ నంచగమి గూ
డఁ జనెఁగా జెలి శౌరిమ్రోలకున్. ముకుంద. ౩. ౨౪౩.

**గుహ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కొండయందలిబిలము. ౨. దాఁగుట. ౩. పల్లము. ౪. హృదయము. ౫. బుద్ధి, మనీష. ౬. ముయ్యాముహాన్న ?.

**గుహాము.** సం. వి. అ. పుం. గుఱ్ఱము.

**గుహాషష్ఠి.** సం. వి. ఈ. స్త్రీ-కుమారస్వామి జన్మించినషష్ఠి-మార్గశీర్ష శుక్లపక్షషష్ఠీతిథి, కుమారషష్ఠి.

**గుహాశయము.** సం. విణ. ( అ. ఆ. అ ) గుహయందు శయనించునది. వి. అ. పుం. ౧. పరమాత్మ. ౨. సింహము, మొ.

శ్లో. సింహవ్యాఘ్రవృకా ఋక్షతరక్షుద్వీపినస్త
థా, బభ్రుజంబుకమార్జాలా ఇత్యాద్యాస్స్యు
ర్గుహాశయాః. (కల్ప)

**గుహినము.** సం. వి. అ.న. అడవి. (కల్ప.)

**గుహుఁడు.** సం. వి. అ. పుం. ౧. కుమారస్వామి. ౨. ఒకనిషాదరాజు. (రామునికి మిత్త్రుఁడు. శృంగిబేరపురమునకు రాజు.)

**గుహేరుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) రక్షకుఁడు, కాచువాఁడు. వి. అ. పుం. కమ్మరి.

**గుహ్యకుఁడు.** సం. వి. అ. పుం. దేవయోనివిశేషము. (వీరు కుబేరునియనుచరులై యక్షనిధులను రక్షింతురు)

**గుహ్యకేశ్వరుఁడు.** సం. వి. అ. పుం. కుబేరుఁడు.

**గుహ్యదీపకము.** సం. వి. అ. పుం-తాను గనఁబడకుండ వెలుతురిచ్చునది-మిణుఁగురుపురుగు.

**గుహ్యపుష్పము.** సం. వి. అ. పుం-అంతఃకుసుమము, దాఁగినపువ్వులు గలది-అశ్వత్థము, రావి ?.

**గుహ్యము.** సం. విణ. (అ. ఆ. అ) రహస్యమైనది. వి. అ. పుం. ౧. వంచన, దంభము. ౨. తాఁబేలు. న. ౧. ఏకాంతము, రహస్యవిషయము. ౨. మగగుఱి. ౩. ఆఁడుగుఱి.

## గూ

**గూండ్ర**=గుండ్ర[3]. వి. గ్రుడ్లగూబకూఁత. (శ.ర.) జ: గూండ్రించు.

**గూండ్రించు.** అ. క్రి. (√గూండ్ర)-గ్రుడ్లగూబ-కూయు. (శ. ర.)

**గూఁటి.** వి. (సం. ఘృష్టిః) పంది, సూకరము. (శ. ర.)

**గూఁటిగువ్వ.** వి. (గూఁడు + గువ్వ) ఈఁకలు రాల్చినపక్షి.

గీ... గూఁటిగువ్వన నణు జనఁ గుఱు జవంగ, నీఁ
కరాల్చినపక్షి యా నిందుమూఁడి. ఆం. భా. ౨. ౯౭.

**గూఁడు.** వి. దే. (బ. గూండ్లు, గూఁడులు. క. తు. గూడు. త. మ. కూడు) ౧. కులాయము, పక్షిగృహము.

క. తనరెఁ బలిభుక్తతులు నిండినగ్రామశ్రీల కటితి
నీలము లగుటన్, గనియెఁ దృణగ్రాహిత ననఁ,
గొనుకసవులఁ జైత్యతరుల గూండ్లకు భ్రమ
లన్. ఆము. ౪. ౧౩౨.

ఉ. క్రూరవనేభదంతహతకుడ్యపరిచ్యుతవజ్రపం
క్తిఁ బో, ల్పారుమిడుంగురుంబురువు లంచు
వెసన్ గొనిపోయి పొంత శృంగారవనద్రు
మాళి గిజిగాఁడులు గూఁడులఁ జేర్చు దీపి
కల్, గారహిఁ గృష్ణరాయమహికాంతునిశా
త్రవపట్టనంబులన్. మనుచ. ౧. ౩౬.

సీ. ... నెలకొన్న కవపిట్టకివకివల్ మొనపి

నాదబ్రహ్మ మిసుమమికింప. చంద్రా. ౩. ౮౯. ఆం. భా. ౨. ౯౯.

౨. గోడయందు దీపము మొదలగునవి యుంచుట కేర్పఱుపఁబడినగుంట.

గీ. తనగృహంబున గూఁటిలోఁ దలుపుమూలఁ, బిడుకలలో నాయకుఁడు దాఁచి పెట్టినట్టి,మాడ లర్పించి...శుక. ౩. ౧౩౧.

౩. పంజరము.

సీ...గూఁడు, చోటు పంజర మనఁ జను...ఆం. భా. ౨. ౧౬౮.

క. అలనాఁటినన్ను మఱచితే, నిలు నిలుమీ తత్సమయాజ్ఞ నీ కిది యనుచుం, బులుఁగుల తేని మహేంద్రుం, డలుఁగుల పెనుగూఁటఁ జిక్కునట్టుగఁ జేసెన్. పారి. ౫. ౨౭.

౪. ఆకుగుడిసె. (శ. ర.)

౫. సులోచనము, మొ. పెట్టుకొనెడిగొట్టము.

ఉదా: సులోచనముగూఁడు, కత్తులగూఁడు. (బ్రౌ)

లక్కగూఁడు=౧. ఇంటిమూలము మొదలగువాని యందు పురుగులు నివసించుటకు మంటితో ఏర్పఱచుకొనెడిగూఁడు. (ఇది శుభసూచక మని వాడుక.) ౨. కుండలము మొదలగువానిలో రత్నములు స్థాపించుటకు ఏర్పఱిచినగుంట.

చ. తొలుమలచాతితో నొరయుచూరుపుఁదొయ్యలిముత్తియంపుఁగుం, డలమునమానికంబు పడినం గనుపట్టెడులక్కగూఁడు నాఁ,జలువలతేనియస్వాదుపుఁజాయఁ దొఱంగినకందు దోఁచె...పారి. ౨. ౪౫.

వాడుకలోనిప్రయోగవిశేషములు :- బండిగూఁడు గట్టిగా లేదు. కోళ్లగూఁడు. కుఱుపు గూఁడు పోసినది. లెక్కగూఁడు విఱుగఁ దన్నెను.

జ: గూఁటిగువ్వ, గూఁటికానుపు, గూఁడుపుట్టువు, గూఁడుబండి.

గూఁడుకానుపు(న్పు). వి. (గూఁడు+కానుపు) నీడోద్భవము, పక్షి.

దండకము...రాచూలి దానవ్వ డాగూఁడుకాన్పుందొరం గూర్చి డెందంబునన్ నిల్పుకున్...అచ్చ. రా. యు. ౧౬౧, నం. ౫౭.

గూఁడుపుట్టువు=గూఁడుకానుపు. (గూఁడు + పుట్టువు.)

గీ. అట్టు లెడ లేనికడిమిఁ గయ్యం బొనర్చు,జడబ్రతుకుగూఁడుపుట్టువుసామిమీఁద, గినిసి కైదువ కేల నంకించి రక్క,సుండు గాళ్లును తెక్కలుఁ జెండివైచె. అచ్చ. రా. అర. ౭౫.

గూఁడుబండి. వి. (గూఁడు+బండి) గూఁడువలె చాఁప కట్టినబండి. (శ. ర.)

గూటము=గూటాము. వి. (సం. కూటః. క. తు. గూట) ౧. డేరామేకు.

చ.సమముగ మిట్టపల్లములు చక్కఁగఁ జేయుచుఁ జొట్టునీరువా,టుచుఁ గని నాల్గువంకల గుడారము లెత్తిరి జీనిపట్టుపగ్గములు బిగించి గూటములఁ గట్టి సరాతులఁ గూర్చి ముందటం, గొమరగుపైఁడిజీవనికట్టుపచప్పరముల్ చెలంగఁగన్. వాల్మీకి. ౩. ౯౬.

౨. గుంజ. (శ.ర.) ౩. వడ్లవాఁడు మాదిగవాఁడు దూదేకులవాఁడు మొదలగువారు ఉపయోగించెడుపనిముట్టు. (శ. ర, బ్రౌ.)

గూటాము=గూటము. (శ. ర.)

గూటిపఱచు. స. క్రి. కప్పిపుచ్చు.

గీ. ఆకటుకు గూటిపఱచి గయ్యాళితపసి, యెంత ప్రియములు చెప్పిన నియ్యకొనక, చంద్రభానునిపే రన్న సైఁప కట్టు, పక్షపాతంబు మీ

అనుపేక్షసేసె. చంద్ర. ౧. ౧౩౪. (ప్రయోగాంతరము లేదు)

**గూడ.** వి. (క. తు. గూడె. త. మ. కూడై) ౧. పుష్పములు మొదలగునవి యుంచెడిబుట్ట, సజ్జ.

సీ...విరుల,తోమాలెలు... గూడ నునుచు ...ఆము. ౫. ౩౮.

౨. భక్ష్యములు మొదలగునవి పెట్టికొనుబుట్ట.

క...పూరీలు...ఆదిగాఁ గలభక్ష్యంబులు గూడల నించి...హంస. ౧. ౧౦౫.

౩. వానకు తడియకుండ తలపైని వేసికొనెడిగూడ.

మ. వసతు ల్వెల్వడి వానకై గుడిసె మోవక్ రాక తా వానియే,వసగా నిల్చినజమ్ముగూడ... ఆము. ౪. ౧౩౩.

౪. దొప్ప.

చ...ఒకయోగికి భిక్షము తోలుగూడచేఁ, దివిచిన వేఁడిపాయసముఁ దెచ్చి రయంబునఁ బెట్టె...భోజరా. ౩. ౫౫.

౫. పల్లమునుండి మెరకకు నీళ్లు తోఁడెడినదురుగూడ. (వా)

౬. జలసముత్క్షేపపాత్రము, ఓడలో చొచ్చిననీళ్లను తీసివేయుపాత్రము.

గీ...విలసిల్లు గూడ యనఁగ, జలసముత్క్షేపపాత్రంబు చంద్రమౌళి. ఆం. భా. ౧. ౧౫౭.

౭. వైష్ణవులు తిరుమణిపెట్టె మొదలైనవి ఉంచి చంకను తగిలించుకొనెడుతాటాకులబుట్ట, తిరువుగూడ. (శ. ర.) ౮. మత్స్యములను బట్టెడుసాధనవిశేషము. (శ. ర)

చెప్పుగూడ=చెప్పట్టలమీఁద దొప్పవలె నుండుభాగము.

గీ. అనుచు నాల్గుదెసలు నరసి యొద్దియు సమ్మ,కూడకున్నఁ జెప్పుగూడ యొకటి, తెచ్చి దానఁ దిగిచి తిగిచి మూఁకుటఁ బోసి,పెట్టెఁ బాయసంబు భిక్షుకునకు. భోజరా. ౩. ౪౬.

జ: గూడకట్టు, గూడకొంగ, గూడబాతు.

**గూడకట్టు.** వి. (గూడ + కట్టు) కచ్ఛము లేకుండ కట్టినబట్టకట్టు. (శ. ర, వా.)

**గూడకొంగ.** వి. (గూడ + కొంగ) పెద్దకొంగ. (బ్రౌ)

**గూడపాల.** వి. మామెన, శారిబ కి. (శ.ర.)

**గూడబాతు.** వి. (గూడ + బాతు) పెద్దకొంగ. (బ్రౌ-బకవిశేషము. శ. ర.)

సీ...సాళ్వము డేగ గూడబాతుల్లంగి కుందటేల ...ఆది యైనపక్షు లతఁడు దీర్చె. హంస. ౩. ౧౩. ఆం. భా. ౨. ౯౮.

**గూడారము**=గుడారము. (త. కూడారమ్.)

సీ. కోఅలు గుడారము గూడారము గుడారు గూడారనఁగను నాల్గు పటగేహ, నామధేయంబులు...ఆం. భా. ౨. ౧౫౯.

ద్వి. గూడారములు దక్క గ్గొల్లెన ల్వన్ని, వేలముల్గప్పక విడిసె నుత్సుకత. పండితా. పర్వ. ౩౫౦ పా. కు. సం. ౧౧. ౬౦౦.

**గూడారు**=గుడారము. ఆం. భా. ౨. ౧౫౯.

**గూడెము**=గోడెము. వి. బోయపల్లె, పక్కణము; పల్లె.

గీ. గూడె మని గోడె మని యనుకొందు రార్యు, లెల్లఁ బక్కణమునకు బాలేందుమౌళి. ఆం. భా. ౨. ౨౩.

మ. తుటుమై యొక్కటఁ గూడి గూడెపుఁగిరాతుల్ ...వెం. పంచ. ౨. ౧౯౨.

సీ. విన్నక్రొమ్ముడివాఁడు వెండిగుబ్బలిగూడె మేలువాఁ డుడివోనిమేలువాఁడు. అచ్చ. రా. బాల. ౧౩.

ఉదా: గొల్లగూడెము, ఈంద్రగూడెము, మొ.

**గూఢచారి.** సం. విశ. (న్. ఈ. న్) గూఢముగా సంచరించువాఁడు.

**గూఢచారుఁడు.** సం. వి. అ. పుం. చారుఁడు, వేగులవాఁడు.

**గూఢనీడము.** సం. వి. అ. పుం-గూఢ మగుగూఁడు కలది-కాటుకపిట్ట.

**గూఢపథము.** సం. వి. అ. పుం. ౧. రహస్యమార్గము. ౨. అంతఃకరణము.

**గూఢపాత్తు.** సం. వి. త్. పుం=గూఢపాదము.

**గూఢపాదము.** సం. వి. అ. పుం-కానరానికాళ్లు గలది-పాము.

**గూఢపురుషుఁడు.** సం. వి. అ. పుం. చారుఁడు, వేగులవాఁడు.

**గూఢపుష్పకము.** సం. వి. అ. పుం. వకుళము, పొగడచెట్టు.

**గూఢఫలము.** సం. వి. అ. పుం. రేఁగుచెట్టు.

**గూఢమణి.** సం. వి. ఇ. స్త్రీ. బాలికాక్రీడావిశేషము.

శ్లో. రత్నాదిభిర్వాలుకాదౌ గుప్తైర్ద్రష్టవ్యకర్తృభిః, బాలికాభిః కృతా క్రీడా నామ్నా గూఢమణిస్స్మృతా.

**గూఢమార్గము.** సం. వి. అ. పుం. ౧. సొరంగము. ౨. రహస్యమార్గము.

**గూఢము.** సం. విశ. (అ. ఆ. అ) రహస్య మైనది.

**గూఢమైథునము.** సం. వి. అ. పుం-గూఢ మైనమైథునముకలది-కాకి.

**గూఢవర్చస్కము.** సం. వి. అ. పుం- గూఢ మైనపురీషముకలది-కప్ప.

**గూఢవల్లిక.** సం. వి. ఆ. స్త్రీ. అంకోలము, ఊడుగు చెట్టు.

**గూఢసాక్షి.** సం. విశ. (న్. ఈ. న్) గుట్టుసాక్షి, ప్రతివాది చెప్పునది రహస్యముగాఁ బొంచి యుండి వినుటకై ఏర్పఱుపఁబడినసాక్షి.

**గూఢాంగము.** సం. వి. అ. పుం. తాఁబేలు.

**గూఢాంఘ్రి.** సం. వి. ఇ. పుం- కానరానికాళ్లు కలది-పాము.

**గూఢోత్పన్నుఁడు.** సం. వి. అ. పుం. ఒకనిభార్యయందు మఱియొకనికిరహస్యముగాఁబుట్టినకొడుకు. (ఇప్లే: గూఢజుఁడు, మొ.)

**గూఢాత్ముఁడు.** సం. వి. న్. పుం. పరమాత్మ.

**గూథము.** సం. వి. అ. న. విష్ఠ, పురీషము.

**గూద.** వి. (సం. గుదమ్.క.గూద) క్రిందికి దిగినగుదము. (గ్రా)

**గూన.** వి. నతభాండము, లోఁతుకుండ.

సీ... నతభాండసంజ్ఞ గూన యనఁ బరఁగు. ఆం భా. ౨. ౭౮౭.

చ... ఓపుగతి గూనల నూనియ నించి ... ఆము. ౧. ౭౩.

**గూనివాఁడు.** వి. (√గూను) గూను గలవాఁడు.

గీ. గూనివాఁడును బిచ్చుకకుంటు గుజ్జు...భార. అను. ౫. ౧౦౭.

గీ...గూనివాఁ డనంగఁ, బరఁగుఁ గుబ్జుండు... ఆం. భా. ౨. ౧౨౧.

**గూను.** వి. దే. (క. తు. గూను.త.మ. కూన్)వీపు మీఁద వంపుగా నున్న భాగము.

సీ. దురితాత్మురాలు మంథర సహింపఁగ లేక గునుకుపర్వున గూను గునియ నేఁగి.దశా. ౭. ౩.

సీ. బొక్కి-బొమ్మలు లోఁతుపొట్టలు మిడిగ్రుడ్లు గూనివీపులు నిడుఁగ్రొంకి వ్రేళ్లు. ఉ. హరి. ౨. ౧౨౨. కాశీ. ౩. ౧౩౭. ఆం. భా. ౨. ౧౭౮.

ఉ. గూనివాఁడు, గూనుగిలు, గూనువోవు.

**గూనుఁడు.** సం. విణ. (అ. ఆ.అ) విస్మితించినవాఁడు.

**గూనుగిలు(ల్లు).** అ. క్రి. (√గూను) వంగు.

గీ. అతివ దిరుగఁ బ్రదక్షిణం బభవుగుడికిఁ, గుచ భరంబున నరగౌను గూనుగిలఁగ. శివరా. ౨. ౨౧.

ద్వి...తత్కంధరమున, గూనుగిల్లఁగ నెత్తుకోలు గుం డొకటి,గట్టి...నవనాథ. ౫. ౨౩౯పా. ౨ పం.

వ... చరణఘట్టనంబున ... కమటకీటజఠరకమఠ భుజగపరివృఢులు గూనుగిల్లఁబడక...కాశీ. ౬. ౧౭౫. (ఇట 'పడు' స్వార్థమున.)

**గూనువోవు.** అ. క్రి. (గూను+పోవు) గూను కలది యగు.

సీ. అనిశంబు వీఁడు వాఁ డనక యెక్కఁగ వేల్పు టేనుఁగునకు వీపు గూనువోయె. వరాహ. ౧౦. ౧౫.

**గూబ¹.** వి. (సం. ఘూకః. క. గూబె.) ౧. గుడ్లగూబ.

క. ఎలుసంజ దాసనంబుల, తెలఁగయ్యెను గూబ లెల్లదెసలఁ జెలంగక,వఱదు లఱచె నుల్కలు వడె, నెటి చెడి సురగాలి విసరె నిలువక పెలుచక. ఉ. హరి. ౨. ౨౪.

సీ. చీకటితప్పు సేసినసరోరుహనేత్ర గూబ యై పసియించుఁ గోటరమున. కాశీ. ౨. ౯౦.

సీ. ఇరుగింటిదయ్యంబు పొరుగింటికిని గూబ యె దురింటివారల కెదురుమక్క. శుక. ౩. ౨౦. (ఇట గూబవలె అశుభదాయకురా లని భావము.)

గూబజంకెన = గూబబెదరింపువంటి బెదరింపు, వ్యర్థమైన బెదరింపు.

ద్వి. కటకటా వెఱచునె కాలకౌశికుఁడు, కుటిల విచార నీగూబజంకెనల. ద్వి. హరిశ్చ. ఉ. ౭౬౯ పం.

**గూబ².** వి. కర్ణమూలము.

ఆ... అతనిచెవులు గూబ లంటఁ బెఱికె. రామా. ౯. ౧౭౯. ఆం. భా. ౨. ౧౭౪.

**గూబతెడ.** వి. మహాబలి. (దీనిపువ్వులు పసుపుపచ్చగా నుండును-బ్రౌ)

గీ... గూబతెడ నులితెడ, యన మహాబల దనరు వృషాధిరూఢ. ఆం. భా. ౨. ౫౬.

**గూబరి.** వి. మాదిగవాఁడు.

సీ...ఆసాది గోసంగి మాదిగ గూబరి యన, మాతంగుఁ డగు...ఆం. భా. ౨. ౨౯౯.

**గూబు.** వి. అశ్వవిశేషము.

గీ. ఘోటకవిశేష మెసఁగును గూబు నాఁగ ... ఆం. భా. ౨. ౯౯౬. (ప్రమాణాంతరము లేదు.)

**గూరణము.** సం=గురణము.

**గూర్జరము.** సం=గుర్జరము.

**గూర్దము.** సం. వి. అ. పుం. దాఁటు, దుముకు, గంతు. (విల్యమ్సు)

**గూవనాలు.** వి. బ. బాలక్రీడావిశేషము.

సీ. కుప్పిగంతులు పిడి గ్రుద్దులాటలు పిల్లదీవులు గొబ్బిళ్లు గూవనాలు...గీ...ఆదిగా శైశవక్రీడ లాడి రపుడు, రామకృష్ణులు గోపదారకులఁ గూడి. వి. పు. ౭. ౨౦౨.

**గూవాకము.** సం=గువాకము.

**గూషణ.** సం. వి. అ. స్త్రీ. చంద్రకము, నెమలిపురికన్ను.

**గూహనము.** సం. వి. అ. న.గోపనము,దాఁచుట.

## గ్ర

**గ్రంజనము.** సం. వి. అ. పుం. ౧. వెల్లుల్లి. ౨. మధుశిగ్రువు, కారుమునగ. ౩. గంజాయి. ౪. వ.

విషదిగ్ధబాణముచేత చంపఁబడినమృగముయొక్క మాంసము.

గృండివము. సం=గృండీవము.

గృండీవము. సం. వి. అ. పుం. ఒకజాతినక్క.

గృత్సుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు.(కల్ప)

గృధువు. సం. విశే. (ఉ) అభిలషించువాఁడు. వి. ఉ. పుం. కాముఁడు, మన్మథుఁడు.

గృధ్నువు. సం. విశే. (ఉ) లోభి.

గృధ్యము. సం. విశే. (అ. ఆ. అ) కోరఁదగినది. వి. అ. న. ఇచ్ఛ, కోరిక.

గృధ్రము. సం. విశే. (అ. ఆ. అ) కోరిక గలది. వి. అ. పుం. గద్ద.

గృధ్రసీ. సం. వి. ఈ. స్త్రీ. ఊరుసంధియందు కలిగెడువాతరోగము.

గృధ్రాణి. సం. వి. ఈ. స్త్రీ. పొగాకు ?.

గృష్టి. సం. వి. ఇ. స్త్రీ. ౧. తొలియీఁతఆవు.(ఇది జాతివాచకములతో సమసించునపుడు విశేషణమై 'తొలియీఁతది'అనునర్థ మిచ్చుచు ఉత్తరపదముగా నుండును. ఉదా: గోగృష్టి=ఒకసారి ఈనిన ఆవు.వాశితాగృష్టి=ఒకసారి ఈనినఆఁడేనుఁగు.) ౨. ఒకబిడ్డను గన్నయాఁడుది. ౩. బదర, వారాహీకందము ?.

గృహకచ్ఛపము. సం. వి. అ. పుం-కచ్ఛపాకారముగ ఇంట నుండునది-సన్నెకల్లు.

గృహకర్త. సం. వి. ఋ. పుం.ధూసరవర్ణము గలచిన్నపిచ్చిక.

గృహకారి. సం.వి.న్. పుం.ఒకజాతికణుఁదురీఁగ.

గృహగోధ. సం. వి. ఆ. స్త్రీ. మూసలి, బల్లి.

గృహగోధిక. సం=గృహగోధ.

గృహగోలిక. సం=గృహగోధ.

గృహచ్ఛిద్రము. సం. వి. అ.న. గృహకలహము. (విల్యమ్సు)

గృహదేవత. సం. వి. ఆ. స్త్రీ. ఇలువేల్పు.

గృహద్రుమము. సం. వి. అ. పుం. మేషశృంగి ?. (వాచ)

గృహనాశనము. సం. వి. అ. పుం. అడవిపావురాయి. (ఇది యింట ప్రవేశించిన అశుభము కలుగును)

గృహనీడము. సం. వి. అ. పుం-ఇంటిలో గూఁడు కట్టుకొనునది-పిచ్చిక.

గృహపతి. సం. వి. ఇ. పుం. ౧. మంత్రి. (మే.ని.) ౨. ఎల్లప్పుడును అన్నాది దానములను చేయుగృహస్థుఁడు. (అమరసుధ.) ౩. యజమానుఁడు. ౪. సత్రయాగముచేయువారలలో ప్రధానుఁడు.౫. అగ్నిహోత్రభేదము,గార్హపత్యము. ౬. కృషీవలుఁడు. ౭. గూఢచారుఁడు. విశే.(ఇ. ఇ, క్లీ. ఇ) గృహమునకు అధిపతి. (కే. ని.)

గృహప్రవేశము. సం. వి. అ. పుం. గృహమున ప్రవేశించునపుడు చేయుకర్మవిశేషము.

గృహబలి. సం. వి. ఇ. పుం. కాకాదులకు వేయు బలి.

గృహబలిప్రియము. సం. వి. అ. పుం. ౧. బకము, కొంగ. ౨. కాకి. ౩. పిచ్చిక.

గృహబలిభుక్కు. సం. వి. జ్. పుం=గృహబలిప్రియము.

గృహభూమి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. ఇల్లుకట్టుకొనుటకు ఏర్పడినభూమి, వాస్తువు. (హలా. ని)

గృహమణి. సం. వి. ఇ. స్త్రీ-ఇంటికి మణివంటిది-దీపము, దివ్వె. (వాచ)

గృహమాచిక. సం. వి. ఆ. స్త్రీ. జతుక, అజినపత్త్ర, గబ్బిలము. (త్రి. ని)

గృహము. సం. వి. అ.న.౧.ఇల్లు, ఉనికిపట్టు. ౨. గృహిణి, పెండ్లాము.౩. పేరు.(కల్ప) ౪.గార్హస్థ్యము, గృహస్థాశ్రమము. ౫. (జ్యోతి) రాశి; లగ్న చతుర్థరాశి. ౬. ఔపాసనాగ్ని. ౭. శైలేయము, శిలాజిత్తు. పుం. బ. ౧. భార్య. ౨. ఇల్లు. (కే. ని)

గృహమృగము. సం. వి.అ.పుం.శ్వానము,కుక్క. (కల్ప)

గృహమేధి. సం. వి.న్. పుం. గృహస్థుఁడు.

గృహమేధిని. సం. వి. ఈ. స్త్రీ. గేస్తురాలు.

గృహయాయ్యుఁడు. సం. వి. అ. పుం. గృహస్థుఁడు.

గృహయాళువు. సం. విశే. (ఉ) గ్రహీత, గ్రహించువాఁడు.

గృహవాటి. సం. వి. ఈ. స్త్రీ. గృహారామము, ఇంటితోఁ జేరినతోఁట, నిష్కుటము.

గృహస్థు. సం=గృహస్థుఁడు. (ఇది 'వృద్ధు' వంటిది)

గృహస్థుఁడు. సం.వి. అ. పుం.సాంగవేదాధ్యయనముసలిపి గురువనుమతి గొని భార్యను పరిగ్రహించి ధర్మార్థకామముల నడపుచు వేదపాఠము వైశ్వదేవాదిహోమము అతిథిపూజ పితృతర్పణము భూతబలియు ననెడిపంచయజ్ఞములను చేయుచు ప్రవర్తించువాఁడు, రెండవయాశ్రమము నాశ్రయించినవాఁడు.

గృహస్థూణము. సం. వి. అ. న. నిట్రాడు, ఇంటినడిమికంబము.

గృహాగతుఁడు. సం. వి. అ. పుం- ఇంటికి వచ్చినవాఁడు-అతిథి.

గృహామ్లము. సం. వి. అ. న. కాంజికము, కలి.

గృహావగ్రహణి. సం. వి. ఈ. స్త్రీ. దేహళి,గడప.

గృహాశయ. సం. వి. ఆ. స్త్రీ. తాంబూలి, తములపాకుతీఁగ.

గృహాశ్మము. సం. వి. న్. పుం. సన్నికల్లు.

గృహాశ్రమము. సం. వి. అ. పుం. గృహస్థాశ్రమము.

గృహాళిక. సం. వి. ఆ. స్త్రీ. బల్లి.

గృహి. సం. వి. న్. పుం.గృహస్థుఁడు.

గృహిణి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఇల్లాలు, భార్య. ౨. కణుఁదుకీఁగ. ౩. కలి,కాంజికము. ౪. దేహళి,గడప. (వై. ని)

గృహీతము. సం. విశే. (అ. ఆ. అ)- గ్రహింపఁబడినది-౧. పట్టుకొనఁబడినది. ౨. స్వీకరింపఁబడినది, తీసికొనఁబడినది. ౩. తెలిసికొనఁబడినది. ౪. ఒప్పుకొనఁబడినది. ౫. ధరింపఁబడినది. వి. అ.న. గ్రహించుట.

గృహీతి. సం. విశే. (న్.నీ.న్) గ్రహించువాఁడు. వి. ఇ. స్త్రీ. గ్రహించుసామర్థ్యము గలబుద్ధి.
శ్లో. ఊహాపోహక్షమా చాక్వీ గృహీతిర్గ్రహణక్షమా. (అమరపదపారిజాతము. ౪. ౪)

గృహ్ణాత్. సం. శత్రు. గ్రహించుచున్న.

గృహ్ణానుఁడు. సం. విశే. (అ. ఆ. అ) గ్రహించుచున్నవాఁడు.

గృహ్యా. సం. వి. ఆ. స్త్రీ. పట్టణమునకు చేరువ నున్న పల్లె, శాఖానగరము, పేఁట. (హేమ. ని.) విశే. ఆ. స్త్రీ. వెలుపల నుండునది. (సేన, మొ.)
ఉదా: గ్రామగృహ్యా సేన.

గృహ్యకము. సం. విశే. (అ. ఆ. అ) ౧. ఇంట నుండునది, పెంపుడైనది. (పక్షిమృగాది) ౨. పరాధీనము.

గృహ్యమాణము. సం. విశే. ( అ. ఆ. అ. ) గ్రహింపఁబడుచున్నది.

గృహ్యము. సం. విశే. (అ.ఆ. అ)- గ్రహింపఁ దగినది-౧. పట్టుకొనఁ దగినది. ౨. స్వీకరింపఁ దగినది. తీసికొనఁ దగినది. ౩. తెలిసికొనఁ దగినది. ౪.

ఒప్పుకొనఁ దగినది. ౫. ధరింపఁ దగినది. ౬. గృ హాసక్తము, పెంపుడైనది. (పక్షిమృగాది) ౭.ఇం ట నుండునది. (పదార్థము) ౮. అధీనము, ఆయ త్తము. వి. అ. పుం. ౧. పెంపుడుమృగము లోనగు నది. ౨. ఇంటియందలి అగ్నిహోత్రము. న. ౧. స్మార్తకర్మబోధకమగు గ్రంథము. ౨. గుదము.

# గ

**గంటరి.** విశే. (గంటు+అరి) వీరుఁడు.

రగడ. సెలఁబిరుదుకూఁతలును పెనకెనయుగంటరు లు...పం. శకుం. ౩. ౨౨౫.

**గంటనము.** వి. ౧. స్ఖలితోక్తి.

గీ. ఒప్పు గంటన మన స్ఖలితోక్తిసంజ్ఞ. ఆం.భా. ౧. ౧౧౭.

౨. పరుషవచనము, నిష్ఠురోక్తి.

క. ...నన్నుఁ జన నీకున్నన్, జనవర నీమీఁద న భో,జన ముండుదు ననుచు గంటనము లాడు టయున్. భోజరా. ౬. ౩౩౦.

గీ. అనుచు ననవింటి పెనుదంట నాడ రాని,గంట సము లాడి...వసు. ౪. ౪౪.

ఉ. ...నా,వెంటనె రమ్ము నమ్ము మిది వేయివిధంబు ల మేలు గల్గు ని,ష్కంటక మైననాపలుకుఁ గైకొన వేని హితంబు గూడ దీ,గంటన మే ల మీఁద బలుకీదు సుమీ వివరించి చూడఁ గన్.కంచిశరభయ్య. పారిజ్ఞా.౩.౨౪౭.(బ్రౌ)

విశే. తీక్ష్ణము, వాఁడి.

సీ. పరఁగించు నప్పుటప్పటికిని గద్దెపై గంటనం బైన క్రేఁగంటిచూపు. వైజ. ౧. ౧౧౮.

**గంటించు.** స. క్రి. (√గంటు)౧. చలింపఁజేయు, కదల్చు.

వ. ఇవ్విధంబునఁ బ్రతిఘటించి గంటింప రాని మగంటిమిం బెచ్చుపెరిఁగి ... కాశీ. ౪. ౨౨౧.

౨. తొలఁగించు.

క. ...ప్రభుసై, యంటకు నార్తులయాపద, గం టింపఁగ ఫలము గాదె కీర్తి మృగాక్షీ.భాగ. ౮. ౨౩౩.

మహాస్రగ్ధర...జిఱజిఱన్ ద్రిప్పి వైచెన్గదన్ వై, చినఁ దేజిన్ రాజు గంటించెఁ దొలఁగ నది యచ్చెంతకాంతార మేర్పన్. మను. ౪. ౯౯.

౩. పాడుచేయు, నాశముచేయు.

శా. ...ఖాండవప్రస్థమే,నుంటం జైద్యహితక్షితీ శ్వరులు మాయోపాయులై మత్పురిన్, గం టింపం జనుదేరఁ బోలుదురు పోనీ తేరు వేగం బునన్. భాగ. ౧౦. ఉ. ౭౮౭.

శ్లో. అహ చాహమిహాయాత అర్యమిత్రాభిసంగ తః,రాజన్యాశ్చైద్యపక్షీయా నూనం హన్యుః పురీం మమ. సం. భాగ. ౧౦. ౭౭. ౮.

౪. కొట్టు.

క. కంటకులు నృపులు నూఁటఁగ,నింటం గంపించు యంత్రమీనముఁ గోలన్, గంటించి మనము వాలుం,గంటిం జేకొంటి మతనికరుణన కాదే. భాగ. ౧. ౩౫౯.

**గంటు.** అ. క్రి. (క. గంటు) ౧. చలించు, కదలు; తొలఁగు.

మ. ధరణీమండల మమ్మహాంబునిధిమీఁద న్నిల్పి వర్ధిల్లఁగన్,ధరణీధ్రంబులు గంటకుండ నిడి యాధారంబుగాఁ గచ్ఛపే,శ్వరశేషాహులఁ గ్రిందఁ బూన్చి...వి. పు. ౧. ౮౦.

ఉ. గంటనిప్రేమ మేను పులకించెఁ గిరీటికిఁ బూ లౌసంగి వా,ల్గంటి గిఱుక్కున దిరుగ... వి జ. వి. ౨. ౧౩౪.

గీ. అవని యొల్లను వఱుపదియాఱువేలు,వత్సరం బులు నూత్నయౌవనము దనకు, గంటి పోకుం

డఁ బాలించెఁ గీర్తి వెలయ ... వి. పు. ౬. ౧౪౩.

చ. ...కుంతలుం,డు నిజపురోధ గాలవుఁ గనుంగొని రాజ్యముమీఁదికోర్కి గెం,టినది నిజంబు గాఁ దనువుసీడకు మూర్ధము గానరాదు...జై. భా. ౮. ౯౬.

౨. చెడు, భగ్నమగు.

మత్తకోకిల. వెంట వచ్చిన నీవు నాపయివేడ్కఁ జిక్కి తపఃక్రియల్, గెంటఁజేయ నెలుంగ కుండినఁ గీడు వాసవు చేత...కళా. ౩. ౨౫౩.

౩. తప్పిపోవు; తప్పు.

క. అంటలుగట్టుచు నొకటియు, గెంటక తల బోడి గాఁగఁ గేశము లూడన్.వరాహ.౧౨.౧౭.

మ...భవత్కుమారి పదివే ల్వర్షాలు జీవించు గెం, టక వద్మాల్లవయేఁటఁ జెందుఁ బతిగండం బంచు వాచించినన్. చంద్రా. ౩. ౧౪.

సీ. వనిత నీముఖకాంతి కెన యొందు లేదని గెంటక ద్విజరాజు వంట వచ్చు. సారంగ. ౨. ౨౦౪.

౪. వెనుదీయు, సంకోచించు.

ద్వి. దంటమాటలు గొన్ని తడవాటు పన్ని, గెంటక నోరార్చి గెల్వఁ జూచెదవు. ద్వి. హరిశ్చ. పూ. ౩౦౦ పం.

స. క్రి. నెట్టు, త్రోయు; (అప్పు, మొ.) తీర్చు.

గీ. మేటిరేద్రిమ్మరుల గెంటుపోటుబంటు. ఉ. రా. ౧. ౮౦. ('జయించు' అని భావము.)

ద్వి. గెంటక యీయప్పు గెంటి యీతులువ, బంటుగా నేలక పాయదు కోవము...ద్వి.హరిశ్చ. ఉ. ౧౪౩౩ పం.

౨. (అస్త్రము, మొ.) ప్రయోగించు.

చ. అరదం బొండొక పెక్కు విల్లు గొని వంచాస్త్రంబులం గెంటి భాస్కరపుత్రుం దరలించి చాపమలుకన్ ఖండించి ... జై. భా. ౫. ౧౧.

వి. చలనము, కదలిక.

ఆ. పడఁతి కలద జాతి ప్రతిమకుఁ జిక్కులి, గింత వాదుధృతికి గెంటు లేదు. కళా. ౩. ౪౫.పాండు. ౨. ౫౫.

జ: గెంటించు, గెంటుపడు.

గెంటుప(వ)డు. అ. క్రి. (గెంటు + పడు) పోవు; తప్పిపోవు.

గీ. జంట వదలక తిరుగుమీవంటిచెలుల, వెంటఁ దిరిగెడిభాగ్యంబు గుంటువడియె, గెంటువడఁ జూడుఁ డింకఁ దొల్లింటినెయ్యమింటి కేఁగుడు మీరు వాల్గంటులార. చంద్రా. ౪. ౧౬౯.

క...పవనజుఁడు గదాహతి నొకఁడున్, గెంటువడకుండఁ బీనుఁగుఁ, బెంటలు గావించె దివిజబృందము పొగడన్. జై. భా. ౩. ౧౦౫.

గెంటెము. వి. జంటనేతవస్త్రము, రెంటెము.

సీ... పహోంబట్టుజిలుఁగుగెంటెంబుతోడ. మను చ. ౬. ౧౦౨.

సీ. పులితోలురెంటెంబు వెలిపట్టుగెంటెంబు కటిమండలంబున గరిమఁ దనర. రుక్మా. ౧. ౨౯.

విణ-రెట్టి అయినది-అధికము.

శా...మదిన్,గెంటెంపుంజల ముప్పతిల్ల...మను చ. ౫. ౧౪.

గెండె=గండె. వి. (సం. గండకః.) మత్స్యవిశేషము.

సీ...గెండె యం చనఁగను గండకంబు. ఆం.భా. ౧. ౧౫౯.

సీ. కొఱ్ఱమీలను దండ్రికొలువులెంకల కిచ్చె ... గెండెల బలుదుండగీల కిచ్చె. ద్వా. ౧. ౨౮౦. హంస. ౪. ౧౮౩.

గెగ్గలు. వి. గేలి, పరిహాసము. (అప్ర.శ.ర-'గగ్గిలి' బ్రౌ)

గెచ్చె. వి. మత్స్యవిశేషము. (బ్రౌ)

గీ. పుల్లరుజా గెచ్చె గెంటెయు బొమ్మడాయ.హం
స. ౪. ౧౫౩. (గజ్జె. ముద్రి.)

**గెడ[1].** వి. ౧. కడ, సమీపము; పార్శ్వము.

ఉ. ఆడెడునమ్మిఁ గన్గొనకుమమ్మ... తేఁటిగెడ నా
లతి సేయకుమమ్మ ... కు. సం. ౫. ౬౧౦.

క. విను ప్రద్యుమ్నాదిభవత్తనయులగెడ నైన నే
కతంబున నేకా,సనమున నుండుట దూష్యం,
బని యెఱుఁగుము...భార. ఆర. ౫. ౩౨౦.

౨. జత. (చూ. గెడకత్తియ, మొ.)

సీ. వక్షస్థలంబున వనమాల గ్రాలంగ వెలిమావుగెడ
లవాగెలు ధరించి, నొగలపై హరి యొప్ప...
భార. ఉద్యో. ౪. ౧౨౫.

క. కడు వేడ్కతోడ నీకుం, గొడు కయ్యెడునం
తకంటెఁ గోర్కియుఁ గలదే, జడుఁడనక
నన్నుఁ గైకొని, గెడసేయుము నన్నుఁ గార్తి
కేయునితోడన్. ఉ. హరి. ౫. ౧౩. (చి. ని,
శ. ర. పా.)

౩. పోలిక, వగిది. (ఉపమావాచకము)

క. దొరయు గెడ జోడు పోలిక,సరి సంగడి యు
ద్ది యీడు సాటి వగిది నాఁ,గరణి యనఁ జా
డ్పు చందం,బొరను వడువు నాఁగ నుపమ
కొప్పన్ జెప్పన్. కావ్యా. ౫. ౧౬.

జ: గెడకత్తియ, గెడగూడు.

**గెడ[2].** వి. వేఁటకుఁ దగినసాధనవిశేషము.

క. వడదోల్లును ముప్పిళ్లును, నడిదంబులు వెడఁద
వాతియలుఁగులు పొదులున్, దడవిండ్లుఁ బం
దిగోళ్లును,గెడలున్ ధరియించి భటులు కెలఁ
కులఁ గొల్వన్. భల్లా. ౩ ఆ. (శ. ర.)

**గెడకత్తియ.** వి. (గెడ[1] + కత్తియ) చెలికత్తె,
జతకత్తె.

చ. మెలపొదవించి తీవలకు మేనుల... పెక్కురే,
ఖలఁ దమతోడ నాడుగెడకత్తియ కాఁ గయి
సేసి రామనిన్. కు. సం. ౯. ౩౦౭.

**గెడగూడు.** అ. క్రి. (గెడ[1] + కూడు) జతగూడు,
జతయగు; రతియందు కలియు.

క...పాపపుఁ, బోడ వగునిది గాదె యితనిఁ బో
డవడఁగించెన్, గెడగూడ దీని నీకని, యొడ
లివయిం బెట్టి కాళ్ళు టుచితం బరయన్.భా
ర. విరా. ౩. ౧౨.

క. మిన్నుదలఁ బాకెఁ ఖగపతి, యన్నదిగూను
బాఱఁ దొడఁగె నవని యద్రువ నే,మున్నో
తా మున్నో యని, వన్నిదమునకు గెడగూడి
పాటినభంగిన్. భోజరా. ౭. ౪౨.

గీ. ఉష్ణశీతాన్నకబళము లొక్కఁడు నూవఁ,బవలో
రాత్రియొ గెడగూడ నవసర మని,దాని కుత్త
రమొకలతాతన్వి యిచ్చె, నధరబింబంబు వి
డిచి సంధ్యాగమ మని. నైష. ౬. ౧౩౭.

**గెదుము**=గదుము.

మ...మృత్యువున్, గెదుమంగాఁ గలబాహువి
క్రముఁడు సుగ్రీవుండు సామాన్యుఁడే. నీ
తావి. ౧. ౧౦౩.

**గెనయు.** అ. క్రి. వర్ధిల్లు.

చ...అప్పృథుండు దా,జననము నొందు బెట్టులం
రసాసతి ధేనువుఁ జేసి లోకముల్,గెనయఁగ
నేల పాలు పిదికెన్ వినిపింపుము నాకు నేర్ప
డన్. వి. పు. ౨. ౯౯.

**గెనుసు.** (చి. ని, బ్రౌ-గెనసు.శ. ర) వి.(క.గెణసు)
ఒకానొకదుంప.

గీ. తనునుమధ్యమ గెనుసు చందనసుగంధి, పనస
కాయ సువాస రంభాకలాటు,బిసరుహేక్షణ
పెసరుఁబప్పుసదృశాంగి,పసిమిఁ గందనివంకా
య బంతి కిడియె. బహు. ౪. ౧౫. హంస. ౪.
౧౩౧.

**గెబ్బు.** స. క్రి. ౧. గెంటు. (బ్రౌ)

గీ. బొబ్బమెకమును నీరింకుమబ్బునుబ్బు, గెబ్బు
సంతతవిజయుబేగీయమూన, మగుచుఁ జాళుక్య

నారాయణాంకుఁ డైన, బుక్కరాజేంద్రురా
మభూభుజునియశము. రామ. ౨౧౩.

గీ. మబ్బునుబ్బు గెబ్బు బిబ్బోకవతి వేణి, మెఱపు
నొఱపుఁ బఱపుఁ దెలువమేను. విజ. వి. ౧.
౭౪.

౨. చంపు.

గీ. వానకందువ మలలపై వ్రాలుమొగులు, చాలు వ
రికట్టఁ జాల్చెంచుజవ్వనులకు, నిబ్బరపుఁదూ
పు తడవింటఁ బ్రబ్బఁజేసి, మబ్బుపైఁ బాఱు
మెకముల గెబ్బు చెంత. ఉ. రా. ౭. ౩౯౧.

సీ. అలమబ్బు వెలిఁ ద్రొబ్బుపాలగబ్బు గలయాబ్బు
తలబెబ్బులుల గెబ్బుఁ దరలకొకఁడు, పెను
వంకలను డొంకలను బంక మనుకంకఁ జనుజం
క మను వింకఁ జదుపు నొకఁడు. చంద్రా. ౨.
౭౭.

వి. (సం. గర్వః. ప్రా. గవ్వో. పా. గబ్బో) గర్వ
ము.

సీ...గరువము పొగరు కావరము గెబ్బు. గీ. త్రు
ళ్లు క్రొవ్వు తిమురు త్రుక్కు మల్లరమ్ము, పొత
రం బేపు నా గర్వ మొప్పుచుండు. ఆం. భా.
౧. ౧౩౩.

గెఱ. వి. (క. ర-క. గెఱ. తు. గెర) రేఖ. ('కెఱ'
అని పరుషాదిగా. అప్పకవి. ౨. ౧౯౭.)

సీ. గెఱ వ్రాసి మాయ వంగీకరించినభంగి వసనంబు
గట్టక వచ్చువాఁడు. భాగ. ౧. ౫౧౬.

(కోడిపందెమువర్ణన) చ. చొరఁబడి కాంచి ప్రాఁ
తలను జుట్టియుఁ గత్తులు వేసి సందిటం, బెర
యఁగఁ బట్టి చెక్కు గఱపించి గ ఱోర్పడ
గీఁచి...పల్లిరమతి పో యటంచును ఖళీఫెళీఁ
బుంజాలు దన్నులాడఁగన్. హంస. ౩. ౨౧౬.

గెఱకట్టు=ఏర్పడినమండలరేఖ కలది యగు.

(కుచవర్ణనము) సీ. గెఱకట్టి కఠుకు లై కెరలి పోఁ
కంత లై వింత లై చెంతల విరివిఁ జెంది. నరస.
౫. ౧౧౩.

సీ. గెఱకట్టుకొని బిట్టు నెటిఁ జూపుచనులతోఁ
గడు సన్నగిలు చున్న కానుతోడ. రాధికా.
౧. ౯.

గెల=గొల. వి. (త. కులై) పండ్లయొక్కయు పూవు
లయొక్కయు గొల.

సీ. గెలలతీవియలమడ్కిని నిడి వ్రాసినపైఠాణివలి
పంపుఁబాగఁ జుట్టి. చంద్రా. ౨. ౬౭. (చి.
ని. పా)

ఉ...గెల ల్సుగంధికదళీవనపంక్తుల నొప్పు నప్పు
రిన్. ఆము. ౧. ౬౯.

గెలిపి(ల్పి)ంచు. స. క్రి. (√ గెలుచు) గెలువ
జేయు.

(జయింపఁజేయు.)

క...తత్క్రమము నవ్వి నిజంబుగ గెలిపించెద,ని
ను వెఱవకు మనియె...శుక. ౩. ౪౨.

ఉ...మదుక్తి తెఱంగు నేఁడు గెల్పించితివి...
ప్రభా. ౩. ౫౭.

గెలివి=గెలివిడి. వి. (త. కెలిప్పు) సంతోషము.

మ...ప్రియునిం గూర్చు న్మరుం డెంతయున్,
గెలివిం దానికిఁ బెండ్లివీడియము సాగింప న్మ
దిం జూచెనో...చంద్రా. ౪. ౧౫౪.

క...వనితా యేమందు దానివగలో త్రుళ్లో, చెణు
కో తెలివో గెలివో, విను వెన్నుకుఁ బండ్లు వ
చ్చువిత మాయెఁ గదే. రాధికా. ౩. ౧౬.

గెలివిడి=గెలివి. వి. ఉల్లాసము, సంతోషము. (చి.
ని, శ. ర)

గెలివివాఁడు. విశే. (√ గెలివి.) రవణుఁడు, గోల
చేయువాఁడు.

సీ...గెలివివాఁ డనఁగను జెలఁగు రవణుఁడు...
ఆం. భా. ౩. ౧౨.

గెలుచు(ల్చు). స. క్రి. (క. గెల్. త. కెలి.) ౧. జ
యించు; నిగ్రహించు.

గీ. సర్వసేనాధిపత్యంబు నిర్వహింప,నీవు దక్క

నిం దొక్కరు నీవ యరసి, చెప్పుమా కలఁ డేని
రక్షింపు మమ్ముఁ, బూని పట్టంబు దాల్పుము
పొడిచి గెలుము. భార. ఉద్యో. ౪. ౧౪౬.
మ...మాధవుఁ డమ్మగాఁ బురము లక్ష్మికి నేకదోశ్శ
క్తి గెల్చినజో దీశ్వరుఁడు...సైమ. ౧. ౨.
గీ. వాద మొనరించి గెలిచి...ఆము. ౨. ౭౫.
ఉ...వసంతకంతులకు, జక్కఁదనంబునం గెలు
వఁ జాలెడువాఁడు...మనుచ. ౨. ౩౫. (ఇట
ఔపమ్యావాచకము.)
క. రోషము గెలిచినజనుఁడు వి, శేషస్థితి దివిజపద
ముఁ జేరుఁ గా...జాహ్నవీ. ౩. ౭౭.
౨. కడపు, పుచ్చు.
క. కంకుఁ డయి ధర్మజుఁడు వల, లాంకుం డై వా
యుజుఁడు బృహన్నల యై ని, శ్శంకుఁడు పా
ర్థుఁడు హయగోకింకరు లై కవలుఁ దొల్లి గె
లుపరె దినములు. భోజరా. ౭. ౨౦౭. (శ. ర.
పా.)
అ. క్రి. ౧. జయమును పొందు, సర్వోత్కర్షము
న వర్ధిల్లు.
మ. వినవచ్చెన్ వినువీథిదిక్కున నుధీవేద్యంబు
లై యింద్రవాహన వర్ధిల్లు పురంజయా మను
కకుత్స్థ గెల్వు మన్వాక్యముల్. కకు. ౪.
౩౫.
౨. పోవు, వెళ్లు.
(సీత) గీ...జడలో నిరత్న మింద మనుచు, నిచ్చి
తెలతెలవాఱఁగ వచ్చె గెలువుమనిలజా యం
చు దీవించి యనుపుటయును. రామా. ౬.
౧౫౭.
జ: గెలిపించు, గెలుపు, గెలుపుఁగంబము, గెలుపు
కాఁడు, గెలుపుకొను, గెలుపడి, గెలువము, గెల్పరి.

గెలుపు(ల్పు). వి. (√గెలుచు) జయము.
గీ. ...జయము, గెల్పు గెలుపడి గెలువము గెలుప
నఁ దగు...ఆం. భా. ౨. ౨౨౩.
క. తోడు దొన లేనియప్పటి, క్రీడి కొలఁది యు
ట్టి దధిప కిరియక విను మేఁ, నోడై రా నెదురు
ట గదుఁ, గీడు వలవ దుడుగవయ్య గెలు పరిది
నుమీ. భార. ఉద్యో. ౩. ౩౮౦.
గెలుపుపేరువజీరు=విజయుఁడు, అర్జునుఁడు.
సీ. గెలుపుపేరువజీరుఁ గినిసినకప్పమై దురవరాద
సెంచు మాదొడ్డి వేల్పు. ప్రబంధ. ౧౬౦.
గెలుపులచ్చి=జయలక్ష్మి. ప్రబంధ. ౧౪౨.
గెలుపోటములు = జయాపజయములు. పి. శకుం.
౧. ౧౬౪.

గెలుపుఁగంబము. వి. (గెలుపు+కంబము.) జయ
స్తంభము.
వ...గుండ్రాజు దుండగపు రాచతండంబులఁ జెం
డి మండలగ్రామంబులకెలంకుల గెలుపుఁగంబము
లు నిలిపె...వరాహ. ౧. ౨౦.

గెలుపుకాఁడు. విశే. (గెలుపు+కాఁడు) జేత, జయిం
చువాఁడు.
ఆ. పగ యడంగె నంచు మిగుల డెందమునోలన, న
లరి వేల్పురాచ గెలుపుకాఁడు, దీవి కేఁగి గెలు
పు తెఱఁగెల్లఁ దండ్రికిఁ, దెలియఁ జెప్పి యొ
లమి నెలయఁజేసె. అచ్చ. రా. యు. ౧౫౨.
(వేల్పురాచగెల్పుకాఁడు=ఇంద్రజిత్తు)

గెలుపుకొను. స. క్రి. (గెలుపు+కొను) గెలుచు,
జయించు.
చ. కలువల గండుమీలఁ దొలుకారు మెఱుంగుల
నిండువెన్నెలన్, వలపుల రాజుతూపులగువా
రిరుహంబుల నొక్కయెత్తునన్, గెలుపుకొ
నంగఁ జాలు మృగనేత్రయుపాంగనిరీక్షణస్ఫు
రుల్...విక్ర. ౬. ౨౬.

గెలుపడి. వి. (గెలుచు+పడి-క. గెలిప్పు.) జయ
ము, గెలుపు.
గీ...జయము, గెల్పు గెలుపడి గెలువము గెలుప
నఁ దగు...ఆం. భా. ౨. ౨౨౩.

గెలువము. వి. (√గెలుచు) గెలుపు.

క. తలఁచిరి తల లూఁచిరి... ఈ, నిలుకడ యీ తా లిమి యీ, గెలువం బీబుద్ధి యేరికిం గల దను చుణ్. కకు. ౧. ౧౫౭. ఆం. భా. ౨. ౨౨౩.

**గెల్వరి.** విణ. (గెల్వు + అరి) గెల్చువాఁడు.

సీ. భక్తుండు గెల్వరి పరమేశుఁ డోటరి యనుట కు శ్వేతవాహనుఁడుసాక్షి. చెన్న. ౨. ౧౫౯.

(బ్రా. పా–గెల్వరి. ముద్రి.)

**గెల్లి.** వి. ఉప్పుకుప్ప. (బ్రా, శ.ర.)

**గెల్లు.** వి. కలకలధ్వని, గొల్లు.

సీ... కలకలధ్వని దోఁచు నలబలం బన హళాహళి యనంగ, గొల్లన గోల కన గెల్లన రొద యన ...ఆం. భా. ౧. ౧౨౧.

జ: గెల్లుపడు.

**గెల్లుప(వ)డు.** అ. క్రి. (గెల్లు + పడు) బెంకవే యు.

క. పల్లియలు ద్రెంచుకొని బల, మెల్లం బెల్లగిలఁ జొచ్చి యెంతయు నలుకణ్, గెల్లుపడి నురభి హుంకృతి, మల్లడిగొనఁ బ్రజల మారిమసఁగఁ దొడంగెణ్. పద్మ. ౭. ౨౩౮.

గే

**గేండుకము.** సం=గేందుకము.

**గేందుకము.** సం. వి. అ. పుం. కందుకము, బంతి.

**గేడకాళ్లవాఁడు.** విణ. కొంగకాళ్లవాఁడు, సన్న ముగాను పొడుగుగాను ఉండుకాళ్లు గలవాఁడు. (శ.ర–గేడికాళ్లవాఁడు. బ్రా)

**గేదఁగి.** వి. (సం. కేతకీ. క. కేదగె) ౧. మొగలి.

ఉ. కేరును కేతకి న్మొగలి గేదఁగి యంచను పేరులు ...ఆం. భా. ౨. ౭౯.

(చంద్రకిరణవర్ణనము) సీ. చదలు గేదఁగితూర్పు తుదకొమ్మ నరవిరి యై కానుపించుపూరేకు ల నఁగ. పారి. ౨. ౩౮.

౨. పచ్చపువ్వుల మొగలి.

ద్వి. పోదుగు కలుజువ్వి మొగలి సంపెంగ, గేదం గియును నారికడము వారిజము. ద్వి.క. పా. ౨. ౭౯ పా. ౧౯ పం.

౩. మొగలిపూవు.

ఉ. భంగములై నగంబులు గుభాలునఁ ద్రెళ్లఁ గర ళ్లదాఁటులో, నింగికిఁ బొంగువారిధి మునింగిన భూవలయంబు కన్నె గే, దంగితుద న్వసించిన మద భ్రమరసారభనిశ్చలీభవ, దృంగముఁబోలఁ గొమ్ముకొన నెత్తె మురారి వరాహరూప మై. వరాహ. ౮. ౧౬.

సీ. క్రేఁగంటిచూపున గెఱఁగొన్న సన్న గేదంగి రే కుల కన్నదమ్ము లగుచు. ఉ. హరి. ౧. ౧౫౧. ఆము. ౪. ౧౧౪.

**గేదె(గేదియ–చి. ని).** వి. ౧. బఱ్ఱె, మహిషి.

గీ. పరఁగు నెనుపెంట్లు గేదెలు బఱ్ఱె లెనుము, లనఁగ మహిషీసమాఖ్యలు ధనదమిత్ర. ఆం. సం. తిర్య. ౧౦.

౨. పొట్టిబఱ్ఱె.

సీ. వామనమహిషి యై వరలు గేదె యనంగ ... ఆం. భా. ౨. ౨౬౪.

జ: గేదెచెలప, గేదెపడ్డ, గేదెపెయ్య.

**గేదెచెలప.** వి. (√ గేదె) మూఁడేండ్లయెనుపదూ డ. (బ్రా, శ. ర.)

**గేదెపడ్డ.** వి. (గేదె + పడ్డ) ఇంచుమించుగా నా లుగేండ్లఎనుపదూడ. (బ్రా.)

**గేదెపెయ్య.** వి. (√ గేదె.) ఇంచుమించుగా రెం డేండ్లఆఁడుగేదెదూడ. (బ్రా.)

**గేయము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. గాతవ్యము, పాడఁ దగినది. ౨. గాత, పాడునది. వి. అ. న. గా నము, పాట.

**గేలి.** వి. (సం. కేలీ. క. గేలి. త. కేలి.) అపహాసము, పరిహాసము.

క. ఈగేలి వెలార్చెద భా, హాగర్వము మెఱయ మిమ్ము నందఱను మహీ, భాగమునఁ గూల్చి... భార. శల్య. ౨.౧౦౦. (చూ. గూ.)

గీ...పిడుగులకడిమి యొంత,యనుచు గేలిగ రచ్చ లవాడుకొనుచు, నేచి పచరింతు రచ్చటిరా తవారు...యయా. ౧. ౧౪.

జ: గేలించు, గేలికొట్టు, గేలిగొను, గేలిపెట్టు, గేలిసేయు.

గేలించు. స. క్రి. (√ గేలి) గేలిచేయు, అపహసించు.

ద్వి. కృతశబ్దతంత్రధురీణుఁడై చంద్ర, శతముల గేలించుచాయఁగా సేసి ... పాలుపారు శేషుని భోగంబునందు. ద్వి. పరమ. ౧. ౧౫ పా. ౬ పం.

గేలికొట్టు=గేలిగొను.

ఉ...రాజుల గణింపక తిట్టుచు గేలికొట్టుచున్. స్వారో. ౨. ౫౨.

గేలిగొను=గేలికొట్టు. స. క్రి. పరిహసించు, పరిహాసము చేయు.

సీ... ఇంద్రుఁడు సనుదెంచి యేల యిచట, ముని యెద పనిన నమ్మునుజాధిపతి తనకోర్కి సెప్పిన గేలిగొనుచుఁ జనిరా.... భార. శల్య. ౨. ౨౧౫.

శ్లో. అపహాస్య తతః శక్రో జగామ త్రిదివం పునః. సం. భార. శల్య. ౫౪. ౭.

సీ. కోకిలారవములు గోమలకిన్నరీగీతులు నొండొంటి గేలిగొనఁగ. హరి. ఉ. ౭. ౫౩.

(భార్గవవనవర్ణనము.) ద్వి. ఎలుకపిల్లలకుఁ జన్నిచ్చు పిల్లులును, గలిగి యన్యోన్యరాగములతో వైరములు మాని సురవనమును గేలిగొనుచు ...ద్వి. పరమ. ౨. ౫౩ పా. ౪ పం. (ఇట ఔపమ్యావాచకము)

గేలిపెట్టు. స. క్రి. (గేలి+పెట్టు.) పరిహసించు, వేళాకోళము చేయు.

చ...హాసముల్, సలిపిరి గేలిపెట్టుచును జంపతులన్ జెలిపిండు వేడుకన్. శశి. ౪. ౧౫౧.

గేలిసే(చే)యు=గేలికొను. (గేలి+చేయు.)

ద్వి. పాలెల్లఁ బెంట్రుకపైఁ బోయఁ దండ్రి, గేలిసేయుచు వచ్చి కాలఁ దన్నుడును...బస.పు. ౨. ౪౧౮ పం.

చ. అనుదితసూర్యహోము లగుయజ్వలప్రజ్వలదగ్నిదీప్తులో, ద్దనమురుసోమిదమ్మలమిథఃకపణోల్లసితస్తనంబులన్, దనరుచు గేలిచేసెఁ గడుఁ దత్సమయాత్తపరస్పోవగూ, హనరసరంగదంగకరథాంగపతంగతతారుణద్యుతిన్. ప్రభా. ౫. ౫౯. అను. ౪. ౪౫.

ఇట్లు:- గేలియొనర్చు.

క. మై లై వచ్చిన మెత్తురు, కాలవశతఁ జేసి కీడు గదిరిన నతనిం, గేలియొనర్చుచుఁ జూతురు, నాలిసతులమాట లంత నమ్మం గలదే. భోజరా. ౪. ౧౪.

గేష్ణువు. సం. విశే. (ఉ) ౧. పాడెడివాఁడు. ౨. నాట్యము చేయువాఁడు. (మే. ని.)

గేస్తు, గేస్తుఁడు. వి. (సం. గృహస్థః. క. గేస్త)

౧. గృహస్థుఁడు.

గీ. దినముఁ బోరిడు గాయకుఁ గనినగేస్తు. దశా. ౨. ౬౨.

సీ...గృహస్థాభిధానం బిలుకొర గేస్తు నా... ఆం. భా. ౨. ౧౭౬.

సీ. కలవు గేస్తులయుండ్లకప్పసేఁతలమంప సుడివడి కలఁగుటల్ మనుఁగులంద. అచ్చ. రా. బాల. ౪౭.

౨. యజ్వ, సోమయాజి.

క. కలువలదాయయు నగ్నియు, నెలవును గేస్తుండుఁ జదలు నేలయు నీరున్, జలిపట్టును రూపులు గాఁ, బొలుపొందెడు పన్నె కాఁడ మూర్తుల శివుఁడా. అచ్చ. రా. బాల. ౨౧౫.

గీ. మన్ను గేస్తుఁడు నగ్గియు మిన్ను నీరు,ప్రొద్దు
సెల గాడ్పు లెవ్వానిరూపు లయ్యె.నీలా. ౧.
౧౨.
3. భర్త.
సీ. జంటమొగంబులసామిముద్దులకుఱ్ఱతల్లి గేస్తుఁడు
పిగఁ దాల్చుపువ్వు. రామ. 3౫౧.
మ...పల్కుఁంబోటి గేస్తుండు...నీలా.౨.౧౧౯.
జః గేస్తురాలు.

గేస్తురాలు. వి. (గేస్తు+ఆలు) ౧. ఇల్లాలు, మగ
నాలు, కులస్త్రీ.
మ...దర్పకజన్యంబున గేస్తురాల నయితిం బ్రా
హ్మీణ్యహైన్యంబునన్. కువల. ౫. 3౦.
గీ. అనఘచారిత్ర యెవ్వ రే మన నొకింత, కరల
నిసుశీల సంపన్న గేస్తురాలు, అత్తరుణిఁ జూ
చి యపుడు నో శత్తి పలికె. సారంగ.3.౮౬.
౨. గృహిణి, భార్య.
గీ. తమ్ముఁడును గేస్తురాలును దాను నగరు, వెడలి
...అచ్చ. రా. అయో. ౮౨.
గీ. అలరుమెం డైననిండుఁబ్రాయంబుకలిమి, రస్తు
మీఱుచు నాతని గేస్తురాలు. శుక. ౨. ౧౦౦.

గేహము. సం. వి. అ. న. గృహము, ఇల్లు.

గేహి. సం. వి.న్. పుం. గృహస్థు, గేస్తు.

గేహిని. సం. వి. ఈ. స్త్రీ. గృహిణి, ఇల్లాలు.

గేహేక్ష్వేడి. సం. విణ. (న్. నీ. న్)-ఇంట మాత్ర
మే గర్జించువాఁడు-పిఱికివాఁడు, పంద.

గేహేదాహి. సం. విణ. (న్. నీ. న్.)=గేహే
శూరుఁడు.

గేహేనర్ది. సం. విణ. (న్. నీ. న్)=గేహేక్ష్వేడి.

గేహేమేహి. సం. విణ.(న్. నీ. న్) -గృహమందే
మూత్రవిసర్జనము చేయువాఁడు - సోమరి, అల
సుఁడు.

గేహేశూరుఁడు. సం. విణ. (అ.ఆ.అ) - ఇంటనే
బింకము లాడువాఁడు-పంద,పిఱికివాఁడు. (విల్యా
మ్సు)

## గై

గైత. వి. కిరాతభేదము. (మి.శ.ప్రా)
సీ. వేసమున్నాఁడ నీ వీకాన వెరఁజాము గైత నీ
వాజాడ గనఁగఁ జూపు. ప్రబంధ. ౧౯3.

గైరము. సం. విణ. (అ. ఈ. అ) ౧. కొండయం
దైనది. ౨. గిరిసంబంధమైనది.

గైరికము. సం. వి. అ. పుం. న-కొండయందు పుట్టి
నది-పర్వతధాతువిశేషము,జేగుఱు. న. బంగారు.

గైరికుఁడు. సం. వి. అ. పుం. పర్వతీయుఁడు, కి
రాతుఁడు.

గైరేయము. సం. విణ. (అ. ఈ. అ.) కొండయం
దు పుట్టినది. వి. అ. న.౧. సిలాజిత్తు. ౨. జేగుఱు
ధాయి.

## గొ

గొంగ. వి. పగతుఁడు, శత్రువు; సంహారకుఁడు.
సీ...వైరి. గీ. మనును...కంటనఁగ గొంగ యన
నూఁడుకాఁ డనంగ...అం. భా. ౨. ౧౫౫.
చ. కువలయపర్వ మబ్జములగొంగ చకోరమనోర
థంబు...నిశామణి తూర్పునఁ దోఁచె...భా.
రా. సుం. ౧౭౦.
మ ... వైరిమనుజేంద్రశ్రేణికిం గొంగ. నిర్వ.
౧. 3౯.

గొంగడి=గొంగళి. (మహా. ఘోంగడె. క. గొంగ
డ) వి. కంబళి.
క. గొంగడు లెగురఁగ వైచుచుఁ, జంగున దాఁ
టుచును జెలఁగి చప్పట లిడుచున్, బొంగు
చుఁ గృష్ణునిఁ బొగడుచు... భాగ. ౧౦ పూ.
౪3౭.
...గొంగ

